

శ్రీః

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః.

శ్రీ హయగ్రీవ ప్రసన్న

శ్రీ శారదాయై నమః

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీమదాంధ్రవాల్మీకిరామాయణము

## యుద్ధకాండము



ప ! ప్రపద్యేడిత ! దురి
తాపహా ! కారుణ్యసీమ ◆ యరిజనభీమా !
తాపహరా ! విధిహరనుత !
క్ష్మాపుత్రీలోల ! రామ◆చంద్రనృపాలా ! ౧

## మందరము

చెప్పఁబోవు యుద్ధకాండార్థమును వినుమని కవి తన యిష్టదేవతయు, గ్రంథమునఁ బ్రతిపాదింపఁబడిన కథానాయకుఁడు నగు శ్రీరామచంద్రమూర్తిని సంబోధించుచున్నాఁడు. శ్రీప = లక్ష్మీదేవిని బాలించువాఁడా ! అరణ్య కిష్కింధా సుందర కాండములందు సీతారామ వియోగము చెప్పఁబడెను. దానివలన నింతవఱకు శ్రీరామచంద్రమూర్తి యశ్రీకుఁడనియే చెప్పవలసి యున్నది. ఈ కాండమున నా శబ్దము సార్థక మగుచున్న దని భావము. శ్రియఃపతీ ! ప్రపద్య + ఈడిత =

26.8.98

ప్రపద్యేడిత—(౧) జనులచేత భజింపఁబడఁదగిన బ్రహ్మరుద్రాదులచేతను, ఈడిత = కొనియాడఁబడినవాఁడా! (౨) ప్ర+పద్య = ప్రకృష్ట పద్యములు = ఉత్తముల వాక్యములు, వానిచేతఁ గొనియాడఁ బడినవాఁడా. (౩) ప్ర=ఉత్కృష్టమైన-పద్య = మోక్షమార్గము కలవారిచేతఁ గొనియాడఁ బడినవాఁడా! "సరణిః పద్ధతిః పద్యా" యని యమరుఁడు - మోక్షమార్గములం దన్నిట శరణాగతి యనఁబడు ప్రపత్తియే కదా యుత్తమమైనదని శ్రుతిచెప్పఁబడుచున్నది. 'తస్మా న్న్యాస మేషాం తపసా మతిరిక్త మాహుః'॥ తైత్తి॥ "భక్త్యా పరమయావాపి ప్రపత్త్యావా మహామునే। ప్రాప్యోఽహం నాన్యథా ప్రాప్యః' ఇత్యాద్యనేక ప్రమాణములు; భగవద్గీతాదులు ప్రపత్తియాత్కృష్ట్యమును స్థాపించుచున్నవి కదా - భగవంతుఁడట్టి ప్రపన్నులచే స్తోత్రము చేయఁబడువాఁడని భావము. ప్రపన్నేడిత యనక ప్రపద్యేడిత యని క్లిష్టవచనరచన యేల యనినఁ బ్రతికాండాదిమపద్యమునందుఁ దొలుత ద్వయమంత్రములోని పదము చేర్పవలయునని కవి పెట్టుకొన్న నియమమే దీనికిఁ గారణము. ఇట్టి నియమ మేల యుంచుకొనవలసి వచ్చె ననిన శ్రీమద్రామాయణ మంతయు దీర్ఘశరణాగతి యని పూర్వాచార్యులు యథార్థముగ వచించిరి. శరణాగతిని విశేషముగఁ బ్రతికాండమందును బ్రతిపాదించుటచేతనే రామాయణము దీర్ఘశరణాగతి యనఁబడెను. అట్టిశరణాగతినిబోధించుమంత్రము ద్వయము. మంత్రార్థమును బోధించు గ్రంథమున మంత్రము కూడ నుండుట బాగని యీ కవి యిట్టు లా మంత్రమును కాండాదిమ పద్యములందు నిర్వహించెను. మంత్రార్థానుసంధానముతో మంత్ర ముచ్చరించినఁ గదా విశేషప్రయోజనము గలుగును. దురితాపహా=దురిత=పాపములను, అపహా = పోఁగొట్టువాఁడా! నీ విట్టివాఁడ వని తెలిసికదా ప్రపన్నులు నిన్ను స్తోత్రము చేయుదురని భావము. వ్యవస్థ చెప్పక దురితాపహా యనుటచే సంచితాగాములను అనభ్యుపగతప్రారబ్ధమును బోఁగొట్టువాఁడని భావము. "ప్రారబ్ధేతర పూర్వపాప మఖిలం ప్రామాదికం చోత్తరమ్, న్యాసేన క్షపయ న్ననభ్యుపగత ప్రారబ్ధఖండంచ నః" అని కదా ప్రపత్తిమహిమ చెప్పఁబడెను. కారుణ్యసీమ = దయకుఁ బొలిమేర యగువాఁడా! దయ యనునది యెంతయున్నదో యంతయు నీయందలోననే యున్నదని భావము. అట్టైన దయాప్రయోగమునకు వ్యవస్థ లేదా యనిన, అరిజనభీమా = శత్రువులకు భయంకరుఁడా - అనుగ్రహపాత్రు లగు నాశ్రితులయందు మాత్రమే పూర్ణదయ వినియోగింపఁబడునుగాని తన్ను ద్వేషించువారియందుఁ బూర్ణ వినియోగము లేదు. పూర్ణవినియోగము లేదనుటచేత శత్రువులందును గొంతదయ చూపునని భావము. 'రిపూణామపి వత్సల' యనికదా ప్రసిద్ధి - శత్రువులందును దయదలఁచువాఁడనికదా రామచంద్రమూర్తి గరుత్మంతునిచేఁ జెప్పఁబడెను. (౧౦౫౫ ప.) దానికి నిదర్శనముగఁ జేఁజిక్కిన రావణుని "పొమ్మా లంక కనుజ్ఞ యిచ్చితిని బోపో" యని కదా రామచంద్రమూర్తి వదలిపెట్టెను. తాపహారా = తాపత్రయముల హరించు

వాఁడా! 'గ్రీష్మే శీత మివ హ్రద' మ్మన్నట్లు సంసారసంబంధ తాపముల నెల్ల హరించు వాఁడా - విధిహరనుత = బ్రహ్మరుద్రులచే స్తోత్రముచేయఁబడినవాఁడా! క్ష్మాపుత్రీలోల = సీతాదేవియం దాసక్తిగలవాఁడా - రామచంద్ర నృపాల = రామచంద్ర మహారాజా! అవధరింపు మని యధ్యాహార్యము.

ఈ కాండమందలి యర్థ మీ పద్యమున సూచింపఁబడెను. శ్రీప యనుటచే రాజలక్ష్మీగామైన సైన్యసంపత్తియు, శ్రీపద్వేషిత యనుటచే విభీషణ శరణాగతియు, దురితాపహ యనుటచే సముద్రముపై నేయఁదలఁచిన బాణమును సముద్రద్వీపవాసులైన పాపులపై వేసి చంపుటయు, కారుణ్యసీమ యనుటచే వధ్యులయిన శుకసారణుల వదలిపెట్టుటయు, అరిజనభీమ యనుటచే సమస్త రాక్షససంహారమును, తాపహరా యనుటచే సీతాపరిగ్రహమును, విధిహరనుత యనుటచే బ్రహ్మాది స్తోత్రమును, క్ష్మాపుత్రీలోల - రామచంద్ర నృపాలా యనుటచే సీతాయుక్తుఁడై పట్టాభిషేకము చేసికొని ప్రజల పాలించుటయు సూచింపఁబడియె.

—♦ శ్రీరాముఁడు హనుమంతునిఁ బ్రశంసించుట ♦—

క. కలది కలయట్లు చెప్పిన, వలిముఖపతి గాడ్పుపట్టి ♦ వాక్యము లెల్లన్
జలజాక్షుఁడు రాముఁడు విని, యలరుమనంబునను నిట్లు ♦ లను నుత్తరముల్. ౨

అర్థములు: కలదికలయట్లు=జరిగినది జరిగినట్లు-సీతాదేవిని దాను దర్శించినది మొదలు-రావణురాక-వాని బెదరింపులు-సీతా ప్రత్యుత్తరము-రాక్షసస్త్రీలు బెదరించుట-సీతా విలాపము-సీతాదేవితోఁ దనకు నైన సంభాషణము-ఆమె చెప్పినమాటలు-త్రిజటా స్వప్నము - రాక్షసస్త్రీల శరణాగతి - వారి కభయ ప్రదానము - సీతా సందేశము లోనైన వన్నియు నొకటియైన దాఁపక - సుందరకాండమున సీతాదేవి రామచంద్రునినే యుపాయముగను నుపేయముగను గ్రహించుటయుఁ-పారతంత్ర్యము-సీతాపురుషకారము చెప్పఁబడెను. ఇట్లు తమ్ము నుపాయముగను, నుపేయముగను గ్రహించినవారి నెట్లు సీతారాము లనుగ్రహింతురో యీ కాండమునఁ జెప్పఁబడును. సుందరకాండమందు ప్రపన్నునకుఁ దన విషయమైన భగవదాశయముఁ దెలిసి భగవంతుఁడు నిన్ను రక్షించును, భయపడకు మని చెప్పి వాని విషయము వాఁడు భగవంతునియం దెట్టి నిష్ఠగలవాఁడై యుండుటయు భగవంతునకుఁ దెలుపుట చెప్పఁబడెను. ఈ కాండమందు నాచార్యుఁడు ప్రపన్నుని రక్షింప భగవంతుని ప్రేరించి యాయనచే నతని రక్షింపఁజేయుట తెలుపఁబడును. సుందరకాండమందు గురువుచే బోధింపఁబడిన యోగి మనస్సు ఆత్మాన్వేషణ మందాసక్తమై సంసార సాగరమునఁ గలుగు విఘ్నముల నెల్ల దాటి దేహమున నాత్మను వెదకి కనుఁగొని జీవాత్మ పరమాత్మలకుఁ గల సామ్యభేదముల విమర్శించి దేహమునఁ జిక్కుపడక దాని దహించి భగవంతునొద్దఁ జేరుట వివరింపఁబడెను. ఇందు జీవాత్మ పరమాత్మ

లకు నైకట్యము సంపాదించి తాను సెలవు తీసికొనుట చెప్పఁబడును. ఇందుఁ బ్రథమ మున భృత్యుఁడు కార్యము నెఱవేర్చి వచ్చినపిదప యజమానుఁడా భృత్యుని విషయ మున నెట్లు ప్రవర్తింపవలయునో యా విధము చెప్పుటకై సీతవార్త దెచ్చిన హనుమంతుని సుగ్రీవాదుల యుత్సాహాభివృద్ధికై రామచంద్రమూర్తి స్తోత్రము చేయుచున్నాఁడు.

నలిముఖమణి = వానర శ్రేష్ఠుఁడు - గాడ్పుపట్టి = వాయువు కొడుకు యొక్క - జలజాక్షుఁడు = కమలములవంటి కన్నులు గలవాఁడు. ఇది సంతోషమును దెలుపుచున్నది. అలరు మనంబునను = సంతోషించు మనస్సుతో - ఉత్తరమున్ = సమాచారము విన్న తరువాత విన్నవారు చెప్పుమాటను.

తాత్పర్యము

వానరశ్రేష్ఠుఁడైన హనుమంతుఁడు సీతావిషయమై లంకలో జరగినది జరిగి నట్టు చెప్పఁగా రామచంద్రమూర్తి విని సంతోషించి బదులుమాట యిట్లు చెప్పెను.

క. మనసునసే నన్యునకుం, బొనరింప నశక్య మగుచుఁ ♦ బొరి దుర్లభ మై
తనరు మహాకార్యముఁ దీర్చెను హనుమకు నీడు జోడు ♦ క్షితిలోఁ గలరే? 3

ప్రత్యక్షే గురవః స్తుత్యాః । పరోక్షే మిత్రబాంధవాః ।
కర్మాంతే దాసభృత్యాశ్చ । న కదాచన పుత్రకాః॥

గొప్ప కార్యములను సాధించిన గురువులను బ్రత్యక్షమున స్తుతింపవలెను. మిత్రులను జుట్టములను బరోక్షమున స్తుతింపవలెను. భృత్యులను దాసులను వారు కార్యము నిర్వహించిన పిమ్మటఁ బొగడవలయును. కొడుకుల నెప్పుడైనను బొగడ రాదు. అది వారికి శ్రేయస్కరముగాదు, అని యుండుటచేఁ గార్యము నిర్వహించిన హనుమంతుని రామచంద్రమూర్తి పొగడుచున్నాఁడు.

అర్థములు: మనసునసేన్ = మనస్సుచే నైనను - అన్యునకున్ = హనుమం తునకుఁ దప్ప నితరునకు, పొరిన్ = మిక్కిలి - అశక్యము = శక్తికి మించినది. ఇది సముద్రతరణమును దెలుపును - దుర్లభము = లంకాప్రవేశమును దెలుపును. పొరి దుర్లభము = రావణాసురుని యింటఁ బ్రవేశించి సీతను జూచి లంక నల్లకల్లోలము చేయుట - మహాకార్యము = మరలఁ బ్రాణముతో వచ్చుటను దెలుపును - తీర్చెను= కార్యమెట్లు చేయవలయునో యట్లు చక్కఁగాఁ జేసెను. కలరే = లేరని భావము.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి సుగ్రీవునిఁ జూచి చెప్పుచున్నాఁడు. మన హనుమంతుఁడు చేసిన గొప్ప కార్యమును మఱియొకఁడు నేను జేసెద నని నోరఁ జెప్పుటకే కాదు, మనస్సులో ననుకొనుటకుఁగూడ వాని శక్తికి మించినది. మిగుల దుర్లభమైనది. అట్టి కార్యమును హనుమంతుఁడు చక్కఁగ నెఱవేర్చి వచ్చెను. ఈయనకు సమానుఁడని చెప్పఁదగినవాఁడీ లోకములో నున్నాఁడా - లేఁడు - లేఁడు.

క. ఇవ్వాయుతనూజుఁడు గా, కవ్విహగాధీశ్వరుండు ♦ కనిలుండును గా
కెవ్వరి కొక్కో సాధ్యం బగు, నవ్వారిధి దాఁటఁ దోఁపఁ ♦ డాత్మ నొకండున్. ౪

అర్థములు: విహగాధీశ్వరుండు = గరుత్మంతుఁడు - అనిలుఁడు = వాయువు - తోఁపఁడు=మనస్సునకు వచ్చినవాఁడు కాఁడు - ఆ విహగాధీశ్వరుఁడు ఆ యనిలుఁడని యన్వయింప వలెను. - వేగంబునఁ బ్రసిద్ధికెక్కిన గరుత్మంతుఁడు వాయుదేవుఁడని యర్థము - ఇవ్వాయుతనూజుఁడు గాక - విహగాధీశ్వరుఁడు గాక - యనిలుఁడు గాక యని యుండవలసి యుండఁగా విహగాధీశ్వరుఁడును అనిలుండును గాక యనుటచే వారి యిరువుర వేగమును నొక్కటిగఁ గలిపిన హనుమంతుని వేగమునకు సరిపోవు ననిభావము. ఆ యిరువు రొకయెత్తు - హనుమంతుఁ డొకఁడే యొక యెత్తని భావము.

తాత్పర్యము.

ఈ హనుమంతుఁడు గాక గమనవేగమునకుఁ బ్రసిద్ధులైన గరుడానిలులు గాక మఱి యెవ్వరికైన నా సముద్రము దాఁట శక్యమా యని యాలోచించిన నొక్కఁడైన నంతటివాఁడు మనస్సునకు రాలేదు.

చ. అనిమిష యక్ష రాక్షస సమూ♦హాహిచయంబుల కైనఁ జక్కఁగాఁ
గనుఁగొన రానిదాని, దశ♦కంధరపాలిత మైన లంకనుఁ,
ఘనతరసత్త్వలక్ష్మిఁ జొరఁ♦గాఁ గను టెక్కడఁ? జొచ్చి నేనియుఁ
దనువునఁ బ్రాణముల్ గలుగఁ♦ దా మఱి వచ్చుట యేడ నెట్టిఁడున్? ౫

అర్థములు: అనిమిష...... చయంబులకైనన్ = దేవతల యొక్కయు - యక్షుల యొక్కయు - రాక్షసులయు - గొప్పసర్పములయు సమూహముల కైనను - ఘనతరసత్త్వలక్ష్మిన్ = మిగుల గొప్పదగు బలసంపదచే - చొరఁగాన్ + కనుట = ప్రవేశింప నాలోచించుట - ఎట్టిఁడున్ = ఎట్టివాఁడైనను.

తాత్పర్యము.

సుగ్రీవా - లంకను దేవతలకు - యక్షులకు - రాక్షసుల కైనను దూరమునుండి దొంగతనముగాఁ జూచితప్ప యథాదృష్టి పాఱఁజూచుటకును సాధ్యము గాదు. పదితలల రావణుఁడు పాలించునట్టి లంకను మఱియెట్టి వాఁడైనను తన బలసంపదచేఁ బ్రవేశింప సాధ్యమా? ఒకవేళ రాక్షసుల నేమఱించి లోపలఁ బ్రవేశించినను మరలఁ బ్రాణముతో వచ్చుటకు సాధ్యమా? అట్లుచేయ మన హనుమంతున కొక్కనికిఁ జెల్లెనుగాక.

క. బలవీర్యము లున్న మహా, బలసుతుతో నీడు వచ్చు♦ వాఁడును గాఁడే
గలఁడే రక్షోరక్షిత, మల దుర్గంబు, లంక ♦ నటువలెఁ జొరఁగన్. ౬

అర్థములు: ఉన్నన్ = ఉండినను - మహాబలసుతునితోన్ = హనుమంతునితోన్ - ఇట్లు చెప్పుటచే కేవల స్వశక్తియేకాక పితృశక్తియుఁ గలసి యున్నదని భావము - మహాబలుఁ డనుపేరు వాయువునకుఁ దప్ప మఱియెవ్వనికి లేకుండుటచే నటువంటి శక్తియు

మఱియెవ్వనికి లేదు. రక్షోరక్షితము= రాక్షసులచేఁ గాపాడఁ బడునది. అల = ఆ దుర్ధర్షంబు = కలఁత పెట్టరానిది - అటువలెన్ = హనుమంతుఁడు ప్రవేశించినట్లు.

## తాత్పర్యము.

సముద్రమును మీఱి హనుమంతునితో సమానులగు బలము విక్రమము గలవారు లోకమున లేరా యందు నేమో - ఒకవేళ నుండినను సన్నివిషయములు వేగము బుద్ధి దృష్టిలోనైన వానియందును వాయునందనునితో సమానుఁడు కాఁడేని రాక్షసులు రక్షించుచున్న యిటువంటి ధర్షింపరాని లంకను హనుమంతుఁడు ప్రవేశించిన విధముగా లంకలోఁ బ్రవేశింప సాధ్యమా ?

క. రవితనయ భృత్యకార్యముఁ, బవమానసుతుండు దీర్చెఁ ♦ బ్రస్తవ్యగతిన్
సవరస నిజవిక్రమతు,ల్యవిధంబుగ బలముఁ జూపె ♦ ననురూపముగన్. ౭

**అర్థములు:** రవి తనయ భృత్యకార్యము=-(౧) సుగ్రీవా! బంటుచేయవలసినపని (౨) సుగ్రీవునిబంటెటువంటి కార్యము చేయఁగునో యట్టికార్యము-అల్పుని దూత యల్పకార్యమే చేయఁగలఁడు. సూర్యపుత్రుఁ డగు సుగ్రీవునంతటి గొప్పవాని బంటు గొప్పకార్యమే చేయఁగలఁడని భావము. పవమానసుతుండు = హనుమ - సుగ్రీవుఁడు సూర్యుని పుత్రుఁడు - సూర్యుని శిష్యుఁడు హనుమంతుఁడు - గురుపుత్రునికార్యము శిష్యుఁడు తీర్పవలసినవాఁడేకదా - ప్రస్తవ్యగతిన్ = మిక్కిలి స్తోత్రము చేయఁబడఁ దగిన విధముగ - సవరస = చక్కని - అనురూపముగన్ = యజమానుని యోగ్యతకుఁ దగిన విధముగ - విక్రమము = అతిశక్తి -

## తాత్పర్యము.

సుగ్రీవునివంటివాని భృత్యుఁ డెట్లు కార్యము చేయవలయునో యట్లు మిక్కిలి పొగడ్తకుఁ దగిన విధముగ సీతాన్వేషణకార్యము నెఱవేర్చెను. అంతమాత్రమేకాదు. సుగ్రీవుని యోగ్యతకుఁ దగినట్లు తన యతిశయమైన శక్తికిఁ దగినట్లు బలమునాడఁ జూపి రాక్షసుల వధించి లంక కాల్చివచ్చెను.

ఆత్మశ్లాఘగా నుండునని హనుమంతుఁడు తాను జేసినకార్యములు చెప్పలేని సుందరకాండాంతమున వ్రాయఁబడెనే - లంకాదహనాది కృత్యములు రామచంద్రుని కెట్లు తెలిసెను అని సందేహింపఁ బనిలేదు. సీతావృత్తాంతము ప్రథమవక్తవ్యమగుట నది తొలుతఁ జెప్పఁబడెను. అంతటితో రామచంద్రమూర్తి సంతోషపడి యూరకుండునా? నీవు సముద్ర మెట్లు దాఁటితివి - ఎప్పుడు దాఁటితివి - ఎట్లు లంకలో బ్రవేశించితివి - రాక్షసులు నిన్నుఁ జూడలేదా? వారికిఁ గానరాకుండ సీత నెట్లు వెదకితివి. సీతతో సంభాషించునపుడు కావలికత్తె లెవ్వరు చూడలేదా - చూచియుండిన రావణునకుఁ జెప్పియుండరా - వాఁడు నిన్నూరక విడచెనా -బాధించియుండునే ఇత్యాది ప్రశ్నలు పుట్టక మానవు - వీనికిఁ బ్రత్యుత్తరముగఁ దాను జేసిన కార్యము లన్నియుఁ జెప్పక తప్పదు-తన్ను గుఱించి తాను ముందుగఁ జెప్పరాదు గాని ప్రశ్న

లడిగినప్పుడు ప్రత్యుత్తర మీయక తప్పదు. అది యాత్మశ్లాఘ కాదు. రెండవ పద్యములోని కలది కలయట్టులను పద మీ యర్థమును సూచించు చున్నది.

తే. పతి సుదుష్కర మగుపనిఁ ♦ బంప భర్తిఁ, దనకుఁ జెప్పని దైనను ♦ దదనుబంధ
మైన దానిని ఘటియించు♦నట్టిభృత్యు, పరునిఁబురుషోత్తముం డండ్రు♦ పరమమతులు.

సుగ్రీవుఁడు చెప్పని పనియైనను జూచిరమ్మనినఁ గాల్చివచ్చెనే యిది యధిక ప్రసంగితనము కాదా యను సందేహము నివర్తింప నట్లు చేయువాఁడే యుత్తమ దూత యని రామచంద్రమూర్తి చెప్పుచున్నాఁడు.

అర్థములు. సుదుష్కరము=చేయుటకు మిగులఁ గష్టమైనది. పంపఁగ=చేయు నాజ్ఞాపింపఁగా · తదనుబంధ మైనదానిని - తత్ = యజమానుఁ డాజ్ఞాపించిన దానికి - అనుబంధము = అంటివచ్చునది - సంబంధించినది - పరమమతులు=గొప్ప మనస్సు గలవారు - బుద్ధిమంతులు , (సూ-సుందర-౧౦౦౮-౧౦౦౯) దూతలక్షణము (సుందర వ. ౭౫౯-౭౬౦ సుందరము చూచునది).

తాత్పర్యము.

యజమానుఁడు చేయుటకు మిక్కిలి కష్టమైన పని చేయు మని యాజ్ఞాపించెనేని నా కింత కష్టమైన పని చెప్పెను, జూచితివా యని మనస్సునందు నొచ్చుకొనక మనయం దనుగ్రహము, గొప్ప యభిప్రాయము కలిగి నేను నెఱవేర్పఁగల నను విశ్వాసము తోడఁగదా నాకీ పని చెప్పెను అని భర్త యందు భక్తిగలవాఁడై యాయన చెప్పిన పని చేయుటయే గాక యా పనికి సంబంధించినది యాయన చెప్పకున్నను నెఱవేర్చు దూతను బుద్ధిమంతులు పురుషోత్తముఁ డనుదురు. ఇది యుత్తమ దూతలక్షణము.

తే. భర్తచేత నియుక్తుఁడై ♦ పతికి హితము
టంచు నెఱిఁగియుఁ జెప్పఁ డ♦టంచు హెచ్చు
నాచరింపని యుక్తస♦మర్థభటుఁడు
మధ్యముఁడు నాఁగఁబడు సాధు♦మతులచేత. ౯

అర్థములు : నియుక్తుఁడై=నియోగింపఁబడినవాఁడై - యుక్తసమర్థభటుఁడు= యుక్తుఁడు= ఉత్సాహముతోఁ గూడినవాఁడు - సమర్థుఁడు = చేయ శక్తిగలవాఁడు.

తాత్పర్యము.

భర్తచేత నాజ్ఞాపింపఁబడి యా కార్యము నెఱవేర్చి దానికి సంబంధించినది చేయఁదగినది యిగుంటానిని సద చేసిన భర్తకు మేలని యెఱిఁగియు నతఁడు చెప్పలేదు, చెప్పనిపని మన మేల చేయవలయునని చెప్పిన దానికంటె హెచ్చుచేయనివాఁ డుత్సాహము సామర్థ్యము గలవాఁడైనను వానిని బుద్ధిమంతులు మధ్యముఁ డని యందురు.

క. పతిచే నియుక్తుఁడై తత్కృతిని సమర్థుండు నయ్యు ♦ భృత్యుఁడు శ్రద్ధా
యుతుఁడయి చలుపక చెఱిచిన, నతనిని బురుషాధముం డ♦టందురు పెద్దల్. ౧౦

అర్థములు. నియుక్తుఁడై = ఆజ్ఞాపింపఁబడినవాఁడై - తత్కృతిని = ఆ కార్యము చేయుటయందు - శ్రద్ధాయుతుఁడయి = శ్రద్ధతోఁ గూడినవాఁడై - పురుషాధముఁడు = నీచమనుష్యుఁడు.

తాత్పర్యము.

నీ వీ కార్యము చేయవలసిన దని భర్తచే నియోగింపఁబడి యా కార్యము చేయుటయందు సామర్థ్యము గలవాఁడయ్యుఁ గార్యమునందు శ్రద్ధలేక చెఱిచెనేని పెద్ద లతనిని నీచమనుష్యుఁ డందురు.

ఉ. కాన నియుక్తకార్యమును ♦ గాడ్పుతనూభవుఁ డాత్మగౌరవం
బూనతఁ నొంద కుండఁ, బలి ♦ యుష్ణకరాత్మభవుండు సంతసం
బూన ఘటించె, నెండియు ర♦ఘూత్తమవంశము సన్న లక్ష్మణుల్
జానకిఁ గాంచి మన్చె, సడి♦చావుఁ దొలంచెను, నిల్పె ధర్మమున్. ౧౧

అర్థములు: నియుక్తకార్యమును = నియమింపఁబడిన పనిని - సడి చావు = నిందతోఁ గూడిన మరణము.

తాత్పర్యము.

ఇట్లుండుటచేత హనుమంతుఁడు పురుషోత్తముఁడు కావున రాక్షసులకుఁ జిక్కినాఁడని తన గౌరవమునకు హాని లేకుండునట్లు - తన్ను నియమించిన సుగ్రీవుఁడు సంతోషించునట్లు నియమిత కార్యమును సాధించెను. ఇది తన స్వామికిఁ జేసిన యుపకారము. ఇఁక మాకో జానకిని జూచుటచే నాకు లక్ష్మణునకు మా యుత్తమ రఘువంశమునకుఁ బ్రాణము లిచ్చి రక్షించెను. ఈయన యీ పని చేయకుండిన లోకములోని యందఱు చచ్చినట్టుగాక యపకీర్తితోడి చావు చచ్చియుందుము. అట్టి దుర్మరణమునుండి తప్పించెను. ఆత్మహత్య యనెడి యధర్మమునకుఁ బాలుపడనీక ధర్మమును రక్షించెను.

క. ఇంతటి పరమప్రియము నుదంతము వచియించు పవన♦తనయునికృతి క
త్యంతము సమ మగు ప్రియ మొక్కింతయుఁ గావింప లేమి ♦ కే దుఃఖంతున్. ౧౨

అర్థములు:—ఉదంతము = వృత్తాంతము.

తాత్పర్యము.

మాకు మా వంశమునకు దుర్మరణము రాకుండఁ గాపాడినంతటి గొప్ప యుపకార మగు సంతోషవార్తను జెప్పిన హనుమంతుని సాహాయ్యమునకుఁ గేవలము సమానమగు సంతోష మాయనకుఁ గలుగఁ జేయుటకు శక్తి లేదాయెఁ గదా యని మిక్కిలి దుఃఖించుచున్నాను.

ఉ. నాకుఁ గలట్టి సర్వము ధ♦నంబు నొసంగినఁ గాని పోదు హృ
ద్వ్యాకులతావిధంబు, ధన♦వంతుఁడఁ గా, నిఁక మాఱుమేలు నే
నే కరణిన్ ఘటింపఁ గల ♦ నియ్యెడఁ? గావున నాదుకౌఁగిలిన్
గైకొనవయ్య దాసప్రతి♦గా మహితాత్మక! మారుతాత్మజా! ౧౩

అర్థములు: హృత్ + వ్యాకులతా + విధంబు = మనస్సునందలి కలత-ప్రతిగా= బదులుగా - మహితాత్మక = గొప్పమనస్సు గలవాఁడా - ఇది భావగర్భితము - మిక్కిలి యుదారమైన మనస్సు గలవాఁడా - నే నిచ్చుదాని విలువ నాలోచింపకు మని భావము - కైకొనవయ్యా = ప్రార్థనార్థకము.

తాత్పర్యము.

నాకు లోకమునందు నాది యని నేను దలంచిన ధన మెంత గలదో యంతయు నిచ్చితినేని నీవు చేసిన ప్రియమునకు సమానమైన ప్రియము నేను జేసితినని సంతోషింపఁ గలను - అట్టు లన్నను నా యొద్ద ధన మనునది లేదు. ఇఁక నేను నీ కేమి మఱుమే లిచ్చుటఁ జేయఁగలను - శుష్కాలాపములతోను, శూన్యహస్తములతోను నేమి లాభము? నేను రాజనై యుంటినేని సర్వరాజ్యము నీ కిచ్చియుందును. అదియు లేదాయె. కావున నీవు చేసిన దానికి బదులుగా నా కౌఁగిలి గ్రహింపు మని యాంజనేయా! ప్రార్థించుచున్నాను. బదు లని నేను జెప్పితినిగాని సమానముగ నని చెప్పలేదు. ఇది నీవు చేసినదానికి సమానము గాదు. అయినను ఈ యల్పదక్షిణను శాస్త్రోక్తదక్షిణగా గ్రహింపు మన్నట్లు నాకు గల యల్పము, నా యీ దేహము నీకు సమర్పించుచున్నాను. నీ వుదారచిత్తుఁడవు, ఎదుటివారి లోపము లెంచువాఁడవుకావు. కూలివాండ్రవలెఁ బ్రతిఫలాపేక్షచేఁ జేసిన వాఁడవుకావు. కేవల ధర్మబుద్ధితో, నుపకారబుద్ధితో, దయార్ద్రహృదయముతోఁ జేసిన మహాత్ముఁడవు. కావున నిరాకరింపక గ్రహింపు మని ప్రార్థించుచున్నాను. కృపతోఁ బరిగ్రహింపుము. నీవు నిరాకరించితివేని నా కంతకంటె వేఱుమరణములేదు. ఏలయిది సమానము గాదనుచున్నావందువా? అచ్చటఁ జచ్చుటకు సిద్ధముగా నున్న సీత ప్రాణములు నిలిపితివి. ఆ వార్త తెచ్చి యిచ్చుట నా ప్రాణములు నిలిపితివి. ఇట్టు లిరువుర దేహములు నీ వీయఁగా నీ కొక దేహ మిచ్చుట యెట్లు సమాన మగును - కాదు-తెలియును. నే నేమిచేయుదును? ఏమియుఁ జేయలేనైతిఁగదా యని పరితాపపడుచున్నాను. నా యీ దుఃఖమును నే నిచ్చినదానిని బ్రీతితో గ్రహించి యణఁపుము - నీవు చేసిన యుపకారములకు నిది సమానము గాదనుటకు మఱియొక కారణము గలదు. నీవు సుగ్రీవునితో నాకు స్నేహము గుదిర్చి గొప్ప యుపకారము జేసితివి. ఆనాఁటినుండి యీయనకుఁ బ్రత్యుపకార మేమి చేయుదునా యని యాలోచించుచుంటిని - ఇప్పుడిది రెండవది. ఈ రెంటికి నే నిచ్చిన యల్ప మెట్లు సరిగాఁగలదు - కావున హెచ్చుతక్కువ లాలోచింపక నే నిచ్చిన యల్పమును బ్రీతిచేఁ బరిగ్రహింపుము. కౌఁగిలి యిచ్చుట యనఁగాఁ దన్నుఁ దాను సమర్పించుకొనుట - ఆత్మాత్మీయనిక్షేప మన్నట్లు తన్ను సమర్పించుట యనఁగాఁ దనకుఁ గల సర్వస్వము, నిత్యవిభూతి, లీలావిభూతి రెండు విభూతులు సమర్పించినట్లే - వీనితో నాయన కేమి ప్రయోజనము? ఆయనకుఁ బ్రియమైన దిచ్చినఁగదా ప్రయోజన మందు రేమో - హనుమంతునకుఁ బ్రియమైనది

'ఇచ్ఛాగృహీతాభిమతోరుదేహ' యన్నట్లు శ్రీరామచంద్రమూర్తి దివ్యమంగళ విగ్రహమే. పరస్వరూపముతో నాయనకుఁ బనిలేదు. కావుననే నిన్ను విష్ణుఁడంపెనా యని రావణుఁ డడిగించినపుడు విష్ణు వెవ్వరో - నన్నుఁ బంపినది రామచంద్రమూర్తి యనెను. ఎవరి కేది ప్రియమో దానిని భగవంతుఁడు వాని కిచ్చుచుండును. కావున ఆ దివ్యమంగళ విగ్రహమందు హనుమంతునకుఁ బ్రీతి యని తెలిసి దానినే యిచ్చెను. దానితో హనుమంతుఁడు సంతుష్టుఁ డయ్యెను. ఈ సందర్భమున శ్రీ భాగవతమున గోపికలకు శ్రీకృష్ణమూర్తి చెప్పిన వాక్యములు స్మరించునది.

ఉ. పాయని గేహ శృంఖలలఁ బాసి నిరంతరమత్పరత్వముం
జేయుచు నున్న మీకుఁ బ్రతి సేయ యుగంబుల నైన నేర నం
బోయక కొల్చు మానసము ప్రత్యుపకారముగాఁ దలంచి నా
పాయుట తప్పుగాఁ గొనక భామినులార కృపం క్షమింపరే. భాగ-౧౦-౧౦౭౯

రుక్మిణీదేవి బ్రాహ్మణునితో—

మ. జలజాతేక్షణుఁ దోడి తెచ్చితివి నా సందేశముం జెప్పి నన్
నిలునం బెట్టితి నీ కృపం బ్రతికితిం నీ యంత పుణ్యాత్మకుల్
గలరే దీనికి నీకుఁ బ్రత్యుపకృతిం గావింప నే నేర నం
జలి గావించెద భూసురాన్వయమణీ! సద్బంధు చింతామణీ!

భాగ - ౧౦-౧౭౩౬.

ఈ కాండమున ౨౬౧౩ పద్యము హనుమంతునకు సీతోక్తి చూచునది. హనుమంతునకు నుభయవిభూతు లిచ్చుట సరి యని రామచంద్రమూర్తి తలఁచెఁ గాని, సీత యదియుఁ దక్కువగానే తలఁచెను. వీని నన్నిటిని గ్రోడీకరించి చూచిన భక్తికి సరియైన ప్రతిఫలము భగవంతుఁడు కూడ సీయఁ జాలఁడనియు సాయుజ్యము కూడఁ దక్కువ ఫలమే యనియు భక్తికి సమానమైనది భక్తియే కాని కర్మము నందుఁ గాని, ఫలమందుఁ గాని వే ఱొకటి లే దనియు నేర్పడు చున్నది. కావున భగవత్సాయుజ్యము గోరు వారికి భక్తితోడి సేవకంటె నుత్తమ సాధనము లేదు. ఇట్టి కౌఁగిలింత గుహ హనుమదాది భక్తులకు లభించెఁ గాని కేవల కర్మఠులకు, మాయాజ్ఞానులకు యోగులకు లభింపలేదు. ఈ కౌఁగిలింతయే వేదాంతముక్తి - అద్వైతవాదు లయిన శంకరాచార్యుల వారును నిట్లు చెప్పిరి.

క. అని పులకితగాత్రుండై, యినవంశాభరణ మతఁడు ♦ కృతకార్యు మహా
త్మునిఁ బావనిఁ బిగికౌఁగిట, మన మారఁగఁ గ్రుచ్చి వెండి ♦ మానసవీథిన్. ౧౪

అర్థములు. పులకితగాత్రుండై = పులకరించిన దేహముగలవాఁడై, ఇనవంశాభరణము=సూర్యవంశపు రాజులలో శ్రేష్ఠుఁడైనవాఁడు, రామచంద్రమూర్తి, కృతకార్యుం=కార్యము సాధించిన వానిని, మహాత్ముని=గొప్పమనస్సు గొప్పస్వభావము

గల వానిని, పావనిః=(౧) పరిశుద్ధుని, (౨) ఆంజనేయుని, మనసా + అంతరంగః= నిండు మనస్సుతో, కౌగిల్చి = కౌఁగిలించి.

కౌఁగిలింతకు అనఁగా సాయుజ్యమునకు నధికారి యెట్టివాఁడనునది కృత కార్యుఁడు, మహాత్ముఁడు, పావని యను విశేషణములు దెలుపుచున్నవి. కృత కార్యుఁడు = యావజ్జీవము స్వధర్మకర్మముల భగవదర్పణబుద్ధి నాచరించువాఁడు సాయుజ్యమున కర్హుఁడగునుగాని, కర్మమును స్వరూపముతోఁ ద్యజించినవాఁడు యోగ్యుఁడు కాఁడని తెలుపుచున్నది.

౧. మహాత్ముఁడు = గొప్ప ప్రయత్నము చేయువాఁడు. అనఁగా సోమరియై యంతయు దేవుఁడే చేయునని యుండక తనకు విధివిహితమైన కార్యములు చేయు వాఁడు, ముందు తాను జేయవలసినవి చేసిన వెనుక భగవంతుఁడు చేయవలసినది చేయును. చరమ శ్లోకత్రయ మీ యర్థమునే బోధించెడిని.

౨. మహాస్థైర్యము కలవాఁడు - ఎన్ని కష్టములు వచ్చినను బూనిన పని యందలి స్థైర్యము ధైర్యము గలవారయి భక్తులు 'శ్రేయాంసి బహు విఘ్నాని' యన్నట్లు లెన్నియో మనశ్శ్లాఘనమునకై విఘ్నములు కష్టములు గలుగును. వానికి భయపడి తన ప్రయత్నము మానరాదు.

౩. మహాత్ముఁడు = గొప్ప మనస్సు గలవాడు - సత్త్వగుణభూయిష్ఠమైన మనస్సే గొప్ప మనస్సు - సాత్త్వికకార్యములు చేయుటయం దాసక్తమైన మనస్సు గలవాఁడు.

౪. గొప్ప స్వభావముగలవాఁడు=సత్త్వగుణము కొంతసేపుండి కొంతసేపు లేకుండునదిగా నుండరాదు. అది స్వభావమై యుండవలెను. రాజసతామస కార్యము లందు మనస్సు పోనిదై యుండవలెను.

౫. గొప్పబుద్ధి గలవాఁడు = నిశ్చయాత్మకమైనది బుద్ధికావున "మ య్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ" యన్నట్లు బుద్ధి భగవంతునిమీఁదనే యుంచఁ బడినదై యుండవలయును.

౬. మహాశరీరముగలవాఁడు = అనఁగా బలసినవాఁడని యర్థముకాదు. మనోబుద్ధిచిత్తములు శుద్ధముగా నున్నవి కదా, బాహ్యమున నెట్లుండిన నేమి యనక శరీరముకూడ శుచిగా నుంచుకొనువాఁడు. 'శుచి ర్దక్ష'యని కదా చెప్పఁ బడెను. బాహ్యాభ్యంతరముల రెంటను నేకవిధముగ నుండవలెను. త్రికరణశుద్ధి యుండవలెను. దీనివలన నస్పృశ్యము స్పృశించుట, అభక్ష్యముల భక్షించుట, దురాలోచనములు చేయకుండుట, చూడరానివి చూడకుండుట లోనైనవి గ్రహింప వలెను.

ఆత్మశబ్దమునకీ యర్థము లన్నియుఁ గలవు.

పావని=పవిత్రుఁడు, 'యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణా'మ్మన్నట్లు, దేవతారాధనము-'దాన మేకం కలౌయుగే' - యన్నట్లు దానము-తపస్సు-సత్యము-దమములలోని నవిగాక యుత్తమ తపస్సు అగు న్యాసము కలవాఁడై యుండవలెను. న్యాస మనఁగా తన రక్షాభారము భగవంతునియందు వైచుట. దేహపోషణమందే యాసక్తుఁడుగాక యదృచ్ఛాలాభసంతుష్టుఁ డయి నిర్భరుఁడు, నిర్భయుఁడు నగుట.

తాత్పర్యము.

ఈ ప్రకారము చెప్పి దేహము సంతోషముచేఁ బులకరింపఁగా రామచంద్రమూర్తి కార్యసాధకుఁడు, మహాత్ముఁ డగు నాంజనేయుని నిండుమనస్సుతోఁ గౌఁగిలించుకొని తరువాత తన మనస్సునందు.

పులకితగాత్రుఁడు మనమారఁగః గ్రుచ్చి ననుటచే రాజనీతి ననుసరించి యుపచారార్థము గాదనియు పరమార్థబుద్ధిఁ గౌఁగిలించెననియు నేర్పడు చున్నది.

బోయ యగు గుహుని, గ్రద్దను జటాయువును, గోతియగు హనుమంతుని కౌఁగిలించుటచే రామానుగ్రహమునకుఁ బూర్ణభక్తిగల సమస్త భూతములు యోగ్యములే యని సూచన.

వాల్మీకి సూర్యోదయము లంకలోఁ జెప్పెఁగాని యావల సూర్యాస్తమానము చెప్పకుండుటచే నిది యంతయు ఫాల్గున శుద్ధ చతుర్దశి పగటిచర్య యనియే గ్రహింపవలసియున్నది.

క. తలపోసి రామచంద్రుఁడు, జలజహితతనూజుఁ గాంచి ♦ జానకి రోయం
గల పని చక్కఁబడియును, జలనిధి దలపోయ మనసు ♦ ఝల్లనె జుమ్మీ. ౧౫

అర్థములు. తలపోసి = ఆలోచించి.

తాత్పర్యము.

ఆలోచించినవాఁడై రామచంద్రమూర్తి సుగ్రీవునిఁ జూచి యిట్లనియె. జానకీదేవిని వెదకు పని చక్కనయ్యెను. కాని సముద్రమును దలఁచిన దిగు లగు చున్నది.

క. దుస్తర మగు జలనిధిని స,మస్తకపుల్ దాఁటి దక్షి ♦ ణాశాతటముఁ
బ్రస్తుతగతిఁ జేరుట యెటు? నిస్తులితబలాఢ్య! చెప్పుము ♦ నీ వొకయుపమన్. ౧౬

అర్థములు. దుస్తరము = దాఁటఁ గష్టమైనది - దక్షిణాశాతటముఁ = దక్షిణపుటొడ్డును - ఉపమన్ = ఉపాయమును - ప్రస్తుతగతిన్ = స్తోత్రము చేయఁబడు విధముగ.

తాత్పర్యము.

దాఁట సాధ్యము గాని సముద్రమును దాఁటి అందఱు వానరులు దక్షిణదిక్కు తీరమును లోకము మెచ్చునట్లు చేరు టెట్లో నీ కుపాయముఁ దెలిసిన చెప్పుము.

క. జనకతనూభవ యుండెడు,నునికియుఁ దద్వార్త మీర • లొప్పుగఁ జెప్పన్
వినితిని వనచరు లిందఱు, వననిధిఁ దరియింప నెట్లు•వల నగుఁ జెపుఁడా? ౧౭

అర్థములు. ఉనికి = ప్రదేశము - తద్వార్త = ఆమె విషయమైన వృత్తాంతము - వనచరులు = వానరులారా!

తాత్పర్యము.

వానరులారా! సీత యెందున్నది, యెట్లున్నది మీరు చెప్పగా వింటిని. అచ్చటికి మనము పోవలయును గదా- మార్గమున సముద్రము దాఁటవలయునుగదా! మీ రందఱు నెట్లు దాఁట సాధ్యపడునో యుపాయము చెప్పుఁడు.

క. అని పలికి హనుమతో సహి, తనిబర్హణుఁ డైన రామ•ధరణీశుఁడు యో
జన సల్పె మహాబాహుం, డనయము శోకంబు దన్ను • నారట పెట్టన్. ౧౮

అర్థములు. అహితనిబర్హణుఁడు = శత్రువులఁ జంపువాఁడు.

తాత్పర్యము.

ఈ ప్రకారము వానరులకుఁ దెలిపి దీర్ఘబాహువులు, భుజబలము గలిగి శత్రువుల ధ్వంసము చేయఁగల రామచంద్రమూర్తి యాంజనేయునితో శోకముచే నారాటపడుచు నాలోచించెను.

దీర్ఘబాహుఁడు, శత్రునిబర్హణుఁ డను రెండు విశేషణములు భుజబలముచే సముద్రము నెండఁగట్టి దాఁట నాలోచించె నని సూచించుచున్నవి. శత్రువగు రావణునకు సహాయుఁ డగు సముద్రుఁడు శత్రువేకదా.

— { ౨-వ సర్గము. సుగ్రీవుఁడు శ్రీరాముని కుత్సాహంబుఁ గలుగ భాషించుట. } —

సీ. తతశోకసంతప్తు • దశరథాత్మజుఁ గాంచి, సుగ్రీవుఁ డిట్లను • శోకనాశ
కరములౌ సూక్తుల • ధరణీశనందన, యే లయ్య ప్రాకృతు•లీల నీవు
సంతాప మందెదు•సౌహృదంబుఁ గృతఘ్నుఁ, డవలఁ ద్రోచెడి భంగి•నార్తి విడువు
మింతకు నీ విట్లు • సంతాప మందఁగఁ, గారణం బేమియుఁ • గానరాదు
ఆ. పగతు నునికి దెలిసె • బలిమి నీరధి దాఁటి, లంక లగ్గ పట్టి • బింకమునను
నీదుశాత్రవుని • నిహతునిఁ గావించి, వెలయఁగల మి టేల • కలఁగ నీకు. ౧౯

అర్థములు. ప్రాకృతులీలన్ = పామరజనునివలె, సౌహృదంబు = స్నేహభావము, కలఁగన్ = కలఁతచెంద.

"ఆప ద్యున్మార్గగమనే, కార్యకాలాత్యయేషుచ, అపృష్టోపి హితాన్వేషీ బ్రూయాత్కల్యాణభాషితమ్॥"

క. హితకార్యము నన్నడుగఁడు, పతి నా కేమిటి కపృచ్ఛపరిభాషణ మం
చతి మౌనముద్ర నుండుట, మత మనరు సునీతివిదులు మంత్రుల కెందున్. పంచ॥

కావునఁ దన్నడుగ కున్నను సుగ్రీవుఁడు చెప్పుచున్నాఁడు.

తా త్ప ర్య ము.

సముద్రము దాఁటు టెట్లులా యని విచారపడు రామచంద్రమూర్తిని జూచి సుగ్రీవుఁడు శోకము నాశము జేయునట్టివియు, మంచి ధైర్యము కలిగించునట్టివియు మాటల నిట్లనియె. రాజకుమారా! నీవు క్షత్రియుఁడవయ్యు నుత్సాహము వదలి సామాన్యజనుని వలె నేల పరితాప పడెదవు. కృతఘ్నుఁడు స్నేహము విడిచినట్లు నీవు శోకమును వదలిపెట్టుము. ఇప్పుడేమి చెడిన దని నీవు పరితాప పడెదవు? నీ పరితాపమునకుఁ గారణ మున్నఁ జెప్పుము. ఇంతవఱకుఁ బగవాఁ డెందుండు నది తెలియక యూరకుంటిమి. వాఁ డుండు ప్రదేశము తెలసెను. ఇఁక మనము పోయి మన బలము చూపించి సముద్రము దాఁటి లంక ముట్టడించి లగ్గలు పట్టి నీ విరోధిని జంపఁగలము. ఏల యూరక కలవరపడెదవు?

మ. మతిమంతుండవు శాస్త్రవేత్తవు దలంపం బండితాగ్ర్యుండవుక్
స్తుతధీప్రాజ్ఞవరుండ విట్లు దగునే శోకంబునం గుండఁగా?
ధృతి యోగీంద్రుఁడు స్వార్థహానికరబుద్ధిక్ వీడున ట్లీ వ్యథా
మతిఁ బోవిడుము, కార్యనాశ మగుఁ జుమ్మా శోకపున్యంబులన్. ౨౦

అర్థములు. మతిమంతుండవు=రాఁబోవు విషయముల గురించిన యాలోచన చక్కఁగా జేయఁగలవాఁడవు- "మతి రాగామిగోచరా". శాస్త్రవేత్తవు. ఏ యే సమయములందు నెట్లెట్లు వర్తింపవలయు నని శాస్త్రము చెప్పుచున్నదో యా విధానము దెలిసినవాఁడవు. పండితాగ్ర్యుండవు = సర్వము దెలిసిన విద్వాంసులందు మొదటి వాఁడవు - స్తుత = స్తోత్రము చేయఁబడిన, ధీ = బుద్ధిగల, ప్రాజ్ఞవరుండవు = బుద్ధిమంతులలో శ్రేష్ఠుఁడవు, ధృతిక్ = ధైర్యముచే, స్వార్థహాని కరబుద్ధిక్ = తాను గోరిన ప్రయోజనమునకు హాని కలిగించు నాలోచనను, వ్యథామతిక్ = వ్యసనము తోడి మనస్సును.

తా త్ప ర్య ము.

రామచంద్రా! కాఁగల విషయమై నీ వెంతో మంచి యాలోచన సేయు సామర్థ్యము గలవాఁడవు. ఆ యాలోచన యైనను శాస్త్రము ననుసరించి చేయుదువు గాని, శాస్త్రజ్ఞానము గలవాడ వగుటచే దానికి విరుద్ధముగ జేయవు. ఏలన, నీవు పండితులలో శ్రేష్ఠుడవు. ప్రాజ్ఞు లందరు నీ బుద్ధిని స్తోత్రము చేయుదురు. ఇట్టివాడవు నీవు శోకముచే బాధపడవచ్చునా? తాను సాధింపఁ బూనిన ప్రయోజనమును విఘ్న పఱచు బుద్ధిని యోగీంద్రుడు ధైర్యముచే నెట్లు విడచునో యట్లు నీవు సంకల్పించిన సీతాప్రాప్తి యను ఫలమునకు విరోధు లగు శోకమును అధైర్యమును వదలుము. విడువవేని నీవు పూనిన కార్యము చెడిపోవును. కార్యసాధక మైన బుద్ధి సంపద గలదు గాని, సహాయసంపత్తి లేదని దుఃఖించెదవా?

క. దిగ్గనఁ దరించి జలనిధి, నగ్గిన ముగ్గినలుగా ని♦శాటుల్ లంకన్
లగ్గలుపట్టి భవద్రిపు, గగ్గో లొనరింత్రు చూడు ♦ కపివీరవరుల్. ౨౧

అర్థములు. దిగ్గన = తటాలున - శత్రువులు హెచ్చరిక పడుటకు ముందే - నిశాటుల్ = రాక్షసులు - నగ్గినముగ్గినలు = తికమకలు - గగ్గోలు = కలవరము.

తాత్పర్యము.

అప్పుడే శత్రువులు రాఁ బోయిరా యని రాక్షసులు హెచ్చరిక తప్పి యుండఁగనే వానరు లున్న ట్టుండి సముద్రము దాఁటి - వానలేసి వట్టి పిడుగు లట్లు వచ్చెనే యని రాక్షసులు దిక్కుదోఁపక తికమక లాడుచుండఁగా లంక కోట గోడ లెక్కి నీ శత్రువును గలవరపడఁ జేయుదురు.

క. దీనుం డై యుత్సాహ వి,హీనుం డై శోకమునను ♦ గృశియించెడి య
మ్మానవు కార్యములుం జెడు,మానని వ్యసనముల నతఁడు♦ మునుఁగుచు నుండున్.

తాత్పర్యము.

ఒకవేళ శోకమునకుఁ గారణ మున్నను, దీనుఁడై యుత్సాహము లేనివాఁడై యేడుచుచు కృశించువాని కార్యములు చెడును. వాఁడు వదలని వ్యసనములచే దాపము నొందుచుండును. కావున శోకకారణ మున్నను ఉత్సాహము వదలరాదు.

ఉ. ఈ హరియూథపుల్ కుశలు ♦ లెల్లరు వీరులు విక్రమోద్ధతుల్
సాహసికాగ్రగణ్యుల్ నృపతి♦చంద్రమ! నీదు నిమిత్తమై కృతో
త్సాహులు, చిచ్చునే నురుకఁ ♦ దప్పరు, వీరి ముదంబుఁ జూడఁగా
నాహవదోహలం బెసక ♦ యయ్యె, దృఢంబు సుమీ మదూహయున్. ౨౩

అర్థములు. కుశలులు = ఉపాయము నాలోచించుటయందు సమర్థులు - విక్రమ + ఉద్ధతుల్ = పరాక్రమముచే గర్వించినవారు - చిచ్చునేన్ = అగ్ని యందైనను - ఉరుకన్ = దూఁకుటకు - తప్పరు = వెనుక దీయరు - ఆహవదోహలంబు = యుద్ధమునం దభిలాష - మత్ + ఊహయున్ = నా యూహ.

తాత్పర్యము.

ఈ వానర సేనానాయకు లందరుఁ జక్కఁగా నాలోచించుటయందు సమర్థులు- ఉత్తమాలోచన చెప్పుటయే కాదు. దాని నెఱవేర్పఁ దగిన శక్తికలవారు. పరాక్రమవంతుల మను గర్వముగలవారు - ఎంతకైనను దెంపుచేయఁగలవారు - నీ కార్యము సాధింపవలయు నను నుత్సాహముతో నున్నారు. నిప్పులలో దూకవలసి వచ్చినను వెనుకఁ దీయరు. ఇఁక నీళ్ళమాట యేల? వీరి సంతోషము చూడఁగా యుద్ధాభిలాష గలవారై యున్నారు. అది శుభసూచకము. మనకు మేలుగలుగును. నా యూహ వ్యర్థము కాదు.

ఉ. రావణుఁ బాపకర్ము రణ♦రంగమునందు వధించి జానకిన్
దే వల నైన పద్ధతిని ♦ దేఁకువఁ బూనుము, సేతుబంధ మిం

కేవిధి సాగు, లంకఁ గను • టెట్లగు నట్లు సమాచరింపుమీ
యా విబుధారి వీఁడు గని • నంత హతుం డని వాని నెంచుమా. ౧౮

అర్థములు. వలనైన పద్ధతి=సాధ్యమగు మార్గము - తేఁకువ = ధైర్యము.

తాత్పర్యము.

ఏ యుపాయము చేసిన పాపాత్ముఁడగు రావణుని యుద్ధమందుఁ జంపి సీతాదేవిని తీసికొని రావచ్చునో యా మార్గమును ధీరుఁడవై పూనుము. నీవు చేయవలసిన దంతయు సముద్రము దాఁటి లంక చూచుటకుఁ దగిన యాలోచన - లంక కనఁబడెనా, వెంటనే రావణుఁడు చచ్చినాఁ డని నమ్ముము.

సీ. సేతునిర్మాణంబుఁ • జేయక వారిధిఁ, దరియింపరా దయ్యె • సురల కైన
సేతు వేర్పడఁ గపి • వ్రాతంబు దాఁటుట, శత్రుసంహారంబుఁ • జలుపు టాయెఁ
గా నిశ్చయింపుము • కామరూపులు కపుల్, సమరశూరులు కలి • జంక రెపుడుఁ
గావున రాజేంద్ర! • కార్యనాశిని యైన, వైక్లబ్యబుద్ధిని • వదలవయ్య
ఆ. జగతి శోక మెపుడు • శౌర్యవినాశన, క్షమము గాన నీకుఁ • గలఁక దగదు
శౌర్యముఖ్యులైన • జనులు కార్యంబుల, బలము ధృతియు దిటముఁ • బాయ రెపుడు.

అర్థములు. కలి = యుద్ధము - వైక్లబ్యబుద్ధిని = దుఃఖవశమైన బుద్ధిని - శౌర్యవినాశన క్షమము = శౌర్యమును నాశముచేయ శక్తిగలది. కలఁక = వ్యాకులత్వము.

తాత్పర్యము.

రామచంద్రా! యొకటి నిశ్చయము. సేతువు కట్టక సముద్రము దాఁటవలయు ననిన దేవతలకైనను సాధ్యము గాదు. సేతు వేర్పడెనా వానరులు దాఁటుట శత్రుసంహారము జరిగెననియే నిశ్చయింపుము. ఆ విషయమున నీవు సందేహింపఁబనిలేదు. ఏల యందువా? ఈ వానరులు కామరూపులు. యుద్ధమునందు శూరులు. కావునఁ గలహమునకు భయపడరు. కాఁబట్టి నీవు కార్యనాశకమైన దుఃఖమును వదలిపెట్టుము. అది నీకుఁ దగినది కాదు. శౌర్యము ప్రధానముగాఁ గలవారు కార్యములు చేయుటయందు బలము, ధైర్యము స్థైర్యము, వదలరు.

ఉ. లోకమునందు నిస్తులబ • లుల్ నినుబోఁటి మహాత్ము లెయ్యెడన్
వ్యాకులతన్ వహింపరు ప్ర • ణష్టవినష్టములందు నెప్పుడేన్;
శోకము సర్వకార్యలయ • సూచక మౌట యెఱింగి దైన్యముం
బోకడఁ బెట్టి ధైర్యగుణ • ముం గొనియాడుచు నుండు రెప్పుడున్. ౧౯

అర్థములు. నిస్తులబలుల్ = అసమానమైన బలము గలవారు, ప్రణష్ట = రూపములేక నాశమైనవానియందు, వినష్టములందు = కానరాకపోయిన వానియందు.

తాత్పర్యము.

సముద్రము దాఁటుట యసాధ్యకార్య మని నేను వ్యసనపడ లేదు. సీతను

జూచుటకు నిచ్చిపెట్టకపోయితిని గదా యని దుఃఖించెద నందువా యదియును నీకుఁ దగినది కాదు. ఏలన:—బలమునం దసమాను లైన నీవంటి మహాత్ములు, మొదలంట నాశ మైనవానికిఁ, గించిత్కాలము కానరాని వానికి నే సందర్భమందును గలఁతఁ జెందరు. ఏలన శోకము సమస్తకార్యముల నాశముచేయు నని తెలిసి దుఃఖము వదలి ధైర్యమునే ప్రశంసించి గ్రహింతురు.

ఉ. నీ వన బుద్ధిమద్వితతి ♦ నిస్తులితుండవు శాస్త్రకోటులన్
గోవిద ! పుష్కలుండవు న♦కుంఠితవిక్రమశాలి విప్ర డో
ర్భావర ! మాదృశాప్తహిత♦మండలసంగతి శత్రుకోటికిన్
గావర మాఱఁ జేయఁ దగుఁ ♦ గాలము గా దిది కుందుచుండఁగన్. ౧౬

అర్థములు. బుద్ధిమత్ + వితతిన్ = బుద్ధిమంతుల సమూహమందు, నిస్తులితుండవు = అసమానుఁడవు, పుష్కలుండవు = పరిపూర్ణుఁడవు, అకుంఠిత = మొక్కవోని, విక్రమశాలివి = పరాక్రమముచేఁ బ్రకాశించువాఁడవు, మాదృశ=మావంటి, ఆప్త - హితమండలసంగతిన్=ఆప్తులయు, మేలు కోరువారలయు సమూహములతోఁ గూడి, కావరము = గర్వము.

తాత్పర్యము.

నీవో యన్నివిధముల శాస్త్రసమూహములందు, బుద్ధిమంతులలో నసమానుఁడవు - పరిపూర్ణుఁడవు - పండితుఁడవు - ఏలోపములేని పరాక్రమము గలవాఁడవు - ఇట్టి నీవు రాజేంద్రా! యిప్పుడు నావంటి మిత్రుల సహాయముతో శత్రువుల గర్వమణఁప వలసిన సమయమే కాని యేడ్చుచుండవలసిన సమయము కాదు.

ఉ. నీకు శరాసపాణికిని ♦ నిల్చి ముఖాముఖిఁ బోరువాని ము
ల్లోకములందుఁ గానఁ, గపు♦లున్ బలయుక్తులు వారు చేయఁగాఁ
జేకొనినట్టి కార్యమునఁ ♦ జేకొనఁగూడదు, భూరివార్ధి నీ
వే కరణిం దరించి హృద♦యేశ్వరిఁ జూచెదు వైశమే నృపా ! ౧౭

అర్థములు. శరాసపాణి= చేత విల్లు ధరించినవాఁడు - ముఖాముఖి = కట్టెదురు - ఏకరణిన్ = ఏవిధముగ నైనను.

తాత్పర్యము.

చేత విల్లు ధరించి నిలఁబడిన నీకు నెదురుముఖమై నిల్చి యుద్ధముచేయఁగల వాఁడు మూఁడు లోకములందు లేఁడు. ఇట్టి నాయకుఁడ వైన నీకు సేనగా నుండు వానరులు బలవంతులు. వారు చేయఁబూనిన పనికిఁ గీడొక్కనాటికిని రాదు. కావున నే విదముగ నైనను సముద్రమును దరించెదవు. నీ ప్రియురాలిని శీఘ్రమునందే చూచెదవు.

క. కావున శోకము మానుము, నీ వెద గ్రోధంబు గొనుము ♦ నిశ్చేష్టులు నా
భూవరులు మందభాగ్యులు, వారిరి వడకుదురు కోప♦వంతున కెవరున్. ౧౯
అర్థములు. నిశ్చేష్టులు=కార్యము చేయనివారు - ఉత్సాహము లేనివారు.

తా త్ప ర్య ము .

నీ విట్లు లేడ్చుచుండిన నీకు శత్రువులు భయపడరు. కావున నేడుపు మాని కోపము తెచ్చికొనుము. కోపము గలవానికి నుత్సాహము లేనివారు అదృష్టహీనులు నగు రాజులు భయపడు చుందురు.

శా. మాతో నీ విపు డెట్లు వారిధి దరిం♦పఁగా వచ్చుఁ దత్పద్ధతిన్
జేతోవీథిని సూక్ష్మబుద్ధిఁ గనుమీ ♦ సేనాపతుల్ దక్షిణా
శాతీరంబును జేరినా రిపులు నా♦శం బైరి, వీరల్ శిలా
వ్రాతక్ష్మారుహవృష్టిఁ గూల్చెద రమి♦త్రవ్యూహముం బోరిలోన్. ౨౦
అర్థములు. దక్షిణాశాతీరంబును = దక్షిణపు దిక్కునఁ గల యొడ్డును - శిలావ్రాత=రాలసమూహము యొక్కయు - క్ష్మారుహ = చెట్లయొక్కయు - వృష్టిన్ = వానచే - అమిత్రవ్యూహమున్ = శత్రుసమూహమును.

తా త్ప ర్య ము .

మాతోడ నీవు సముద్రము దాటు నుపాయ మేదో దాని నాలోచింపుము. సముద్రముయొక్క దక్షిణతీరమును వానరులు చేరిరా వెంటనే శత్రువులు నాశమైనవారే. వీరలు రాలవానచే, చెట్లవానచే శత్రుసమూహమును ధ్వంసము చేయుదురు. కావున సహాయ సంపత్తికి, సాధన సంపత్తికి గొఱఁత లేదు.

క. వరుణాలయ మెటు లైనను, దరియింపఁగ వలయు నంత♦టినుక నె కష్టం
బరి రావణాసురుఁడు సం,గరసీమను నిర్జితుండు♦గా నెంతు నృపా! ౨౧
అర్థములు. వరుణాలయము = సముద్రము.

తా త్ప ర్య ము .

ఏ విధముగ నైన సముద్రము దాట వలయును. అంతవఱకే కష్టము. ఆ పని నెఱవేఱెనా రావణాసురుఁడు యుద్ధమందుఁ జచ్చినవాఁడే యని నా యభిప్రాయము.

క. ఏలా పలుమాటలు నీ, కే లిలల నైన విజయ ♦ మొనఁగును శుభదం
బౌ లక్షణములఁ గంటిని, జాలఁగ నా మనము సంత♦సంబునఁ దేలెన్. ౨౨

తా త్ప ర్య ము .

రామచంద్రా! పెక్కుమాట లేల కాని, నీ కే విధముగ నైనను జయము కాగలదు. శుభశకునములు నాకుఁ గానవచ్చు చున్నవి- నా మనస్సు సంతోషమునఁ దేలాడుచున్నది. ఇది గొప్ప శుభచిహ్నము.

—♦ { 3-వ సర్గము. శ్రీరాముఁడు హనుమంతుని లంకయందలి దుర్గాదులవిధం బడుగుట. } ♦—

చ. అని యిటు యుక్తియుక్తముగ ♦ నాడిన నా పరమార్థవేది యా
జనకసుతామనోహరుఁడు ♦ చక్క గ్రహించి మరుత్తనూజునిం
గని కనులార నీవె దశ♦కంఠుని వీటిని గంటి గాదె? లం
కను జెపు మెన్ని దుర్గములు ♦ గ్రాలెడినో బల మెంత మాత్రమో. 33

అర్థములు. పరమార్థవేది = వాస్తవవిషయము దెలిసినవాఁడు, వాస్తవార్థము తెలిసినవాఁడు మరల నొకని నడుగనేల యనిన వేషమునకుఁ దగిన భాషలు చేష్టలుండ వలయును గావున లోకసంగ్రహార్థ మడుగుచున్నాఁడు.

తాత్పర్యము.

యుక్తియుక్తముగ సుగ్రీవుఁడు చెప్పినమాటలు విని వాస్తవార్థ మెఱింగిన రామచంద్రమూర్తి హనుమంతా! నీవు లంకానగరము కన్నారఁజూచితివి కదా దానియందుఁ గోట లెన్నియున్నవి, సేన యెంతమాత్రము చెప్పుము.

క. నా తపము బలముచేతనో, సేతువు బంధించి యొండె ♦ శిఖిసఖబాణ
వ్రాతమున నొండె జలనిధి, నే తీరున నైన దాఁట ♦ నే నిపుణుండన్. 34

తాత్పర్యము.

నా తపోబలము చేతనో, సేతువు కట్టియో, అగ్ని సమానములైన బాణములచే సముద్రమున నింకించియో యే విధముగ నైన సముద్రమును దాఁటు సామర్థ్యము నాకుఁ గలదు. ఆ విచారము నాకు లేదు.

తే. ద్వారదుర్గక్రియాదుల ♦ దనుజసదన
ములను దద్గుప్తికర్మముల్ ♦ పలుక వయ్య
తీఱుపాటుగ సర్వంబుఁ ♦ దిరిగి కంటి
వన్నివిధములఁ గుశలుండ ♦ వాంజనేయ! 35

తాత్పర్యము.

లంకకు ద్వారములెన్ని? కోటలెన్ని? వాని నే విధముగఁ గట్టినారు-రాక్షసుల యిండ్లెన్ని? వానిని రక్షింప నేమి యుపాయము చేసినారు? ఇవన్నియుఁ జెప్పుము. తీరికగా లంకయందుఁ దిరిగి చూచితివిగదా - అన్నిట సమర్థుఁడవు కావున నీకీ విద్య కూడఁ దెలియును చెప్పుము.

ఉ. రామవిభుండు తన్ను నిటు ♦ ప్రశ్న యొనర్పఁగ విన్న దేవ లం
కామహిమంబు దుర్గబల♦కాండ విధానము వాహనావళీ
ధామవిభాగముల్, మకర♦ధామము భీమత, గుప్తికర్మముల్
శ్రీనుతరామచంద్ర యిది ♦ వేడ్కము సర్వము విన్నవించెదన్. 36

అర్థములు. దుర్గబలకాండవిధానము=కోటలయు సేనా సమూహములయు నేర్పాటు విధము-వాహనావలీ ధామవిభాగము=వాహనములు సమూహములకై కట్టఁబడిన యిండ్లయేర్పాటు - మకరధామము = సముద్రము - గుప్తికర్మమున్ = ఏవిధముగ రక్షకై చేసిన కార్యమును, భీమసురారి = భయంకరులైన రాక్షసులకు రావణునందు గల - భక్తి=ప్రేమయు - వేద్యము = తెలియఁదగినది

తాత్పర్యము.

రామచంద్రమూర్తి తన్నిట్లు లడుగగా హనుమంతుఁడు దేవా! లంకయొక్క గొప్పతనము, దానియందలి కోటల - సేనల యేర్పాటు - రథగజాది వాహనములకుఁ గట్టఁ బడిన యిండ్లవిధము, సముద్రముయొక్క భయంకరత్వము, శత్రువులను వధించుటకై చేయఁబడిన రహస్యమైన యేర్పాటులు, రావణాసురునియందు రాక్షసులకుఁ గల భక్తి - తెలియవలసినది సర్వము విన్నవించెదను వినుము.

ఉ. ద్వారరమణా! ప్రహృష్టమయి ♦ మత్తగజాకుల మై, మహాకృతుల్
తేరులు, గల్గి పూర్ణముగ ♦ దేవవిరోధిచయావృతంబు నై
సారతురంగమాఢ్య మయి ♦ సార్గళసంపరిబద్ధతుంగవ
ద్ద్వారచతుష్కయుక్త మయి ♦ వాసవవైరిపురంబు గ్రాలెడిన్. ౨౭

అర్థములు. ప్రహృష్టమయి = సంతోషించినది - మత్తగజాకులము = మదించిన యేనుఁగులతో నిండినది - మహా+ఆకృతుల్ = గొప్ప యాకారములు గలవి - దేవవిరోధిచయ = రాక్షస సమూహముతో - ఆవృతంబు = ఆవరింపఁబడినది - సార = బలముగల - తురంగమాఢ్యము = అశ్వసంపత్తిగలది - సార్గళ = అడ్డముగా వేయు గడియమ్రాఁకులతో - సంపరిబద్ధ = బాగుగ బిగింపఁబడిన - తుంగవత్ = ఎత్తైన - ద్వారచతుష్కయుక్తము = నాలుగు ద్వారములతోఁ గూడినది. వాసవవైరిపురంబు = రావణుని పట్టనము - లంక - గ్రాలెడిన్ = ఒప్పుచున్నది.

తాత్పర్యము.

రాజేంద్రా! లంకాపురమం దందఱు సంతోషముతోఁ గూడినవారే - లంకయంతయు మదించిన యేనుఁగులచేతను, పెద్ద తేరులచేతను - బలము గల గుఱ్ఱముల చేతను నిండి - రాక్షస సమూహముచే నావరింపఁ బడి యున్నది. లంకకు నాలుగు దిక్కుల నాలుగు ద్వారములు గలవు. వాని వాకిండ్లను అడ్డగడియ మ్రాఁకులచే బంధించి యున్నారు.

ఉ. అందలి యశ్మయంత్రముల ♦ నాగతశాత్రవసైన్య మంద వే
మ్రిందు, శతఘ్నికల్ తఱచు ♦ రాక్షససంఘవిసృష్టితంబు లై
క్రిందుగ ద్వారదేశములఁ ♦ గ్రాలుచు నుండు, సువర్ణసన్మణీ
బృందవిదూరజాంతరిత♦భీమసువప్రము దుష్ప్రధర్ష మౌ. ౩౦

అర్థములు. అశ్మయంత్రములకా = జాలయంత్రములచే - ద్వారమునకుఁ బై భాగమునఁ బలకలపైఁ గానరాకుండ శిలలు పేర్చి శత్రువు లా మార్గమున వాని క్రిందికి వచ్చినపుడు వారిపై నవి పడునట్లు చేయు యంత్రములు - ఆగత=వచ్చిన - శాత్రవసైన్యము = విరోధులసేన - అంద = ఆ ద్వారమందే - మ్రిదున్ = చచ్చును - సువర్ణ = బంగారు చేతను - సన్మణీ = మంచి కెంపులచేతను - విదూరజ = వైడూర్యములచేతను - అంతరిత = పొదుగఁబడిన - భీమ = భయంకరమైన సువప్రము = పెద్ద కోటగోడ - దుష్ప్రధర్షము = పడఁగొట్టి లోపలికిఁ బోవలయు ననిన సాధ్యము కానిది.

తా త్ప ర్య ము .

ఆ ద్వారములయందలి జాలయంత్రములచే నా మార్గమున వచ్చిన విరోధిసేన యందే చచ్చును. రాక్షసులచే నిర్మింపఁబడి వేటునకు నూర్గురిని జంపు శతఘ్నులు ద్వార ద్వారము నొద్ద విశేషముగ నిలుపఁబడి యున్నవి. (ఈ శతఘ్నులిప్పటి ఫిరంగులవంటివి.) బంగారు, కెంపులు, వైడూర్యములు వీనిచే నడుమ నడుమఁ బొదుగఁబడిన కోటగోడను బగులఁగొట్టి లోపలికిఁ బోన సాధ్యపడదు.

సీ. ఆ పురిచుట్టు మ♦హాభీమములు గ్రాహవంతముల్ శీతల♦వారి మిగులఁ
గమ్రంబు లగుచు న♦గాధంబు లగుచు నగడ్త లొప్పును మీన♦కాండయుక్తి
ద్వారంబులందు యం♦త్రారూఢములు చాల, విపులౌ వంతెనల్♦ వెలయు నాలు
గచ్చోటఁ గలవు మ♦హాగృహపంక్తు లాపలకలవంతెనల్ ♦ పరులసేన

తే. వచ్చునప్పుడు రక్షించుఁ ♦ బట్టణంబు, వాని యంత్రాళి బలమునఁ ♦ బరిఖలోన
విడుచు చుందురు; వానిలో♦ వేదికలును, బైడికంబంబులును గల్గి♦ పటిమనొప్పి.

అర్థములు. మహాభీమములు = మిగుల భయంకరములు - గ్రాహవంతముల్ = మొసళ్ళుగలవి - అగాధములు = మిగుల లోఁతైనవి.

తా త్ప ర్య ము .

ఆ పట్టణము చుట్టు మిగుల భయంకరములై మొసళ్ళు గలిగి మిగుల లోతైన యగడ్తలు గలవు. చల్లని నీరు, చేఁపలుగలవై చూచుటకు మనోహరముగ నుండును. ద్వారములందు నా యగడ్తల మీఁద జనుల రాకపోకల కనుకూలము మగునట్లు యంత్రములతోఁ జేయఁబడిన వెడలుపాటి వంతెనలు గలవు. శత్రువులు వచ్చినప్పుడీ యంత్రములఁ ద్రిప్పిన నా వంతెనలు లేచి కోట ద్వారములకుఁ దలుపులవలె నడ్డపడును. అచ్చట నిండ్లవరుసలు గలవు. అవియును ఆ పలకల వంతెనలు శత్రువులు ముట్టడించినపుడు పురమును రక్షించును. ఆ పలకల వంతెనలను యంత్రబలముచేఁ బని లేనపుడు నీళ్ళమీఁద దిగవిడతురు. శత్రువులు వచ్చినపుడు యంత్రములతోఁ జేఁదుకొందురు. ఆ నాలుగింటిలో నరుఁగులు, బంగారు స్తంభములు కలదై, బిగువు కలదై.

క. కదలింపరాక దృఢమై, పొదలెడు నంతెన యొకండు ♦ పొలుచును జుమ్మీ
యది సేనాదర్శనమున, యదనున దశకంధరునకు ♦ నగుఁ దానముగన్. ౪౦

అర్థములు. తానము = స్థానము - అదను = సమయము.

తాత్పర్యము.

గట్టిగఁ బాఁదుగొని కదలింపరానిదై యొక వంతెన యుత్తరద్వారమునఁ గలదు. అది సేనల విమర్శింప రావణుఁడు వచ్చినపుడు వానికి విశ్రమస్థానమై యుండును.

క. మతిమత్ప్రకృతియుతుం డయి, సతతంబు యుయుత్సుఁ డగుచు♦ స్వయముగ సేనా
తతి సావధానముగఁ గను, చేతులితజాగరిత రావ♦ణాసురుఁ డొప్పున్. ౪౧

అర్థములు. మతిమత్ = ఆలోచనగలవాఁడు, ప్రకృతియుతుఁడు = స్వస్వభావమున జూదము మొదలగు దురభ్యాసములు లేకయున్నవాఁడు, విశేషణోభయపదకర్మధారయము - మతిమంతమైన స్వభావముతోఁ గూడినవాఁడని యైన జెప్పవచ్చును. యుయుత్సుఁడు = యుద్ధమం దుత్సాహము గలవాఁడు, సావధానముగఁ = హెచ్చరికతో, అతులితజాగరిత = అసమానమైన హెచ్చరికతో, అతులితజాగరిత రావణాసురుఁడు మతిమత్ప్రకృతియుతుండయి సతతము స్వయముగ యుయుత్సుఁడయి సేనాతతి సావధానముగఁ గనుచు నొప్పును అని యన్వయక్రమము.

తాత్పర్యము.

రావణాసురుఁడు మిక్కిలి హెచ్చరికఁ గలవాఁడై యాలోచనపరుఁడు, స్వస్వభావయుక్తుఁడై సర్వదా యొకరిమాటల మీఁదనే యాధారపడి యుండక తానే యుద్ధాసక్తుడై సేనా సమూహములను విమర్శించి చూచు చుండును.

సీ. ఇఁక లంక నాదేయ♦కృత్రిమ పార్వత, వాన్యచతుర్విధా♦సస్యసాధ్య
భీకరదుర్గస♦మాకలితం బయి, సురలకు నేనియుఁ ♦ జొరఁగరాక
యాలంబహీన మై ♦ యంబుధికూలంబు, నందు నావలు చన ♦నైనఁ ద్రోవ
లేక వార్తకుఁ జొర ♦ వీక శైలాగ్రంబు, నం దమరావతీ♦చందమునను
తే. వాజివారణపూర్ణ మై♦ పరమయంత్ర,వివిధ పరిఘాశతఘ్నికా♦న్వితము నగుచుఁ
బరమదుర్జయ ♦ మయి దశవక్త్రపాలితంబు పొలుపొందు దశరథ♦తనయ యందు.

అర్థములు. నాదేయ = నదియందుఁ బుట్టినది, అనఁగా జలదుర్గము, కృత్రిమ = మనుష్యులచేఁ గల్పింపఁబడినది, ప్రాకారాది దుర్గము = కోటలు మొదలయినవి, పార్వత = పర్వతసంబంధ మైన దుర్గము, వాన్య = వనసంబంధ దుర్గము, అనఁగా వనదుర్గము, చతుర్విధ = నాలుగు విధములైన, అసస్యసాధ్య = ఇతరులకు సాధింపరాని, భీకర = భయంకరములైన, దుర్గ = కోటలచే, సమాకలితంబు = చక్కఁగాఁ గూర్పఁబడినది, ఆలంబహీనమై = ఆధారము లేనిదై, త్రికూట పర్వత

ముల తాలను నులులతో గొట్టి నునుపుగాఁజేసి యా పర్వతశిఖరమున లంకను గట్టి యున్నారు. కావున దానికి వేఱాధారము లేదు. వార్తకః జొరవీక = ఇతర దేశ సమాచారము లక్కడి వారికి, అక్కడ నేమి జరగునో వెలుపలివారికిఁ దెలియు మార్గము లేక, వాజివారణపూర్ణమై = గుఱ్ఱములతో నేనుఁగులతో నిండి, పరిఖా = అగడ్తలచే, అన్వితము = కూడినది.

తా త్ప ర్య ము.

ఇఁక లంకామహాత్మ్యము చెప్పెద వినుము. లంకయందు జలదుర్గము, కృత్రిమ దుర్గము, పర్వత దుర్గము, వనదుర్గము లను నాలుగు విధము లైన భయంకర దుర్గములు గలవు. ఇవి యితరులకు సాధ్యము లగునవి కావు. లంక నిరాధారముగ సముద్రతీరమున నున్నది. దానియందుఁ బ్రవేశింప దేవతలకైన సాధ్యము గాదు. నావలు కూడ దాని సమీపమునకుఁ బోవ మార్గము లేదు. పర్వత శిఖరంబున నమరావతివలె నున్నది. బయటి వార్త లోపలికిఁ బోవుటకుఁ గాని, లోపలి వార్త బయటికి వచ్చుటకుఁ గాని వలనుపడదు. ఏనుఁగులు గుఱ్ఱములు నిండి యున్నవి. గొప్ప యంత్రములు నానావిధములైన యగడ్తలు, శతఘ్నులు కలవు. జయించుట కేమియు సాధ్యమగునది కాదు. దీనిని రావణుఁడు పాలించు చున్నాఁడు.

సీ. ప్రాగ్ద్వారరక్షకుల్ ♦ పదివేవు రుందురు, ఖడ్గాగ్రయోధులు ♦ కడిఁదిబలులు
శూలపాణులు రణ♦శూరులు దుర్జయుల్, దక్షిణద్వారంబు ♦ రక్షసేయ
నియుతరక్షోవరుల్ ♦ నిష్ఠురవిక్రముల్, చతురంగబలయుక్తి ♦ సతత ముందుప్ర
పడమటివాకిఁట ♦ బ్రయుతరక్షోగ్రిముల్, చర్మఖడ్గాన్వితుల్ ♦ చటులబలులు
తే. వినుతసర్వాస్త్రకోవిదుల్ ♦ వెలయు చుందు
రుత్తరద్వారమును గాచు ♦ చుంద్రు న్యర్బు
దాసురులు కులజులు వార♦గాశ్వవాహు
లిందఱును బూజితులు రాక్ష♦సేశ్వరునకు. ౪౩

అర్థములు. ప్రాగ్ద్వారరక్షకుల్ = తూర్పు ద్వారమును గాచువారు. ఖడ్గాగ్రయోధులు = కత్తులు ధరించి తక్కిన సేనకు ముందు నిలిచి యుద్ధము సేయు వారు. కడిందిబలులు = విస్తార బలముగలవారు. నియుతరక్షోవరుల్ = లక్షరాక్షస శ్రేష్ఠులు. ప్రయుత = పదిలక్షల, రక్షః+అగ్రిముల్ = రాక్షసశ్రేష్ఠులు, చర్మ ఖడ్గ అన్వితులు=డాలులు తరవారులతోఁ గూడినవారు, న్యర్బుద=పదియర్బుదముల.

తా త్ప ర్య ము.

ఇఁక సైన్య సన్నివేశము చెప్పెద వినుము. తూర్పునుండి శత్రువులు వచ్చుటకు వలను పడదు. కావున ఆ ద్వారమును పదివేల రాక్షసులు సేనలకు ముందు నిలిచి ఖడ్గములతో యుద్ధము చేయు రాక్షసులు కాచియున్నారు. దక్షిణ ద్వారమును శూలములు ధరించిన శూరులు, జయింపరాని వారు, లక్షరాక్షసులు, మిగులఁ

బరాక్రమవంతులు, నాలుగు విధములైన (రథములు, ఏనుగులు, గుఱ్ఱములు, కాలిబంట్లు) సేనలతోఁగూడి కాచియుందురు. పడమటి వాకిట పదిలక్షల రాక్షసులు డాలులు తరవారులు ధరించి కాచియుందురు. వీరికి సర్వశస్త్రవిద్యయుఁ దెలియును. ఉత్తరద్వారమును పదియర్బుదముల రాక్షసులు గొప్పవంశములఁ బుట్టినవారు ఏనుగులు గుఱ్ఱములు వాహనములుగాఁ గలవారు రక్షించుచుందురు. వీ రందఱు రావణునకుఁ బూజ్యులు, విశ్వాసపాత్రులు.

క. మధ్యమభాగాశ్రితులు న,సాధ్యులు నూర్వేవు రుందుర ♦ సర్వంబు సదా
రాఢ్యం బగు తత్పురమున, మధ్యాహ్న ర్కాభకోటి ♦ మానవభోజుల్. ౨౪

తా త్ప ర్య ము.

లంకాపుర మధ్యమున నసాధ్యు లగు రాక్షసులు నూఱువేలమంది కలరు. సైన్యమంతయు సర్వదా శ్రేష్ఠమైనదియే. ఎందును లోపములేదు. మధ్యాహ్న సూర్యునితో సమాను లగు రాక్షసు లందఱు గోటిగలరు.

క. చెఱిచితి వంతెన లెల్లను, బఱచితిఁ బాతికబలంబుఁ ♦ బాడు లగడ్తల్
నుఱుమాడితి వప్రంబులు, తెఱపులు నెటఁ గన్న నిపుడు ♦ దేవారిపురిన్. ౨౫

తా త్ప ర్య ము.

ఇది నేను లంకను దొలుతఁ జూచి నప్పు డున్న విధము. ఇప్పు డిట్టులున్నదని తలఁపవలదు. ఏలన వంతెనల నన్నిటిని జెఱిచితిని. గట్టి వంతెన యొకటియులేదు. పాతిక సేనను బాడుచేసితిని. అగడ్తలు పాడుపడఁ జేసితిని. కోటగోడలు దుమ్ముగా చేసితిని. ఇప్పుడు లంకలోనికి నన్ని మార్గములే. ఏ కంతలో నుండి యైనఁ దూఱిపోవచ్చును.

సీ. శ్రీరామ! యేలుటైన ♦ వారిధిఁ దరియింపఁ, గలిగినయేని లం♦కాపురంబు
వానరకోటిచేఁ ♦ బాడని నమ్ముము, బల మంతయును నేల ♦ పార్థివేంద్ర
యంగదద్వివిదబు♦ద్ధాఘ్యర్క్షనీలురు, మైంద పనస నలుల్ ♦ మాత్ర మైన
వారిధి దాఁటి దే♦వారిపురంబునఁ, బర్వత వనములు ♦ భగ్నపఱచి
తే. తోరణంబులు చెఱిచి ప్రా♦కారములను
తుఱుము గావించి భవనముల్ ♦ దుమ్ము గలిపి
వత్తు రీ వారిఁ బంపుము ♦ వరమహార్త
నిశ్చయముఁ జేయుమీ పయ♦నించుపొంటె. ౨౬

అర్థములు. తుఱుము = పొడి, పయనించు పొంటె = ప్రయాణము చేయుకొఱకు.

తా త్ప ర్య ము.

రామచంద్రా! లంక ఎంత దృఢముగ నైన నుండును గాక. ఎందఱు రక్షకులుండిన నుందురు గాక. ఏ విధముగ నైన సరియె సముద్రము దాఁటితిమా వానరులచే

లంక పాడైన దని సమ్మతము. వానరసేన యంతయుఁ బోవలసిన పని లేదు. అంగదుఁడు, ద్వివిదుఁడు, జాంబవంతుఁడు, నీలుఁడు, మైందుఁడు, పనసుఁడు, నలుఁడు, వీరు మాత్రమైనను సముద్రము దాఁటి లంక ప్రవేశించి పర్వత దుర్గములు వన దుర్గములు విఱిచి ద్వారములు పాడుచేసి ప్రాకారములు పొడిచేసి యింకన్నియు దుమ్ములోఁ గలిపి రాఁగలరు. వీరి నైనఁ బంపుము. ప్రయాణమునకు మంచి ముహూర్త మేర్పాటు చేయుము.

—♦ { ౪-వ సర్గము. శ్రీరాముఁడు కపిసేనతో లంకపై దండయాత్ర వెడలుట. } ♦—

క. అను హనుమంతుని వాక్యము, లనుక్రమముగాఁగ రాముఁ డాలించి యనున్
దనుజేంద్రపురము విధ్వం, సనముం గావింతుఁ జుండు సత్యం బంటిన్. ౪౭

అర్థములు. అనుక్రమముగన్ = వరుసగ, ఆదినుండి యంతమువఱకు.

తాత్పర్యము.

ఈ ప్రకారము చెప్పుచున్న హనుమంతునిమాట లాదినుండి కడవరకు విని రామచంద్రమూర్తి యిట్లనెను. లంక జెఱచుట గొప్పకార్యముగాదని తలచి రావణాసురుని పురము ధ్వంసము చేసెదను. సత్యము చెప్పుచున్నాను.

చ. అగు నిది మంచిమూర్తము ప్రయాణము సేయఁగఁ బద్మమిత్రుఁడున్
గగనము మధ్యముం దఱిసెఁ గ్రాలు నిదే విజయంబు పేరటన్
నెగడిన సన్ముహూర్తము వనేచరనాయక! యిప్డు పోయినన్
బగతుఁడు జానకిం గొనుచుఁ బ్రాణముతో నెట కేఁగఁ గల్గెడిన్? ౪౮

అర్థములు. మూర్తము = ముహూర్తశుభసమయము, పద్మమిత్రుఁడు = సూర్యుఁడు.

తాత్పర్యము.

"మనోజవంతు మారుతవ్య"యను సూక్తినిబట్టి ప్రయాణమునకు నిదియే మంచి ముహూర్తము. అంతియేకాదు, సూర్యుఁడు ఆకాశమధ్యమున నున్నాఁడు. ఈ ముహూర్తమునకు విజయ మని పేరు. ఇది మంచిముహూర్తము. సుగ్రీవా! యిప్పుడు మనము బయలుదేరి పోయితిమేని పగవాఁడు జానకిని దీసికొని ప్రాణముతో నెందుఁబోగలఁడు. ఎచ్చటికిఁ బోయినను జచ్చినవాఁడే. ఈ ముహూర్తమునకు నభిజిత్తని పేరు. సూర్యుడు నడినెత్తికి సరిగా నుండు సమయము. "ఆర్ద్రోరగ మిత్ర మఘా వసు జల విశ్వాభిజి ద్విరించ చేంద్రాగ్నీ, ఐంద్రాగ్నీ మూల వరుణార్యమ భగ తారాదివా ముహూర్తాస్స్యుః॥"అని పగట పదునాఱు ముహూర్తములు గలవు. ముహూర్తమునకు ముక్కాలు గంటకాలము. ఇందు నెనిమిదవది అభిజిత్తు. అనఁగా పదునొకొండు గంటల పదునైదు నిమిషముల మొదలు పండ్రెండు వఱకు నభిజిత్తు - ఇది పగలు పండ్రెండు గంటలు గల దినము వృత్తాంతము.

"అన్వీయమానో రామోసౌ, ముహూర్తేఽభిజితి ద్విజాః
విలంఘ్య వివిధాన్ దేశాన్, మహేంద్రం పర్వతం యయౌ."
స్కాందము ౯-౨-౨౫.

గీ॥ గార్గ్యసిద్ధాంత మత ముషః కాలకలన
శకున మూనుట యది బృహస్పతి మతంబు
విప్రజనవాక్య మరయంగ విష్ణుమతము
సర్వసిద్ధాంత మభిజిత్తు సమ్మతి మగు. భీ. పు. ౯-౪౧
భుక్తౌ దక్షిణయాత్రాయాం, ప్రతిష్ఠాయాం ద్విజన్మని
ఆధానేచ ధ్వజారోహే మృత్యుద స్స్య త్సదాభిజిత్.
అని జ్యోతిష రత్నాకర మందుఁగలదు కదా. అభిజిత్తు దక్షిణ దేశయాత్ర
కెట్లు రామచంద్రమూర్తి మంచి దనెను. కిష్కింధకు లంక యాగ్నేయ మూల
నున్నది కాని దక్షిణమున లేదు. కావున దోషంబు లేదు.

ఉ. నా యభియానమున్ వినుచు ♦ నా ప్రియురాలు మనంగ నాసయోన్
జేయును గాక, పీడితుఁడు ♦ చేపడినట్టి విషంబు గ్రోలి సా
పాయదశన్ సుధాద్రవముఁ♦బానముఁ జేసిన రీతి సూర్యజా!
యీ యెడఁ గాలయాపన మిఁ♦కేల యొనర్పఁగ రిత్త చూడుమా. ౪౯

అర్థములు. అభియానము = దండయాత్ర, వినుచున్ = త్రిజటాదులచే
నని భావము. సాపాయదశన్ = ప్రాణమునకు నపాయము నచ్చిన స్థితియందు,
సుధాద్రవము = అమృతరసము, కాలయాపనము = కాలము జరుపుట.

తాత్పర్యము.

నేను దండయాత్ర బయలుదేఱుట త్రిజటాదులు చెప్పఁగా విని నా ప్రియు
రాలు బ్రదికి యుండుటకు నాశ యొనఁ గలద యగును గాక. ఎట్లు లనిన, రోగి చేతికి
దొరకిన విషము దిని ప్రాణము పోవు సమయమున నమృతరసము ద్రాగి జీవించినట్లు.
ఇచ్చట నాలోచనలతో వ్యర్థ కాలక్షేపము చేసిన నేమి మేలు?

ఆ. ఉగ్రకిరణతనయ ♦ యుత్తరఫల్గుని, నేఁడు, రేపు హస్త ♦ నిలుచు శశియుఁ
గాన నేఁడ సకల ♦ సేనాసమేతంబు, పయన మగుట లెస్స ♦ ప్లవగరాజ. ౫౦

తాత్పర్యము.

ఒకనాఁటిలో మించిన దేమి, రేఫు పోనమందువేమో, సుగ్రీవా! నేఁ డుత్తర
ఫల్గుని నక్షత్రము - నా జన్మనక్షత్రమునకు కాజవది, సాధనతార - కావున శుభము-
రేపు చంద్రుడు హస్తతోఁ గూడిన నేడవతార నైధనతార యగును. అది యశు
భము. రేపు ప్రయాణము చేయరాదు. కావున నేఁడే, యిప్పుడే సకల సేనలతో
ప్రయాణము చేయవలయును.

ఈ దినమున నక్షత్ర ముత్తర యనియు, దానితోఁ జంద్రుఁడు గూడి

యున్నాఁడనియుఁ జెప్పుటచే నిది ఫాల్గునమాసము కావున నేఁడు పున్నమ యని తెలియఁ దగియున్నది.

చతుర్దశినాఁటి సాయంకాలము రామాంజనేయ సమాగమము. కావునఁ బున్నమనాఁడు దండయాత్ర - 'అభిజిత్సర్వదోషఘ్న' మ్మని అభిజిత్తునఁ బ్రయాణము చేయుటకు తిథ్యాదులఁ జూడఁ బనిలేదు.

క. ఉత్తమశుభదము లైన ని,మిత్తము లెంతయును దోఁచె ♦ మేలుగ మనకున్
మిత్తికి వశపడ రాక్షస,సత్తముఁ గావించి నిజము ♦ జానకిఁ దెత్తున్. ౫౧

అర్థములు. మిత్తికి = మృత్యుదేవతకు.

తాత్పర్యము.

మంచివి శుభశకునములు పెక్కులు కానవచ్చుచున్నవి. కావున రావణుని జంపి సీతను దెచ్చుట సత్యము.

క. మీఁగన్నదరెడి శత్రులఁ, జాఁగఁగొని విజయి వగుచు ♦ జనకజఁ గొని నీ
వీఁగెదు బన్నం బను క్రియఁ, జాఁగురె పయనింప నిదియ ♦ సమయం బనుచున్.

అర్థములు. ఆ శుభశకునము లేవి యనిన:— మీఁగన్ను = మీఁదు + కన్ను = మీఁగన్ను = కంటి పై భాగము, చాఁగఁగొని = నాశముచేసి, విజయివి = గెలిచినవాఁడవు, ఈఁగెదు = పోఁగొట్టుకొనెదవు, బన్నము = అవమానము, భగ్న శబ్దభవము, చాఁగురె = ప్రశంసార్థకము.

తాత్పర్యము

శత్రువుల నాశము చేసి, జయము నొందినవాఁడవై, యవమానమును బోఁగొట్టుకొందు వని చెప్పుచు నీ కంటి పై భాగ మదురుచున్నది. ప్రయాణము సేయుటకు నిదియే ప్రశస్తసమయము; మీఁగన్ను—వాల్మీకి కుడికంటి పై భాగమైనది, నేయెడమ కంటి పై భాగమైనది చెప్పలేదు. మహేశ్వరతీర్థులు కుడి కన్నని వ్రాసిరి. ఇది చింత్య మని వ్రాయుచు గోవిందరాజులు "నేత్రస్యాధ స్ఫురణ మసకృ త్సంగరే భంగహేతు। శ్నేత్రప్రాంతే హరతి నయనం, నేత్రమూలేచ మృత్యుః నేత్రస్యోర్ధ్వం హరతి సకలం మానసం దుఃఖజాతం। వామే నైవం ఫల మవికలం దక్షిణే నైవ పరీత్యమ్"॥ అను శ్లోకమును జ్యోతిశ్శాస్త్రమునుండి యనువదించిరి. దీని వలన నెడమకన్ను పై భాగ మదరిన మానసదుఃఖము లన్నియుః దొలఁగు నని యేర్పడుచున్నది.

"దక్షిణాక్షి పరిస్పందో దక్షిణస్య భుజస్యచ। హృదయస్య ప్రసాదశ్చ, సద్యః సంసిద్ధి సూచకాః" శకున శాస్త్రమున మగవారికిఁ గుడికన్నదరుట శుభసూచక మని చెప్పఁబడెను.

రామాయణమందే రామసుగ్రీవులు సంభాషించు నపుడు వాలి రావణులకు నెడమ కన్నదరె నని చెప్పఁబడెను. (కిష్కింధ ౧౭౫ వ పద్యముఁ జూచునది). దీని

వలనఁ గుడికన్నయినను గ్రిందిభాగ మదరుట శుభసూచకము. పై భాగ మదరుట వలన మేలు లేదని యేర్పడుచున్నది.

చ. వరనయవేది వెండి యను ♦ వానరరాజును లక్ష్మణుండుఁ ద
న్నురుతరభక్తిఁ గొల్వఁగను ♦ గొబ్బునఁ బంపుము నూరువేల్ వనే
చరులను మార్గశోధనము ♦ సల్పఁగ నీ వెలగోలుగాఁ జమూ
వరుఁ డగు నీలు వెంట హరి♦వర్య! మహాబలవేగవంతులన్. ౧౩

అర్థములు. వరనయవేది = గొప్పనీతిశాస్త్ర పండితుఁడు. గొబ్బునన్ = శీఘ్రముగ, ఎలగోలు = పెద్దసేనకు ముందుగాఁ బోవుచున్న సేన, పెద్దసేన రాఁదగిన మార్గము శోధించుట యీ సేన పని (Reconnoitering) చమూవరుఁడు = సేనాపతి.

తాత్పర్యము.

సుగ్రీవ లక్ష్మణులు తన్నుఁ బ్రేమతోఁ గొల్చుచుండఁగా నీతి శాస్త్రము చక్కఁగాఁ దెలిసిన రామచంద్రమూర్తి సుగ్రీవునితో నిట్లనియె. నీ వెలగోలు సేనగా నూఱువేల వానరులను త్రోవలు శోధించుటకుఁ గాను మహాబలము వేగము గలవారిని ముందుగా సేనానాయకుఁ డగు నీలుని వెంటఁ బంపుము. వీరు బలవంతులు గాకేని శత్రుభయము గలదు. వేగవంతులు గాకేని పెద్ద సేన వచ్చి కలసికొనును. ఈ రెండును సరిగాదు.

చ. వరఫలమూలవంత మయి ♦ వారిసుఖాస్పద మై సుశీత మై
పరమమధుప్రభూత మగు♦బాటలఁ దోకొని పొమ్ము నీల! నీ
హరివరసేనలన్, విను దు♦రాత్ములు వైరులు నీళ్ళ మూలికో
త్కరఫలకోటులన్ విషముఁ ♦ దార్తురు, పొంతురు క్రోవ రాక్షసుల్. ౧౪

అర్థములు. ఇట్లు సుగ్రీవునకుఁ జెప్పి ప్రయాణ మగుచున్న నీలునితో నిట్లు రామచంద్రమూర్తి చెప్పుచున్నాఁడు. వరఫలమూలవంతమయి = మంచి ఫలములు, మూలములు గలది, వారి = నీళ్ళు, సుశీతమై=మిగుల చల్లనిదై, పరమ మధుప్రభూతము = శ్రేష్ఠమైన తేనె విస్తారముగఁ గలది, మూలికోత్కర ఫల కోటులన్ = వేళ్ళ సమూహములందు, పండ్ల సమూహములందు; విషము దార్తురు= విష ముంచుదురు, పొంతురు = పొంచియుందురు, "మంత్రౌషధ ప్రయోగేన పరం నిస్సంజ్ఞం కృత్వావా రాజ్యం గృహ్ణీయాత్" - బుధస్మృతి - ౪౨.

తాత్పర్యము.

నీలా! వానరుల కాహారము లగు మంచిఫలములు, మూలములు గలట్టియు, యారోగ్యకరములై చల్లని నీళ్ళుగలట్టియు, విస్తారముగఁ దేనె గలట్టియు, బాటల యందు నీ వానరసేనలను దోడుకొని పొమ్ము - నీవొక విషయమున జాగ్రత్తగల వాఁడవై యుండవలెను. ఏ దస రాక్షసులు త్రోవలందుఁ బొంచియుండి తటాలునఁ బైఁబడుదురు. దుష్టబుద్ధులు గావున వీరి కాహార మైన పండ్లయందు, మూలములందు,

నీళ్ళయందు విషముపెట్టుదురు. ఇట్టి భయములేని త్రోవలందు సేనల నడిపింపుము. నీతిశాస్త్రము ననుసరించి రామచంద్రమూర్తి చెప్పెనే కాని భయకారణము లేదు. రావణుడు దుర్గ - సేనా - బంధు - స్వబలగర్వితుండై తనపై నెవరు రాఁగలఁ డని వేగుల నుంచినవాఁడు కాఁడు - ఈ విషయమును శూర్పణఖా మారీచులు రావణుని దూషించియున్నారు. రామచంద్రమూర్తి యీ పదినెలలుగా నెచ్చట నేమి చేయు చుండునది రావణునకుఁ దెలియదు. హనుమంతుఁడు లంకఁ గాల్చి వానరసేన - సముద్రతీరమునకు వచ్చువఱకు వాఁడు నిద్రపోవుచునే యుండెను. ఆ కారణముచే నీ కుచేష్టలు చేసినవాఁడు కాఁడు, అవకాశము లేదు.

క. జలదుర్గంబులఁ గానన,తలములఁ బల్లముల వైరి♦తతి ఘన్నంబై
 బిలముల డాఁగును గావున, వల నగుఁ బై కెగిరి కనఁగ ♦ వానరతతికిన్. ౫౫

అర్థములు. జలదుర్గంబులన్ = చొచ్చుటకుఁ గష్టమగు నీటిప్రదేశము లందు, వైరితతి = విరోధుల సమూహము, ఘన్నంబై = మఱుఁగుపడినదై, బిల ములన్ = బొరియలందు.

తాత్పర్యము.

మీరు పోవునపుడు మఱియొకటి కనిపెట్టవలెను. మనము పోవునపుడు తిట్టా లున వీరిఁ జంపుటకై శత్రువులు జలదుర్గములందు, అడవులలోఁ జెట్లచాటున, గుంతలయందు, బొరియలయందు, దాఁగియుందురు. కావున నిట్టివారిని వానరులు పై నెగిరి పోవుచు కనిపెట్టవలెను.

క. బలవిక్రమవంతులకును, జలుపఁగ నర్హంబు ఘోర♦సంగ్రామంబుల్
 బలహీను లెవ్వరేనియుఁ, గలిగినఁ గిష్కింధ కనుపఁ♦గాఁ దగు నీకున్. ౫౬

తాత్పర్యము.

నీలా! బలపరాక్రమములు గలవారే యుద్ధముచేయ సమర్థులు. కావున నీ సేనలో బలహీను లున్నయెడల వారిని గిష్కింధకుఁ బంపుము. వారు రానేల? తేరకుఁ జావనేల.

సీ. వెల్లివెల్లువ పాఱు♦విధమున నెలగోలు, బలము నూఱులు వేలు ♦ పనుప వయ్య
 గజుఁడు గవాక్షుండు ♦ గవయుండు మును చను,వా రాలలో బలీ♦వర్దము లన
 ఋషభునితోఁ బంపు♦మీ కపిసేనను, దక్షిణపార్శ్వంబు ♦ రక్ష సేయ
 మదహస్తిబలి గంధ♦మాదనుఁ డురుగుతేఁ, గపులతో డాపటి♦కాపుగాఁగ
తే. సకలబలములు జాతహ♦ర్షమునఁ దేల, నేను నైరావతారూఢుఁ ♦ డైన యింద్రు
 కరణి హనుమంతు పై నెక్కి♦యరుగువాఁడ, సైన్యమధ్యంబునందు నో♦సైన్యనాథ.

అర్థములు. వెల్లి = సముద్రము, 'అప్పాలవెల్లిలోపల నప్పటి కప్పటికి' ॥భాగ॥ వెల్లువపాఱు విధమునన్ = ప్రవాహముగాఁ బోయినట్లు, ఎలగోలు బలము= ముందు పోవు సేన, ఆలలో = ఆవులలో, బలీవర్దములు = వృషభములు, దక్షిణ

పార్శ్వంబు = అనఁగా దక్షిణ దిక్కని యర్థముగాదు. ఇచ్చట పడమటి దిక్కనియే యర్థము. దక్షిణముఖముగా సేన పోవుచున్నది. కావున నదియే తూర్పనియు, దానికిఁ గుడిచేతివైపు దక్షిణ మనియు గ్రహింపవలయును. అప్పుడు పడమరయే యగుచున్నది. 'యతశ్చ భయ మాశంకితాం ప్రాచీం పరికల్పయే' త్తని కామందకోక్తి. ఏ ప్రక్కన శత్రువుల వలన భయము గలదో యా దిక్కు తూర్పుగా నెంచవలయును. ఇచ్చట దక్షిణ దిక్కునుండి కదా భయము.

తా త్ప ర్య ము .

సేనానీ ! సముద్రమేఘుగాఁ బ్రవహించినట్లు నూఱువేల వానరులను ముందుగాఁ బంపుము. ఆ సేనలో గజుఁడు, గవాక్షుఁడు, గవయుఁడు ఆవులలో కోడెలవలె ముందు పోవలెను. కుడి పార్శ్వమున రక్షసేయ ఋషభుఁడు సేనతోఁ బోవలెను. ఎడమవైపు రక్షింప మదించిన యేనుఁగు బలముగల గంధమాదనుఁడు వానరులతోఁ బోవలెను. అందఱకు నేను గానవచ్చునట్లు వారు సంతోషింపనైరావత మెక్కిన యింద్రునివలె నేను హనుమంతునిపై నెక్కి సేనల నడుమ వచ్చెదను. ప్రభు వందఱకుఁ గానవచ్చుచుండిన సేనలో వారి కుత్సాహము కలుగును.

తే. సార్వభౌమంబు మీఁది వై ♦ శ్రవణుపోల్కి
సంగదుని నెక్కి సౌమిత్రి ♦ యరుగు వెంచుఁ
గుక్షిరక్ష సుషేణుండు ♦ ఋక్షనాథ
జాంబవద్వేగదర్శులు ♦ సలుపువారు. ౨౧

తా త్ప ర్య ము .

సార్వభౌమ మను తన యేనుఁగు మీఁదఁ గుబేరుఁ డెక్కి వచ్చునట్లు లంగదుపై నెక్కి లక్ష్మణుఁడు వచ్చును. సేనామధ్యభాగమును సుషేణుఁడు జాంబవంతుఁడు వేగదర్శి యను వారు రక్షింపవలయును.

క. భూమివిభుఁ డట్లు వచింప సుమావిభు నాదేశమునను ♦ మర్కటులు గుహా
భూములు శృంగతలంబులు, భీమగతిఁ వెడలి రభ్ర♦పృథ్వులు నిండన్. ౨౨

అర్థములు. సుమావిభు = సుగ్రీవుని, ఆదేశమునను = ఆజ్ఞచొప్పున, అభ్రపృథ్వులు = ఆకాశము, భూమి.

తా త్ప ర్య ము .

రామచంద్రమూర్తి యిట్లు చెప్పఁగా సుగ్రీవుఁ డాజ్ఞ సేయఁగా గుహలనుండి పర్వతశిఖరములనుండి భూమ్యాకాశములు నిండునట్లు భయంకరముగ వానరులు బయలు దేఱిరి.

క. రాముఁడు వానరవల్లభ, సౌమిత్రిసమేతుఁ డగుచు ♦ సమ్మదమునను
ద్దామగతి నడిచె రయమున, శామనదిఙ్ముఖముగా స♦సైన్యుం డగుచున్. ౨౦

అర్థములు. శామనదిక్ + ముఖముగా = శమనుని సంబంధము శామనము — దక్షిణపు దిక్కు ముఖము చేసి.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి లక్ష్మణ సుగ్రీవులతో సంతోషముతో నతివేగముగ దక్షిణాభిముఖుండై ప్రయాణము చేసెను.

సీ. వారలవెంబడి ♦ వారణవిభులైన, కోతులు వేలును ♦ కోట్లు లయుగ
ములు వెన్నడించిరి ♦ ముదితులై దృప్తులై, గంతులు వేయుచు ♦ గర్జ లిడుచు
నెగురుచు దుముకుచు ♦ మొగి చుట్లు పెట్టుచు, ఫలముల మెక్కి ♦ తేనెలను గ్రోలి
చెట్లల నెక్కుచుఁ ♦ జిదుముచు గుత్తులు, కాయల రాల్చుచు ♦ గంతుమీఱి
ఆ. యొక్కఁ డొకని ద్రోయు ♦ నొక్కని బై కెత్తు
నొకఁడు తెగి వేయు ♦ నొక్కఁ డతనిఁ
బట్టి పెనఁగు వాని ♦ పై నెక్కు నొక్కండు
నొకని నొకఁడు ద్రోచి ♦ యుర్వి గూలు. ౬౧

అర్థములు. ముదితులై = సంతోషించినవారై - దృప్తులై = గర్వించినవారై, గర్జలు = సింహనాదములు, చిదుముచున్ = త్రెంచుచు.

తాత్పర్యము

స్పష్టము.

క. నేనే త్రుంచెద రావణు, నేనే వధియింతు యామినీచరకోటిన్
నేనే నేనే యనుచును, వానరపతి రాముమ్రోల ♦ వాదము లాడున్. ౬౨

అర్థములు. యామినీచరకోటిన్ = రాత్రి సంచారముచేయు రాక్షసుల సమూహమును.

తాత్పర్యము

స్పష్టము.

సీ. కుముదనీలర్షభుల్ ♦ కొమ్మున మున్నుగాఁ, జనిరి మార్గముల శోధనము సేయ
రామలక్ష్మణులును ♦ రాజు సుగ్రీవుండు, నడుమ నేగిరి గొల్వఁ ♦ గడిఁదిబలులు
శతబలి పదికోట్ల ♦ శాఖామృగాళితో, సర్వంబు రక్షించె ♦ సైన్యసమితిఁ
గరిజనుల్ వేవేలు ♦ బలసిరాఁ బనసార్క, గజకేసరులు ప్రక్క ♦ కాపులైరి
ఆ. ఋక్షసేనతోడ ♦ రక్షించె జఘనంబు, జాంబవంతుఁ డధిక ♦ శక్తియుక్తి
బొసటయి సుషేణ ♦ బలిముఖుఁ డుండెఁగఁ, దరణిసుతుఁడు మున్ను ♦ దవిలి నడువ.

అర్థములు. కొమ్మున = ఉత్సాహముతో.

తాత్పర్యము.

సేనకు ముందుగా మార్గములను బరీక్షించుటకుఁ గాను కుముదుఁడు నీలుఁడు, ఋషభుఁడు ౫౭వ పద్యంబునఁ జెప్పఁబడిన వారితోడఁ బోయిరి (వీరినిగూడ రామ

చంద్రమూర్తి యిచ్చటఁ జెప్పె ననియు కవి యచ్చట గొందఱ నిచ్చటఁ గొందఱ జెప్పె ననియు నెఱుంగవలయు. లేదా యీ సేనను నియమింపఁ బడకుండుటచే భక్త్యతి శయమున వారే పోయి రనిదైన (గిహింపనగు.) మహాబలవంతులు సేవించుచుండఁగా రామలక్ష్మణ సుగ్రీవులు నడుమఁ బోయిరి. శతవలి పది కోట్ల వానరులతో సేన సంతయుఁ గాచి తిరుగుచుండెను. వేయివేల వానరులతోఁ బనసుఁడు, అర్కుఁడు, గజుఁడు, కేసరి, పార్శ్వముల రక్షించుచుండిరి. జాంబవంతుఁ డెలుఁగులతో సేనామధ్య భాగమును రక్షించెను. ఆయనకు సహాయుడై సుషేణుఁ డుండెను. సుగ్రీవుఁడు ముందు పోవుచుండెను.

క. సేనాపతి యగు నీలుఁడు, వానరసైన్యముల నాల్గు♦వంకల సంర
క్షానియమంబున నిపుణతఁ,మానుగ నరయుచును జనెఁ బ్ర♦మాదరహితుఁడై.♦ ౬౪

తాత్పర్యము.

సేనానాయకుఁ డగు నీలుఁడు నాలుగు ప్రక్కల నుండు సేనలను నేర్పుతో హెచ్చరికతో రక్షించుచుఁ బోవుచుండెను.

తే. వానరులఁ దీవరించుచు ♦ వరుసఁ జనిరి
రంభుఁడు దరీముఖుండును ♦ రభసకపియు
మఱి ప్రజంఘుండు చను చిట్లు ♦ మార్గమునను
గనిరి సహ్యాద్రి ఘనసరో♦వనయుతంబు. ౬౫

తాత్పర్యము.

త్వరగా నడువుఁడు, త్వరగా నడువుఁ డని వానరులను వేగిర పెట్టుచు రంభుఁడు, దరీముఖుఁడు, రభసుఁడు, ప్రజంఘుఁడను వారు పోయిరి. ఇట్లు పోయి గొప్ప సరస్సులతో వనములతోఁ గూడిన సహ్యాపర్వతముఁ జేరిరి.

క. భీమాగ్రహాయుతుఁ డగు శ్రీరాముని యాజ్ఞప్తి వాన♦రవ్యూహంబుల్
గ్రామంబుల జనపదముల, భూముల డాయంగఁ జనవు ♦ పురుతరభీతిన్. ౬౬.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి వానరు లెవ్వరును గ్రామములోఁ గాని పల్లెలలోఁ గాని వారికి సంబంధించిన సాగు భూములలోఁ గాని పోరాదని కఠినమైన యాజ్ఞ చేసి యుండుటచే నాయనకుఁ దీవ్రమైన కోపము వచ్చు నను భయముచే వానరులు జనులు చరించు మార్గములఁ బోవక యడవుల వెంటనే పోయిరి.

తే. సాగరౌఘనిభం బయి ♦ జలధిఘోష, సన్నిభారవ మయి కీశ♦సైన్య మపుడు
రామపార్శ్వతలంబున♦రమణ నడచె, సంప్రమోజితజవనాశ్వ♦చయముభంగి. ౬౭

అర్థములు. సాగరౌఘనిభంబు = సముద్రప్రవాహముతో సమానము - సముద్రము ప్రవాహముగాఁ బాఱిన నెట్టులుండునో యట్లు - జలధిఘోష సన్నిభారవ మయి = సముద్రధ్వనితో సమానమైన ధ్వనిగలదై - ఇట్లు చెప్పుటచే

సముద్రమును సమీపించి రని సూచన - సంప్రయాజిత = చక్కఁగాఁ దోలఁబడిన- జవనాశ్వచయము భంగిఁ = వేగవేగముగఁ బోవు గుఱ్ఱముల గుంపువలె - దీనివలన వానరులు మెల్లగా నడచిపోలేదనియు బాగుగాఁ బరువెత్తగల గుఱ్ఱపు వేగమునఁ బోయి రనియు తెలియ నయ్యెడిని.

తా త్ప ర్య ము.

సముద్రధ్వనితో సమానమైన ధ్వనితో సముద్రము పొంగి వెల్లువగాఁ బాఱి నట్లు వానరసేన చక్కఁగాఁ దోలబడిన మంచివేగము గల గుఱ్ఱపుదండు పోయినట్లు రామచంద్రమూర్తి ప్రక్కల నడచెను.

క. వానరసమూహ్యమానులు, మానవపతితనయు లపుడు ♦ మహితగ్రహయు
క్తానంతరత్నమిహికా, భానులగతిఁ బొలిచి చనిరి ♦ ప్రాభవ మారన్. ౬౭

అర్థములు. వానరసమూహ్యమానులు = వానరులచే మోచికొని పోఁబడు చున్న వారు - మానవపతి తనయులు=రాజకుమారులు=రామలక్ష్మణులు - మహిత= గొప్పవగు - గ్రహయుక్త= గ్రహములతోఁగూడిన - అనంతరత్న= సూర్యుని - మిహికాభాను = చంద్రుని - గతిఁ = విధముగ - ప్రాభవము = అతిశయము.

తా త్ప ర్య ము.

హనుమ దంగదులచే మోచికొనిపోఁబడుచున్న రామలక్ష్మణులు గురుశుక్రులతోఁ గూడిన సూర్యచంద్రులవలెఁ బోయిరి.

ఇందు నాలుగు గ్రహముల కూటమి యుపమాన విధముగఁ జెప్పఁబడెను. ఇది లంక కనిష్టము సూచించును. కావున నిట నలంకారముచేత నొక వస్తువునకు ధ్వని. గ్రహయుక్త యను నుపమాన సారస్యముచేత రామలక్ష్మణులు వేంచేయుట యందు హనుమదంగదులకుఁ గల లాఘవాతిశయము సూచితము. కావున పద ప్రతిపాద్యవస్తువుచేత వస్త్వంతరధ్వని.

—♦ లక్ష్మణుఁడు శుభశకునముల శ్రీరామునితోఁ జెప్పుట. ♦—

శా. తారేయాంసగతుండు లక్ష్మణుఁడు సీ♦తానాథుతోఁ బల్కె న
న్నా! రక్షోధిపుఁ జంపి తద్ధృతసతిన్ ♦ వైదేహినిం గ్రమ్మఱన్
దేరం గల్గును నీకు నిక్కమిది కం♦టే కార్యసిద్ధ్యర్థమై
యూరం దోఁచెడి సన్నిమిత్తముల భూ♦మ్యాకాశదేశంబులన్. ౬౮

అర్థములు. తారేయాంసగతుండు = అంగదుని భుజములపై నున్నవాఁడు, తత్ + హృతసతిన్ = ఆ రావణుచే నపహరింపఁబడిన భార్యను, కార్యసిద్ధి + అర్థమై = కార్య మనుకూలముగ ఫలించుకొఱకు, సన్నిమిత్తములు = శుభశకునములు.

తా త్ప ర్య ము.

అంగదుని భుజములమీఁదఁ గూర్చుండిన లక్ష్మణుఁడు రామచంద్రమూర్తి కిట్లనియె. అన్నా! రావణునిచే నపహరింపఁబడిన సీతాదేవిని మరల నీవు తీసికొని రాఁగలవు. ఇది నిజము. భూమియందు నాకాశమందుఁ గానవచ్చు శుభశకునములు కార్యసిద్ధి తెలుపుచున్నవి చూచితివా.

నాలవ పాదంబున అనుస్వార సంబంధయతి.

"గీ. ఆది పూర్ణయుతములై టతవర్గాక్షరములు తుదను గలుగు వ్రాలుదక్క బొసఁగు నొకటి కొకటి భువి ననుస్వారసంబంధయతులునాఁ బ్రబంధములను' అప్పకవి. ఉదా॥ "పెక్కు చందాలంబందు నొకప్పుడుం దలుగ దింటం బాఁడియుఁ బంటయున్" మనుచరిత్రము. మ. దవఘూర్ణముంపు తమంబులోఁ సమరస ద్రవ్యంబు పంకేజబాంధవ భానుప్రతతుల్ హరింపఁ గుయి వెంటన్ వెళ్ళు" అనునది సాధుపాఠము- కుయివెట్ట న్వెళ్ళునది యపపాఠము- రెండుచోటుల ననుస్వారసంబంధము లేదు. అనుస్వారసంబంధము రెండుచోటుల నుండినచో యనుస్వారమునకు ననుస్వారమునకు యతి చెల్లును. సకార టకారములకుఁగాని దకార టకారములకుఁగాని యతిమైత్రి లేదు. "బాన్ధవ భాను ప్రతతుల్ హరింపఁ గుయివెట్టన్" అనుచో ననుస్వారసంబంధము గలదు గాని 'బాన్ధవ భాను ప్రతతుల్ హరింపఁ గుయివెట్టన్' అనిన నట్టి సంబంధము లేదు కావున నిది దుష్టము.

సీ. అనుకూలవాయువుల్ ♦ మన సైన్యములమీఁద
మృదుహితసుఖములై ♦ మెలఁగఁ బొడఁగెఁ
బరుషేతరారావ♦భాసమానంబులై
మృగపక్షితతు లెల్లు ♦ లిడఁగఁ గడఁగె
నన్ని దిక్కులు సుప్ర♦సన్నంబులై యొప్పె
విమలుఁడై భానుండు ♦ వెలుఁగువాఁడు
బ్రహ్మరాశి విశుద్ధ♦భార్గవుం డనుగతుఁ
డై యున్నవాఁడు ♦ మహర్షివరులు
తే. ధ్రువుని వలగొనుచున్నారు ♦ తోయజాక్ష!
మనకుఁ బ్రపితామహుండు ని♦ర్మలవృషర్షి
సహపురోహితుఁ డగుచుఁ ద్రి♦శంకుఁ డిదిగో
మింట వెలుఁగుచు నున్నాఁడు ♦ మేలిరుచుల. ౨౦

అర్థములు. అనుకూలవాయువుల్ = మనకు వెనుకనుండి వీచుచు మనవెంట వచ్చు వాయువు, మృదు హితసుఖములు = మెల్లగాను,హితముగాను, సుఖముకలిగించునవిగాను, ప్రయాణమున నెదురుగాలి యోరుగాలి దుమ్ముతోడిగాలి యపశకున

ములు, పరుషేతర=కఠినముగ లేక, వినవింపైన, ఆరావ = ధ్వనులచే, భాసమానంబులై = ప్రకాశించునవియై, ఎలుఁగులు=ధ్వనులు,సుప్రసన్నంబులై=మిగులనిర్మలములై మబ్బులుగాని మెట్టనికాంతులుగాని లేనివై,స్వచ్ఛములై, బ్రహ్మరాశి = వేదముల కుప్ప, సూర్యుఁడు, "కర్మసాక్షీ జగచ్చక్షు రంశుమాలీ త్రయీతనుః"॥ అని నిఘంటువు. వేదములు శరీరముగాఁగలవాఁడనగా వేదముల నన్నిటిని బూర్ణముగ నధ్యయనము చేసినవాఁడని భావము. విశుద్ధభార్గవుఁడు = దుష్టగ్రహసంబంధములేని శుక్రుఁడు, అనుగతుఁడు = కూడవచ్చువాఁడు, శుక్రున కెదురుగాఁ బోవుట యపశకునము, చుక్క కెదురుపోరాదు. "ప్రతిశుక్రం ప్రతిబుధం, ప్రతిభౌమం గతో నృపః। అపి శక్రేణ సదృశో హతసైన్యో నివర్తతే'' శుక్రున కెదురుగా బుధున కెదురుగా అంగారకున కెదురుగఁ బోయెనేని నిందుని సంతవాఁడైనను రాజు, చంపఁబడిన సేనలు గలవాఁడై వెనుకకు మరలును-దక్షిణముగఁ బోవువారికి చుక్కెదు రను ప్రసక్తిలేదు గావున శుక్రుఁ డనుగతుఁ డనఁగా శుక్రవకార్యములేదని భావ మని తీర్థీయము.

విశుద్ధభార్గవుం డనుగతుఁడై యున్నాఁడనుటచేత - రాముని యవతారకాలమున జాతకఫల సూచనమువలె దండయాత్రాకాలమున గోచారఫలము రాక్షసుల విపరీతఫలమును సూచితములు - రాముఁడు కిష్కింధకు నాగ్నేయముగా నున్న లంకకుఁ బ్రయాణమై పోవుచున్నాఁడు. అప్పుడు శుక్రుఁ డనుకూలుఁ డనియు వెనుక నున్నాఁడనియుఁ జెప్పఁబడెను. శుక్రుడు తఱచుగా సూర్యుఁ డున్నరాశికి ముందు రాశిలో నుండును. రాముఁడు బయలు దేఱినది ఫాల్గునపూర్ణిమ యని ముందే చెప్పఁబడెను. అప్పుడు సూర్యుఁడు మీనరాశియం దుండుటచేత శుక్రుఁడు మేషరాశియం దున్నాఁడని తెలియుచున్నది. రాముని జన్మరాశి కర్కటము - దానికిఁ బదవరాశియైన మేషమున శుక్రుఁ డుండుట రామున కనుకూలము - వెనుక శుక్రుఁ డుండుట చేతను ననుకూలుఁడే - ఇందుకు శుక్రానుకూల్యము చెప్పుటచేత బృహస్పత్యాద్యానుకూల్యమును సూచితము. బృహస్పతి శ్రీరాములవారి జన్మకాలమున కటకరాశియం దుండెను. ఇతని కొక్కొక్క రాశియం దొక్కొక్క సంవత్సరము వాసము కానఁ బండ్రెండేండ్లకుఁ బండ్రెండు రాసులను జుట్టివచ్చును. అట్లు మూఁడు తడవలు చుట్టిరాఁగా ముప్పదియాఱేండ్లు గడచినవి. ముప్పది యెనిమిదవయేఁట రాముని దండయాత్ర.ఆ యేఁట బృహస్పతి రామరాశి ద్వితీయ రాశియైన సింహమున నున్నాఁడు. గురువు రెండవయింట నుండుట యనుకూలము. రామజన్మకాలమున శని తులావర్గోత్తమమున నుండెను. శనికి రెండున్నర యేండ్లొక రాశియందు వాసము. తులనుండి పండ్రెండు రాసులు చుట్టివచ్చుటకు ముప్పది సంవత్సరములు గడచినవి. ముప్పది రెండున్నరదాఁక తులలోను ఆ పై రెండున్నర వృశ్చికములోను ఆ పై రెండున్నర ధనుస్సులోను నుండి యాపై అనఁగా ముప్పది యేడున్నర యేండ్లయిన తరువాత మకరమునకుఁ బోవలసినది ప్రాప్తమయ్యును వక్రితాదులచేత ధనుస్సులోనే

యున్నాఁడని యెంచునది-రాహువు రామావతారకాలములో సింహరాశిలో నుండెను. రాహువునకుఁ బ్రతిరాశిలోను నొకటిన్నర సంవత్సరము వాసము. అప్రదక్షిణ సంచారము - అందుండి ముప్పదియెనిమిదవయేఁటఁ గటకరాశిలో నుండవలసినది ప్రాప్తమయ్యును అతిచారాదులచే మిథునరాశిలో నున్నాఁడని నిశ్చయించునది - రాహువునకు నేడవయింట కేతువాసము. కాన నిప్పుడు ధనుస్సునఁ గేతువున్నాఁడు- నైరృత దైవత నక్షత్రమగు మూల దుమగతికేతుచే ధూపితం బని యీ ప్రకరణమునను జెప్పబడియున్నది. దుమగతికేతువు - ధూమకేతువు = ధూమాకారమైన కేతువు - ధనుస్సున శనికేతువు లున్నారు. ధనుస్సు కర్కటరాశి కాఱవది-అందున్న శనికేతువులు రాముని కనుకూలురు- రామరావణ యుద్ధ ప్రస్తావమున "ఆక్రమ్యాంగారక స్తస్థౌ విశాఖే అపిచాంబరే" యని యున్నది. ఈ వాక్యప్రకార మప్పుడు అంగారకుఁడు విశాఖాచతుర్థపాదమైన వృశ్చికరాశియం దున్నాఁడు. అది కటకమునకు నైదవ రాశి - ఇట్లైదవయింట నంగారకుఁ డున్నందున రామునికిఁ జెడు ఫలము బ్రహ్మాస్త్రబంధాదులు - బుధుఁడు రామునికిఁ బదవ రాశియందున్నాఁడు. కాన ననుకూలుఁడు, చంద్రుఁ డుత్తర ఫల్గునిలోఁ జేరి యున్నాడు కానఁ గన్యారాశియం దుండినట్లు. అప్పటికిఁ దృతీయచంద్రుఁడు కాన రాముని కనుకూలుఁడు. మీనమునం దున్న సూర్యుఁడు కటకమునకుఁ దొమ్మిదవ యింటివాఁ డగుచున్నాఁడు. కాన ననుకూలుఁడు. మిథునములో నున్న రాహువు కటకమునకుఁ బండ్రెండవ యింటివాఁ డగుచున్నాఁడు. కాన రామునికిఁ గొంచెము బాధాకరుఁడు. ఇట్లు రాముని కనుకూలమైన గోచారఫలము నూహించునది. ఈ గోచారము జన్మరాశిని బట్టి చూచియున్నది. చంద్రరాశిని బట్టి చూడలేదు. ఇట్లే యీ గోచారము రాక్షసులకు విపరీత ఫలమయినదిగా నున్నది. రాక్షసుల నక్షత్రము మూల, దానికి సంబంధించినది ధనూరాశి, ఇదే రాక్షసుల రాశి, దీని కైదవయింట నున్న శుక్రుఁడు ప్రతికూలుఁడు. జన్మరాశియైన ధనుస్సులో నున్న శనికేతువులు ప్రతికూలురు. దాని కేడవ యింట నున్న రాహువు కొంచె మనుకూలుఁడు. పండ్రెండవ యింట నున్న యంగారకుఁడు ప్రతికూలుఁడు. తొమ్మిదవ యింట నున్న గురువు అనుకూలుఁడు. నాలవ యింట నున్న సూర్యుఁడు అయిదవయింట నున్న బుధుఁడును అనుకూలురుగారు, పదవయింట చంద్రుఁడు కొంచె మనుకూలుఁడు, ఇంచుఁ గొంచె మనుకూలముగా నున్నను విశేష భాగము ప్రతికూలముగా నున్నది. కాన రాక్షసులకీ గోచారము విపరీత ఫలమునే యిచ్చును.

అర్థములు. మహర్షివరులు = సప్తర్షులు, ధ్రువునిఁ = ధ్రువస్థానమును, వలగొనుచున్నారు = ప్రదక్షిణించుచున్నారు, మనకుఁ = ఇక్ష్వాకులకు, ప్రపితామహుండు = కూటస్థుఁడు, నృప+ఋషి = రాజఋషి, త్రిశంకుఁడు = (౧) సహ

పురోహితుఁడు = విశ్వామిత్రునితోఁ గూడినవాఁడు (౨) సృజన్ దక్షిణమార్గస్థాన్ సప్తర్షీనపరాన్ స్వన యని బాలకాండమునఁ జెప్పినట్లు విశ్వామిత్రసృష్టిలోని సప్తర్షి మండలములోఁ జేరిన వసిష్ఠునితోఁ గూడినవాఁడు.

తా త్ప ర్య ము .

అన్నా ! యనుకూల వాయువులు మన సేనలమీఁద మృదువుగాను హితముగాను సుఖకరముగా మెల్లగాను వీచుచున్నవి. విన నింపైన ధ్వనులతో మృగములు పక్షులు ధ్వనించుచున్నవి. దిక్కులన్నియుఁ బ్రసన్నములై యున్నవి. సూర్యుఁడు నిర్మలుఁడై ప్రకాశించుచున్నాఁడు. వేదమూర్తియగు సూర్యుఁడు దుష్టగ్రహసంగతి లేని శుక్రునిగూడి మన కనుకూలుఁడై యున్నవాఁడు. సప్తర్షులు ధ్రువుని బ్రదక్షిణించుచున్నారు. మన వంశకూటస్థ పురుషుఁడు త్రిశంకుం డచ్చటి సప్తర్షి మండలములోని వసిష్ఠునితో నాకాశమునఁ బ్రకాశించుచున్నాఁడు.

క. మనయిక్ష్వాకుల తారకఁ, గనుము విశాఖను వెలింగెఁ ♦ గడువిశదంబై
తనరి నిరుపద్రవంబుగ, మనశత్రుల కివి రహించు ♦ మార్గము వినుమా. ౫౧

తా త్ప ర్య ము

మన యిక్ష్వాకువంశతార విశాఖ. అది యెట్లు నిర్మలముగ నుపద్రవములేక ప్రకాశించుచున్నది చూడుము. ఇఁక నీ గ్రహములు మనశత్రువులకుండు విధముఁ జెప్పెదను.

విశాఖ యిక్ష్వాకుల నక్షత్ర మని జ్యోతిషదర్పణంబునఁ గలదు. నిరుపద్రవ మనఁగా నంగారకాది క్రూరగ్రహసంబంధము లేకయుండుట.

సీ. నైరృతదైవత♦నక్షత్ర మగు మూల, దుమగతి కేతుచే ♦ధూపితంబు
గానుట రాక్షస♦కాండంబులకుఁ జేటు, దెల్పుచున్నది యెన్ని♦ తెఱఁగు లరయ
వారికి నాశంబు ♦ చేరువ నున్నది, మృత్యుగృహీతుల♦రిక్ష మరణ
కాలంబుఁ దెలుపుచు ♦ గ్రహపీడితం బగు, నం డిప్పు డవి నైరు♦లందుఁ గలిగె
ఆ. నీరు నిర్మలంబు ♦ నీరజాకరముల, వనము లెల్లఁ బుష్ప♦వంతములును
గమ్మఁదావి యొలసె♦ఘమ్మని యెల్లెడ, భూజతతి యథర్తు♦పుష్పయుతము. ౫౨

అర్థములు. నైరృత దైవత నక్షత్రము = రాక్షసులకు దేవత యగు నక్షత్రము, మూల = మూలానక్షత్రము. దుమగతి కేతుచే = ధూమ కేతువుచే - ధూపితంబు=తపింపఁజేయఁబడుచున్నది. 'ధూప సంతాపే' యని ధాతువు, కాండంబులకు= సమూహములకు, మృత్యుగృహీతుల రిక్ష = మృత్యుదేవతచేఁ బట్టుపడినవారి నక్షత్రము, యథర్తు = యథాఋతు = ఋతుయోగ్యమైన, పుష్పయుతము = పూలతోఁ గూడియున్నది.

తా త్ప ర్య ము .

రాక్షసుల నక్షత్రము మూల, దానిని ధూమకేతువు పీడించుచున్నది. ఎన్ని విధముల నాలోచించినను ఆ నక్షత్రము వారికిఁ జేటు తెలుపుచున్నది. వారు

నాశమై పోవు కాలము సమీపించినది. మరణము సమీపించినవారి నక్షత్రము క్రూర గ్రహములచే వీక్షితమై మరణకాలము దెలుపు నని శాస్త్రజ్ఞులు చెప్పుదురు. అట్టి చిహ్నములు వైరులందుఁ గానవచ్చుచున్నవి. మన మార్గమున సరస్సులందు నీళ్ళు నిర్మలములుగా నున్నవి. అడవులన్నియుఁ బూచియున్నవి. ఘుమ్మని కమ్మనివాసనలే కొట్టుచున్నవి. ఈ ఋతువునఁ బూచవలసిన చెట్లు పూచియున్నవి. దోహదాది క్రియలు లేక నిష్కారణముగ నొక ఋతువునందుఁ బూచవలసిన చెట్లు మఱియొక ఋతువునఁ బూచెనేని యుత్పాతము.

ఆ. తారకామయాఖ్య ♦ దారుణరణమున, దేవసేనపోలె ♦ దేవ వెలుఁగు
చున్నయదియు వానరోగ్రవీరుల సేన, జయము నిజము మనకు ♦ శంకవలదు.

అర్థములు. తారకామయాఖ్య = తారకామయ మను పేరుగల, దారుణ రణమునన్ = భయంకర యుద్ధమందు, తారక+ఆమయ = (౧) తారకుని వధము గలదని, ఆఖ్య = పేరుగల (౨) తారకా+ఆమయ = బృహస్పతి భార్య యను తార మనోవ్యాధియే కారణముగాఁ గలది, బృహస్పతి భార్య యగు తారను చంద్రుఁడు హరించెను. ఎవరు చెప్పినను మరల నిచ్చినవాఁడు కాఁడు. బృహస్పతి యింద్రునితోఁ జెప్పెను. ఆయన బృహస్పతి పక్షమునఁ జంద్రునిపై యుద్ధమునకు వెడలెను. బృహస్పతి తండ్రియగు అంగిరసుని వలన విద్య నేర్చినవాఁడగుటచే గురుపుత్రు పక్షమున రుద్రుఁడును యుద్ధమునకుఁ బూనుకొనెను. చంద్రుని పక్షమున శుక్రుఁడు జంభకుంభాది సకల దైత్యదానవ సమూహముతో సహాయపడెను. రెండు పక్షముల వారికి నఘోరియుద్ధము జరిగెను. ఈ యుద్ధము తారానిమిత్తమైనది కావున తారకామయ మను పేరు గలిగెను. "ఏవంచ తమోరతీవోగ్ర స్సంగ్రామ స్తారానిమిత్తం తారకామయో నామాభవత్" అని విష్ణుపురాణమున చతుర్థాంశమున ౬౫వ యధ్యాయ మందుఁ గలదు. ఇది పౌరాణిక గాథ.

భూమియందు భూకంపన - మహావాయుప్రచారణములచే నెట్లుత్పాతములు పుట్టియున్న ద్వీపములు దేశములు పోవుట క్రొత్తవి వచ్చుట యెట్లుగలవో యట్లే యాకాశ మండలమున నెప్పుడైన మహోత్పాతములు గలుగుచుండును. అప్పుడంత రాళమునఁ దిరుగు సల్పగ్రహములు వాయుప్రేరితములై వానివాని స్థానములు విడిచి మఱియొక చోటికిఁ గొట్టుకొనిపోవుటకలదు. అట్లొకసారి యుత్పాతమున బృహస్పతి చుట్టు తిరుగు నుపనక్షత్రమొకటి (తార = నక్షత్రము) గాలికి కొట్టుకొనిపోయి చంద్రుని జుట్టి తిరుగుచుండెను. ఆవల మఱియొక యుత్పాత సమయమున మరలవచ్చి బృహస్పతి చుట్టు తిరుగ నారంభించెను. ఈ జ్యోతిశ్శాస్త్ర విషయమును బౌరాణికు లీ విధముగ వర్ణించి వ్రాసిరి. ఆ మహోత్పాతములో జరగిన గందరగోళము తారకామయ మనఁబడెను. అనఁగా నక్షత్రములందు జరిగిన యల్లకల్లోల మని యర్థము.

### తాత్పర్యము.

తారకామయ మను భయంకర యుద్ధమునందు దేవసేనవలె మనసేన ప్రకాశించుచున్నది. కావున మనకు నిస్సందేహముగా జయము గలదు.

క. అని శకునంబులఁ దెలుపుచుఁ, దనయగ్రజుమనము ముదముఁ ♦ దగుల సుమిత్రా
తనయుఁడు పలికిన రాముఁడు, విని సంతస మంది సేన♦వే నడిపించెన్. ౭౪

### తాత్పర్యము.

ఈ ప్రకారము శకునములఁ దెలుపుచు నన్నకు లక్ష్మణుఁడు సంతోషము గలిగింపఁ జెప్పుచుండ రామచంద్రమూర్తియు సేనను త్వరగా నడిపించెను.

—♦ కపిసేనలు ప్రయాణమై పోవుట. ♦—

చ. జలధరసంఘ మంబరము ♦ ఛాదితముం బొనరించు మాడ్కి న
బ్బలిముఖచక్రముల్ సవన♦పర్వతదక్షిణదిక్కు గప్పగాఁ
బలితపుఁ దత్కరాంఘ్రిహతిఁ ♦ బాయక లేచి ధరాపరాగముల్
జలజహితద్యుతుల్ సమయ ♦ సర్వజగంబును మ్రింగె నొక్కటన్. ౭౫

అర్థములు. జలధర సంఘము = మబ్బులగుంపు, అంబరముఁ = ఆకాశమును, ఛాదితముఁ = మఱుఁగుపడినదిగా, బలిముఖచక్రముల్ = వానర సేనలు, సవన పర్వత దక్షిణదిక్కు = అడవులతోఁ గొండలతోఁ గూడిన దక్షిణదిక్కును, తత్ = ఆ వానరులయొక్క, కరాంఘ్రిహతిఁ = చేతుల కాళ్ళదెబ్బలచే, ధరాపరాగముల్ = నేలదుమ్ములు, జలజహితద్యుతుల్ = సూర్యకాంతులు, సమయఁ = చెడిపోవునట్లు.

౬౦ వ పద్యము రాత్రివర్ణనము-ఇది పగటి వర్ణనము. ఇది ఫాల్గున బహుళ ప్రతిపత్తు పగలని తెలియవలయును.

### తాత్పర్యము

మబ్బు లాకాశమును మఱుఁగు పఱుచునట్లు వానరసేనలు అడవులు కొండలతో నిండిన దక్షిణదిక్కును గప్పఁగా వారి కాలుసేతుల దెబ్బలకు రేఁగిన దుమ్ము సూర్య ప్రకాశము సమయునట్లు లోకము నంతయు లోఁగొనెను.

క. విడువక శాఖామృగముల, దడమును తరియించుకతనఁ ♦ దటినులు వంకల్
పెడమరలి పాఱెఁ బెక్కు,మడ లెప్పటి యట్ల పోవ ♦ మార్గము లేమిన్. ౭౬

అర్థములు. దడములు = దళములు = సేనలు - తటినులు = ఏళ్ళు - పెడమరలి = వెనుకకుఁ దిరిగి.

### తాత్పర్యము.

గుంపుగా వానరసేనలు విడువక యొకటి వెంట నొకటి దాఁటుచున్న కారణమున నేళ్ళు వంకలు యథాప్రకారము పాఱుటకు సాధ్యముగాని కారణమున పెక్కుమడ లెదురెక్కి పాఱెను.

చ. విమలసరోవరంబులను ♦ వృక్షచయావృతపర్వతంబులన్
సమతల భూప్రదేశములఁ ♦ జారుఫలాన్విత సద్వనంబులన్
క్రమమున నడ్మ నెల్ల యెడఁ ♦ గ్రచ్చఱ నడ్డముగాఁగఁ గ్రిందుగా
సమద వలీముఖప్రముఖ ♦ సైన్యసమూహము లావరించుచున్. २२

అర్థములు. వృక్షచయ = చెట్లగుంపులచే, ఆవృత = క్రమ్ముకొనఁబడిన, చారు = మనోహరములైన, ఫల=పండ్లచే, అన్విత = కూడిన, సద్వనంబులన్ = మంచియడవులను, నడ్మ = నడుమ, సమద = గర్వముతోఁ గూడిన, వలీముఖ = వానరుల.

తా త్ప ర్య ము .

వానర ప్రముఖుల సేనాసమూహములు నిర్మలమైన సరోవరంబులందుఁ జల్లని నీరుండుటచే నడుమ నావరించెను. చెట్లతో నిండిన పర్వతంబులను చెట్లడ్డముగా నుండుటచే నడ్డముగా నావరించెను. సమముగా నుండు నేలలయందు సర్వత్ర యావరించెను. మనోహరములైన పండ్లతో గూడిన వనంబులందు పండ్లనిమిత్తమై చెట్ల క్రిందుగా నావరించెను.

చ. చనెఁ జనె వాయువేగమున ♦ సమ్మదవీర్య బలాతిరేకముల్
గనబడ యౌవనోద్ధతివి♦లాసపరాక్రమరీతి గర్జలన్
నినుచుచు నందుఁ గొందఱు వ♦నేచరనాథులు కిల్కిలార్భట
స్వనముల ఱొప్ప, గంతులను ♦ వైచిరి కొందఱు రంతు సేయుచున్. २३

అర్థములు. చనెన్ చనెన్=దీర్ఘప్రయాణము గావున ద్విరుక్తి, దీనికిఁ గర్త్రృ పదము పూర్వ పద్యము నందలి సైన్య సమూహములు, సమ్మద, వీర్య బల, అతిరేకముల్ = వారి వారి సంతోషము, వీర్యము, బలము, వీని యతిశయము, యౌవనోద్ధతి = వయస్సు యొక్క గర్వము, విలాసము = పరాక్రమము. రీతిన్ = తగినట్లు, నినుచుచున్ = నిండించుచు.

తా త్ప ర్య ము .

ఆ సేనలందు వానరులు వారి వారి సంతోషము పరాక్రమము బలము యొక్క యతిశయము గనఁ బడునట్లు, యౌవనము వలనఁ గలిగిన గర్వము, విలాసము, పరాక్రమమునకుఁ దగినట్లు సింహనాదములచే దిక్కులు నిండించిరి. కొందఱు వానర శ్రేష్ఠులు కిల కిల మని కిలారించిరి. కొందఱు ధ్వని చేయుచు గంతులు వైచిరి.

సీ. క్షొ్మాస్థలి తోఁకలు ♦ జాడించికొట్టుచు, ధరణి గ్రక్కదలఁ బాదముల నిడుచుఁ
గొండల నెక్కుచుఁ ♦ గుప్పించి దాఁటుచు, భూజముల్ విఱుచుచు♦బొబ్బలిడుచు
నూరువేగంబునఁ ♦ జారులతాపాళి, నలియఁ జేయుచును వా♦నరబలంబు
నూఱులు వేలును ♦ నూఱువేలును గోట్లు,కోలఁదిగా ధారణిఁ ♦ గలయఁ బర్వి

తే. రేయుఁబగలును నడిచె సు♦గ్రీవరక్ష, నిలువ కెడ నెడ హర్షంబు ♦ దలకొనంగ
నెప్పుడెప్పుడు రాముని♦యిగురుఁబోణి, బందిఁ దొలఁగింత మను తమి ♦ సందడింప.

అర్థములు. కదకదలు = కదలు+కదలు=మిక్కిలి కదలు, భూజముల్ = చెట్లు, ఎడనెడ నిలువక = నడుమ నడుమ నిలువక, బంది = నిర్బంధము, చెఱ; తమిన్ = కోరికతో.

తా త్ప ర్య ము .

స్పష్టము.

చ. నిలువక పోయి పోయి యన♦నీరుహసంకటమున్ మృగావళీ
కలితము నైన సహ్య మను♦ క్ష్మాధరమున్ మలయావనీధ్రమున్
బలితపుఁగాననంబులఁ బ్ర♦వాహములం గనుఁగొంచు నేగు చో
వలిముఖభంజితంబు లయి ♦ వ్రాలెఁ గదంబు తమాలసంతతుల్. ౭౦

అర్థములు. అననీరుహసంకటమున్ = చెట్లతో నిండినది, మృగావళీకలితము = మృగముల గుంపులుగలది, వలిముఖ = వానరులచే, భంజితంబులు = విఱువఁబడినవి - తమాలసంతతుల్ = కానుగల గుంపులు.

తా త్ప ర్య ము .

ఇట్లు లోకరాతిరి, పగలు విడువక ప్రయాణము చేసిచేసి చెట్లచే నిండి మృగముల గుంపులు గల సహ్యము మలయము నను పర్వతములను బలిష్ఠములైన యడవులను, ప్రవాహములను జూచుచుఁ బోవునపుడు వానరులు కానుగు చెట్లు విఱిచి వైచిరి.

క. త్రుంచుచు నూఁడుగులన్ ఖండించుచు మావులను జువ్వి♦చెట్లను దెగ ఖండించుచుఁ బొగడల నేరేడు, లించుక భయ మేది వనచ♦రేశ్వరు లరుగన్. ౭౧

తా త్ప ర్య ము.

త్రోవ కష్టము వచ్చిన యూడుగుచెట్లను, మామిడిచెట్లను, జువ్వి, పొగడ, నేరేడు చెట్లను గూలఁద్రోయుచు విఱచుచు వానరులు భయములేక పయనించిరి.

క. కాననభూరుహవారము, వానరతతిమీఁద వాయు♦వశచలితం బై
మానితసుగంధబంధుర, సూనవితానములు గురిసె ♦ సొబగారంగన్. ౭౨

అర్థములు. కానన భూరుహవారము = అడవులందలి చెట్లసమూహములు, వాయువశ చలితంబై = గాలి కారణముగఁ గదలినవై, మానిత సుగంధబంధుర సూనవితానములు = గౌరవింపఁ దగిన పరిమళముచే మనోహరములైన పూలగుంపులను - సొబగు = అందము.

తా త్ప ర్య ము .

వానరులు చెట్లక్రిందఁ బోవునపుడు అడవులలోని చెట్లు గాలికిఁ గదలి మంచి పరిమళము గల పూవులను వారిపైఁ గురిసెను.

క. చందనశీతలుఁ డగుచును, నిందిందిరబృందగాన ♦ మొసఁగఁగ వీచెన్
మందత సుఖసంస్పర్శుఁడు, సుందరసామోదవనుల ♦ శుభపవనుండున్. ౮౩

అర్థములు. చందనశీతలుఁడు = చందనమువలెఁ జల్లనివాఁడు, ఇందిందిరబృందగానము = తుమ్మెదలగుంపుల ఝుంకారమనెడి పాటలు, మందత = మెల్లగా సుఖ సంస్పర్శుఁడు = సుఖము కలుగునట్లు తాఁకువాఁడు, సుందర = అందములయిన సామోద = వాసనతోఁ గూడిన, వనులన్ = అడవులందు - శుభపవనుఁడు = శుభసూచకముగ వాయువు.

తాత్పర్యము.

చందనమువలెఁ జల్లనివాఁడై, తుమ్మెదల ఝుంకారమనెడి పాటలు పాడుచు, మెల్లగా సుఖముగఁ దాఁకుచు శుభసూచకముగ వాయువు అందమైన పరిమళముతోఁ గూడిన యడవులందు వీచెను.

క. వాతమహారయఘట్టిత, ధాతుప్రసృతము రజోవి♦తానముచే న
త్యాతతగతి శైలము ప్రస్ఫీతవలీముఖవరేణ్య♦సేనం గప్పెన్. ౮౪

అర్థములు. వాత = వాయువుయొక్క, మహారయ = మిగుల వేగము చేత, ఘట్టిత = ఎగురఁగొట్టఁబడిన, ధాతు = ధాతువులనుండి, ప్రసృతము = బయలు దేఱిన, రజోవితానముచే = పొడి సమూహముచే, అత్యాయతగతి = విస్తారముగ, ప్రస్ఫీత = మిగుల విస్తారమైన, వలీముఖవరేణ్య = వానరశ్రేష్ఠుల, సేనన్ = దండును.

తాత్పర్యము.

వాయువుయొక్క మహావేగముచేఁ గొట్టఁబడి ధాతువుల నుండి లేచిన పొడిచే పర్వతము విస్తారవానర సేనను నధికముగఁ గప్పెను. పూర్వపద్యము నందు గానము చెప్పఁబడెను. ఇందు గందపొడి చల్లుట చెప్పఁబడెను. ఇవి శుభసూచకములు.

క. వికసించి యుండె గిరిఁ గేతకపద్మక తినిశ వరణ♦ధవ పాటలచూ
తకకోవిదార రథ కురువక చూర్ణక సిందువార ♦ వకుళాదితరుల్. ౮౫

అర్థములు. గిరిన్ = సహ్యపర్వతము నందు - కేతక = మొగిలి, పద్మక = మెట్టదామరలు - (౨) సువాసనగల పూవుల చెట్లు - వరణ = ఉలిమిరిచెట్లు, ధవ = చండ్రచెట్లు - పాటల = పాదిరిచెట్లు - చూతక = మామిడిచెట్లు - కోవిదార = కాంచన చెట్లు- రథ = పరిబ్బలిచెట్లు, కురువక = ఎఱ్ఱగోరింటచెట్లు, చూర్ణక = ఉసిరికచెట్లు, సిందువార = వావిలిచెట్లు, వకుళ = పొగడలు, ఆది = ఇవి మొదలుగా, తరులు = చెట్లు.

తాత్పర్యము.

ఆ సహ్యపర్వతమందు మొగిలి మొదలగు చెట్లు వికసించి యుండెను.

క. గంతు లిడుచుఁ జను వానర, కాంతుల రాయిడిని వివిధ♦కాననతరువుల్
కాంతులు చెడి వ్యాకులతాక్రాంతములై యుండె శైల♦వర్గమునందన్. ౮౬

తాత్పర్యము.

గంతులు పెట్టుచు పోవుచున్న వానర శ్రేష్ఠుల రాపిడి వలనఁ గలిగిన బాధచే నానావిధములైన యడవిచెట్లు కాంతి మాసి చెదరినవై కొండలమీద నొప్పుచుండెను.

సీ. పర్వతమ్ములనున్న ♦ బావులు గుంటలు, శీతలజలసము♦పేత మగుచుఁ
జక్రకారండవ♦సంసేవితంబులై, చెలువార శార్దూల♦సింహ ఋక్ష
చిత్రకాయ లులాయ♦పోత్రిచయంబులు, సర్వత్ర నయనగో♦చరము లయ్యెఁ
బద్మసౌగంధికో♦త్పలకైరవంబుల, గొలఁకు లచ్చోటను ♦గలుకు లయ్యె

తే. శైలసానుతలంబుల ♦ శ్రవ్యముగను, విహగకూజితములు చా♦బహుల మయ్యె
నట్టితలముల డాసి వ♦నౌకసములు, తనివి తీరఁగ విహరించె♦ మనముగోలఁది. ౮౭

అర్థములు. శీతలజలసముపేతము = చల్లని నీటితోఁ గూడినది, చక్రకారండవ = చక్రవాక పక్షులచేతను నీటికోళ్ళ చేతను, సంసేవితంబులై = సేవింపఁబడినవై, శార్దూల = పులులయు, సింహ = సింగములయు, ఋక్ష = ఎలుఁగులయు, చిత్రకాయ = చిరుతలయు, లులాయ = అడవి దున్నలయు, పోత్రి = పందులయు, చయంబులన్ = సమూహములు - సర్వత్ర = అన్ని ప్రదేశములందు - నయనగోచరములయ్యెన్ = కన్నులకుఁ గానవచ్చెను. పద్మ = తామరలు - సౌగంధిక = ఎఱ్ఱకలువలు - ఉత్పల = నల్లకలువలు - కైరవ = తెల్లకలువలు - గొలఁకులు = సరస్సులు - కలుకులు = ఒప్పిదము కలవి - శైలసానుతలంబులన్ = పర్వతముల చఱులయందు, శ్రవ్యముగను = వినుట కింపై - విహగకూజితములు = పక్షుల కూఁతలు - వనౌకసములు = క్రోఁతులు.

తాత్పర్యము.

కొండల యందున్న బావులు గుంటలు చల్లనినీళ్ళు చక్రవాకములు నీటికోళ్లు కలవై యుండెను. ఎక్కడఁ జూచినను పులులు సింహములు ఎలుఁగులు చిఱుతలు దున్నలు పందులు కానవచ్చుచుండెను. తామరలు - ఎఱ్ఱని - నల్లని - తెల్లని కలువలు గలిగి సరస్సు లందంబులై యుండెను. కొండచఱులయందు పక్షులు విననింపుగ విశేషముగఁ గూయుచుండెను. అట్టి ప్రదేశములందు వానరులు తృప్తియగువఱకు విహరించిరి.

ఉ. దోసిట నీరు గ్రోలుచును ♦ దోఁగుచు నిచ్ఛగఁ ద్రోవ వచ్చు నా
యాసము దీర నీళ్ళఁబడి ♦ యాడుచు నొండొరుమీఁద నీర ము
ల్లాసముగాఁగఁ జల్లుచుఁ దలన్ జలమధ్యమునందు ముంచుచున్
గ్రీసరబీతులేక పులి♦నీతతులెక్కుచుఁ బండ్లు మెక్కుచున్. ౮౮

అర్థములు. తోఁగుచున్ = మునుఁగుచు, స్నానము చేయుచు, ఇచ్ఛగన్ =

ఇష్టము కొలఁది, కీసరబీతు = కొంచెమైన భయము, పులినీ తతులు = ఇసుక దిబ్బల గుంపులు, మెక్కుచున్ = తినుచు.

తాత్పర్యము.

దోసిళ్ళకొలఁది నీళ్ళు త్రాగుచు, మనసార స్నానము చేయుచు దారి నడచిన బడలిక దీర నీళ్ళలోఁబడి యీదుచు, నొకరిమీఁద నొకరు చల్లుచు, తలలు నీటిలో ముంచుచు, భయము కొంచెమైనను లేక యిసుకదిబ్బ లెక్కుచుఁ బండ్లు తినుచు.

క. తేనియల ద్రోణమాత్రప్రమాణముల గ్రోలుచున్ క్షమాసుహితతులన్
మానితలతలం జెఱచుచు, వానరతతి దిరిగె నేర్చి వసుధాధరముల్. ౮౯

తాత్పర్యము. స్పష్టము.

ఆ. చెట్టు చేమ లేని మెట్టలఁ గొందఱు, పోవఁ దేనె లెస్స దావి మత్తు
కతనఁ జెట్లనీడఁ గపులు కొందఱుఁ గొందఁ ఱరుగఁ జనుచు లేచు చరుసమునను

తాత్పర్యము. స్పష్టము.

క. ఎచ్చటఁ జూచిన కీశసముచ్చయముల్ పరఁగ ధరణి మొగిఁ బక్వంబై
హెచ్చిన వరిపైరున మడి,యచ్చున రాజిల్లె నిబిడ సైనిక తతులన్. ౯౦

అర్థములు. కీశసముచ్చయముల్ = కోఁతులగుంపులు.

తాత్పర్యము.

ఎచ్చటఁ జూచినను పింగ వర్ణము గల కోఁతులు వ్యాపించుటచేఁ దట్టముగఁ బండిన వరిపైరుచే వరిమడివలె భూమి కానవచ్చెను.

క. ఇంద్రనిభుఁడు రాముండు మహేంద్రధరాధరమునన్ సమేధితమహాశృం
గేంద్రము నెక్కి కమఠఝషసాంద్రము రత్నాకరంబు సందర్శించెన్. ౯౧

అర్థములు. ఇంద్రనిభుఁడు = ఇంద్రునితో సమానుఁడు, మహేంద్ర ధరాధరమునన్ = మహేంద్రపర్వతమందు, సమేధితము = ఎత్తైనది, శృంగేంద్రము = శ్రేష్ఠమైన శిఖరము, కమఠఝష సాంద్రము = తాఁబేళ్ళచేతను, చేఁపలచేతను దట్టమైనది, రత్నాకరంబున్ = సముద్రమును, సందర్శించెన్ = చూచెను.

తాత్పర్యము.

ఇంద్రునితో సమానుఁడైన రామచంద్రమూర్తి మహేంద్ర పర్వతమున నెత్తైన శిఖర మెక్కి తాఁబేళ్ళు, చేఁపలు దండిగఁ గల సముద్రమును జూచెను.

తే. మలయసహ్యమహాశైలములఁ దరించి,యానుపూర్విగ జలధి డాయంగఁ బోయి
దిగ్గి వేలావనం బెల్ల దీవరముగ, దాఁటి ధాతోపలతలముఁ దఱిసి వేల. ౯౨

తాత్పర్యము.

మలయపర్వతమును, సహ్యపర్వతమును దాఁటి క్రమముగ సముద్రమును సమీపించి యచట హనుమంతుని మూఁపులనుండి దిగి సముద్రతీరమందుండు వనము త్వరగా దాఁటి చెలియలి కట్టయందు నలలచేఁ గడుగఁ బడిన ప్రదేశము సమీపించి.

చెట్లకొమ్మలు తగులు నని హనుమంతుని భుజములనుండి రామచంద్రమూర్తి దిగెనని యెరుఁగనగు.

—♦ శ్రీరాముఁడు కపిసేనతో సముద్రతీరముఁ జేరుట. ♦ —

ఉ. శ్రీరఘువంశమాళి కపి♦శేఖరుఁ గన్గొని కీశనాథ! కూ
పారము తీరముం గదియ ♦ వచ్చితి మింక నతీరము౯ సుగం
భీరము నైన దీని నొక♦మేలి యుపాయముచేతఁ గాక యిం
కే రహిఁ దాఁటరాదు మన♦యీ కపిసేనకు నెల్లఁ జూడుమీ. ౯౪

అర్థములు. కూపారము తీరము = సముద్రముయొక్క యొద్దు - అతీరము౯ = రేవు లేనిది - సుగంభీరము = మిగుల లోఁతైనది - మేలి = శ్రేష్ఠమైన.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి సుగ్రీవునిఁ జూచి వానరరాజా! సముద్రతీరముఁ జేరితిమి - దీనికి రేవులు లేవు. లోఁతు విస్తరించియున్నది. దీని నేదైన గొప్ప యుపాయముచేత దాఁటవలయునేకాని మఱియొక విధముగ మన వానరసేన దాఁట సాధ్య పడదు; ఆలోచింపుము.

తే. మున్ను మనకెల్లఁ మది సము♦త్పన్నమైన, చింత యే యిప్డు వెండియు ♦ జివురు లెత్తె
జేయఁగావగు నొక సదు♦పాయ మిప్డు, కాలయాపనసేఁత యో♦గ్యంబుగాదు

అర్థములు. సముత్పన్నము = పుట్టినది - కాలయాపనసేఁత= వ్యర్థముగాఁ గాలము గడపుట.

తాత్పర్యము.

కిష్కింధలో మన కే విచారము కలిగెనో యదియే యిప్పుడు మరలఁగలిగెను. ఏదైన నొక యుపాయము చేసి దీనిని దాఁట వలయును గాని వ్యర్థముగ గాలము త్రోయరాదు.

రావణాసురుఁడు హెచ్చరిక పడుటకు ముందే లంకపైఁ బడవలయు ననియు, అటులు చేసిన సంధికి వచ్చు ననియు రామచంద్రమూర్తి తలంపు.

ఉ. కావున మంత్రతత్పరత ♦ కార్యము చుమ్ము, యనుజ్ఞ నిమ్ము సు
గ్రీవ! నివేశముం గొనఁగఁ♦గీశచమూనిచయంబు లింద, యిం
దే వనచారి యైనఁ బని ♦ యెయ్యది యైనను గల్గు గాక దాఁ
బోవఁగ రాదు సేన విడి, ♦ పోవఁగ వచ్చును శూరసత్తముల్. ౯౬

అర్థములు. మంత్రతత్పరత = ఆలోచనముం దాసక్తి గలవార మగుట, నివేశము౯ = నిలుచుటకుఁ దగినచోటు.

తాత్పర్యము.

మన మీ విషయ మాలోచింపవలసి యున్నది. వానరు లందఱు నిచ్చటనే వారి వారికిఁ దగిన స్థలములందు దిగున ట్లేర్పాటు చేయుము. శూరులగు నాయకులు

తప్ప మఱే యే కోరిక యైనను నెంతపని యున్నను దండునుండి చీలిపోరాదు. సేనలోనే యుండవలెను.

ఉ. ఛన్నవిరోధిసంఘములచందము రోయఁగ నౌను గాన, నం
చేన్న సుమిత్రపట్టియు సహాయుఁడుగాఁ గపిసేన నెల్ల వా
రాన్నిధితీరమందు వనరాజిని బాళెము దిగ్గఁ బంచె నం
పన్నగుణుండు కీశపతి భ్రాజిత మా పరిధిస్థకోటితోన్. ౯౭

అర్థములు. ఛన్నవిరోధి సంఘములు = దాఁగియుండు పగవారి గుంపుల యొక్క, చందము = విధము, రోయఁగన్ = వెదకఁగ, వారాన్నిధి తీరమందు = సముద్రము యొడ్డున, వారాన్నిధి = అలుకన్నమాసము, పాళెముదిగ్గన్=విడియుటకు, పనిచెను = ఆజ్ఞాపించెను. పరిధిస్థకోటితోన్ = రక్షకసమూహముతో.

తా త్ప ర్య ము.

శూరులగు వానరశ్రేష్ఠులు మాత్రే మేల సేన విడిచిపోనలయు ననిన విరోధులు మనలఁ గొట్టుటకుఁ మఱుగు స్థలములందు దాఁగియుందురు. వారిని వెదక కొందరు పోవలసియుండును. అట్టివారు మాత్రము పోవచ్చును. ఈ ప్రకారము రామచంద్ర మూర్తి చెప్పఁగా లక్ష్మణుని తోడుతీసికొని గుణసంపత్తి గల సుగ్రీవుఁడు సేనల నన్నిటిని సముద్రతీరమందు రక్షకులగు వారితోడ దిగవలసిన దని యాజ్ఞాపించెను.

క. పారం బెఱుఁగని మర్కట, వారము మధుపాండుసలిలవంతం బగు కూ
పారం బన లవణాకూ,పారము నికటమున నప్పుడు భాసిలు చుండెన్. ౯౮

అర్థములు. పారంబు = అంతము - పరిమాణము - మధుపాండు సలిల వంతము = తేనెవలెఁ బింగళమైన జలముగలది; మధుశబ్దసాహచర్యముచే పాండు శబ్దమునకు పింగళవర్ణము గ్రాహ్యమని తిలకము. కూపారము = సముద్రము లవణాకూపారము=లవణసముద్రము. ఉప్పునీళ్ళ సముద్రము యొక్క, నికటమునన్= సమీపమునందు.

తా త్ప ర్య ము .

పరిమాణ మింత యని చెప్ప సాధ్యపడని వానరసమూహ ముప్పునీళ్ళ సముద్రము సమీపమున తేనెవంటి పింగళజలము గల సముద్రమో యన్నట్టు లొప్పుచుండెను. అలంకార ముత్ప్రేక్ష.

క. వారిధినాదము లోఁగొని, సారం బగు కీశసైన్యసన్నాహరవం
బారూఢిఁ జెలఁగె; ముత్తెఱఁ, గై రహి మించెన్ బలంబులర్కజు నాజ్ఞన్.౯౯.

తా త్ప ర్య ము.

వానరుల సేనల సన్నాహమునఁ బుట్టిన ధ్వని సముద్రధ్వనిని మిగిలి పై చెను. అప్పుడా సేన సుగ్రీవు నాజ్ఞ ప్రకారము మూఁడు విధము లయి యొప్పెను. అనఁగా వానరు లందఱు నొక గుంపుగను, ఎలుఁగు లొక గుంపుగను, కొండముచ్చు లొక గుంపుగను విభజింపఁ బడెను.

—♦ సముద్రవర్ణనము. ♦—

సీ. దూరపారంబు ర♦క్షోరాజియుక్తంబు, చండనక్రగ్రహ♦సంయుతంబు
క్షణదాదిఘోరంబు ♦కలితఫేనకదంబ,హసితంబు భంగనృ♦త్యాంచితంబు
జైవాతృకోదయ♦సంజృంభితంబును, బ్రతికువలయహిత♦వ్యాకులితము
తిమితిమింగిలసము♦దీర్ణంబు చండమా,రుతమహాగ్రాహభా♦సితము నగుచు
తే. దీప్తభోగభుజంగాళి ♦ తేజు మీఱి, శింశుమారాదితతిచేతఁ ♦ జెలఁగుదానిఁ
బ్రకటశైలయుతంబు దు♦ర్గమపథంబు, సాగరవరంబుఁ గాంచెఁ గీ♦శవ్రజంబు.౧౦౦

అర్థములు. దూరపారము = దూరమైన పారము (గట్టు)గలది - విశాల మైనది, రక్షోరాజియుక్తంబు = రాక్షసులతోఁ గూడినది, కాలకేయనివాత కవచులవంటి వారు నీళ్ళలో దాఁగి యుందురు. ఇప్పుడు ( Submarine) సబ్ మారీన్ = సముద్రములోనుండు నావలలో నుండు వారి వంటివారు; చండనక్రగ్రహసంయుతము= క్రూరములైన మొసళ్ళతోను, లతాకారముగాఁ జుట్టుకొని ' పీడించు' చేయు మత్స్యములతోను గూడినది; గ్రహమే గ్రాహము "గ్రాహోవహారో నక్రస్తుకుంభీర" యని యమరుఁడు. క్షణదా = రాత్రియొక్క - ఆది = ప్రథమ భాగంబున- ననఁగా సాయంకాలంబున వృద్ధిపొందుటచే - ఘోరంబు = భయంకరమైనది; కలితఫేన = పొందఁబడిన నురుగుయొక్క, కదంబ = గుంపుచే - హసితంబు = నవ్వునది- నురుగు తెలుపు - నవ్వు తెలుపని కవిసమయము కావున నురుగు నెపమున సముద్రము నవ్వుచున్న దని భావము - భంగ=అలలచలన మనెడి, నృత్య=ఆటచేత, అంచితంబు= ఒప్పునది - జైవాతృకోదయ = చంద్రోదయముచే - సంజృంభితంబును = విజృంభించునది. అభివృద్ధి నొందునది - ప్రతికువలయహిత వ్యాకులితము = ప్రతిబింబించిన చంద్రునిచే వ్యాకుల పెట్టబడినది. తిమితిమింగిల సముదీర్ణంబు=తిమియను చేఁపలచేతను దానిని మ్రింగు తిమింగిలములచేతను అతిశయించినది. "అస్తి మత్స్యస్తిమిర్నామ శతయోజన మాయతః। తిమింగిలగిలోప్యస్తి తద్గిలోప్యస్తి సాగరే" - అని పురాణవచనము. తిమిని మ్రింగునది తిమింగిలము - దానిని మ్రింగునది తిమింగిలగిలము - చండమారుత మహాగ్రాహ భాసితము = ఝంఝామారుతమువంటి వేగముగల మొసళ్ళచేఁ బ్రకాశించునది, దీప్తభోగభుజంగాళి = రత్నములచేఁ బ్రకాశించు పడగలు గల పాములగుంపులు; తేజు = కాంతి - శింశుమార = సీటికోతి - ఆది = మొదలగువాని - తతిచేత = సమూహముచే, ప్రకటశైలయుతంబు = పెద్దపర్వతములతోఁగూడినది. దుర్గమపథంబు = పోవుటకు సాధ్యముకాని మార్గముకలది.

తా త్ప ర్య ము.

దూరమునందు తీరము గలదియు, రాక్షసులతోను, మొసళ్ళతోను, గ్రాహములతోను గూడినదియు సాయంకాలము వేళ మిగుల భయంకరమైనదియు, నురుగు నెపమున నవ్వునదియు, అలలనెపమున నృత్యము చేయునదియు, చంద్రోదయమున

వృద్ధిపొందునదియు, ప్రతిబింబించిన చంద్రునిచే నిండినదియు, విశేషముగ తిములు తిమింగిలములు గలదియు, తుపానుగాలివలెఁ దిరుగు మొసళ్ళుగలదియు, రత్నములు పడగలందుఁగల పాములచేఁ బ్రకాశించునదియు నీటికోఁతులు గలదియు పెద్దపర్వతము లుండుటచేఁ బోవుటకు మార్గములేనిదియు నైన సముద్రమును వానరులు చూచిరి.

సీ. మొసళులచే భోగ♦విసరంబుచేత వి,గాఢ మై వాతప్ర♦కంప్ర మగుచుఁ
బడుచును లేచుచు ♦ బహుళతరంగము, లధికప్రవృద్ధ మై యమరుదాని
నగ్నిచూర్ణాకీర్ణ ♦ మయినట్లు భాస్వరో, దకము మహోరగ♦తతులు గలిగి
యమరారివిషయ మై ♦ యధికభీకరము నై, పాతాళవిషమమై ♦ వారిదాధ్వ
ఆ. సన్నికాశ మగుచు ♦ సాగర మిది యని,యభ్ర మిది యటంచు ♦ ననఁగరాక
గగన మధ్ధిఁ గలసి ♦ గగనంబునం దబ్ధి, గలసి తారకామ♦ణులను వెలసి. ౧౨౧

అర్థములు. భోగివిసరంబుచేతఁ = పాముల శరీరముల సమూహముచేతఁ; విగాఢమై = ప్రవేశింపఁ బడినదై, వాతప్రకంప్రము = గాలిచేఁ గదలింపఁ బడినది కనుకనే - బహుళతరంగములు=అనేకము లలలు, అధిక ప్రవృద్ధమై = మిగుల పెరిఁగినదై, అగ్నిచూర్ణ+ఆకీర్ణము = నిప్పుల పొడిచే నిండినట్లు - భాస్వరోదకము = భాస్వరమను ద్రవ్యముతోఁ గూడిన నీళ్ళు, ఈ భాస్వరమే ఆంగ్లభాషయందు ఫాస్ఫరస్ (Phosphorous) అందురు. ఇది మెఱయుచుండును. రాత్రులందుఁ జీకటివేళ నలలయందుఁ గానవగు. తీరమందిసుకలోను సన్నని పలుకులు పడి యుండుటయుఁ గలదు. అల లొడ్డునఁ బడి మరల పోవుచోట నుండును. మహోరగతతులు= పెద్ద పాములగుంపులు, అమరారి విషయమై = రాక్షసులకు స్థానమై, అధిక భీకరమునై = మిగుల భయంకరమై, పాతాళవిషమము = పాతాళమువలె విషమము, వారిదాధ్వసన్నికాశము = ఆకాశముతో సమానము, అభ్రము = ఆకాశము, తారకామణులను = నక్షత్రము లను రత్నములచే, రాత్రులందు సముద్రజలము ప్రకాశించుటకుఁ గారణము విష్ణుపురాణమున నిట్లు చెప్పఁబడినది. "ఆతామ్రాహి భవంత్యాపో దివా నక్తంప్రవేశనాత్। దినం విశతి చైవాంభో భాస్కరేఽస్తముపాగతే॥ తస్మాచ్ఛుక్లీభవంత్యాపో నక్తమహ్నః ప్రవేశనాత్. వి-పు-౨-౮-౨౭౪.

తాత్పర్యము.

మొసళ్ళచేతఁ బాముల పడగలచేతఁ బ్రవేశింపఁబడినదై, గాలికిఁ గదలునదియై లేచుచుఁ బడుచునుండు నలలచేత వృద్ధినొందినదై, నిప్పులపొడివలె భాస్వరముతోఁ గలిసిన నీళ్లు - పెద్ద పాములుగలదై, రాక్షసులకు వాసస్థానమై, భయంకరమై, పాతాళమువలె విషమమై - యాకాశముతో సమానమై - యిది యాకాశము ఇది సముద్రమని వేఱుపఱుపరాక యాకాశమున సముద్రము సముద్రమునం దాకాశము కలసి తారక లను మణులు, మణు లను తారకలు కలసినదై.

క. తనరుచు సముత్పతన్ముదిరనికరముల భూరిభంగ♦రాజులచేతన్
గనుఁగొనఁగరాక భేదం, బనయము నొక్కటిగఁ బెనసి♦యరుదగుదానిన్. ౧౦౨

అర్థములు. సముత్పతత్ = క్రిందికి పైకి పోవుచున్న - ముదిర నికరముల= మేఘముల సమూహములచే - ఇది యాకాశమండలిది - భూరిభంగరాజులచేతన్ = గొప్ప యలలచేతను - అనయము = ఎల్లప్పుడు - బెరసి = కలసి - అరుదు=ఆశ్చర్య కరము.

తాత్పర్యము.

ఆకాశమున మేఘములు క్రిందికి పైకి పోవుటచే పడుచు లేచుచున్న యల లతోఁ బోలిక గల దగుటచే నాకాశ సముద్రములకు భేదము చెప్పరాక కలసి యుండుదానిని. అలంకారము మీలితము. సాదృశ్యమువలన భేదమే కానరాక పోయిన మీలితాలంకార మగును.

తే. బెరసి యొండొంటితో వెండి ♦ పెరఁగి యొకటి
నొక్కటి గుభాలునను దాఁకి ♦ యూర్మిపంక్తు
లబ్ధిరాజమహాభేరు♦లట్లు మ్రోయ
నగచరావళి చూచె మ♦హాద్భుతముగ. ౧౦౩

అర్థములు. బెరసి = కలిసి; ఊర్మిపంక్తులు = అలలవరుసలు - అబ్ధిరాజ మహాభేరులట్లు = సముద్రరాజుయొక్క పెద్దనగారాల వలె.

తాత్పర్యము.

అల లొకదానితో నొకటి కలసి పెరఁగి యొకదానితో నొకటి తాఁకి గుభా లున పడఁగా నివి సముద్రరాజు మహాభేరులా యని వానరసేన యాశ్చర్యకరముగ జూచెను.

చ. రయయుతవాత సంకుల త♦రంగక గర్భిత దివ్యరత్నసం
చయజలనాదితంబు జల♦జంతుసమూహసమాకులంబు న
వ్యయమహితానిలోద్ధుత సు♦రాధ్వనటద్భృశభంగముల్ సవి
స్మయమతిఁ జూచె నెల్లకపి♦సంఘము భ్రాంతతరంగనాదముల్. ౧౦४

అర్థములు. రయయుత = వేగముతోఁ గూడిన, వాత = గాలిచే, సంకు లిత = కలఁత పడినది, గనుకనే, తరంగక = అలలచేత, గర్భిత = లోపలికిఁ దీసి కొనఁబడిన, దివ్యరత్నసంచయ = శ్రేష్ఠరత్న సమూహముచేతను, జల = నీటిచేతను, నాదితంబు = ధ్వని గలదిగాఁ జేయఁబడినది, జలజంతు సమూహ = నీటియందుండు జంతువులచే, సమాకులంబు=నిండినది, అవ్యయ=ఎడఁదెగక వీచు, మహిత = గొప్ప దగు, అనిల = గాలిచే, ఉద్ధుత = ఎగురఁ గొట్టఁబడిన, సురాధ్వనటత్ = ఆకాశ మున నటించుచున్న, భృశభంగముల్ = అనేకములగు నలలు గలది, సవిస్మయ

మతిఁ =ఆశ్చర్యముతోఁ గూడిన మనస్సుతో- భ్రాంతతరంగ నాదముఁ = కదలు చున్న అలల ధ్వని గలదానిని.

తా త్ప ర్య ము .

మిగుల వేగముచే వీచు గాలిచేత కలఁత చెందిన యలలయందలి గొప్ప రత్నములు నీళ్ళు నొకదానితో నొకటి కొట్టుకొనఁగాఁ బుట్టిన ధ్వని గలదియు జలజంతువుల గుంపులచే నిండినదియు, విడువక వీచు గొప్ప గాలిచే నెగురఁ గొట్టఁ బడుటచే నాకాశమున నటించు నలలుగలదియు కదలు చున్న యలల ధ్వని గల దియు నగు సముద్రమును ఆశ్చర్యముతో వానరులు చూచిరి.

క. భర మగు నిర్హ్రాదంబును, బొరలి పొరలి వచ్చునలలు ♦ బురుగును గనఁగా
సురద్రావి పొర్లు వెంగలి, కరణి జలధి తోఁచెఁ గీశ♦కాండంబునకున్. ౧౦౫

అర్థములు. భరమగు = అతిశయించిన, నిర్హ్రాదంబును = ధ్వనియును, బురుగు = నురుగు - జొల్లు, సుర = కల్లు, వెంగలి = అవివేకి.

తా త్ప ర్య ము .

విస్తార ధ్వనియు, పొరలి పొరలి వచ్చుటయు బురుగును గల సముద్రమును జూడఁగా కల్లుద్రావి కేకలు పెట్టుచు నేలఁబడి దేహము తెలియక పొర్లుచు నోట జొల్లు కార్చుచున్న మూఢుని వలె వానర సమూహమునకుఁ గానవచ్చెను.

——♦ ౫-వ సర్గము. శ్రీరాముఁడు సీతం దలంచి దుఃఖించుట. ♦——

క. పాలకయుతహరివాహిని, నీలుఁడు సింధూత్తరమున ♦ నెఱి విడిసెను శా
స్త్రోలపితరీతి నల్దెస, మాలక చరియించి కాప ♦ మైందద్వివిదుల్. ౧౦౬

అర్థములు. పాలకయుత = రక్షకులతోఁ గూడిన, హరివాహిని = వానర సేన, సింధు+ఉత్తరమునన్ = సముద్రముయొక్క యుత్తర తీరమున, నెఱిన్ =క్రమముగా, విడిసెన్ = విడియునట్లు చేసెను, అంతర్భావిత ణిజంతము, దించెను, శాస్త్రోలపితరీతిన్ = శాస్త్రమునందుఁ జెప్పఁబడిన విధముగ, నల్దెస = నాలుగు దిక్కులందు, మాలక = వదలక.

తా త్ప ర్య ము .

రక్షకులు గల వానరసేనను సముద్రము యొక్క యుత్తర తీరమున నలుఁడు దించెను. శాస్త్ర ప్రకారము మైందద్వివిదులు ప్రాలుమాలక నాలుగు ప్రక్కలఁ దిరిగి కాచుచుండిరి.

క. కడలిదరి యుక్తపద్ధతి, విడియఁగ సేనలును రామ♦విభుఁడు భృశార్తిన్
మిడుకుచుఁ దనకెలన వసించెడి లక్ష్మణుఁ జూచి యనియెఁ ♦ జిత్తం బెరియన్.

అర్థములు. శరణ్యునం దుండవలసిన కృతజ్ఞత, మిత్రుల ననుసరించుట, కార్యములను విమర్శించుట, మహోత్సాహము, మొదలగు గుణములు శ్రీరామ చంద్రమూర్తియందుఁ గల వని యింతవఱకుఁ దెలుపఁ బడెను. అన్ని గుణములలోఁ

బ్రిధానమైన గుణము దయ. అది రామచంద్రునందు విశేషించి కలదని యీ సర్గమునందుఁ జెప్పబడుచున్నది. పరుల దుఃఖము తన దుఃఖముగా నెంచి తపించుట దయ యనఁబడును. సీతాదేవి దుఃఖమును దలంచి రామచంద్రమూర్తి దుఃఖించుట యిందుఁ జెప్పఁబడును.

కడలి దరిన్ = సముద్ర తీరమున, యుక్త పద్ధతిన్ = యోగ్యమైన విధముగ, భృశార్తిన్ = అధిక వ్యధచే, తనకెలనన్ = తన ప్రక్కన, ఎరియన్ = మండుచుండఁగా.

తాత్పర్యము.

సముద్ర తీరమున సేన లన్నియు నే యే సేన యే యే చోట దిగవలయునో యా ప్రకారము దిగిన పిమ్మట రామచంద్రమూర్తి యీ సముద్రమునకావలియొడ్డునందే కదా సీతాదేవి దుఃఖించుచున్న దని యామెపడు దుఃఖములను హనుమంతుఁడు చెప్పినవి జ్ఞప్తికిరాఁగా మిగుల వ్యధచే దుఃఖపడుచుఁ దలఁచుకొలఁది హృదయము మండుచుండఁ దన ప్రక్కను నున్న లక్ష్మణుఁజూచి యిట్లనెను.

క. లోకమున నాఁడునాఁటికి, శోకంబు క్షయించుచుండుఁ ♦ జుమ్మీ యెందున్
నా కన్ననో నానాఁటికి, శ్శోకన్యక లేమి వనట ♦ మఱి మఱి పెరిఁగెన్. ౧౦౬

తాత్పర్యము.

లక్ష్మణా! లోకములో సాధారణముగా సందఱయందు దుఃఖము కాలక్రమముగ క్షయించును - మొదట నున్న దుఃఖము తరువాతఁ గొన్నిదినముల కుండదు. ఇది లోకసామాన్య విషయము. నాకో సీతను విడిచిన దుఃఖము నానాఁటికిఁ బెరుగుచున్నది కాని తగ్గుటలేదు.

లోకమున నెవరును బరులకై దుఃఖించువారు లేరు. తమ ప్రియపదార్థ వియోగమునఁ దమకుఁ గలిగిన సుఖనష్టికై కష్టమునకై దుఃఖింతురు. రామచంద్రమూర్తి యం దట్టి దుఃఖమున కెడములేదు. 'నానవాప్త మవాప్తవ్య' మ్మనునట్లు ఆయన సుఖసంతోషముల కన్యులపై నాధారపడియుండువాఁడు కాఁడు. కావున 'మిథిలాయాం ప్రదీప్తాయాం న మే కించి త్ప్రదహ్యతే' యన్నట్లు లేదిపోయినను దనది పోయినట్లు దుఃఖింపఁడు. బిడ్డల దుఃఖమునకై తల్లిదండ్రులు తపించునట్లు తన యాశ్రితుల దుఃఖమునకై తాను తపించును.

తే. లేదు వగపు కాంత ♦ నాదవ్వ చనె నని, లేదు వగపు ముచ్చి♦లింపఁ బడుట
కంబుజాతనేత్ర ♦ కరుగు చున్నది గదా, వయసు టంచు నాత్మ ♦ వగచువాఁడ.

తాత్పర్యము.

నాకుఁ బ్రియురాలగు సీత మిగుల దూరము నం దున్నదికదా యని నేను దుఃఖింపను. రావణుఁ డామెను దొంగిలించికొనిపోయెనే యని నేను వగవలేదు. కమలములవంటి కన్నులుగల సీతాదేవి నా యొద్ద నున్నప్పు డెంతో సంతోషించుచుండెను. అట్టి సంతోషము నిప్పు డామెకు లేక కాలమంతయు వ్యర్థమై పోవుచున్నది

గదా యని దుఃఖించెదను. నా తోడ నుండుటయే యామెకు మహానందము. నా వలన నామె సంతోషించు చున్నది కదా యని నేను సంతోషించు చుంటిని. అట్టి దానికి విఘ్నము కలిగించితిని గదా యని దుఃఖించెదను. ఇట్లు చెప్పుటచే రామచంద్రమూర్తి కాముకుఁడై దుఃఖింప లేదని యేర్పడు చున్నది. వయస్సు పోవుచున్న దనుటచే ముసలితనము వచ్చుచున్న దని యర్థము. నిత్య యౌవనవతికి వార్ధక మెక్కడిది.

శా. పొమ్మీ మారుత! సీత యున్న యెడకుం ♦ బూఁబోణి స్పర్శింపుమీ
రమ్మీ నన్ను స్పృశింపుమీ మఱల, సా♦రంగాంకుమార్గమ్మునన్
గొమ్మం జూచెద, నట్లు నీ వలన నా♦కున్ జానకీకోమలాం
గమ్మం దాఁకిన యట్టులౌఁ, గలదె భాగ్యం బంత నా కక్కటా? ౧౧౦

అర్థములు. స్పర్శింపుమీ = తాఁకుమా.

తాత్పర్యము.

వాయుదేవా! నీవు సీతాదేవి యున్న చోటికిఁ బోయి యామెను దాఁకుము. దాని వలన నిది రామచంద్రుని స్పృశించిన గాలి కదా యని నా యొద్దనుండి వచ్చిన హనుమంతుని జూచి సంతోషించినట్లు ఆయన తండ్రి వగు నిన్నుఁ జూచియు సంతోషించును. అట్టులామెను దాఁకి సంతోషింపఁ జేసి మరలవచ్చి నన్ను దాఁకితి వేని నేను సంతోషించెదను. అప్పుడు నేను జానకిని దాఁకినవాఁడనగుదును. ఇట్టులే జానకిని నేను జూచుచున్నాఁడను. జానకి చంద్రుని జూచుచున్నది. ఆమె దృష్టులు చంద్రుని యందుఁ బడినవి. నాదృష్టులు చంద్రునియందుఁ బడినవి. ఇరువుర దృష్టులు చంద్రునందుఁ గలసికొనెను. కావున నే నామెను ఆమె నన్నుఁ జూచినట్లయ్యెను. అట్టులే నీ మూలమున మేమొకరి నొకరు స్పృశించినవార మగుదుము. అయ్యో నాకంత యదృష్టము కూడఁగలదా?

ఉ. రావణుచేతఁ జిక్కువడి ♦ రాజముఖీమణి నన్నుఁ గూర్చి "హా
జీవితవల్లభా!"యని వ♦చించిన యా ర్తివిలాపయుక్త మా
నా వచనంబులన్ మనము ♦ నంటుఁ దలంపఁ దలంపఁగా నశే
షావయవంబులున్ విషము ♦ నానిన యట్టులు గ్రాఁగఁ జొచ్చెడిన్. ౧౧౧

అర్థములు. అశేషావయవంబులు = దేహమాద్యంతము - మనస్సు మాత్రమేకాదు - దేహముకూడ.

తాత్పర్యము.

రావణుచేతఁ జిక్కుకొని చంద్రముఖి సీత ప్రాణేశ్వరా యని దుఃఖముతో నేడ్చుచు నఱచిన యా మాట నేను తలఁపఁగాఁ దలఁపఁగా విషము ద్రాగినట్టులు బాహ్యేంద్రియములను నంతరింద్రియములను గూడ దహించుచు నున్నది.

దుశ్శాసనుఁడు చీర లొలుచు నపుడు ద్రౌపది "హా కృష్ణ ద్వారకావాసిన్ క్వాసి యాదవనందన, ఇమాం మవస్థాం సంప్రాప్తాం కిమనాథా ముపేక్షసే? శంఖచక్ర గదాపాణే ద్వారకానిలయాచ్యుత, గోవింద పుండరీకాక్ష రక్ష మాం శరణాగతామ్॥ అని గోవిందా యని పిలిచెను.

శరణాగతురా లయిన ద్రౌపది యాపత్కాలమం దఱచిన గోవిందా యనుమాట కృష్ణుని బదుమూఁడు సంవత్సరములు బాధించెను. ఈ విషయము పదునాలుగవ సంవత్సరమున రాయబారము పోవుటకు ముందు కృష్ణమూర్తి పాండవులతో 'గోవిందేతి యదాక్రందత్ । కృష్ణా మాం దూరవాసినమ్। ఋణం ప్రవృద్ధ మివ మే । హృదయా న్నాపసర్పతి" యని చెప్పెను. ధర్మరాజా! నీవు రాజ్యమునకై యుద్ధము చేయుదువు గాక, చేయకుందువుగాక! దూరముగా నుండు నన్ను ద్రౌపది గోవిందాయని పిలిచెను. అప్పుడు నేను దూరమున నున్నవాఁడ నగుటచే నా దుష్టుల నేమియుఁ జేయఁజాల నైతిని - ఆ మాట నా హృదయమునుండి తొలఁగిపోక ఋణము దినదినము వడ్డితోఁ బెరిఁగినట్లు పెరుగుచున్నది. ఆ యప్పు నేను దీర్చుకొనవలసియున్నది సుమా యని చెప్పెను. కావున భక్తుల యాక్రందనధ్వని విని భగవంతుఁడు వారి కష్టము దీర్చు వఱకు మిగులఁ బరితాప పడుచుండును.

సీతకు వయస్సుపోయి వార్ధకము వచ్చుచున్నది. నే నా పయ స్సనుభవింపక పోతినే యని రాముఁ డేడ్చె ననుట సరిగాదు. అగ్ని ని శీతో భవ యన్నట్లు రావణుని హతోభవ (చావుము) అని భస్మము చేయఁగలిగియు నా రక్షణసామర్థ్యము విశ్వసించి తన పారతంత్ర్యమునకు హాని వచ్చునే, నా కపకీర్తి వచ్చునే యని నా నిమిత్తమై దుఃఖించు చున్నది కదా, నే నేమియుఁ జేయఁ జాలకున్నానే యని దుఃఖించెదను, అని రామ హృదయము.

క. చింతాజ్వాలాయుతము ని,తాంతవియోగేంధనప్ర•తానేధిత మా
కంతుజ్వలనము రేవగ, లెంతయు నా దేహముఁ ద•హించెడి వత్సా! ౧౧౩

అర్థములు. చింతాజ్వాలాయుతము = చింత యనెడి శిఖలతోఁ గూడినది, నితాంత = తీవ్రమైన, వియోగ = వేఱుపాటనెడి, ఇంధన = కట్టెలయొక్క, ప్రతాన = సమూహములచే, ఏధితము = వృద్ధి పొందింపఁబడినది, కంతుజ్వలనము = మన్మథాగ్ని, రే వగలు = రాత్రి పగలు, ఇది సమాహారద్వంద్వము, ఏకవచనము, సర్వవేళల నని యర్థము. ద్వంద్వమున పకారము వకార మయ్యెను. వత్సా = నాయనా!

## తా త్ప ర్య ము .

నాయనా! చింత యనెడు జ్వాలలు గలదై వేఱుపాటనెడి కట్టెల ప్రోవుచేఁ బెరిఁగిన మన్మథాగ్ని సర్వవేళల నన్ను మిక్కిలి కాల్చుచున్నది.

చిత, చింత యను రెంటిలో చింతయే గొప్పది. చిత చచ్చినవానిఁ గాల్చును. చింత బ్రదికినవానిఁ గాల్చును.

**తే.** నిన్ను విడనాడి లక్ష్మణా! ♦ నీరనిధిని, నేను మునిఁగి సుఖంబుగా ♦ నిద్దురింతు
నారములలోన శయనించు♦న న్నదెట్లు, నీరజేషుఁడు దహియింప♦ నేర్చువాఁడు.

అర్థములు. నారములలోన = నీళ్ళలో, "నారము లనఁగా జలములు" భార. నీరజేషుఁడు = నీళ్ళలోఁబుట్టిన కమలము బాణముగాఁ గలవాఁడు, మన్మథుఁడు.

తా త్ప ర్య ము.

నిన్నుఁజూచిన నాకు సీతయు జ్ఞప్తికి వచ్చును. మీరిద్దఱు నన్ను విడువకయుండు వారుగదా. కావున నిన్నుఁగూడ వదలి నేను సముద్రమున హాయిగా నిద్దురపోదును. నిద్దురపోవువానిని దుఃఖ మేమి చేయఁగలదు. నీళ్ళలో నిద్దురపోవు నన్ను నీళ్ళలోఁ బుట్టిన కమలము బాణముగాఁ గలవాఁ డెట్లుబాధింపఁగలఁడు. నీళ్ళమీఁదఁ గమలముతో దెబ్బ గొట్టిన నీళ్ళలో నుండువానికి నొప్పికలుగునా? సముద్రమునందు నేను సుఖముగ శయనింతు నని రామచంద్రమూర్తి మనుష్యభావమునఁ జెప్పినను ఆత్మహత్య చేసి కొనెద నని చెప్పినట్లు. అది ధీరోదాత్తుని లక్షణముగాదు. కావున నా యర్థము పొసఁ గదు. లక్ష్మీనారాయణు లిరువురు శేషునిపైఁ బవళించువారే. ఒకరు లేకపోయి నపుడు రెండవవారికి నా సుఖశయ్య యేల? కావున ఆదిశేషుఁడవగు నిన్నుఁగూడ వదలి ప్రళయావస్థయందు వలె నీటఁబండుకొని యోగనిద్ర పోయెదను. అప్పుడు మన్మథున కుత్పత్తియే లేదు. కావున నన్నతఁ డేమియుఁ జేయఁజాలఁడు అని భావము. ఇట్లు లక్ష్మణుని యాదిశేషత్వము తన నారాయణత్వము సూచించెను.

**క.** అక్కమలాక్షియు నేనును, నొక్కవసుంధరనె నిలిచి ♦ యుండుటచే నే
నెక్కరణినో మనఁ గల్గితి, గ్రక్కున నప్పొలతిఁ జూడఁ ♦ గల్గునె నాకున్. ౧౦౪

అర్థములు. వసుంధరనె = భూమిమీఁదనె - మనఁగలిగితిన్ = బ్రతుకఁ గలిగితిని.

తా త్ప ర్య ము.

లక్ష్మణా! సీతను విడిచి నేను బ్రదుకుటకుఁ గారణములు రెండు గలవు. ఒక టానుపుమీఁద నిద్దఱ మున్నట్టు లొకభూమి యందే యిరువుర మున్నవారము - రెండవది సీత జీవించియున్నదని హనుమంతుఁడు చెప్పెను. కావున నేనును జీవింపఁ గలిగితిని. కాని యామెను నేను జూడఁగలనా?

ఒకవసుంధరనె యనుటచే నిరువుర మొక భూలోక మందే యున్నవార మగు టచే సాంగత్యము కలదు. కావున నెట్లెట్లో బ్రదికితిని. అటుగాక యొక రొకలోకమున మఱియొకరు వేఱొకలోకమున నుండఁగలిగెనేని మేము బ్రదుకఁ జాలము. నిన్ను విడిచి నేను సీతయు నిమిషమైన బ్రదుకఁ జాల మని నీవే చెప్పితివిగదా. వాస్తవార్థ

మున జీవ ప్రకృతి మయ మగు నీ లీలావిభూతి ప్రపంచము లేకుండిన భగవంతుఁ డుండియు లేనివాఁడే. ప్రాగవస్థయం దాయనను దలఁచువాఁ డెవ్వఁడు ?

క. ఆవారి జలము గల మడి, క్రేవలఁ దడిలేనిపొలము ♦ క్ష్మాయూటవలెఁ

బావని మని యున్నది యని, నే వినుటను బ్రదుకుఁ గంటి ♦ నిర్మలచరితా. ౧౧౫

అర్థములు. ఆవారి = దండిగ, క్రేవలన్ = ప్రక్కలందు, తడి = చెమ్మ, క్ష్మాయూటవలెన్ = భూమిలోని యూట తడివలె.

తా త్ప ర్య ము .

సీతాదేవి బ్రదికి యున్నదని హనుమంతుఁడు చెప్పుటచే నేను బ్రదికి యున్నాను. బ్రదికి యుండఁగానే యేమి ? ఆమె యెక్కడ, నే నెక్కడ. నీవు బ్రదుకుట కామె యెట్లు కారణము కాఁగలదు. నబ్బులో నీ వుండిన భూమిమీఁదఁ బైరు పండునా యందువేమో, అట్లు గాదు. మే మిరువుర మొక భూమియందే యున్నారము. ఒక నదిమడి నిండ నీ ళ్లుండెనేని యా నీళ్లు ప్రక్క భూములపైఁ బాఱకుండినను భూమిలోని యూటచే నవియు దడిగల వగుచున్నవి గదా. అట్లులే యామె బ్రదికియున్న దను వార్త విని నేను బ్రదికి యున్నవాఁడను.

ఉ. ఎన్నఁడు గాంచువాఁడనో యు♦హీనవిరోధులఁ జంపి నిస్తులా

భ్యున్నతి నొందు లక్ష్మివలె ♦ నుగ్మలి నీరజపత్రనేత్ర, నే

నెన్నఁడొ గాంచఁబడ్డయతఁ ♦ డిష్టరసాయన మాను భంగి నా

యన్న ముఖాబ్జ మెత్తి యధ♦రామృత మానుదు నాశ దీరఁగన్. ౧౧౬

అర్థములు. అహీన విరోధులన్ = బలమున గొప్పవారగు శత్రువులను, నిస్తుల = అసమానమైన, అభ్యున్నతి = మేలు, అభివృద్ధి, ఇష్ట రసాయనము = ఇంపైన శరీర పుష్టికరమైన యౌషధము, ఆనుభంగిన్ = త్రాగుటవలె. అన్న = స్త్రీ, ఉగ్మలి = స్త్రీ - సీత.

తా త్ప ర్య ము .

బలవంతులైన పగవారిఁ జంపి మిగుల నభివృద్ధిచెందు లక్ష్మివలె నే నెన్నఁడు సీతాదేవిని జూతునో కదా - మిక్కిలి బడలినవాఁడు దేహపుష్టికరమై యింపైన రసాయనమును ద్రావినట్లు నే నెన్నఁడు సీతాదేవి యధరామృతమును నాశ దీరఁ బానము సేయుదునో—

యజ్జరా వ్యాధి విధ్వంసి భేషజం, తద్రసాయనమ్. బాహటుఁడు

నీరసానాంహి ధాతూనాం, లాభోపాయో రసాయనమ్ - వైద్యకము.

జ్వరాది సంబంధములై దేహమును నిస్సారముగఁ జేయు వ్యాధులను ధ్వంసము చేయునది రసాయనము.

క. బలిసిన యిఱిసిన తాళీ, ఫలములతో నెనయుచున్న ♦ పద్మాక్షికుచం

బులు న న్నెన్నఁడొ కౌఁగిట, నలరించెడివేళఁ గంప♦మందెడి నయ్యో. ౧౧౭

అర్థములు. ఇఱికిన=ఒకదానితో నొకటి రాచుకొనుచున్న, తాళీఫలములతో= తాటిపండ్లతో; బలిసిన, యిఱికిన, ఎనయుచున్న యను విశేషణంబులు కుచంబు లను పదముతో నన్వయించును. ఇచట తాళీఫలములతో నను వ్యవధానము గలదు. కొన్ని యెడల విశేషణోభయపదంబులు త్రికక్రియాజన్య విశేషణ ఘటితంబులు సందర్భ యోగ్య పదవ్యవహితంబు లగు. ప్రౌ. వ్యా. సమా-౧౮- "కం-చిక్కని చక్కని నున్నని, సుక్కని త్రోలూడ్వఁబడని ఛుల్లి సెగలచే నొక్కఁబడని దండంబులు తక్కక యుపనయనవేళఁ దాల్పఁగ వలయున్॥ విజ్ఞా - ఆచార- "కం-మొగి విరిసి కఱకు గూడక, పగులక వెడలుపును నిడుపుఁ బసిమియుఁ గల లేఁజిగురు దరఁటాకులు పెట్టిరి, దిగదిగ నద్దేవి యాజ్ఞ దివ్యపురంధ్రుల్॥ భీమ- ౨-౧-౨౮

తాత్పర్యము.

బలుపుగలట్టియు - నొకదానితో నొకటి రాచు కొనుచున్నట్టియు - తాటి పండులఁ బోలియున్నట్టియు సీతాదేవి స్తనములు నేను గౌఁగిలించు నపుడు చలింపఁ గలవు.

క. నన్నుం బ్రాణేశ్వరుఁగాఁ, గొన్న సతీమణి యరాళకుంతల సోఁకుం
గన్నెలనడుమ ననాథవలె న్నవసెడిఁ గాచు దిక్కు లే కెడపడుచున్. ౧౧౮

అర్థములు. అరాళకుంతల = వంకరగా నుండు వెండ్రుకలు గలది, సోఁకుంగన్నెల = రాక్షసస్త్రీల, అనాథవలె = దిక్కులేని దానివలె, నవసెడిన్ = కృశించు చున్నది, ఎడపడుచున్ = భయపడుచు.

తాత్పర్యము.

నన్ను, మూఁడు లోకముల వారిని గావఁగల నన్ను తన ప్రాణేశ్వరుఁగాఁ గొనియుఁ బతివ్రతారత్నమయి వంకర వెండ్రుకల సీత రాక్షస స్త్రీల నడుమ దిక్కులేని దానివలె రక్షించువారు లేక భయపడి కృశించు చున్నది గదా.

క. జనకునిసుత యఁట దశరథ, జనపతికోడ లఁట నాదు సతి యఁట రక్షో
వనితాజనతామధ్యము,నను నిద్దుర నెట్లు గొనెడి నవలామిహిరయున్. ౧౧౯

అర్థములు. రక్షోవనితా జనతా మధ్యమునన్ = రాక్షస స్త్రీ సమూహముల నడుమ, నవలామిహిర = స్త్రీల యందు శ్రేష్ఠురాలు.

తాత్పర్యము.

తండ్రియా జనకమహారాజఁట. మామగారా దశరథమహారాజఁట. భర్తయా నేనఁట. ఇట్టి యుత్తమ స్త్రీ రాక్షస స్త్రీల నడుమ నెట్లు నిద్రింపఁ గలదు.

క. గారేతరనీరదతతి,దారితముగఁ దోఁచు శారదవిధుకల యనన్
గ్రూరాసురులన్ సతి ధిక్కారించియు వెలికి రాఁగఁ గలుగుట యెప్పుడో.

అర్థములు. గారేతర = నల్లని; నీరదతతి = మేఘసమూహము, దారితముగన్ = చీల్పఁబడినదిగ, శారదవిధుకల = శరత్కాల చంద్రరేఖ.

తా త్ప ర్య ము .

నల్లని మబ్బులఁ జీల్చుకొని వెలికిఁ గానవచ్చు చంద్రరేఖవలెఁ గ్రూరరాక్షసుల ధిక్కరించి యెప్పుడు బయట రాఁగలదో.

చ. తరళమృగాక్షి నైజముగఁ ♦ దాను కృశాంగియు, యందు నిప్పు దు
ర్భరబహుళార్తిచేతను, వి♦పర్యయ మాటను దేశకాలముల్,
కర ముపవాసముం బడుటఁ ♦ గాంత మ తెంత కృశించెనో కదా
హరిహయవైరిఁ ద్రుంచి ముద♦మార ధరాసుతఁ దెచ్చు టెన్నఁడో. ౧౨౧

అర్థములు. తరళమృగాక్షి = చలించు జింక కన్నులవంటి కన్నులు గలది, నైజముగన్ = స్వభావముచేతనే, కృశాంగియు = శుష్కించిన దేహము గలది, దుర్భర = భరింపరాని, బహుళార్తిచేతన్ = విస్తార దుఃఖముచేతను, విపర్యయము= తాఱుమాఱు, హరిహయవైరిన్ = ఇంద్ర శత్రువు రావణుని.

తా త్ప ర్య ము .

చలించుచున్న జింక కన్నులవంటి కన్నులుగల సీతాదేవి స్వభావముచేతనే సన్నని దేహముగలది, ఇఁక నిప్పుడో సహింపరాని దుఃఖాతిశయముచేత, దేశము కాలము తాఱుమాఱగుటచేత, ఆహారము లేమిచేత నెంత శుష్కించినదో కదా. రావణాసురునిఁ జంపి నే నెన్నఁడు సీతను సంతోషముతోఁ దేఁ గలనో.

తే. దేవతాకన్యఁ బోలు నా♦దేవి సీత
పరమసాధ్వీమచర్చిక ♦ పరమశాంతిని
నెప్పుడో కదె యాకంఠ ♦ మెలమిఁ గ్రుచ్చి
వితతమోదాశ్రువులఁ దాను ♦ విడువఁగలదు. ౧౨౨

అర్థములు. ఆకంఠ మెలమిఁ గ్రుచ్చి=సంతోషముతోఁ గంఠము వఱకుఁ గౌఁగిలించి, ఇట్టి కౌఁగిలింతకు స్పృష్టక మని పేరు. "యద్యోషిత స్సమ్ముఖ మాగతాయా । అన్యాపదేశాత్ వ్రజతో నరస్య । గాత్రేణ గాత్రం ఘటతే తదేత దాలింగనం స్పృష్టక మాహు రార్యాః॥ యత్కుర్వతే వక్షసి వల్లభస్య, స్తనాభిఘాతా న్నిబిడోపగూఢాః। పరిశ్రమార్థం శనకై ర్విదగ్ధా స్తత్కంఠసూత్రం ప్రవదంతి సంతః॥ ఉరసి కమితు రుచ్చై రావిశంతీ వరాంగీ స్తనయుగ ముపధత్తే చేత్తనాలింగనం తత్॥ కంఠసూత్రి స్తనాలింగనములు పర్యాయ నామములు.

తా త్ప ర్య ము .

దేవతాస్త్రీ వంటిదై పరమ పతివ్రతలలో శ్రేష్ఠురాలైన నా దేవి సీత గొప్ప మనస్సుతో నెప్పుడు నా మెడఁ గ్రుచ్చి కౌఁగిలించి యానందబాష్పములు విడువఁ గలదు.

పరమ సాధ్వీమచర్చిక = ఉత్తమ పతివ్రతలందు శ్రేష్ఠురాలు, "మతల్లికా మచర్చికా ప్రకాండ ముద్ఘ తల్లజౌ । ప్రశస్తవాచకా న్యమూని" అమరుడు.

క. నాసతిఁ దరుణీరత్నము, భూసుత నెడఁబాయఁ బెరుఁగు♦భూరివ్యథ నే
మాసినవస్త్రముమాడ్కిని, బాసి సుఖము పడఁగఁగలుగు♦భాగ్యం బెపుడో. ౧౧౩

తా త్ప ర్య ము .

నా భార్యను స్త్రీ రత్నమును భూపుత్రిని సీతను విడనాడుటచేఁ గలిగిన దుఃఖము నే నెన్నఁడు మాసిన గుడ్డను వదలినట్లు వదలి సుఖింపఁ గలనో.

తమ్మునితోనైనను నిటువంటి మాటలు చెప్పవచ్చునా? లక్ష్మణుఁడు సర్వ విధముల సేవకుఁడే యగుటచేఁ జెప్పఁబడెను. అటు కాని యెడల ననుచితమే. గోవింద. సుందరకాండమందు సీతాదేవి తన స్తనములను గుఱించి హనుమంతునితోఁ బ్రస్తావించెను. పరపురుషులతో మాట్లాడునపుడు స్త్రీలు తమ స్తనముల ముచ్చట తేరాదు. అట్లుండియు హనుమంతుఁడు తమ మర్మమెఱింగి నచ్చిన బంటు కావున సర్వవిధ సేవకుఁ డను భావముతో బిడ్డతోఁ జెప్పుకొన్నట్లు చెప్పుకొనెను.

చ. అని విలపించుచుండఁగ ది♦నాంతమునం గను మందరశ్మియై
దినకరుఁ డస్తమించుటయు ♦ దీనత పాయ నచించి లక్ష్మణుం
డనునయసూక్తిఁ దేర్చుటయు ♦ నంబుజలోచన సంస్మరించుచున్
వనట మునుంగుచున్ నృపతి♦వర్యుఁడు సంధ్య యుజించె భక్తిమై. ౧౧౪

అర్థములు - దినాంతమునన్ = సాయంకాలమున, మందరశ్మియై = వేఁడిమిలేని కిరణములు గలవాఁడై, సంస్మరించుచున్ = స్మరించుటచేత; హేత్వర్థక శతృప్రత్యయము.

తా త్ప ర్య ము .

ఈ ప్రకారము శోకించు చుండఁగా సాయంకాలమై సూర్యుఁ డస్తమింపఁగా నా వ్యసనము పోవునట్లు లక్ష్మణుఁడు సమాధాన వాక్యములు చెప్పి సరిచేయఁగా సీతను స్మరించుచు దుఃఖపడుచు రామచంద్రుఁడు సంధ్య వార్చెను.

ఈ దినము పాడ్యమి. సూర్యాస్తమయ మైనట్లు లిచ్చటఁ జెప్పఁబడెను. చంద్రోదయము ౧౦౦ వ పద్యమందుఁ జెప్పఁబడెను. కావున నేఁడు శ్రీరామచంద్రమూర్తి గౌణకాలమున సంధ్య వార్చె నని యేర్పడుచున్నది.

—♦ ౬-వ సర్గము. రావణుఁడు మంత్రులతో నాలోచించుట. ♦—

ఉ. అక్కడ రావణుండు, త్రిద♦శాధిపతుల్యుఁడు మారుతాత్మజుం
డొక్కటి లంకలోన ఘటి♦యించిన ఘోరము భీతిదంబు నా
నక్కృతి నెంచి రాక్షసన♦భాంతరసీమను సిగ్గు దోఁపఁగా
నుక్కటి నేలఁ జూచు చసు♦రోత్తమ పీరులతోడ నిట్లనున్. ౧౧౫

ఇచ్చట శ్రీరామాదులు సముద్రముదాఁటు నుపాయ మాలోచించు చున్నారని చెప్పి విడిచి యీ మూఁడు దినములలో లంకలో జరిగిన వృత్తాంతము చెప్పఁ గవి యారంభించెను. హనుమంతుఁడు లంక విడిచిన నాఁటి వృత్తాంతము చెప్పబడుచున్నది.

అర్థములు. అక్కడ = లంకాపురమునందు, త్రిదశాధిపతుల్యుఁడు–ఇంద్రునితో సమానుఁడు, ఎక్కటి = అసహాయుఁడై, ఒంటరిగాఁడై, ఏకశబ్దభవము, అక్కృతి = ఆ కార్యము, సీతాదర్శన, రాక్షసవధ, లంకాదహనాది కార్యములు. ఉక్కు + అఱి = బలగర్వము దిగినవాఁడై, సిగ్గు = లజ్జ, "మనస్సంకోచనం లజ్జా హ్యానౌచిత్య ప్రవర్తనాత్" అనుచితకార్యము చేసినపుడు కలుగు మనస్సంకోచము లజ్జ యనఁబడును. త్రిదశాధిపతుల్యుఁ డనుటచే, ఇంద్రుఁడు చేయఁదగినంత కార్యము చేసినవాఁ డని యర్థము. ఇది మారుతాత్మజ పదమునకు విశేషణము.

తా త్ప ర్య ము .

లంకలో రావణుఁ డింద్రసమానుఁడైన హనుమంతుఁ డొక్కఁడే చేసిన చూడ నసాధ్యమై భయంకరమైన రాక్షసవధ లంకాదహనాది కార్యములు తలఁచి రాక్షసుల సభయందు బలగర్వము క్షీయించినవాఁడై సిగ్గుపడుచు నేలఁ జూచుచు రాక్షస వీరులతోడ నిట్లనెను. హనుమంతుఁడు నిలువఁబడి యుద్ధము చేసినపుడు రాక్షస సేనలఁ జంపఁగలిగెను. లంకాదహనకాలమున హనుమంతుఁడు మిద్దెల మీఁదఁ బరువు లెత్తుచు నిండ్లలో దొడ్లలోఁ దూఱి కొంపలు తగులఁబెట్టి వాయు వేగమునఁ దిరుగువానిఁ దన కొంప దగులఁబెట్టినను నేమియుఁ జేయఁజాలక పోయెను. తన యిల్లు తాను గాపాడుకొన లేనివాఁడు లంకాపుర మంతయు నేమి కాపాడఁ గలఁడు? ఒక్కని నివారింప లేనివాఁడు పెక్కురు వానరులు వచ్చిన నేమి నివారింపఁ గలఁడు? ఇది బలహీనతను దెలుపును గావున నవమానకరము.

ఉ. వానరమాత్రుఁ డొక్కరుఁడు ♦ వాలినశక్తిఁ జొరంగరాని లం
కానగరంబుఁ జొచ్చి ననుఁ ♦ గానునకుం గొన కా ధరాసుతన్
గానఁగఁ బోయి పెద్దవని ♦ గల్గిన గోపుర మూర్వి( గూల్చి ర
క్షోనిచయంబుఁ జంపి పురి ♦ ఘోరవిధిన్ దహియించె నుగ్రుఁడై. ౧౨౬

అర్థములు. వాలిన = అతిశయించిన, కొనక = లక్ష్యముసేయక.

తా త్ప ర్య ము .

సామాన్యపుఁ గోఁతి (కోఁతి రూపు ధరించిన దేవతలు గారు) యొక్కఁడు (పెక్కుమంది గారు) మనవలె నాయుధములు ధరించినవాఁడును గాఁడు. అతిశయించిన శక్తిచేత నెట్టి వారికిని బ్రవేశింప సాధ్యపడని లంకాపురముఁ బ్రవేశించి కానునకుఁ గల విలువయైన నాయం దున్న దని తలంపక నన్నుఁ దృణముకంటె నీచముగా నెంచి నా యింటిలోఁ బ్రవేశించి సీతను జూడఁబోయి పెద్దగవనిగోపురము విఱుగఁదన్ని నేలఁ ద్రోచి రాక్షసులఁ జంపి పట్టణమును బీభత్సముగఁ గాల్చెను.

ఉ. ఏమి యొనర్చువాఁడ? నిఁక ♦ నెయ్యది మార్గము? మీకు నాకు మే
లేమి విధంబునం గలుగు? ♦ నేమి యొనర్చిన నెల్లఁ జక్కనౌ?

రాము నెడాటమం దెటులు ♦ గ్రాలిన మే లొనగూడుఁ? జెప్పుఁడా
మీ మతముల్, జయాస్పదము ♦ మేలి సుమంత్రము యందు రార్యులుల్. ౧౨౮

అర్థములు. రాము నెడాటమందు = రాముని విషయమున.

తాత్పర్యము.

అయిన దేమో యైనది. దానికి వగచి ఫలములేదుకదా. ఇఁక జరగవలసిన కార్యము చెప్పుఁడు. నేనేమి చేయవలయును? నే నేమి చేసిన నాకు మీకు మేలు గలుగును? ఏమి చేసితిమేని యంతయుఁ జక్కఁబడును. రాముని విషయ మం దేమి చేసిన మనకు మేలుగలదు? మీ యభిప్రాయముఁ జెప్పుఁడు. మంచి యాలోచనయే జయకారణ మని పెద్దలందురు. కావున నాలోచింపక కార్యములు చేయరాదు.

తే. జగతిఁ బురుషులు గలరు ము ♦ త్తెగలవారు, వలఁప నుత్తమ మధ్యమా ♦ ధము లనంగ
వారియందలి గుణదోష ♦ వర్గములను, వరుస వచియింతు రాక్షస ♦ ప్రవరులార! ౧౨౯

తాత్పర్యము.

లోకమునందు నుత్తములనియు, మధ్యము లనియు, నధము లనియు మూఁడు తెగల పురుషులు గలరు. రాక్షసశ్రేష్ఠులారా! వారే గుణములచే నుత్తములయిరో యే దోషములచే నధము లయిరో చెప్పెద వినుండు.

చ. సమసుఖదుఃఖబాంధవుల ♦ సంహతితోఁ దనమేలు గోరు నె
య్యముగలవారితోడఁ దన ♦ యాత్మను నచ్చిన మిత్రకోటితో
విమలమనీష యోజనలు ♦ వే యొనరించి ఫలంబు దైవయ
త్నముగను గార్యముం గడఁగు ♦ తజ్జ్ఞనుఁ డుత్తముఁ డండ్రు కోవిదుల్. ౧౨౯

తాత్పర్యము.

తన సుఖమే తమ సుఖముగను, తన దుఃఖమే తమ దుఃఖముగను నెంచు బంధువుల సమూహముతోడను, తన మేలుగోరు స్నేహముగలవారితోను, దన మనస్సు నమ్మిన మిత్రులతోను నిర్మలమైన బుద్ధితో శీఘ్రముగ నాలోచించి ఫలము దైవాధీన మని కార్యముచేయ నెప్పుఁడు పూనుకొనునో వాఁ డుత్తమ పురుషుఁడు.

క. దైవమె శరణంబుగఁ గొని, భావించి యొకండె కార్య ♦ పద్ధతి నొకఁడే
కావింపఁ బూనె నేనియు, నా వాఁ డగు మధ్యముం డ ♦ టండురు ప్రాజ్ఞుల్. ౧౩౦

తాత్పర్యము.

జయాపజయములకు లాభాలాభములకు దైవమే కారణము. ఆయనయే రక్షకుఁ డని దైవమునే నమ్మి యితరులతో నాలోచింపక తనకు మేలని తోఁచిన విధముగఁ గార్యము చేయఁబూనువాఁడు మధ్యమపురుషుఁడు.

క. అరయక గుణదోషంబులఁ, బొరి దైవాశ్రయము చింత ♦ పూనక పని దా
నెరయింపఁబూనియును నది, పరిపూర్తి నొనర్పకున్న ♦ వాఁ డధముఁ డగున్. ౧౩౧

తాత్పర్యము.

ఇటుచేసిన మేలు,అటుచేసిన కీడు అని యాలోచనలేక దైవమును విశ్వసింపక దైవసాహాయ్యము గోరక కార్యము చేయఁబూని దానిని జక్కఁగఁ దుదముట్టఁజేయుని వాఁడు పురుషాధముఁ డనఁబడును.

ఆ. పురుషులందుఁబోలె ♦ సురవైరివరులార! యొప్పు మంత్రములను ♦ నుత్తమాధ
మములు మధ్యమంబు ♦ మఱి వీని లక్షణ,ములను విశదపఱుతుఁ♦దెలియ వినుఁడు.

తాత్పర్యము.

పురుషు లం దుత్తమ మధ్యమాధము లున్నట్టులు మంత్రాలోచన యాదాను మూఁడువిధములు గలవు. వాని లక్షణములు తెలియఁజెప్పెద వినుఁడు.

తే. శాస్త్రదృష్టిని జూచుచు ♦ సచివులెల్లఁ
గార్యమునయందు నాసక్తి ♦ కడను వడక
యైకమత్యంబు వహియింతు ♦ రట్టి యదియ
యుత్తమాలోచనం బందు ♦ రుర్వి బుధులు. ౧౩

తాత్పర్యము.

శాస్త్రమునందు దృష్టి యుంచి యది చెప్పినప్రకారము మంత్రులందఱు కొఱఁతలేని యాసక్తితో నెట్టులైన నీకార్యము సాధింపవలయు నని పట్టుదలగలవారై యేకాభిప్రాయము గలవారై రేని యట్టిది యుత్తమమైన యాలోచన మని పండితు లందురు.

తే. కార్య మాలోచనము సేయఁ ♦ గడఁగు నప్పుడు
మొదల వేర్వే ఱభిప్రాయ♦ములను గొనియుఁ
దుదకు నేకమతంబునఁ ♦ బొందలి రేని
దాని మధ్యమ మందురు ♦ తత్త్వవిదులు. ౧౪

తాత్పర్యము.

కార్యము నాలోచింపఁ బూనినప్పుడు మొదట వేఱువేఱభిప్రాయములు గల వారైనను గడపట నందఱు నేకాభిప్రాయము గల వారై రేని మంత్రతత్త్వము దెలిసినవారు దానిని మధ్యమాలోచన మందురు.

తే. ఒకరిమతమును మెచ్చక ♦ యొక్కరుండు, తాను బట్టిన పట్టును ♦ మానుకొనక
యైకమత్యంబునందు శ్రే♦యస్సులే ద,టన్న యాలోచనం బది♦ యధమమంత్రము.

తాత్పర్యము.

ఒకఁడు చెప్పిన దానిని మఱియొకఁ డంగీకరింపక తాను జెప్పినదే సరియని హఠవాదము చేయుచు నేకాభిప్రాయమునకు రాక యెవరి యభిప్రాయము వారి దను నాలోచన మధమాలోచనము.

లవము నెఱుంగ లేక మిగుల్లన్ మతిహీనత నీతిబాహ్యులై;
భువి నవినీతులైన సచివుల్ గద రాజుల పాలిశాత్రవుల్. ౧౩౪

అర్థములు. పవిధరవైరి=వజ్రము ధరియించిన యింద్రుని పగవాఁడు, రావణునికొఱకు - ఆత్మవిరోధిపక్షముల్ = తమ బలము, విరోధిబలము, పక్షము=పక్షో మాసార్ధకే పార్శ్వే గృహే సూర్యవిరోధయోః। కేశాదేః పరతో బృందే బలే సఖ సహాయయోః. విశ్వ నిఘంటువు. లవము = కొంచెమైనను; మతిహీనతన్=బుద్ధి లేనితనముచేత, నీతి బాహ్యులై = నీతిమార్గము వదలినవారై, అవినీతులు = నీతి మాలినవారు, సచివుల్ = మంత్రులు, అర్థాంతరన్యాసాలంకారము.

తాత్పర్యము.

రావణుఁ డీప్రకారము పలుకఁగా మహా బలవంతులు రాక్షసులు చేతులు జోడించి, దేహబలము గలవారేకాని బుద్ధిబలము లేనివారగుటచే తమ బల మెంత - విరోధుల బలమెంత యని తెలిసికొనలేక యిట్టి సందర్భముల నెట్లు ప్రవర్తించుట నీతియో యదియు నెఱుఁగక కొంచెమైనను బుద్ధి లేనివారై యిట్లనిరి. నీతిమాలిన మంత్రులు గదా రాజులకు విరోధులు - చెఱుపు చేయువారు విరోధులు - దురాలోచనము చెప్పి చెఱుపుచేయుదురు గావున దుర్మంత్రులు విరోధులే.

ఇట్లు చెప్పుటయందుఁ గవి యభిప్రాయ మేమన:—రాముఁ డింతవఱకుఁ జేసిన కార్యము లిప్పు డొక క్రోతి చేసిన కార్యము - ఇట్టివా రింకను పెక్కురు గలరు గదా కావున బలవద్విరోధము మేలు లేదని యాలోచించి యందఱ యేకవాక్యముగా సీతను మరల నిమ్మని పట్టుపట్టి యుండినయెడల రావణుఁ డీయకి తప్పించుకొనలేఁడు. అటుగాక వా రధముపుసులై యధమమంత్ర ముపదేశించి వానిని జెఱిచి తామును జెడిరి.

సీ. దనుజేంద్ర! యిటు విషాదముపడ నేటికిఁ? బట్టిసశక్త్యృష్టిపరిఘశూల
సంకుల మగు మహాసైన్యంబు నీ కుండఁ, బరిమార్చితివి భోగవతిని ఫణుల
గైలాసవాసి యక్షవ్యూహసంయుతు, ధనదుని నోడిచితి దర్పగరిమ
నమ్మహేశ్వరుసఖ్య మంది కీర్తితోఁడ నై, కినుక దిక్పాలుర గెలిచి తీవు
తే. యక్షులను బట్టి గళవళ మందఁ జేసి, కొట్టి వధియించి కైలాసకూటమందుఁ
దేజరిల్లు విమానంబుఁ దెచ్చి తిటకు,నీకు సరివారు గలరె ముల్లోకములను?

అర్థములు. శక్తి = పోటుగాటి కత్తులు, ఋష్టి - ఋష్టి = ఖడ్గములు - ఖడ్గేతు నిస్త్రింశ చంద్రహాసాసి రిష్టయః కౌక్షేయకో మండలాగ్రః కరవాలః కృపాణవత్॥ అమరుఁడు. చంద్రహాసర్ష్టి నిస్త్రింశా జ్ఞేయా ఏకార్థవాచకాః॥ త్రి. శేషము - రిష్టి, రూ. ఋష్టి రెండు రూపములు గలవు.

తాత్పర్యము.

రాక్షసేశ్వరా ! పట్టిసములు - శక్తులు - ఋష్టులు - పరిఘములు - శూల

ములు నిండిన గొప్పసేన నీ కుండఁగా నీ వేల యిట్లు వ్యసనపడెదవు. భోగవతీ పురమందు సర్పముల నెల్ల గెలిచితివి. కైలాసమున యక్ష సమూహములతో నుండు కుబేరుని బల గర్వముచే జయించితివి. ఆ మహేశ్వరునితో స్నేహముచేసి కీర్తిని సంపాదించి కోపించి దిక్పాలకుల నెల్ల జయించితివి. యక్షులను బట్టి తికమక పడఁగొట్టి చంపి కైలాస శిఖరమందున్న విమానము నిచ్చటికిఁ దెచ్చితివి. నీకు సమానులు మూఁడులోకములందును గలరా.

చ. భయమున నీదు సఖ్యమును ♦ ప్రార్థన సేయుచు నాత్మసంభవన్
మయుఁ డను దానవేశ్వరుఁడు ♦ మానుగ నిచ్చెను నీకు భార్యగా
జయము గొనంగ లేదొకొ ర♦సాతలసీమ రణంబునన్ బిలే
శయులను వాసుకిన్ జటిని ♦ శంఖునిఁ దక్షకు గెల్చి శూరతన్. ౧౮౦

అర్థములు. బిలేశయులను = సర్పములను - బిలే+శయులు = బిలమందు శయించువారలు = అలుక్సమాసము.

తాత్పర్యము.

నయమున నీయకుండినఁ జంపుదు వను భయముచే నీ స్నేహముఁ గోరి గదా దానవేశ్వరుఁడు మయుఁ డనువాఁడు తన తనయను నీకు భార్యగా నిచ్చెను. (ఉత్తర రామాయణమున ౨౫౬ వ పద్యము చూచునది) పాతాళమునకుఁ బోయి యుద్ధమున సర్పములను వాసుకిని జటిని శంఖుని తక్షకుని శౌర్యముచే గెలువలేదా.

ఉ. దానవనాయకుండు బల♦దర్పితమానసుఁ డా మధుండు కుం
భీనసిసౌఖ్యధాత యతి♦వీరుఁడు నీకు వశంపడండె? యు
ద్ధాన సమస్తదిక్పతుల♦దర్ప మడంచి సురేంద్రలోకమున్
మానక చేరి యందు బల♦మర్దను నిర్జితుఁ జేయవే ప్రభూ. ౧౮౧

అర్థములు. బలదర్పితమానసుఁడు = బలముచే గర్వించిన మనస్సు గలవాఁడు - కుంభీనసి సౌఖ్యధాత = కుంభీనసి మగఁడు, బలమర్దనున్ = ఇంద్రుని.

తాత్పర్యము.

దానవుల కధిపతియు బలగర్వము గలవాఁడును - నీ చెలియలు కుంభీనసి మగఁడును నగు మధుఁడు నీకు వశపడలేదా - యుద్ధమున సమస్త దిక్పాలురను గర్వ మడంచి యింద్రలోకమునకుఁ బోయి యందు నింద్రుని జయింపలేదా.

క. బలయుతుల లబ్ధవరులను, గలిశూరుల నక్షయులను ♦ గదనములోనన్
నిలిచి యొకరొఁడు దనుజుల, గెలువవె మాయలను నేర్చి ♦ కీర్తిం గనవే. ౧౮౨

అర్థములు. లబ్ధవరులను = బ్రహ్మచే వరముల నొందిన వారలను, కలిన్ = యుద్ధమందు, అక్షయులన్ = నాశము లేనివారలను, కదనములోనన్ = యుద్ధమందు,

తా త్ప ర్య ము.

బలవంతులును బ్రహ్మచే వరము పొందినవారును రణశూరులును నాశము గాని వారు నగు దనుజులతో నొక సంవత్సరము యుద్ధము చేసి గెలువలేదా; వారి వలన మాయలను నేర్చి కీర్తి సంపాదింపవా.

క. విక్రమవంతుల మఱి ని,ర్వక్రభుజబలాఢ్యయుతుల ♦ వరుణాత్మజులన్
చక్రాన్వితుల బాహుప,రాక్రమమున గెలువలేదె ♦ రణలంపటతన్. ౧౪౩

అర్థములు. నిర్వక్ర = వంకరలేని, లోపము లేని, భుజబల + ఆఢ్యయుతుల = బాహుబల సంపత్తితోఁ గూడినవారు, చక్రాన్వితులన్ = సేనలతోఁ గూడిన వారిని, రణలంపటతన్ = యుద్ధమందలి యాసక్తిచే.

తా త్ప ర్య ము.

పరాక్రమము గలవారిని, సంపూర్ణ భుజబల సంపన్నులను, సేనలతోఁగూడిన వారలను వరుణ పుత్రులను యుద్ధమందలి యాసక్తిచే భుజ బలముచే గెలువలేదా.

చ. ప్రకటితశాల్మలీద్రుమవి♦భాసము భీకరమృత్యుదండస
క్రకమును గాలపాశసుత♦రంగము దండధరోగ్రకింకరా
హికము పరేతరాడ్బలమ♦హిష్ఠసముద్రముఁ జొచ్చి మృత్యువున్
దికమికఁ గూర్పవే జగము ♦ దిగ్భ్రమ నొంద జయంబుఁ గాంచవే. ౧౪౪

అర్థములు. ప్రకటిత = ప్రసిద్ధపఱుపఁ బడిన, శాల్మలీద్రుమ = బూరుగు చెట్లచేత, బూరుగుచెట్లవంటి యాయుధములచేత, విభాసము = విశేషముగఁ బ్రకాశించునది, భీకర = భయము కలిగించు, మృత్యుదండ నక్రకమును = యమ దండ మను మొసళ్లు గలదియు, కాలపాశసుతరంగము = కాలపాశ మను నలలు గలది, దండధర = యమునియొక్క, ఉగ్రకింకర = భయంకరులైన కింకరు లనెడి, అహికము = పాములు గలది, పరేతరాట్ = యమునియొక్క, బల=సేనయనెడి, మహిష్ఠ సముద్రము = గొప్ప సముద్రమును, మృత్యువున్ = యముని, మృత్యు దేవతను, తికమిక = కలఁత,సముద్రమునందుఁ జెట్లెట్లుండు నని సందేహింపరాదు, ద్వీపములందు మహావృక్షములు గలవు.

తా త్ప ర్య ము.

ప్రసిద్ధమైన బూరుగు చెట్లచేఁ బ్రకాశించునదియు, భయంకర మైన మృత్యు దండ మను మొసళ్లు గలదియు, కాలపాశ మను నలలు గలదియు, యమకింకరు లను పాములు గలదియు, నగు యముని సేన యను గొప్ప సముద్రమునఁ బ్రవేశించి మృత్యు దేవతను గలవరము నొందఁజేయలేదా? లోకము దిగ్భ్రమ నొంద జయింప లేదా?

ఉ. వృత్రవిరోధిసన్నిభులు ♦ విశ్రుతవీర్యపరాక్రమాఢ్యు లా
క్షత్రియు లీ ధరాస్థలిని ♦ గానవృక్షము లట్లు లుండఁగా

దాత్రముచేతఁ బోలె శర♦దారితగాత్రులఁ జేయవాఁకొ(-; యా
గోత్రధృతీడ్యవిక్రములకుఁ♦ సరి వచ్చునె రాముఁ డాజులోన్. ౧౮౫

అర్థములు. వృత్ర విరోధి సన్నిభులు=ఇంద్రునితో సమానులు, విశ్రుత = ప్రసిద్ధికెక్కిన, కాననవృక్షములు = అడవిలోని చెట్లు, అడవిలోని చెట్లు అడ్డములేక తమ యిష్టము వచ్చినట్లు పెరిగి యభివృద్ధి చెందినట్లు క్షత్రియులు పెరిగినారని భావము. దాత్రము = కొడవలి, ఇచ్చట గొడ్డలి యనియే చెప్పవలెను, శర = బాణములచే, దారిత = చీల్పఁబడిన, గాత్రులన్ = దేహములు గలవారినిగ, గోత్ర ధృతి = పర్వతములవంటి ధైర్యము గల, ఈడ్య = స్తోత్రము చేయఁదగిన, విక్రము లకున్ = పరాక్రమము గల వారికి.

తా త్ప ర్య ము

నేను దేవదానవాదులచే భయము లేకుండ వరము గోరితిని. గావున నింద్రాదుల జయింప గల్గితిని. మనుష్యుల వలన భయము లేకుండ నేను గోరలేదు గదా! రాముడు మనుష్యుఁడుగదా యందువేమో. ఇంద్రునితో సమానులై మహాబలపరాక్రమవంతులైన యనరణ్యాది క్షత్రియు లడవిచెట్లవలె బాగుగ యథేచ్ఛముగ బలసి యుండగా గొడ్డలితోఁ గొట్టినట్లు బాణములచే వారిని జీల్పలేదా? వారు మనుష్యులు గారా? పర్వతములవలె ధైర్యముగల వారును స్తోత్రము చేయఁబడిన విక్రమము గల వారు నగు ఆ రాజుల కీ రాముఁడు యుద్ధములో సమానుఁ డగునా?

ఉ. ఊరక యుండు గాసిఁ గొన ♦ కో మనుజాశననాథ! పాకజి
ద్వైరి యొకండె చక్కఁడుచు ♦ వానరకోటుల నెల్ల, మృత్యుసం
హారు మహేశు యజ్ఞమున ♦ హర్షితుఁ జేసి సుదుర్లభంబు దు
ర్వారము నా వరంబుఁ గని ♦ రంజిలఁ జేయఁడె యెల్లవారలన్. ౧౮౬

తా త్ప ర్య ము .

రాక్షసేశ్వరా! నీవే యాలోచన చేయవలసిన పని లేదు. ఏ కార్యము చేయవలసిన పనిలేదు. నిశ్చింతముగ నూరకుండుము. వానరుల నందఱను నింద్రజిత్తొక్కఁడే చంపును. యముని జయించిన శివుని గూర్చి యజ్ఞము చేసి యాయనను సంతోషపెట్టి మిక్కిలి దుర్లభము అడ్డగింపరానిది యగు వరంబు సంపాదించి రాక్షసుల నందఱ సంతోషపెట్టఁడా?

సీ. శక్తితోమరచయ♦శకులీకమును విని,కీర్ణాంత్రశైవాల♦కీలితంబు
వారణకచ్ఛప♦వారసంబాధంబు, సశ్వమండూక చ♦యాంచితంబు
నాదిత్యరుద్రమ♦హాగ్రాహమును మరు,ద్వసుమహాపన్నగ♦దరకరంబు
స్యందనతురగగ♦జాంబుపూరంబును, బటుపత్తిసైకత♦భాసితంబు

తే. నైన నిర్జరసైన్యమ♦హార్ణవంబుఁ, బఱచి శంబరవృత్రహుఁ ♦ బట్టి లంక
కిటకుఁ గొనివచ్చి శ్రీసుర♦జ్యేష్ఠు నాజ్ఞఁ,దలఁచి విడిచిన శూరుఁ డీ♦తండ కాఁడె.౧౮౭

అర్థములు. శక్తితోమరచయ = శక్తులయు, చిల్లకోలల సమూహ మనెడి, శకులీకమును = చేఁపలు గలదియు, వినికీర్ణ = రాలియున్న, అంత్రి = ప్రేవులనెడి, శైవాల = పాఁచిచే, కీలితంబు = నిండినదియు, వారణ= ఏనుఁగు లనెడి, కచ్ఛప = తాఁబేళ్ళయొక్క, వార = సమూహముచే, సంబాధితంబు = నిండినది, అశ్వ = గుఱ్ఱము లనెడి, మండూక = కప్పల, చయ = గుంపుచే, అంచితంబు = ఒప్పినది. ఆదిత్యరుద్ర = సూర్యులు, రుద్రుఁడు ననెడి, మహాగ్రాహమును = గొప్ప మొసళ్ళు గలదియు = మరుత్, వసు = మరుత్తులు వసువు లనెడి, పన్నగ= పాములచే, దర కరంబు = భయము కలిగించునది, స్యందన తురగ గజ = రథములు గుఱ్ఱములు ఏనుఁగులు నను, అంబు = నీళ్ళ, పూరంబును = ప్రవాహము గలదియు, పటు=దృఢమైన, పత్తి = పదాతు లనెడి, సైకత = ఇసుక దిబ్బలచే, భ్రాజితంబు = ప్రకాశించునదియు, నిర్జరసైన్య = దేవతల సేన యనెడి, మహార్ణవంబు = గొప్ప సముద్రము, పఱచి = పాఱఁదోలి, శంబర వృత్రహుఁ = శంబరుని వృత్రుని జంపిన యింద్రుని, సురజ్యేష్ఠు = బ్రహ్మయొక్క.

తాత్పర్యము.

శక్తులు తోమరము లను చేఁపలు, ప్రేవులనెడి పాఁచితీఁగలు, ఏనుఁగు లనెడి తాఁబేళ్ళు, గుఱ్ఱము లనెడి కప్పలు, సూర్యుఁడు రుద్రుఁడు నను పెద్ద మొసళ్ళు - మరుత్తులు వసువు లనెడి పాములు, తేరులు - గజములు - గుఱ్ఱములనెడి నీళ్లు, కాలిబంట్లనెడి యిసుకదిబ్బలు గల దేవసేన యనెడి సముద్రమును పాఱిపోఁజేసి (ఎండించి) శంబర వృత్రులఁ జంపిన యింద్రుని జెఱఁబట్టి లంకకుఁ దీసికొనివచ్చి బ్రహ్మ యాజ్ఞ ప్రకారము వదలిన శూరుఁ డితఁడే కదా.

ఈ రాక్షసులు చెప్పిన విషయము లన్నియు నుత్తరకాండంబున వివరింపఁబడినవి.

ఉ. కావున నిట్టి యాత్మజుల సంఖ్యవిపరాక్రము నిందజిత్తుఁగీ
ర్తావళి రాముతోఁ క్రముగ ♦ నంతకు నంతికసీమఁ జేర్పఁగాఁ
బోవ నసుజ్ఞ యిమ్ము, పొరిఁ♦పుచ్చును వారలఁ, బ్రాకృతుం డొకం
డావిధిఁ జేటు గూర్చె నని ♦ యాత్మఁ గలంగకు, గెల్తు రాఘవున్. ౧౮౮

అర్థములు. అంతకు = యమునియొక్క, అంతికసీమ = సమీప ప్రదేశమును, పొరిపుచ్చును = చంపును, ప్రాకృతుఁ డొకండు = ఎవఁడో యొక నీచుఁడు, క్రోఁతిగాడు.

తాత్పర్యము.

ఇటువంటి గొప్పకార్యము చేసిన నీ కొడుకును నిందజిత్తును, పూర్ణపరాక్రము రామునితోడ వానరులఁ జంపఁబోవునట్లు ఆజ్ఞాపింపుము, వారలను

జంపును. ఎవఁడో యొక నీచపుఁగోతిగాఁ డా ప్రకారము గీవు గెలిగించెనని వ్యాకుల పడకుము, రాముని నీవు గెలువఁగలవు.

—♦ ౮-వ సర్గము. ప్రహస్తాదులు తమతమ పరాక్రమంబు రావణుతోఁ జెప్పుట.♦—

ఉ. అంతట సైన్యనాథుఁ డసి♦తాబ్దనిభుండు ప్రహస్తుఁ డుగ్రదు
ర్దాంతపరాక్రమోద్ధతుఁడు ♦ ప్రాంజలియై యను రేంద్ర! యేల యీ
చింత? సురాసురోరగవి♦శిష్టపిశాచగణంబు లేని నీ
చెంతలఁ జేర లే వసఁగఁ ♦ జెప్పెడి దేమి వనేచరావళిన్. ౧౪౯

అర్థములు. అసిత + అబ్ద+నిభుఁడు = నల్లని మేఘముతో సమానుఁడు, ఉగ్ర = భయంకరమైన, దుర్దాంత = అణఁపరాని, పరాక్రమ = పరాక్రమముచే, ఉద్ధతుఁడు = గర్వించినవాఁడు, ప్రాంజలియై = అంజలి జోడించినవాఁడై, సుర+ అసుర + ఉరగ + విశిష్టపిశాచగణంబులు = దేవతలయు, అసురులయు, సర్పము లయు, సమస్త పిశాచములయు సమూహములైనను, వనేచర+ఆవళి = వానరుల గుంపును, వనే + చర = సప్తమ్యలుక్సమాసము.

తా త్ప ర్య ము.

సభలో నుండు రాక్షసు లందఱు నిట్లు చెప్పినపిమ్మట మంత్రులు ప్రముఖులు వారివారి యభిప్రాయము వేఱువేఱ జెప్పుచున్నారు. అందు మొదట ముఖ్య సేనానాయకుఁడు ప్రహస్తుఁడు తన యభిప్రాయముఁ దెలుపుచున్నాఁడు.

ఇట్లందఱుఁ జెప్పిన పిమ్మట మేఘమువలె నల్లనివాఁడును భయంకరమై యణఁప రాని పరాక్రమముచే గర్వించినవాఁడును నగు ప్రహస్తుఁడు నమస్కరించి యిట్లనియె. రాక్షసేంద్రా! నీ కేల యీ విచారము. దేవాసురులైనను పన్నగ పిశాచములైనను నీ సమీపమునకు నైన రాలేవు, ఇఁకఁ గోఁతులా నీ యెదుట నిలచి యుద్ధముచేయఁ గలవు!

ఉ. ఎవ్వఁడు మ మ్మెదుర్చు మము ♦ నెవ్వఁడు గెల్వఁగఁ జాలు నంచు మే
మివ్విగ నప్రమాదగతి ♦ నేమఱి యుంటిమి గాన వానరుం
డవ్విధి మేనితోఁ జనఁగ ♦ నయ్యెను వంచన చేసి, కానిచో
నవ్వనగోచరుఁ డమగృ♦హాతిథిగా నొనరించి యుండనే!

అర్థములు. ఇవ్విగన్ = ఈ విధముగ - నప్రమాదగతి = హెచ్చరిక తప్పి- యమగృహాతిథిగా = యముని యింటికి నతిథిగా - చంపి యని యర్థము - పర్యా యోక్త్యలంకారము.

తా త్ప ర్య ము .

మమ్మెదిరించు వాఁ డెవ్వఁడు ? మమ్ము గెలువఁగల వాఁడెవ్వఁడు ? అని యీ ప్రకారము మేము హెచ్చరిక దప్పి యేమఱియుంటిమి. గావున వానరుఁడు వంచన

చేసి ప్రాణముతోఁ బోవఁ గలిగెను. గాని కొంచెము హెచ్చరిక కలిగి యుండినచో వాని నప్పుడే చంపి యుండనా ?

చ. జలధిపరీతధారిణి స♦శైలవనాంత మవాసరంబుగాఁ
జలిపెద, నాజ్ఞ యి మ్మిపుడ ♦ చయ్యన నేగెదఁ, గ్రోతిచేత నే
విలయము గూడకుండ నొక♦ వేయివిధంబులఁ గాపు పెట్టెదఁ,
గలుగదు స్వాపరాధభవ♦కష్ట మొకింతయు నీకు నావుడున్. ౧౫౧

అర్థములు. జలధిపరీతధారిణి = సముద్రముచేఁ జుట్టఁబడిన భూమి- అవాసరంబుగా = వాసరు లనువారు లేకుండ - స్వాపరాధ భవకష్టము = సీతాపహరణ మనెడి స్వయంకృతాపరాధము వలనఁ గలుగు కష్టము.

తాత్పర్యము.

సముద్రముచేఁ జుట్టఁబడిన భూమి యంతయు కొండలతో నడవులతోఁ గూడిన దానిని వాసరు లనువారు లేకుండఁ జేసెదను. ఆజ్ఞ యిచ్చెదవేని యిప్పుడే పోయెదను. నీ వొక త్రోవఁబోయిన వారొక త్రోవవచ్చి యూరిపైఁ బడుదు రేమో యనకుము. అట్టి భయము లేకుండ వెయ్యి విధముల రక్షణోపాయములఁ గావించెదను. చేతులారఁ జేసికొనిన దోషమువలని కష్టము నీకుఁ గలుగదు.

స్వాపరాధభవ కష్ట మనుటచే నీవు స్వయముగఁ జేసినదేమో దోషమే. దానివలన నవమానము రాకుండుటకై యుద్ధము చేయవలసి యున్నదని ప్రహస్తుని యభిప్రాయము.

ఆ దోషము సవరించుకొనుటకు రెండుపాయములు. సీత నిచ్చుట మొదటిది. అది యవమానకర మని తోఁచినయెడల యుద్ధము సేయుట - మొదటి యభిప్రాయమునఁ బెక్కు రేకీభవింపమిచే నంతఃకలహ మాపుటకై వారిమార్గమును దా ననుసరించి యుద్ధవిషయము చెప్పెను. ప్రహస్తుని వాస్తవాభిప్రాయము ౧౧౭౮ వ పద్యంబునఁ జెప్పఁబడినది.

ఉ. క్రుద్ధుఁడు దుర్ముఖుం డనెడి♦ ఘోరపలాశి వచించెఁ గ్రోతి దు
ర్బుద్ధి పురంబువారికిని ♦ బొల్తుకకూఁటువకుం సురేంద్రునిం
బద్ధు నొనర్చినట్టి బల♦వంతున కీ యసురాధినేతకుం
సిద్ధ మగౌరవం బొనరఁ ♦ జేసెను, దీనిని సైఁపఁ జెల్లునే. ౧౫౨

అర్థములు. క్రుద్ధుఁడు = కోపించినవాఁడు - పలాశి = రాక్షసుఁడు - పల+అశి = మాంసము దినువాఁడు; దుర్బుద్ధి = చెడుబుద్ధి గలవాఁడు; పొల్తుకకూఁటువకుం = అంతఃపురస్త్రీలకు.

తాత్పర్యము.

ప్రహస్తుడు తా నజాగ్రత్తగా నుండుటచే వాసరుఁడు చెడుకార్యము చేయఁ గలిగె నని చెప్పఁగాఁ గోపించిన దుర్ముఖుఁ డను రాక్షసుఁ డిట్లను చున్నాఁడు. దుర్బుద్ధి

గల క్రోఁతి నగరమున నుండువారికిని కొంపలుగాల్చి యంతఃపురస్త్రీలు నడివీథులలోనికి వచ్చునట్లు చేయుటచే స్త్రీల గుంపునకును, ఇంద్రుని బట్టి కట్టిన రాక్షసేశ్వరునకు నవమానము గలిగించుట సత్యము. నే నజాగ్రత్తగా నుంటి ననిన పోయిన మానము మరలి వచ్చునా? ఈ యవమానము సైఁప సాధ్యమా?

క. ఈనిమిషంబున నొకఁడన, వానరవర్గంబు మిన్ను ♦ ప్రాఁకిన జలధిం
దీనతఁ దూఱి భుజంగస్థానంబున కేగఁ బట్టి ♦ చంపెదఁ గడిమిన్. ౧౫౩

తాత్పర్యము.

అవమానము కలుగుట సత్యమే, దానిని సహింపరాదనుట సత్యమే, అయినను దానికి నీవేమి ప్రతీకారము చెప్పెద వందువా! నేనొకఁడనే యీ నిమిషమునఁ బోయి వానర సమూహము ఆకాశమున కెగిరిపోయినను ఏదుచు సముద్రములో దాఁగినను పాతాళంబునకుఁ బోయినను బట్టి చంపెదను.

చ. అనఘుఁడు వజ్రదంష్ట్రుఁడు మహాబలశాలి పలాస్రభూషితం
బును బరిఘంబుఁ గేలఁ గొని ♦ బొబ్బిడుచుం బలుకన్ దపస్వియౌ
వనచరుతోడ నేమి పని ♦ వ్రాలిన శక్తిని రాముఁ డుండఁగా
ననుజుఁడు లక్ష్మణుండుఁ బ్లవగాధిపుఁ డుండఁగ? నేనొకండనే. ౧౫౪

అర్థములు పల+అస్ర+భూషితంబు = మాంసము నెత్తురుతోఁ బూయఁబడినది. (పూజావేళ యని శ్లేషము). తపస్వి = తపసు చేయువానివలెఁ గూరగాయలు దిని శుష్కించినవాఁడు, కావుననే (౨) కనికరింపఁదగినవాఁడు; వనచరుతోడన్ = అడవులందుఁ దిరుగువానితో.

తాత్పర్యము.

దుర్ముఖుఁ డిట్లు చెప్పఁగా దానిని మెచ్చక వజ్రదంష్ట్రుఁ డనువాఁడు మాంసము నెత్తురు పూయఁబడిన యినుపకట్ల గుదియఁ జేతఁ దీసికొని సింహనాదము చేయుచు నిట్లనియె. క్రోఁతులఁ జంపెదమని కొందఱు అనుచున్నారు. క్రోఁతు లడవులలోఁ దిరుగునవి, మన యిండ్లతో వాకిండ్లతో మనతో వానికేమి పని? అదియునుగాక తపస్సు చేసికొనువారివలెఁ గాయగసురులు దిని జీవించునవి, కావుననే కనికరింపఁదగినవి. వానిని జంపిన రాఁగల లాభమేమి? అంతతో విరోధము పోవునా? మనలను నవమాన పఱుపఁ బూనిన శత్రువులు రామలక్ష్మణ సుగ్రీవులు కదా! వారిని విడిచి వానరులను జంపుట వలన మేలులేదు. కావున నే నొకఁడనే.

క. రాముని సుగ్రీవాన్వితు, సౌమిత్రియుతంబుగాఁగఁ ♦ జప్పున నిపుడే
నామ మణఁతుఁ బరిఘంబున, భీమంబుగఁ గ్రోఁతు లదరి ♦ బెదరి తపింపన్. ౧౫౫

తాత్పర్యము.

మీ రెవ్వరి సాహాయ్య మక్కఱలేకయే లక్ష్మణ సుగ్రీవులతోడ రాముని నా

పరిఘంబున నిప్పుడే చంపెదను. అది చూచి వానరు లదరి బెదరి సంతాపపడి పరువెత్తుదురు.

శా. రాజేంద్రా! విను మే నుపాయ మను వాక్యం బొక్కడన్, యుక్తులన్
భ్రాజిద్బుద్ధి వచింపు మవాడె యరిం దీవ్రం బుం జాలు నిస్సంశయ్యడై
యోజస్స్యతులం గామరూపధరులన్ ♦ యుద్ధక్రియాభీలు
రక్షోజాలాగ్ర్యుల నేఁటి వేలకొలఁదిం ♦ గూర్పం దగున్ వెంటనే. ౧౩౬

అర్థములు. భ్రాజిద్బుద్ధి = ప్రకాశించు బుద్ధిచే, అరిన్ = పగవానిని, తీర్పఁ జాలున్ = చంపఁ గలుగును, నిస్సంశయుఁడై = సందేహము లేనివాడై, ఓజస్స్వితులన్ = సంపూర్ణ బలముగల వారిని, యుద్ధ క్రియా = యుద్ధకార్యమందు, ఆభీల=భయంకరులైన, రక్షోజాలాగ్ర్యులన్ = రాక్షస శ్రేష్ఠులను.

తా త్ప ర్య ము.

రాజా! నే నొక యుపాయము చెప్పెదను. బుద్ధి వికాసముచేఁ జక్కని యుపాయము చెప్పువాఁడే శత్రువుల నెచ్చరికతో సంహరింపఁ గలవాఁడు కావున బలవంతులగు రాక్షసుల కామరూపులను యుద్ధక్రియయందు భయంకరులను నేరి వెంటనే జతగూర్పవలయును.

ఉ. వారలు మానవాకృతుల ♦ వారిజమిత్రకులీను రామునిన్
జేరి భవత్సహోదరుఁడు ♦ శ్రీభరతుం డనిపె న్నను న్నృభా
కారుఁ డ దేమొ యాత్యయిక ♦ కార్యము గల్గెఁ బురంబుఁ జేర నే
తేరు మటంచుఁ బల్కి యన ♦ దెప్పున నాతఁడు పోవు సేనతోన్. ౧౩౭

అర్థములు. వారిజమిత్రకులీనున్ = సూర్యుడను సూర్యవంశమునఁ బుట్టినవానిని, ఆత్యయిక కార్యము = అవశ్యము వెంటనే చేయవలసిన పని.

తా త్ప ర్య ము.

ఇట్లు చేరిన వారలు మనుష్యుల వేషములు వేసికొని రామునియొద్దకుఁ బోయి నీ తమ్ముఁడు భరతుఁడు పంపఁగా వచ్చితిమి - అయోధ్యయం దేదో నీవు చక్కఁ జేయవలసిన యవశ్యకార్యము గలదఁట, నిన్నుఁ బిలుచుకొని రమ్మని మమ్ముఁబంపెను- అని చెప్పఁగానే యతఁడు సేనతో నయోధ్యకు వెంటనే పోవును.

క. ఆ సమయంబునఁ జాపశరాసిగదాకరులు మగుచు ♦ నభ్రతలమునన్
రాసుల మై ప్లవగులను బరాసులఁ జేయంగవచ్చు ♦ నశ్మసువృష్టిన్. ౧౩౮

అర్థములు. చాప - శర - అసి - గదా కరులము = విల్లు - బాణములు - కత్తులు - గదలు చేతఁగలవారమై - అభ్రతలమునన్=ఆకాశమునుండి, పరాసులను = చచ్చినవారిని, అశ్మసువృష్టిన్ = రాలవానచే.

తా త్ప ర్య ము.

అట్లు రాముఁ డయోధ్యకుఁ బోవు సమయంబున విల్లు బాణములు గదలు

కత్తులు ధరించి యాకాశమునుండి వానరులమీఁద తూలవాన గురియించి చంప వచ్చును.

క. ఈ యనువున మా పన్నిన,మాయలలోఁ జిక్కి రాము♦మహిపుఁడు ననుజుం
డా యమసదనముఁ జేరం, బోయెద దంతటను బీడ ♦ పోవును మనకున్. ౧౫

తా త్ప ర్య ము .

ఈ విధముగ మీము పన్నిన యుపాయములకుఁ జిక్కుపడి రాముఁడు తమ్మునితోఁ జచ్చును. అంతతో మనపీడ పోవును.

తే. కుంభకర్ణసుతుండు ని♦కుంభుఁ డనెడి, ఘోరదర్పుఁడు పరమసం♦క్రుద్ధుఁ డగుచు
భువనరావణు రావణుఁ ♦ బోలఁ జూచి, యధికగంభీరవాక్కుల ♦ ననియె నిట్లు.

అర్థములు. ఘోరదర్పుఁడు = భయంకర బలగర్వములు గలవాఁడు, భువన రావణున్ = లోకముల నేడ్పించు.

తా త్ప ర్య ము .

ఆ మాటలు విని కోపించినవాఁడై కుంభకర్ణుని కొడుకు నికుంభుఁ డనువాఁడు బలగర్వముచే లోకము నేడిపించు రావణుఁజూచి మిగుల గంభీరములైన వాక్కుల నిట్లనెను.

ఉ. ఉండుఁడు మీర లింక యసు♦రోత్తముఁ గొల్చుచు నే నొకండ దో
ర్దండపరాక్రమక్రమవి♦దారితగాత్రులఁ జేసి ప్రుచ్చెదన్
భండనసీమ రాఘవుని ♦ భ్రాతృయుతున్ హనుమం గపిప్రభున్;
జెండెదఁ దక్క వానరవి♦శిష్టచమూనివహంబు వ్రేల్మిడిన్. ౧౬

అర్థములు. దోర్దండ=దండములవంటి భుజములయొక్క, పరాక్రమక్రమ= పరాక్రమ విధముచే, విదారిత గాత్రులన్ = చీల్పఁబడిన దేహములు గలవారిని, భండన సీమన్ = యుద్ధరంగమందు, వ్రేల్మిడిన్ = చిటికెవేయు కాలములో.

తా త్ప ర్య ము .

మీ రందఱు రాక్షసశ్రేష్ఠుని సేవ సేయుచు నిందే యుండుఁడు, నే నొక్కఁడనే భుజబల పరాక్రమముచే యుద్ధరంగమందు రాముని లక్ష్మణుని హనుమంతుని సుగ్రీవుని జీల్చి పాఱవేసెదను. తక్కిన వానరసేన సంతయు తునకలుగా చిటికె వేయు కాలములో ఖండించెదను.

క. అప్పుడు వజ్రహనుం డను, నప్పలలాశనుఁడు పర్వ♦తాభుఁడు క్రోధం
బుప్పతిలఁ బెదవి నాకుచుఁ, దెప్పున వచియించెఁ దనదు♦ధీరత వెలయన్. ౧౭

అర్థములు. పలలాశనుఁడు = రాక్షసుఁడు, పర్వతాభుఁడు = కొండతో సమానుఁడు, ఉప్పతిలన్ = పుట్టఁగా.

తా త్ప ర్య ము .

అప్పుడు వజ్రహనుఁ డను రాక్షసుఁడు కొండంత దేహము గలవాఁడు,

కోపము పుట్టుచుండఁగా పెదవి నాకుచు తన ధైర్యము ప్రకాశించు నట్లిట్లు చెప్పెను.

ఉ. ఎక్కడిజోలి మీకుఁ, జనుఁడీ పదఁడీ మదిలోనఁ జింతలం
దక్క యథేచ్ఛ మైఁ బను లొనర్చుకొనం, దనివార మాంసముల్
మెక్కుఁడు త్రాగుఁడీ మధువు మెచ్చగు నాటల నాడుఁ, డొక్కఁడన్
గ్రక్కున రాఘవాంగదుల గాడ్పుసుతుం గపిరాజుఁ ద్రుంచెదన్. ౧౬౩

తా త్ప ర్య ము.

రాక్షసులారా! యీ ప్రసంగము మీ కేల? మనస్సులో విచారము మాని యిష్టము వచ్చినట్లు మీ మీ గృహకృత్యములు చేసికొనఁ బొండు పొండు, మీకు దృప్తి గలుగ మాంసముఁ దినుఁడు,సారాయము త్రాగుడు, ముచ్చట లాడుడు నే నొకఁడనే రామలక్ష్మణులను సుగ్రీవాంగద హనుమంతులను జంపెదను.

—౯-వ సర్గము. రభసాదులు విజృంభించి పలుకుట.—

సీ. అంతట రాక్షసుల్ యజ్ఞహనుండు నికుంభ, రభస మహాపార్శ్వ రశ్మికేతు
సూర్యశత్రువులును సుప్తఘ్నుఁడును మహో,దరుఁ డగ్నికేతుండు దశశిరస్కు
సుతుఁ డింద్రజిత్తు నిస్తులుఁడు ప్రహస్తుండు,నతికాయుఁడును విరూపాక్షుఁ దుగ్ర
ధూమ్రాక్షుఁడును వెండి దుర్ముఖవజ్రదం,ష్ట్రులు పట్టసంబులు శూలములును

తే. ప్రాసశక్తిపరశ్వధ పరిఘములును, గాండదీపితచాపముల్ ఖడ్గములును
నొడిసి త్రిప్పుచుఁ జెలరేఁగి మిడిసిపడుచు,మండుచునుబల్కి రసురప్రకాండుతోడ.

తా త్ప ర్య ము.

ఆవల యజ్ఞహనుఁడు, నికుంభుఁడు, రభసుఁడు, మహాపార్శ్వుఁడు, రశ్మికేతువు, సూర్యశత్రువు, సుప్తఘ్నుఁడు, మహోదరుఁడు, అగ్నికేతుఁడు,రావణుని కొడుకు ఇంద్రజిత్తు, అసమాను డగు ప్రహస్తుఁడు, అతికాయుఁడు, విరూపాక్షుఁడు, ధూమ్రాక్షుఁడు, దుర్ముఖుఁడు, వజ్రదంష్ట్రుఁడు, వీరందరు నికుంభుని మార్గ మనుసరించి యుద్ధ చేయ దలఁచి యహమహమికతో నేను ముందనిన నేను ముందనుచు వారి వారి యాయుధములు పట్టసములు శూలములు ప్రాసములు శక్తులు గండ్రగొడ్డండ్లు ఇనుపగుదియలు బాణములతోడి విండ్లు కత్తులు వీనిని బట్టుకొని త్రిప్పుచు విజృంభించి యెగిరి పడుచు కోపముతో మండిపడుచు రాక్షసశ్రేష్ఠునితో నిట్లనిరి.

ఇందు అసురప్రకాండునితోడ నని ప్రకాండ శబ్దము పుంలింగముగాఁ బఠింపఁ బడినది. అమరకోశమునందు "మతల్లికా మచర్చికా ప్రకాండ ముద్ఘ తల్లజౌ" యని నియత నపుంసకలింగముగాఁ బఠింపఁబడినది. అయినను 'ప్రకాండోఽస్త్రీ ప్రశస్తే చ' యని నానార్థరత్నమాల యందు పుంనపుంసకముల రెంటిని జెప్పుటచేతను 'క్షత్రియ ప్రకాండః' అని భవభూతి మహావీర చరిత్రమునందు (4-35- 5-48) పఠించి యుండుట చేతను "ప్రకాండో న స్త్రీ విటపే మూలశాఖాంతరే తరోః। శస్తే" యని మేదిని యందుండుటను 'ప్రకాండో విటపే శస్తే మూలస్కంధాంతరే తరోః' యని విశ్వనిఘంటువు

నందుండుటను "ప్రకాండః పుంస్యపి అస్త్రీ ప్రకాండో విటపీ తరుస్కంధ ప్రశస్తయో" అని సుధయందుండుటను నిచ్చటఁ బుంలింగమున బ్రయుక్తము.

క. ఈనగరంబును గాల్చిన,యా నీచుని హనుమ రాము♦ననుజసమేతున్
వానరనాయకు నిపుడే, నేనే వధియింతుఁ బ్రభుంతు ♦ నేనే నేనే. ౧౬౫

తాత్పర్యము స్పష్టము.

క. అని కేల నాయుధంబులు, గొని బిరుదము లాడు నసుర♦కోటులఁ దమ యా
సనముల నుండ న్మరలిచి,యనియె విభీషణుఁడు భ్రాత♦కంజలితోడన్. ౧౬౬

అర్థములు. బిరుదములు = పౌరుష వాక్యములు.

తాత్పర్యము.

ఈ ప్రకార మాయుధములు ధరించి పౌరుషపు మాటలు పలుకుచున్న యందఱను వారి వారి స్థానంబులం దుండఁ జేసి విభీషణుఁ డన్నకు నమస్కరించి యిట్లనియె.

ప్రహస్తాదులు ప్రభు వను నుద్దేశముతో మాటలాడిరి. విభీషణుఁ డన్న యను ప్రేమముతో మాటలాడు చున్నాఁడని భావము.

—♦ విభీషణుఁడు రావణునకు రాజనీతిఁ దెలుపుట. ♦—

క. విను సామదానభేదము, లనెడు నుపాయముల మూఁట ♦ నర్థము సిద్ధిన్
గనకున్న విక్రమంబును, గొనియాడుదు రయ్య నీతి♦కోవిదవర్యుల్. ౧౬౭

అర్థములు. నీతికోవిద వర్యుల్ = నీతిశాస్త్రమునందుఁ బండితశ్రేష్ఠులు.

తాత్పర్యము.

రాజనీతియందుఁ గార్యము సాధింప సామము దానము భేదము అను మూఁడుపాయములు చెప్పఁబడినవి. ఈ మూఁడుపాయములచేఁ గార్యము సాధింప సాధ్యపడ దేని యప్పుడు దండ మను నాలుగవ యుపాయము నవలంబింపఁ దగు నని నీతిశాస్త్రమందుఁ పండితశ్రేష్ఠులు చెప్పుచున్నారు. మొదటి మూఁడుపాయములు యత్నింపకయే యుద్ధమునకు దిగుట శాస్త్రవిరుద్ధము.

సామాదీనా ముపాయానాం । త్రయాణాం విఫలేన యే । వినయే న్నయ సంపన్నో దండం దండ్యేషు ధర్మభృత్ ॥ అని కామందకము.

చం. అమలినరాజ్యతంత్రములయందు విరక్తునిమీఁద, నింద్రియ
ప్రమదనురక్తి హెచ్చరిక ♦ వాసిన యాతనిమీఁద, దైవసా
హ్యము గనరానివానిపయి ♦ నర్భకభీరులమీఁద, మంత్రియు
క్తముగ విమర్శ సల్పి మతి ♦ దండముఁ బూన జయంబు సిద్ధమౌ. ౧౬౮

అర్థములు. ఇంద్రియ ప్రమదనురక్తిన్ = ఇంద్రియములను సంతోష పెట్టు ననురాగముచే, అర్భక, భీరులమీఁదన్ = పిల్లవాండ్రమీఁద, పిఱికి వాండ్రమీఁద "బాలో వృద్ధో దీర్ఘరోగీ, తథా జ్ఞాతిబహిష్కృతః । భీరుకో భీరుకజనో, లుబ్ధో

లుబ్ధజన స్తథా । విర క్తప్రకృతిశ్చైవ, విషయే ష్వతిసక్తిమాన్ । అనేకచిత్తమంత్రశ్చ, దేవబ్రాహ్మణనిందకః । దైవోపహతక శ్చైవ దైవచింతక ఏవచ । దుర్భిక్షవ్యసనోపేతో బలవ్యసనసంయుతః । అదేశస్థో బహురిపు ర్యుక్తో కాలే న యశ్చ సః। సత్యధర్మవ్యపేతశ్చ, వింశతిః పురుషా అమీ । ఏతైస్సంధిం న కుర్వీత విగృహ్ణీయా త్తు కేవలమ్॥" కామందకము.

తాత్పర్యము.

మనవారు యుద్ధమును బాగడుచున్నారు గదా! ఎవరితో యుద్ధము చేసిన గెలుపు గలుగు నని శాస్త్రము చెప్పుచున్నదో వినుము. రాజ్యకార్యములయందుఁ బ్రీతిలేక యుండువానిమీఁద, ఇంద్రియములకు సంతోషము గలిగించుటయందు నాసక్తిగలవానిమీఁద, దైవ సాహాయ్యము లేనివానిమీఁద, పిల్లవాండ్రమీఁద, పిఱికివాండ్రమీఁద, కార్యాకార్యములు విమర్శించి యుద్ధము చేసినచో జయము తప్పక కలుగును.

ఉ. ఏమఱుపాటు లేదు మనఃసేన్యా, గెల్పు గొనంగఁ గోరెడిన్,
 భీమబలస్థితుండు, రణవీథిని దేఁటికి సంగరాము, దు
 ర్దామపరాక్రముండు, విజితప్రతిఘుం, డల రామభద్రుఁ డా
 రాముని నెట్లుకో ఘనపరాక్రమవృత్తి జయింపఁ జూచుటల్. ౧౬౯

అర్థములు. భీమ బలస్థితుండు = భయంకరమైన సేన గలవాఁడు - విజిత ప్రతిఘుండు = కోపమును జయించినవాఁడు - ఇట్లు చెప్పుటచేఁ గోప మనునది సేవకునివలె రమ్మనిన వచ్చును, పొమ్మనినఁ బోవును గాని స్వతంత్రించి తనంతటఁ దాను రాఁజాలదు-ప్రతిఘా రుట్ క్రుధౌ స్త్రియా మ్మని యమరుఁడు-పరాక్రమవృత్తిన్ = పరాక్రమ కార్యముచేత. 'క్రోధాత్ భవతి సమ్మోహః' యన్నట్లు కోపములేని కారణముచే మోహము లేదనియుఁ జక్కఁగా నాలోచించి కార్యము చేయుననియు భావము. కామము చెందినఁగాని క్రోధము గలుగదు. కావునఁ గ్రోధము లే దన్నప్పుడు కామము లేదని భావము. కామము క్రోధము నను రెండు నీయందుండి నీవు భ్రమపడి చేయరానిపని చేయుచున్నావు గాని, యాయన స్వస్థచిత్తుఁడై కార్యములు చేయవలసిన విధానమునఁ జేయుచున్నాఁడని భావము.

తాత్పర్యము.

మనస్సునందైనను రాముఁడు ప్రమాదపడి యుండువాఁడు కాఁడు. ఎట్టులైన జయముగోరి యుండువాఁడు - భయంకరమైన బలముగలవాఁడు - యుద్ధమునందు నాయనను గన్నెత్తిచూడ సాధ్యపడదు. నివారింపరాని పరాక్రమము గలవాఁడు- కోపమును జయించినవాఁడు - కావున నిష్కారణముగఁ గోపగింపఁడు - రామభద్రుఁ డిటువంటివాఁడు - ఇట్టివానిని పరాక్రమముచే నెట్లు జయింప సాధ్యపడును.

క. ఘోరనదీనదపతిఁ గూపారము లంఘించి యొక్కఁ • డుష్టవగుండ దరలే
ధీరత దుష్కరకార్యముఁ, దీరుచు నని యెవ్వఁడే మ • దిం దలఁచె నొకో. ౧౭౦

అర్థములు. ఘోర = భయంకరమైన - నదీనదపతిన్ = మగయేఱ్ఱు నదులకు పతియైనవాఁడు, నదులు తూర్పుగాఁ బాఱునవి - నదములు పడమరగాఁ బాఱునవి. కూపారము = సముద్రము.

తా త్ప ర్య ము.

భయంకరములైన నదములకు నదులకుఁ బతియైన సముద్రమును దాఁటి యొక్క క్రోఁతి ధైర్యముతో నసాధ్యకార్యముఁ జక్కఁ జేసికొని పోవు నని మనస్సునం దైన నెవ్వఁడైనఁ దలఁచెనా? ఏమి యీ యాశ్చర్యము.

దీనివలననే రామచంద్రమూర్తి తన కార్యము చక్కఁజేసికొనుటయందు హెచ్చరికఁ గలిగి కృషి చేయుచున్నాఁడనియు, గెల్వ నిశ్చయించినాఁడనియు, గొప్ప సేన బలము గలవాఁడనియు నేర్పడుచున్నది. ఆయన యుద్ధము చేయు విధము గుఱించి శూర్పణఖాకంపనుల వలనను వాలివధమువలనను వినియున్నాము. ఇట్టి వానిని జయించుటెట్లు?

క. బలమా లెక్కింపఁగ రా, దలవును నట్టిదియ పగఱ • కట్టియెడం గే
వలము నలక్ష్యంబుగ నిటు, పలుకఁగ న్యాయంబె యసుర • వల్లభులారా! ౧౭౧

అర్థములు. అలవు = పరాక్రమము, పగఱకు = విరోధులకు; పగవారు= పగఱు.

తా త్ప ర్య ము.

వానరాధిపతి యగు సుగ్రీవుఁడు రామునకుఁ దోడైనాఁడని వింటిమి, కంటిమి కదా! వానరసేన యెంతయైనది యెట్టిదనది మనకుఁ దెలియునుగదా. కావున రామునకు సేనాసమూహము లెక్కింపరానిదై యున్నది. పగవారికిఁ బౌరుషము గట్టిదే యైయున్నది. ఇట్టిసందర్భములందు శత్రువుల విషయమై లక్ష్యములేక మీరు రాక్షస వీరులారా! మనమే వీరులము, ఇతరవీరులు లోకమున లేరని మాటలాడవచ్చునా? ఏ విషయమున మీకంటె వారు తక్కువవారో చెప్పుఁడు.

ఉ. ఏ యపకారముం జలిపె • నేర్పడఁ జెప్పుఁడు రాఘవుండు దై
తేయకులాగ్రగణ్యునకుఁ • దేరకుఁ దా మును మున్న యీతఁడే
యా యవనీందు భార్యను వ • నాంతరవీథి హరించి తెచ్చె, న
న్యాయచరిత్రు డెవ్వఁడిదొ • యాడుఁడి యెవ్వరొ వైరకారకుల్ ? ౧౭౨

తా త్ప ర్య ము.

రామునిమీఁదికి యుద్ధమునకుఁ బోయెద మని పలుకుచున్నారు గదా. ఏమి కారణము? ఆయన మీకుఁ జేసిన యపకార మేది? తన దూతచేత మన నగరము తగులఁ బెట్టించి మన వారిని జంపించెఁ గదా యందురేమో. ఏల యిట్లు

చేసెను ? తొలుత నెవ్వరి కెవ్వ రపకారము చేసిరి ! రాముఁడే మైన మన రాక్షస రాజునకు నపకారము చేసెనా ? ఈయనయే కదా ముందుగాఁ బోయి యెందో యడవిలో నున్న రాముని భార్యను హరించి తెచ్చెను. ఇం దన్యాయ మెవరిది ? కలహమునకుఁ గాలు ద్రివ్వినవా రెవ్వరు ? ఆయన భార్యను హరించి తెచ్చుటయే గాక యాయన తన భార్యను మఱల గ్రహించుటకుఁ జేయు ప్రయత్నము దోష యుక్త మందురా ? సీతాదేవి యిందు లేదేని వానరుఁ డిందు వచ్చి యుండునా ? అంత పని చేసి యుండునా ? ఇదియేల మీ రాలోచింపరు. మీ భార్యలను బరులు హరించిన మీ రూరకుందురా ? కుంభీనసిని మధుఁడు హరించినప్పుడు వాని మీఁదికి మీరు యుద్ధమునకుఁ బోలేదా ? మీరు చేసిన నొప్పు, పరులు చేసిన తప్పా?

ఉ. రాముఁడు గాఁడె మున్ను ఖర ♦ రాక్షసునిం దునుమాడె నందురా !
యా మనుజాశనుండె కద ♦ యాతని పైపడిపోయెఁ జివ్వకై ?
భూమిని నెల్లప్రాణులను ♦ బూని యథాస్వబలంబుగాఁ దముం
దాము సురక్షసేత తగ ♦ దా? యది దోషమె మీర చెప్పుఁడా? ౧౨౩

అర్థములు. చివ్వకై = యుద్ధమునకై, యథాస్వబలఁబుగా = వారి వారి బలము కొలఁది.

తాత్పర్యము.

విభీషణా ! నీవు చెప్పునది సరిగాదు - ఖరాదులను ముందు రాముఁడు చంపుటచేఁగదా రాక్షసరాజు రాముని భార్యను హరించెను. కావునఁ గలహాకారకుఁడు రాముఁడే యందురా ? రాముఁడు ఖరాదులమీఁదికి దండెత్తి వచ్చెనా ? ఖరుఁడు రామునిమీఁదికి దండెత్తి పోయెనా ? ఖరుఁడేకదా పోయినవాఁడు - తన ప్రాణమున కపాయము వచ్చినప్పుడు వారి శక్తికొలఁదిఁ దమ్ముఁ దాము రక్షించుకొనుట లోకమునఁ గలిగిన విషయమేకదా - అట్లులే తన్నుఁ దాను రాముఁడు రక్షించుకొనినఁ దప్పేమి? మీ ప్రాణముమీఁదికి వచ్చినపుడు మిమ్ము మీరు రక్షించుకొనరా ?

ఇచ్చట మఱియొక ప్రశ్న రావలసినదే - రాలేదు. శూర్పణఖ ముక్కు చెవులు కోయుటచేఁగదా ఖరుఁడు యుద్ధమునకుఁబోయెనని రాముఁడే కలహాకారకుఁడని వాదము రావలసినదే - అది వచ్చినయెడల శూర్పణఖ అంకు బైటపడును - ఇప్పటికే రాక్షసుల కందఱకు శూర్పణఖ అంకాడఁబోయి ముక్కు సెవులు పోఁగొట్టుకొనె ననియు నదియే కలహకారకు రాలనియు లంకలోనివారికిఁ దెలియును. సీతాదేవివలన నిది వెలువడియుండును. రాక్షసుల కందఱకు నీ విషయము దెలియునని ౨౧౯౯ - ౨౨౦౦- ౨౨౦౧ పద్యములవలన స్పష్టపడును.

క. పరదారహరణ మెప్పుడుఁ, గర మపకీర్తిని ఘటించుఁ ♦ గలుషముఁ బెంచుఁ
హరియించు నాయు వర్ధముఁ, బొరి నాశము సేయుఁ గానఁ ♦ బుణ్యాజనేంద్రా.

అర్థములు. పరదారహరణము = ఇతరుల భార్యలను హరించుట.

తాత్పర్యము.

రాక్షసరాజా! యితరుల భార్యలను హరించుటవలన మిగుల నపకీర్తి కలుగును. అది పాపమును వృద్ధిచేయును. ఆయుస్సు క్షీణింపఁజేయును. అర్థము నాశము చేయును.

మ. తలఁపన్ జానకికారణంబుగ సముత్పాదితంబై నీ యెల్లవా
రలకున్ భూరిభయంబు; నిక్కము నిది, కార్యం బామెఁ బో విడుటల్;
కలహార్థం బగు కార్యముం దెలుప బ్రోవా? యూనటం చంపవే
కలహంబే నిజమని యెంచి యిక లంకన్ సీతతోఁ జూడుమా. ౧౨౫

తాత్పర్యము.

ఈ లంకలోని నాకీ సేవకు సహాయము కలుగుటకు సీతయే కారణము. ఆమె యిందుండుట వలన నా మునుపటి సుఖము తప్పెను. కావున నశించెదము. అదియే తగిన కార్యము. విభీషణా! నేను రామునియెడ సీతను తీసికొని రాలేదు. రాముఁడు ఖరాదులను జంపెను. కావున యుద్ధమునకు రాముని పిలిచెను. అతనిని యుద్ధమునకు లాగుటకై సీతను దెచ్చితి నంటివా? అట్లు యుద్ధమే నీకు ముఖ్యోద్దేశ మగునని సీతతో లంకలో నేమి పని? సీత లేకుండినను మనము నా మీఁదికి యుద్ధమునకుఁ బోరాదా? నా తమ్ములను జంపిన కారణముచే నేను యుద్ధమునకుఁ బోయిన నది లోకము మెచ్చు కార్యమై యుండును. అప్పుడే నీ వీ పని చేసియుండిన రామునకు వానరసేనాసంపత్తి లభించి యుండదు. నా తమ్ముఁడు మఱియు లేనిచో కాన సులభముగా జయించి యుందువు? వారు వచ్చి మన యూరిపైఁ బడుచుందురు గదా. అటుగాక నీవు వక్రమార్గము నవలంబించి సీతను దెచ్చుటచే వారెంత బలసంపత్తి గలవారైరో చూడుము. నీ కెట్టి యపఖ్యాతి వచ్చెనో యాలోచింపుము.

క. సారబలిష్ఠుఁడు ధర్మా,చారరతుం డట్టి రామచంద్రునితో ని
ష్కారణవైరము దగునే?, శ్రీరామున కప్పగింపు ♦ సీతాదేవిన్. ౧౨౬

అర్థములు. సారబలిష్ఠుఁడు = దృఢమైన మహాబలము గలవాఁడు, ధర్మాచారరతుఁడు = ధర్మముతోఁ గూడిన నడవడియం దాసక్తి గలవాఁడు.

తాత్పర్యము.

అన్నా! రామచంద్రమూర్తి సామాన్య బలముగలవాఁడు కాఁడు. సారవంతమైన మహాబలము గలవాఁడు. ఇట్లు దేహబలమునకుఁ దోడు ధర్మపునడవడి యందాసక్తిగల వాఁడు. ధర్మమున్న చోట జయముండును. కావున ధర్మబలము, దాని వెంట దైవబలము గలవాఁడు. అటువంటి రామచంద్రునితో నీవు కారణములేక కలహమునకు దిగుట నరిరాదు. కావున సీతాదేవిని శ్రీరామున కర్పింపుము.

క. చారుమణిసంకులము హయ,వారణయుక్తంబు లంక ♦ పరబాణాళిన్
దారితము గాక మున్నే, శ్రీరామున కప్పగింపు ♦ సీతాదేవిన్. ౧౨౭

అర్థములు. చారుమణి సంకులము = అందములైన రత్నములచే నిండి హయ వారణ యుక్తంబు = గుఱ్ఱములతోను; ఏనుగులతోను గూడినది, పర శరైః = శత్రువుల బాణసమూహములచే, దారితము = చీల్పఁబడినది.

తాత్పర్యము.

మనోహరము లగు రత్నములచే నిండినదియు, గుఱ్ఱములు, ఏనుగులు గలదియు నగు లంక శత్రువుల బాణములచే భిన్నముగాక ముందే సీతాదేవిని శ్రీరామున కర్పింపుము.

క. ఘోరము దుర్ధర్షము కపి,వారము మానపురికి లగ్గ♦పట్టక మునుపే
పేరిమి యొసఁగఁగఁ దండ్రీ, శ్రీరామున కప్పగింపు ♦ సీతాదేవిన్. ౧౭౮

అర్థములు. దుర్ధర్షము = తిరస్కరింపరానిది, పేరిమి = గొప్పతనము,

తాత్పర్యము.

తండ్రీ! ఘోరమై తిరస్కరింపరానిదై వానరసేన లంకకోటలకు లగ్గలు పట్టక ముందే సీతాదేవిని శ్రీరామున కర్పించుట గౌరవకరము.

కం. మానవభోజులతో లం,కానగరము నాశమందు ♦ క్ష్మాసుత నీవే
మానితగతి నివేసియు, జానకిని మఱల రామ♦చంద్రున కిమ్మా. ౧౭౯

తాత్పర్యము.

నీవు సీతాదేవిని రామునకు మరల నియకపోయితివా రాక్షసులతో లంకానగరము నాశమై పోవును. గావున సీతాదేవిని మఱల రామచంద్రున కిమ్ము.

ఉ. అన్నవు గాన నిన్నిదిగో ♦ హస్తముల న్ముకుళించి వేఁడెదన్,
నన్ను ననుగ్రహింపు, దయ ♦ నా వచనంబులు చొప్పు చేయుమీ
యన్న! హితంబుఁ బథ్యమును ♦ జాడితిఁ గాని మఱొండు గాదు, క్ష్మా
కన్నను రామచంద్రునకుఁ ♦ గ్రమ్మఱఁ బుచ్చుము మేలు హెచ్చఁగన్. ౧౮౦

తాత్పర్యము.

నీవు మాకు రాజవు మాత్రమేకావు, నాకన్నవు కావున నన్న యను గౌరవముతోఁ బ్రేమముతో నమస్కరించి చెప్పుచున్నాను, నన్ననుగ్రహింపుము, నా యందు దయయుంచి నేను జెప్పినట్లు చేయుము. అన్నా! నీకు మేలయినది, పథ్యమైనది చెప్పితిని గాని విరుద్ధముగ నే నేమియుఁ జెప్పినవాఁడఁగాను. సీతాదేవిని రామచంద్రునకు మరలఁబంపుము. మనకు మేలు గలదు.

కం. శరదర్కకరనిభంబును, బురుదృఢము నవాగ్రపుంఖ♦మును నగు ధరణీ
వరు శరనికరము నిన్నుం, బొరిగొన వెడలకయు మున్న♦పుచ్చుము సీతన్. ౧౮౧

అర్థములు. శరదర్కకరనిభంబు = శరత్కాల మందలి సూర్యకిరణములతో సమానమైనది, పురుదృఢము=మిగుల గట్టిది, నవాగ్రపుంఖము = క్రొత్తదైన కొన పిడిగలది, ధరణీవర = రామచంద్రునియొక్క, శరనికరము = బాణసమూహము.

తాత్పర్యము.

విభీషణుని మాటలు రావణునకు రుచించినవి కావు. అవి వానికి గోపము హెచ్చించెను. అయినను భయపడక చెప్పుచున్నాడు.

శరత్కాల సూర్యకిరణముల వంటివి, మిగుల గట్టివి, క్రొత్తకొన పిడులు గలవి యగు రామబాణంబులు నిన్నుఁ జంపుటకై వెలువడక ముందే సీతను రామున కిమ్ము.

పంచచామరము. త్యజింపవయ్య కోపముఁ సుధర్మ సౌఖ్యనాశముఁ
భజింపవయ్య సౌఖ్యకీర్తి వర్ధనంబు ధర్మముఁ
భుజింపవచ్చు భోగముల్ సపుత్రమిత్ర రాక్షస
వ్రజంబులెల్ల, సీత నిమ్ము రామభూమిభర్తకున్. ౧౮౨

తాత్పర్యము.

అయ్యా! ధర్మమును సుఖమును నాశము చేయు కోపమును వదలి పెట్టుము. సౌఖ్యము కీర్తి వృద్ధిచేయు ధర్మమును సేవింపుము. కొడుకులతో మిత్రులతో రాక్షసు లందఱు భోగములు యథాప్రకారముగ ననుభవింప వచ్చును. కావున రామచంద్రునకు సీత నిమ్ము.

క. నావుడు విభీషణుని వా, క్యావళి నాలించి రాక్షసాధిపుఁడు వెసన్
దా వారి నెల్ల వీడి ని,జావాసముఁ జొచ్చెఁ బరిజనావళితోడన్. ౧౮౩

తాత్పర్యము.

విభీషణుఁ డిట్లు చెప్పఁగా నా మాటలు విని రావణుఁడు సభ చాలించి తరువాత నీ విషయము పరిష్కరింత మని యందఱను బోవఁబనిచి పరిచారకులతోఁ దన యింటి లోనికిఁ బోయెను.

ఇంతవఱకు హనుమంతుఁడు లంక పడిచిననాఁటి వృత్తాంతము.

—— ౧౦-వ సర్గము. విభీషణుఁడు రావణు గృహంబునకుఁ బోవుట. ——

సీ. శైలాగ్రసంచయసన్నికాశంబును, నుర్వీధరోరుశృంగోన్నతంబు
సువిభక్తకక్ష్యంబు సూరిసంయుతమును, మతిమత్సురక్తసన్మంత్రియుతము
నాప్తపర్యాప్తసు రారిరక్షితమును, శంఖనిస్వనమహాస్వానితంబు
ప్రమదావితానసంబాధితంబును దూర్య,నాదానునాదితనవ్యతలము
తే. మత్తమాతంగనిశ్శ్వాసమారుతాఢి, కాకులీకృతవాతపిహారవ్యాద్య
మతులకలకలకలితమహాపథంబు, తప్తకాంచనమత్తదంతావళంబు. ౧౮౪

అర్థములు. శైలాగ్ర=పర్వత శిఖరములయొక్క, సంచయ=సమూహముతో, సన్నికాశంబును=సమానమైనదియు, రావణు నింటిమీఁద ననేకశిఖరము లుండుటచే నీ యుపమానము, ఉర్వీధరోరుశృంగోన్నతము = పర్వతముయొక్క పెద్ద శిఖరము వలె నెత్తైనది, సువిభక్తకక్ష్యంబు = చక్కఁగా విభజింపఁబడిన తొట్టికల్లు గలది.

సూరిసంయుతమును = పండితులతోఁ గూడినది. మతిమత్ = మతిమంతులై, సురక్త = మంచి యనురాగముగలవారైన, సన్మంత్రియుతము = మంచి మంత్రులతోఁ గూడినది, ఆప్తపర్యాప్త = కార్యము నెఱవేర్చుటయందు నేర్పరులైన, అసురాదిరక్షితము = రాక్షసులచేత రక్షింపఁబడినది, శంఖనిస్వన = శంఖధ్వనులచే, మహాస్వానితంబు = మిగుల చప్పుడు గలుగఁజేయఁబడినది, ప్రమదావితాన సంబాధితంబు = వయస్సుపడుచుల సమూహముచే నిండినది, తూర్యనాద = వాద్యముల ధ్వనిచేత, అనునాదిత = ప్రతిధ్వని కలుగఁజేయఁబడిన, సవ్యతలము = మనోహరమైన ప్రదేశముగలది, మత్తమాతంగ = మదపుటేనుఁగుల, నిశ్వాసమారుత = ఊర్పుగాలులచే, అధిక = మిక్కిలి, ఆకులీకృత = కలఁతపెట్టఁబడిన, వాత = వాయువుయొక్క, విహార = సంచారముచే, హృద్యము = మనోహరమైనది, అతుల = సమానములేని, కలకల కలిత = కలకల ధ్వనులచేఁ గూడిన, మహాపథంబు = పెద్ద బాటగలది, తప్తకాంచన మత్తదంతావళంబు = మంచిబంగారుసొమ్ములు గల మదపుటేనుఁగులు గలది.

తా త్ప ర్య ము .

పర్వతశిఖరములతో సమానమైనదియు, కొండశిఖరము వలె నెత్తైనదియు, చక్కగావిభజింపఁబడిన తోట్లకట్లు కలిగియు, పండితులతోఁ గూడినదియు, బుద్ధిమంతులై రావణునందు ప్రేమ గల మంత్రులతోఁ గూడినదియు, కార్య సాధనమునందు నేర్పరులైన రాక్షసులచే రక్షింపఁబడినదియు, శంఖధ్వనిచే బోరుకొనునదియు, స్త్రీ సమూహముచే నిండినదియు ప్రతిధ్వనించుచున్న వాద్యధ్వనులు గలదియు, మదపుటేనుఁగుల యూర్పు గాలులచేఁ గలఁతచెందిన గాలివీచుటచే మనోహరమైనదియు, జనుల కిలకిల ధ్వనులు గల పెద్ద బాట గలదియు, బంగారుసొమ్ములు ధరించిన మదపుటేనుఁగులు గలదియు.

క. మరుతుల గంధర్వుల మం, దిరముల కెన యగుచు రత్న♦నికరముచే సం
భరితంబై భోగుల సుం, దరగేహము నట్లు వెలయు♦వానిౕ ద్యుతిమై. ౧౮౫

అర్థములు. ఎనయుచు = సమానమై.

తా త్ప ర్య ము .

మరుత్తులయు గంధర్వులయు నిండ్లతో సమానమై రత్నసమూహములచే నిండినదై కాంతిచే సర్పముల సుందరగృహముల వలె వెలయునదియు నగుదాని,

తే. ప్రాప్తధర్మార్థనిశ్చయుండై విభీష,ణుండు భీషణకర్ముండు♦చండభానుఁ
డభ్రపటలంబుఁ జొచ్చిన♦ట్లన్నగృహముఁ, జొచ్చెమఱునాఁటివేకువ♦శుద్ధమతిని.

అర్థములు. ప్రాప్తధర్మార్థ నిశ్చయుండు = పొందఁబడిన ధర్మమునందు నర్థమునందు నిశ్చయబుద్ధి కలవాఁడు, అనఁగా సీతాదేవిని మఱల రామచంద్రునకిచ్చుటచేతనే ధర్మము, అర్థము ప్రాప్తించు ననునిశ్చయ జ్ఞానము గలవాఁడు.

అర్థప్రాప్తి యనఁగా క్రొత్తగా ధనము లభించుట గాదు. ఉన్నది శత్రువులచేఁ జెడక దక్కుటయే. ధర్మము అర్థము చెప్పుటచేఁ గామము కూడ గ్రహింపవలెను. రావణుఁడు కామాసక్తుఁడు, జీవించినఁ గదా భార్యలతోడనైనఁ గామ మనుభవింపఁ గలఁడు. కావున దానిని బోఁగొట్టుకొనక దక్కించుకొనుటయే ప్రాప్తి. భీషణకర్మండు = భయంకరకార్యము చేయఁబూనినవాఁడు, వాస్తవమున నన్నకు మేలైన దయ్యును అతనికి నిష్టము లేనిది కావున నతనితో సాహసించి చెప్పుటకు నందఱు భయపడువారే. విభీషణుఁడు చెప్పిన మాటలు మఱియొకఁడు చెప్పియుండిన వాని తల యక్కడనే యెగిరిపడియుండును. కావున విభీషణుఁడు చేయఁదలఁచినది భయము కలిగించు కార్యమే. చండభానుఁడు = సూర్యుఁడు, అభ్రపటలంబు = మేఘసమూహము, శుద్ధమతిని = నిర్మలమైన మనస్సుతో, మఱునాఁటి వేకువ = పున్నమ నాఁటి ప్రొద్దున.

తాత్పర్యము.

అన్న గృహమును ధర్మము అర్థము ప్రాప్తించుటకు సీతాదేవిని మఱల రామచంద్రమూర్తి కిచ్చుటయే యను నిశ్చయ బుద్ధిగలవాఁడు, అపాయకర మైన యీ విషయమును రావణుతోఁ జెప్ప సాహసించిన వాఁడును నగు విభీషణుఁడు సూర్యుడు మేఘములందుఁ జొచ్చిన విధముగా నిర్మలమనస్సుతో లంకాదహనమైన మఱునాఁడు (పున్నమ) ప్రవేశించెను.

సూర్యుఁడు మేఘమండలముఁ జొచ్చె ననుటచే విభీషణునకే తేజోహాని యని సూచితము. ఇది తెలిసియు నన్న యందుఁ గల ప్రేమచేఁ బోయె నని భావము. ఈ గృహవర్ణనమునకుఁ గారణ మింతయైశ్వర్యమును బుద్ధిమాలిన యధర్మకార్యము చేసి నాశము చేసికొనఁ బోవుచున్నాఁడని తెలుపుటకే.

ఇది హనుమంతుఁడు లంకఁ గాల్చిపోయిన మఱునాఁటి వృత్తాంతము. ఉదయమున స్నానము సంధ్య దేవపూజ లొనగునవి చేయువాఁ డగుటచే నప్పుడు రావణుని మనస్సు సత్త్వగుణము కలదై యుండును. కావున నప్పుడు ధర్మవిషయము చెప్పిన నంగీకరించు నని తలఁచి వేకువనే పోయెను.

తే. భ్రాతృజయసంశ్రితంబులు ♦ పరమపుణ్య, ములును వేదవిదభిహిత♦ములును నైన
విమలపుణ్యాహరవములు ♦ వినుచు నచటి, దధిఘృతాక్షతపుష్పపా♦త్రములచేత.

అర్థములు. భ్రాతృజయసంశ్రితంబులు = అన్నజయమే ఫలముగాఁ గలవి, వేదవిత్ + అభిహితములు = వేదము తెలిసిన వారిచే నుచ్చరింపఁబడునవి, దధి = పెరుగు, ఘృత = నేయి, పుష్ప = పూలు, వీని పాత్రములచే, ఇది పై పద్యముతో నన్వయము.

తాత్పర్యము.

అన్నకు జయము గలుగవలయు నను ఫలము గలవియు మిగులఁబుణ్యవంతము

లును వేదవిదులచే నుచ్చరింపఁబడునవియు నగు పుణ్యాహవాచన మంత్రములు వినుచు అందున్న పెరుగు - నేయి - అక్షతలు - పూలు గల పాత్రలచేత,

తే. అర్చితము మంత్రవేదవి♦దవనివిబుధ, పూగముం గని రాక్షస♦పూజ్యమానుఁ
డగుచుఁ దన తేజుస న్వెల్గు ♦ నాసనస్థు, శ్రీదసోదరుఁ గనుగొని ♦ చేరి మ్రొక్కె.

అర్థములు. అర్చితము = పూజింపఁబడినది యగు, మంత్ర, వేదవిత్ + అవని విబుధ పూగమున్ = మంత్రము బ్రాహ్మణము అను వేదభాగముల నెఱింగిన బ్రాహ్మణసమూహమును, వైదికకర్మములు చేయునపుడు చెప్పఁబడు వేదభాగము మంత్ర మనఁబడును, వైదికకర్మముల విధించు వేదభాగము బ్రాహ్మణ మనఁబడును. పూజ్యమానుఁడు=గౌరవింపఁబడుచున్న వాఁడు, శ్రీదసోదరుఁ = కుబేరుని తమ్ముని, ఇది రావణు నైశ్వర్య సమృద్ధిఁ దెలుపఁ జెప్పఁబడెను.

తా త్ప ర్య ము .

పూజింపఁబడు మంత్ర, బ్రాహ్మణవేత్త లగు బ్రాహ్మణసమూహముఁ గని (ఈబ్రాహ్మణులు రాక్షసబ్రాహ్మణు లని తెలియునగు) రాక్షసులచేఁ బొగడఁబడుచుఁ దన తేజస్సుచేఁ బ్రకాశించుచు నాసన మందున్న కుబేరుని తమ్ముఁడగు రావణుఁ జేరఁ జని నమస్కరించెను.

క. ఈ రీతి మ్రొక్కి విహితా,చారవిదుఁడు నడపి యర్థా♦చర్యల రక్షో
వీరుని కనుస న్నెఱఁగి మ,హారజతాసనమునందు ♦ నాసీనుండై. ౧౨

అర్థములు. విహితాచారవిదుఁడు = ప్రభువునొద్దకుఁ బోయినప్పు డెట్లు ప్రవర్తింపవలయునో యా యాచారములను దెలిసినవాఁడు, అర్థాచర్యలఁ = కాలదేశముల ననుసరించి చేయఁదగిన కార్యములు, జయ జయ యనుట లోనైనవి, కనుసన్న = కంటితోఁ జేయఁబడిన సంజ్ఞ, మహారజతాసనము = బంగారుపీఁట.

తా త్ప ర్య ము .

ఈ రీతి నమస్కరించి ప్రభువులయొద్ద నే సమయమున నెట్లు నడువవలయునో యా యాచారముల నెఱిఁగిన వాఁడు కావున సమయోచిత చర్యల నడపి రావణుఁడు కూర్చుండు మని కనుసైఁగ చేయఁగా నది తెలిసికొని బంగారుపీఁటపై విభీషణుఁడు కూర్చుండెను.

—♦ విభీషణుఁడు రావణునకుఁ బురంబున నపశకునంబులు
పుట్టుటఁ జెప్పుట. ♦—

తే. దేశకాలార్థసంవాది ♦ దృష్టలోక,మంగళామంగళుం డట ♦ మంత్రు లెదుట
విజనముగ సాంత్వసూక్తుల♦విభుఁ బ్రసన్నుఁ, జేసికొని యిట్టు లనియె న♦శ్లిష్టఫణితి

అర్థములు. దేశకాలార్థ సంవాది = ఆ యా దేశకాలముల ప్రయోజనము ననుసరించువాఁడు, దృష్టలోక మంగళామంగళుఁడు = బాగుగఁ దెలియఁబడిన లోకము నందలి శుభాశుభములు గలవాఁడు, విజనముగఁ = మంత్రాలోచనము

నకుఁ దగని యితరజనులు లేనప్పుడు, సాంత్వసూక్తులన్ = మంచిమాటలచే, ప్రసన్నఁజేసికొని = అనుగ్రహము గలవానిఁగాఁ జేసికొని, స్పష్టమై సందేహమున కెడమీని మాటలతో.

తా త్ప ర్య ము.

దేశకాల ప్రయోజనముల ననుసరించి పోవువాఁడును, లోకుల శుభాశుభములు దెలిసిన వాఁడును, (ఏది చేసిన మేలో యేది చేసిన కీడో తెలిసినవాఁడు, ఇట్లనుటచే రావణుఁడు చేసినది కీడు కలిగించునది యని తెలిసినవాఁ డనుట) మంత్రులు వినుచుండఁగ నితరు లెవ్వరు లేని సమయమున మంచి మాటలచే ప్రభువు నకుఁ దనయం దనుగ్రహబుద్ధి కలుగఁ జేసికొని స్పష్టములై సందేహము కలిగింపనీని మాటలచే నిట్లనియె.

శా. అన్నా! జానకి యెప్డు నీ పురికి సం♦ప్రాప్తించె నాఁ డాదిగా
నెన్నంజాలని పెక్కుదుశ్శకునము ♦ ల్వీక్షింప నయ్యెం జుమీ
చెన్నారందు సుమంత్రయుక్తహవులం ♦ జేర్పంగనన్ ధూమజా
లౌన్నత్యుండు సవిస్ఫులింగుఁడు సధూ♦మార్చిర్యుతుం డగ్నియున్. ౧౬౦

అర్థములు. ఎన్నంజాలని = లెక్కలేని, సుమంత్రయుక్త హవులన్ = మంచి వీర్యవంతము లయిన మంత్రములతోఁ గూడిన హవిస్సులచే, చేర్పంగనన్ = చేర్చినప్పటికిని, ధూమజాలా + ఔన్నత్యుండు = పొగగుంపుల యాధిక్యము గలవాఁడు, సవిస్ఫులింగుఁడు = మిణుఁగురులతోఁ గూడినవాఁడు, సధూమ + అర్చిః + యుతుఁడు = పొగతోఁ గూడిన జ్వాలలతోఁ గూడినవాఁడు.

తా త్ప ర్య ము.

అన్నా! యే నాఁ డీ యూరికి సీత దాపరించెనో యా దినము మొదలు లెక్కలేని యపశకునములు పురమందుఁ గానవచ్చుచున్నవి. మంచి మంత్రములచే హవిస్సు హోమము చేసినను పొగయు మిణుఁగురులు కలవాఁడై పొగతోడి జ్వాలలు గలవాఁ డగుటచే నగ్నిహోత్రుఁడు ప్రకాశించుట లేదు.

ఆ. వంటయిండ్లలోన ♦ వైశ్వానరుని గృహంబులను వేదపాఠ♦ములు పఠింపఁ
బడెడి మందిరములఁ ♦ బాములు ప్రాఁకెడి,హవ్యములను జీమ ♦ లంటఁ దొడఁగె.

అర్థములు. వైశ్వానరుని గృహంబులందు = అగ్నిహోత్రుని యిండ్లయందు, హవ్యములను = దేవతలకై యుద్దేశించిన హోమపదార్థములు, నెయ్యిలోనైనవి.

తా త్ప ర్య ము.

వంటయిండ్లలో, అగ్నిహోత్రగృహములలో వేదములు పఠించు మందిరములలోఁ బాములు ప్రాఁకులాడుచున్నవి. హవ్యములకుఁ జీమలు పట్టుచున్నవి.

క. ఆవులు వట్టి చనెఁ దం, తావళముల మదము చెడియె ♦ దైన్యముతో మేఁ
పానంత యెలమి ముట్టవు, మావులు మన వీట విమత♦మదమానహరా! ౧౯-౮

అర్థములు. వట్టిచనెఁ = ఎండిపోయెను. మావులు = గుఱ్ఱములు, విమతుల = శత్రువుల, మదమానహరా = గర్వము మానము హరించినవాఁడా!

తాత్పర్యము.

మన నగరమందు నావుల పొదుగులందుఁ బాలెండిపోయినవి. ఏనుఁగుల మదము చెడినది. విచారపడుచుఁ గన్నుల నీళ్లు కార్చుచు గుఱ్ఱములు కొంచెమైన మేఁపు సంతోషముతో ముట్టుటలేదు.

క. ఖరములకు నొంటెలకుఁ గం, చరగాడిదలకును రాలి ♦ చనె వెండ్రుక లే
తెరువున జికిత్స చేసినఁ, బురిగొన వా భంగి బాష్ప♦ములు పొరిఁ గార్చున్.

అర్థములు. బాష్పములు = కన్నీళ్లు.

తాత్పర్యము.

స్పష్టము.

క. కాకులు గుంపులు గుంపులు, నై కఠినరవాళి నినిచె ♦ సన్నితలములఁ
బోక్రికలు నై విహరించెడిఁ, గాకారవముల విమాన♦గణములమీఁదన్. ౧౯-౫

అర్థములు. కఠినరవాళి = వినుటకుఁ బరుషములైన ధ్వనులు, నినిచెఁ = నిండించెను, కాకారవములఁ = కాకా యను ధ్వనులను.

తాత్పర్యము.

స్పష్టము.

క. గ్రద్దలు చక్రాకృతిగాఁ, బద్దుగఁ దిరుగాడి వ్రాలె ♦ భవనంబులపైఁ
బ్రొద్దుల సాయంవేళలఁ, దద్దయు వఱళులును నించె ♦ దారుణరవముల్. ౧౯-౬

అర్థములు. చక్రాకృతిగా = గుండ్రముగ, పద్దుగఁ = పందెము వేసికొన్నట్లు, వఱళులు = నక్కలు, దారుణరవముల్ = భయంకర ధ్వనులు, వఱదు బహువచనమున వఱదులు కాఁగా, లువర్ణకంబునకు ముందున్న యసంయుక్తంబులై యుదంతంబులైన డలరలకు నలఘులకారంబు బహుళంబుగ నగు. సు-వ్యా-ఆచ్ఛిక. సంధి. ౨౦ సూ.

తాత్పర్యము.

గ్రద్దలు గుండ్రముగాఁ దిరిగి యిండ్లపై వ్రాలుచున్నవి. ఉదయాస్తమాన కాలములందు నక్కలు భయంకరధ్వనులు చేయుచున్నవి.

క. పిడుగులవడువున రవములు, కడు బెడిదముగాఁగ నించెఁ ♦ గ్రవ్యాదంబుల్
విడివడి పురిగవఁకులకడ, విడువక తద్ధ్వనులు వీట ♦ వినఁగా నయ్యెన్. ౧౯-౭

అర్థములు. క్రవ్యాదంబుల్ = మాంసము దిను పులులు తోడేళ్ళు సింహములు కుక్కలు నక్కలు లోనైనవి. విడివడి = విచ్చలవిడి.

తాత్పర్యము.

మాంసము దిను మృగములు పురిగవనివాకిట నిలచి విచ్చలవిడిగా పిడుగు ధ్వనివంటి ధ్వనితో నక్కల భయంకరముగా నూరిలోకి వినవచ్చునట్లు అఱచుచున్నవి.

—♦ విభీషణుఁడు రావణునితో సీతాదేవిని శ్రీరామున కిమ్మని చెప్పుట. ♦—

క. ఈ యశుభంబుల కెల్లను, బ్రాయశ్చిత్తం బొకండు ♦ వాకొను వాఁడన్
జేయు మిఁక సీత రామున, కై యర్పింపుము క్షితీశ ♦ యభిమత మేనిన్. ౧౯౯

అర్థములు. వాకొనువాఁడన్ = చెప్పెదను. అభిమతమేనిన్ = నీ సమ్మతమైన యెడల.

తాత్పర్యము.

స్పష్టము.

క. ఇది యజ్ఞానముచేతనో, బ్రదికెడియాసలనో యిట్లు ♦ పలికితి ననుచున్
మదిఁ దలఁతు వేనియును సుర, హృదయత్రాస! యపుడు దోష ♦ మెంచకు నాపై

తాత్పర్యము.

నే నిట్లు చెప్పుటకుఁ దెలివితక్కువతనము ననుకొనినను, పిఱికితనముచే, చచ్చెదనని భయపడి చెప్పుచున్నాఁడని తలఁచినను, దేవవిరోధీ! నేను ద్రోహబుద్ధితోఁ జెప్పుచున్నానని దోష మెంచకుము.

క. పురమున నంతఃపురమునఁ, దరుణులకుం బురుషులకు ను ♦ దాహృతదోషో
త్కరములు విదితంబులు చు, మ్మరయుము నలఁతేని రాక్ష ♦ సాన్వయచంద్రా! ౨౦౦

అర్థములు. ఉదాహృత దోషోత్కరములు = నేను జెప్పిన యపశకునముల సమూహములు, విదితంబులు = తెలిసినవే, అరయుము = విచారింపుము.

తాత్పర్యము.

నేను జెప్పిన దుష్టశకునములు పురమునందు నీ యంతఃపురమునందు స్త్రీలకుఁ బురుషులకు నందఱకుఁ దెలిసినవే, రహస్యములు గావు, నేను గల్పించి చెప్పునవి కావు, నీ యిష్టమున్న యెడల వాస్తవము విచారింపుము.

క. విను నీమంత్రులు నీకున్, వినిపింపఁగ లేరు సుమ్ము ♦ వీని న్నేనో
కనినది వినినది సర్వము, వినిపింపక యుండ నాకు ♦ విహితమె యన్నా! ౨౦౧

తాత్పర్యము

నీవు చెప్పునది నిజమైన యెడల నా మంత్రులు నాకేల చెప్ప లేదందువేమో, వారు భయముచే నీకు చెప్ప లేదు. కాని వారికి నేను చెప్పినవి తెలియక కాదు. నేనో నీ తమ్ముఁడ నగుటచే నీ మేలు కోరి నేను చెప్పవలసి యున్నది. మంత్రుల కొక రాజు పోయిన మఱియొక రాజు వచ్చును. నా కన్న పోయిన మఱియొక అన్న రాఁడు గదా! కావున నన్నను బోఁగొట్టుకొన లేక చెప్పుచున్నాను. (చూ. ౨౩౩౮.ప.)

క. కావున న్యాయాన్యాయము, లో వీరా! ముందు వెనుక ♦ యోజించి మఱి కా
    గావింప వయ్య నీ యిచ్ఛావిధ మని చెప్పె నెల్ల ♦ సచివులు వినఁగన్. ౨౦౨

తా త్ప ర్య ము .

అన్నా, సీత నిచ్చుట న్యాయమో యన్యాయమో యిచ్చినఁ గలుగు ఫలమేమో యియ్యకుండినఁ గలుగు కష్టమేమో జరిగినది రాఁబోవునది యాలోచించి తరువాత నీ యిష్టము వచ్చినట్లు చేయుము. విచారింపక తొందరపడి చేయకుము అని మంత్రులందఱు వినుచుండఁ జెప్పెను.

చ. హితము మహార్థయుతము మృదుల ♦ హేతుయుతంబు వ్యతీతకాలసం
    ప్రతిశుభదంబు, సౌఖ్యదము ♦ భావిని, నొ తన తమ్ముని వాక్యముల్
    శ్రుతిఁ జొరనిచ్చి రావణుఁడు ♦ క్రోధముఁ దాలిచి యాత్మకృత్యమం
    దతిశయమైన పట్టుదల ♦ నాతనితోడ వచించె నిట్టులన్. ౨౦౩

అర్థములు. మహార్థము=గొప్ప ప్రయోజనము గలది. మృదుల=మెత్తని మాటలచేఁ జెప్పఁబడినది, హేతుయుతము = యుక్తియుక్తమైనది, వ్యతీతకాల = కడచిన కాలమునకు, సంప్రతి = వర్తమాన కాలమునకు, శుభదంబు = మేలిచ్చునది, విభీషణుఁడు చెప్పిన మాట విన్న యెడల నిదివఱకుఁ గలిగిన సీతాపహరణ దోషము, దానివలనఁ బ్రాప్తించిన యపకీర్తి తొలఁగును కావున భూతకాలహితము. ఇప్పుడును విచారము లేక యుండవచ్చును గావున వర్తమానకాలహితము. భావిని = రాగల కాలమందు, సౌఖ్యదము=అందఱు జీవించి యుండుటచే సౌఖ్యము నిచ్చునది, ధర్మవర్ధకము గావున భవిష్యత్కాలహితము.

తా త్ప ర్య ము .

హితమైనవియు గొప్పప్రయోజనము గలవియు మృదుత్వముతోఁగూడినవియు యుక్తియుక్తమైనవియు, కడచిన కాలమునను, వర్తమాన కాలమునను, భవిష్యత్కాలమునను శుభము సౌఖ్యము కలిగించునవియును నగు దన తమ్ముఁడు చెప్పిన వాక్యములు చెవిఁ జొరనిచ్చి రావణుఁడు కోపించి దానఁ జేయఁబూనిన పనియందే యెక్కువ పట్టుదల గలవాఁడై యీ విధముగ నతనితోఁ జెప్పెను.

ఉ. ఏమిర వచ్చె నంతభయ ♦ మీయెడ నా? కది యట్టు లుండనీ
    రాముఁడు డాయునే జనక ♦ రాజకుమారిక? నెట్లు చూచినన్
    సామరసంఘశత్రుఁడయి ♦ యాలము చేయఁగఁ బూనె నేనియున్
    రాముఁడె నిల్చువాఁడు రణ ♦ రంగమునందు మదగ్రధారిణిన్?

అర్థములు. సామర సంఘ శత్రుఁడయి = దేవతా సమూహముల తోడ, నింద్రునితోడ, ఆలము = యుద్ధము, మదగ్రధారిణిన్ = నా యెదుట,

తా త్ప ర్య ము .

ఇప్పు డేమిరా నా కంత ప్రాణభయము వచ్చెను. అదట్టు లుండనీ, కాని

రాముఁడు సీతాదేవి సమీపమున నైన రాఁగలఁడా? దేవతలతోడి యింద్రునిగూడి యుద్ధము చేయఁబూనినను రాముఁడు నా యెదుట నిలువఁ గలఁడా?

క. అని నిర్జరసైన్య విమర్దనుఁడు మహాచండబలుఁడు ♦ దశవదనుండుర్
దనయనుజుని హితవాదిని, ననఘు విభీషణుని విడిచి ♦ యవలకుఁ జనియెన్. ౨౦౫

అర్థములు. నిర్జర సైన్య విమర్దనుఁడు = దేవతాసైన్యమును మర్దించిన వాఁడు; మహాచండబలుఁడు = మిగుల తీక్ష్ణమైన బలము గలవాఁడు, హితవాదిని = మేలు చెప్పు వానిని, అనఘున్ = ద్వేషాసూయాది దోషరహితుని.

తాత్పర్యము.

ఈ ప్రకారము చెప్పి దేవతాసేనను దండించిన వాఁడును మిగుల జండబలుండును (అను గర్వము గలిగి రాముని ధిక్కరించిన) పది తలలు గల వాఁడును నగు రావణుఁడు తన తోఁడఁబుట్టిన వాఁడును తన మేలు గోరి చెప్పు వాఁడును నిర్దోషియు నగు విభీషణుని విడిచి లేచి యావలఁ బోయెను. అంగట యెదుట నతని నేమియు ననలేక తానే లేచిపోయెను.

— ♦ ౧౧-వ సర్గము. రావణుఁడు కొలువు కూటంబునకుఁ బోవుట. ♦ —

క. హితుల యనాదృతిని స్వయం,కృత సీతాహరణ పాప♦కృతిచే సీతా
తత కామమోహితుం డగు, పతితుఁడు రావణుఁడు చిక్కఁ♦బాఱుచు నుండెన్.

అర్థములు. హితుల యనాదృతిని = తన మేలు గోరు వారే తన్ననాదరించిరి గదా యనియు, తన యభిప్రాయమునకు విరోధముగ విభీషణుఁడు చెప్పినపుడు తక్కిన మంత్రులందరు విని యూరకుండిరి గాని నీవు చెప్పినది సరి కాదని యతనిని నాక్షేపింప కుండుటచే వారును వాని యభిప్రాయముతో నేకీభవించినవారే యని రావణుఁడు గ్రహించి తన్నలక్ష్యము చేసిరని యెంచెను. స్వయంకృత = తానుఁగా జేసికొనిన, సీతాహరణ = సీతను హరించుట యనెడి, పాపకృతిచే = పాపపుఁ గార్యము చేతను, సీతాతత కామమోహితుండు = సీతయందు విస్తారముగఁ గల కామముచే మతిచెడిన వాఁడు, 'సుఖదుఃఖాది జనితో మోహశ్చిత్తస్య మూఢతా'= సుఖదుఃఖాదుల వలన మనస్సు మౌఢ్యమును వహించుటయే మోహము, ఆకారణము చేతనే, పతితుఁడు=భ్రష్టుఁడైన వాఁడు, చిక్కఁబాఱుచు నుండెన్ = శుష్కించుచు నుండెను. శుష్కించుట యనునది యీ గడియ యం దగునది కాదు. కొంతకాలము నుండి జరుగుచుండవలెను. దీని వలన విభీషణుఁడు హనుమంతుఁడు రాకముందు కూడ నీ విషయము చెప్పుచుండి నట్లు మంత్రులు దాని నామోదించుచుండి నట్లు పాపము వృద్ధి యగు కొలఁది తేజస్సు మాఱుచున్నట్టు లేర్పడుచున్నది. కామము వృద్ధి యగు కొలఁది బుద్ధి చెడుచున్నట్టు లేర్పడుచున్నది. బుద్ధి నాశాత్ ప్రణశ్యతి యన్నట్లు పతితశబ్ద మీ నాశములను దెలుపుచున్నది.

తాత్పర్యము.

హితులగు వారనాదరణము చేసిన కారణముచేతను, తానుగాఁ జేసిన సీతాహరణ మనుపాపకార్యముచేతను, సీతయందుఁ గల కామాతిశయముచే బుద్ధినాశ మగుటను, ఆ కారణములచేఁ బలితుఁడై యాకారణమునఁ దేజోహీనుఁ డగుచు రావణుఁడు శుష్కించుచుండెను.

క. ఆలోచనకును సర్వాపుఁ, గాలము కడచనఁగ యుద్ధ♦కాలము డాయన్
గాల మిది సచివహితులతో, కాళులతో మంత్రసమున ♦ కద నని తలఁచెన్. ౨౦౭

తాత్పర్యము.

ఆలోచనకుఁ దగిన కాలము కార్యముచేయుటకు ముందటి కాలము. ముం దాలోచించి యావలఁ గార్యము చేయవలయును. అది దాఁటిపోయినది. కార్యము కానేయైనది. దానిఫల మిప్పుడు యుద్ధముచేయవలసిన కాలము వచ్చినది. ఇది యెల్ల వారితోఁ గలసి చేయవలసిన కార్యము. ఇప్పు డేమి చేయవలయు నని మంత్రులతో, హితులతో నాలోచించుటకుఁ దగిన కాల మని తలఁచెను.

సీ. బంగారు కటికీలఁ ♦ బగడాల సొమ్ములఁ, దీరిన గుఱ్ఱాల ♦ తేరి నెక్కి
మబ్బు లుఱ్ఱైడిరీతి ♦ గొబ్బున సభకునై, దశకంఠుఁ డంతటఁ దరలి చనఁగ
వాలును బలుకయు ♦ వఱలు సాధనములు, ధరియించి మున్ను గొం♦దఱు చనంగ
నానావికృతవేష ♦ నానాపరిష్కార, భూషితు లిరువంకఁ ♦ బొల్చుచుండ
తే. రథములను వీరవారణ♦రాజిమీఁద, సటన మాడెడి వాజుల ♦ పటలిమీఁద
సతిరథులు కొంద ఱెక్కి ద♦శాస్యు బలసి,కొలిచి వెనువెంట నేగిరి ♦ కొప్పరించి.

అర్థములు. వాలు = కత్తి, పలుక = డాలు, నానా పరిష్కారభూషితులు— అనేకవిధము లైన సొమ్ములు ధరించువారు, బలసి = చుట్టుకొని, కొప్పరించి = అతిశయించి,

తాత్పర్యము.

విభీషణుఁడు తనకు విరోధముగఁ జెప్పుట, తక్కిన మంత్రులు దాని నామోదించి యూరకుండుట, దీనివలనఁ దనవిషయమై భేదాభిప్రాయము గలవారు కొందఱు గల రని రావణుఁడు గ్రహించి తాను జేసినది సరి యని సభలో నందఱచేత ననిపించి తప్పనఁగలవారిని దిరస్కరింపవలయు నని సభ చేరుటకై యాలోచనశాలకు రావణుఁడు పోవుచున్నాఁడు. విభీషణునివలెఁ జెప్పినవారు మఱికొందఱు గలరు. (౨౫౭౩ పద్యము చూచునది.) కాని విభీషణువలెఁ దెగఁబడి చెప్పినవారు లేరు. వారు రావణు కోపమునకు భయపడి యూరకుండిరి.

బంగారు కిటికీలు, పగడాల సొమ్ములు గలిగి చక్కఁగా శిక్షితము లైన గుఱ్ఱములను గట్టిన రథ మెక్కి రథచక్రములు మేఘము లుఱిమినట్లు ధ్వనించుచుండఁగా రావణుఁడు సభామందిరమునకై బయలుదేఱఁగా తరవారి, డాలు ధరించి కొందఱు

ముందుగా నడచిరి. నానావిధము లైన వికారవేషములు గలవారు నానావిధము లయిన సొమ్ములు ధరించి యిరుప్రక్కల వచ్చుచుండిరి. తేర్లమీఁదఁ గొందఱు, మదపుటేనుఁగుల మీఁదఁ గొందఱు, నాట్యమాడునట్లు చిందులు ద్రొక్కు గుఱ్ఱముల మీఁదఁ గొంద ఱతిరథులు నెక్కి రావణాసురుని విశేషముగఁ జుట్టుకొని వెంటఁ బోయిరి.

క. పరిఘగదారిష్టులఁ దో,మరములఁ బరశువుల శక్తి♦మండలి శూలో
  త్కరములఁ గరములఁ దాలిచి, సురవైరులు చనిరి విబుధ♦సూదను వెంటన్.

అర్థములు. పరిఘ = ఇనుపకట్ల గుదియలు - గదా = గదలు - కొసలు లావుగా నుండు బడితలు - రిష్టుల = కత్తులను, పరశువులన్ = గండ్రగొడ్డండ్లను.

తా త్ప ర్య ము.

ఇనుపకట్ల గుదియలను, గదలను, కత్తులను, చిల్లకోలలను, గండ్రగొడ్డండ్లను శక్తులను, కట్టెలను, శూలములసమూహములను చేతులందు ధరించి కొందఱు రాక్షసులు రావణు వెంటఁ బోయిరి.

ఉ. అంతటఁ దూర్యనిస్వనము ♦ లంతట నిండె మహారవంబుగా,
  దొంతర లయ్యె శంఖముల ♦ తోరపు నాదములున్, ధరాంబరా
  క్రాంతము లయ్యె నేముల వి♦రావము, లెల్లు రహింపఁ దారకా
  కాంతిని మించె ఛత్రములు ♦ గ్రాల మహాపథమార్గగామియై. - ౨౧౦

అర్థములు. అంతటన్ = ఇట్లు రావణాసురుఁడు సభామందిరమునకై పయనింపగా - తూర్యనిస్వనములు = వాద్యధ్వనులు, అంతటన్ = అన్నిప్రదేశములందు - దొంతర లయ్యెన్ = ఒకటి వెంట నొకటి పరంపరగా నచ్చెను. దొంతులవలె నగుట దొంతర లగుట, తోరపు = అధిక మైన, స్థూలశబ్దభవము తోరము - ధరాంబరాకాంత్రము లయి=ఆక్రాంతధరాంబరములు=ఆక్రమింపఁబడిన భూమి యాకాశములు గలవి, నేముల =రథచక్రముల యంచులయొక్క, విరావము = ధ్వని, మహాపథ మార్గగామియై = మహాపథ మనెడి మార్గమునఁ బోవువాఁడై.

తా త్ప ర్య ము.

రావణుఁడు సభామందిరమునకై బయలుదేఱి ఆపెద్దబాట వెంటఁ బోఁగా వాద్యధ్వను లన్నిచోటుల పెద్దధ్వనితో నిండెను. శంఖముల పెద్దధ్వనులు పరంపరలుగా నయ్యెను. రథచక్రముల ధ్వనులు భూమి, యాకాశము నాక్రమించెను. ఛత్రములు నక్షత్రముల వలెఁ గాన నయ్యెను. పగట నక్షత్రములు గానవచ్చుట యుత్పాత సూచకము.

క. చనఁగా హాటకమంజరి, వినిచయగర్భితము స్ఫటిక ♦ విగ్రహములు నా
  ఘనచామరవ్యజనములు, దనరారె దశాస్యసవ్య ♦ దక్షిణదిశలన్. ౨౧౧

అర్థములు. హాటకమంజరి వినిచయ గర్భితము = బంగారు కమ్మల గుత్తులు

నడుమ నడుమఁ గలవి, చామర వ్యజనములు=వింజామరలు, విసనకఱ్ఱలు, సవ్యదక్షిణ దిశలఁ = ఎడమ కుడిప్రక్కలందు.

తా త్ప ర్య ము .

బంగారు పూసలగుత్తులు నడుమ నడుమ కుచ్చులవలె వ్రేలాడు నవియు, స్ఫటికములవలెఁ దెల్లనైనవియు నగు వింజామరములు, వీవనలు రావణుని యెడమకుడి వైపులందు నొప్పుచుండెను.

క. దనుజులు నేల న్నిలఁబడి, వినయంబునఁ గేలు మోడ్చి ♦ వినమితశిరులై
ఘనరథసంస్థుని దశవ, క్త్రుని మ్రొక్కరి పోవుచుండు ♦ త్రోవల నెదురై. ౨౧౨

తా త్ప ర్య ము .

పోవునప్పుడు మార్గమున నెదురైన రాక్షసులు వాహనములు దిగి నేలమీఁద నిలఁబడి వినయముతో రెండుచేతులు జోడించి తలవంచి రథముమీఁద నుండు రావణునకు మ్రొక్కిపోవుచుండిరి.

క. దేవారులు జయజయ యని, దీవింపఁగఁ గొంద ఱందుఁ ♦ దెలచుచు నుండఁ
భావితతేజుఁడు సువిహిత, మై వెండిపసిండికం♦బమై శోభితమై. ౨౧౩

అర్థములు. తెలచుచుఁ = స్తోత్రము చేయుచు, భావితతేజుఁడు=పొందఁబడిన తేజము గలవాఁడు, సువిహితమై = చక్కఁగ నిర్మింపఁ బడినదై, పసిండికంబమై = బంగారు స్తంభములు గలిగి.

'జయజయ' ఈ సంస్కృత శబ్దంబు లనుకరణ రహితంబులై ప్రయోగింపఁ బడినవి. ఆశ్చర్యసంతాపాద్యర్థంబుల ననుకరణంబు లేమి దోషంబు గాదు. "జయజయ శంకర" "అంటితి నమశ్శివాయ పాపాత్మురాల" "మనుజాశను లఁట బలు లఁట మును లఁట యాగంబు లఁట నమో విశ్వసృజే విన మెన్నఁడు" ఉ. హరివంశము. "లింగ నివాస మేమియును లేమికిఁ జొక్కి నమశ్శివాయ చేయంగల కార్య మెద్ది" కాళహస్తి. "ఆరగింపుఁడు లెండు మీ కమృత మస్తు" శ్రీనాథుఁడు. భీమఖండము. ఇత్యాది.

తా త్ప ర్య ము .

కొందఱు రాక్షసులు జయజయ యని దీవింపఁగా, కొందఱు స్తోత్రము చేయుచుండఁగా తేజముతోఁ గూడిన రావణుఁడు చక్కఁగా నిర్మింపఁబడి వెండి బంగారు స్తంభములు గలదై, ప్రకాశించునదియై,

తే. అమలిన స్ఫటికాంతర ♦ మగుచుఁ బైఁడి, పట్టుసరిగల రత్నకం♦బళము గలిగి
యాఱునూర్లపిసాసు ల♦హర్నిశంబుఁ, గాచు భవనోత్తమము విశ్వ♦కర్మకృతము.

అర్థములు. అమలిన స్ఫటికాంతరము = నిర్మలము లైన స్ఫటికశిలలచే నడుమ నడుమఁ గూర్పఁబడినది, అహర్నిశంబు = రాత్రియుఁ బగలు, ఎల్ల వేళల నని భావము - సమాహార ద్వంద్వము - ఏకవచనము.

తా త్ప ర్య ము .

నడుమనడుమ స్ఫటికములు గూర్పఁబడి పట్టు సరిగ గల రత్నకంబళము పఱచి ఆఱువందల పిశాచములు రాత్రి పగలు విడువక కాచియుండు నదియు, విశ్వకర్మ నిర్మితము నగు మందిరము.

క. రయమునఁ జొచ్చి విదూరజ, మయముం బ్రియకాజినాభిమండితము నుపా
శ్రయరాజిత మయిన సము,చ్ఛ్రియ పరమాసనముఁ గొనుచు రావణుఁ డంతన్.

అర్థములు. ప్రియకాజినాభిమండితము = చిత్ర వర్ణముగల జింకచర్మముచే నలంకరింపఁబడినది, ఉపాశ్రియ రాజితము=ఆనుకొనుటకు నొఱగు దిండ్లచేఁ బ్రకాశించునది, సముచ్ఛ్రియ = ఎత్తైన, పరమాసనము = గొప్ప పీఠము.

తా త్ప ర్య ము .

కార్యము తీవర పెట్టుటచేఁ దొందరగాఁ బ్రవేశించి వైడూర్యములతో నిండి చిత్రవర్ణపు జింకచర్మముచే నలంకరింపఁబడి యొఱగుదిండుగల యెత్తైన యుత్త మాసనమునఁ గూర్చుండి రావణుఁడు, ఆ పిమ్మట.

—— రావణుఁ డెల్ల రాక్షసుల సభకు రప్పించుట ——

ఉ. దూతల వేగవంతులను దోడన పిల్చి జవంబున న్మహా
జ్జాతమునై సమర్థ్యము విచార్యమునై పని యొండు గల్గె మీ
రాతతవేగయుక్తి సభకై చనుదెం డని సర్వరాక్షస
వ్రాతముఁ బిల్చిరం డనిన వారును నేగి పురంబులోనికిన్. ౨౧౮

అర్థములు. వేగవంతులను=వేగముగఁ బోఁగలవారిని, తోడన = వెంటనే-కూర్చుండి కూర్చుండక ముందే, మహత్+జాతము = గొప్పవారివలనఁ గలిగినది. ఇట్లు చెప్పుటచే రామలక్ష్మణులు వానర సేనతో వచ్చి సముద్రతీరమున దిగి రని సూచితము. దూతలకుఁ జెప్పుటకావున నింత కెక్కున యిచ్చుటఁ జెప్పలేదు గాని సభలో రామలక్ష్మణులు వేలావనిఁ జేరినా రనియే చెప్పెను. (ప-౨౩౯) కావుననే యీ తొందర. సమర్థ్యము=సమర్థులు సాధింపఁదగినది, విచార్యము = సాధనమార్గ మాలోచింపఁదగినది, ఆతతవేగ యుక్తిన్ = మిగుల వేగముగ.

తా త్ప ర్య ము .

రావణుఁ డాసనమునఁ గూర్చుండి కూర్చుండక ముందే వేగముగఁ బోవఁ గల దూతలఁ బిలిచి మీరు త్వరగాఁబోయి రాక్షసుల నందఱను గొప్పవారివలనఁ గలిగినదై, సమర్థులు నిర్వహింపఁదగినదై, కావుననే యాలోచింపఁదగిన పని యొకటి గలిగెను, మీరంద ఱతివేగమున రం డని పిలచి రండని చెప్పఁగా వా రంద ఱూరి లోనికిఁ బోయి.

క. ఇల్లిల్లు తోఁటదొడ్డులు, సల్లలితవిహారదేశసమితిఁ గనుచు వా
రెల్లరఁ బిలిచిరి మఱి నిద్రిల్లెడివారలను గూడ దిగు లేది వెసన్. ౨౧౯

అర్థములు. సల్లలిత విహార దేశసమితి = మనోహరమై విహరింపఁ దగిన ప్రదేశ సమూహములను, దిగు లేది=భయములేక, ఇల్లిల్లు-వీప్సయందు ద్విరుక్తి. ఒక యిల్లు, అవల మరియొక యిల్లు.

తా త్ప ర్య ము .

ఆ దూత లింటింటికిఁ బోయి యిండ్లయందుండు వారిని, తోటలలో దొడ్లలో నుండు వారిని, క్రీడావిహారప్రదేశములం దుండువారిని, నిద్రపోవుచుండు వారినిగూడ దిగులు లేక రాజాజ్ఞ కావున లేపి పిలచిరి.

ఉ. కొందఱు స్యందనంబులను ♦ గొందఱు భూరిమదావళంబులన్
గొందఱు సైంధవంబులను ♦ గొందఱు కాల్నడ వచ్చుచుండఁగా
సందడితేర్ల వారణహ♦యంబులచే నగరంబు రాజిలెన్
గ్రందుగఁ బక్షిసంఘములు ♦ గ్రమ్మి రహించు నభంబుకైవడిన్. ౨౧

అర్థములు. స్యందనంబులను = రథములమీఁదను, భూరిమదావళంబులన్ = పెద్దయేనుఁగులమీఁదను, సైంధవంబులను = గుఱ్ఱములమీఁదను, పక్షిసంఘములు గ్రమ్మి రహించు నభంబుకైవడిన్ - అనుటచేతను నుదయమే సూచితము, ఆహారము నకై గూండ్లు విడిచి యుదయముననే కదా పక్షులు పోవును.

తా త్ప ర్య ము.

ఇట్లు దూతలు పిలువఁగానే రాక్షసులు కొందఱు రథముల నెక్కియుఁ, గొంద ఱేనుఁగుల నెక్కియుఁ, గొందఱు గుఱ్ఱముల నెక్కియు, గొందఱు నడచియు వచ్చుచుండఁగా వారల తేర్లచే, నేనుఁగులచే, గుఱ్ఱములచే నగరము పక్షులగుంపులు గ్రమ్మిన యాకాశము వలె నుండెను.

ఉ. యానము లెల్ల దూరతల♦మందున నిల్పి పదప్రచారులై
లోనికి బోఁకు లెల్ల గుహ♦లోనికిఁ బోవు మృగాధినాథులో
నా నయ మార నేగి సుర♦నాయకగర్వవిదారిపాదముల్
పూని కరంబులన్ మరలఁ ♦ బూజితులై యుచితత్వ మేర్పడన్. ౨౪

అర్థములు. దూరతలమందున = దూరప్రదేశమునందే, సురనాయక గర్వ విదారి = ఇంద్రుని పొగ రణఁచిన రావణుని, పూజితులై =సమ్మానింపఁబడినవారై, ఉచితత్వ మేర్పడన్ = వారివారి యోగ్యతకుఁ దగినట్లు.

తా త్ప ర్య ము .

వారివారి వాహనముల నన్నిటిని దూరమునందే నిలిపి దిగి కాలినడకతో గుహలోనికిఁ బోవు సింహములవలె సభలోనికిఁ బోయి రావణుని పాదములంటి నమస్కరించి మరల గౌరవింపఁబడినవారై వారి వారి యోగ్యతకుఁ దగినట్లు.

క. కొందఱు పీఁటల మఱియుం, గొందఱు దర్భాసనములఁ ♦ గొందఱు నేలన్
బృందారకరిపుశాసన, మొంది యతని మ్రోల నెల్ల ♦ రుపవిష్టులుగాన్. ౨౦

అర్థములు. బృందారకరిపు శాసనము = దేవవిరోధి యగు రావణునాజ్ఞ, ఉపవిష్టులు = కూర్చుండినవారు.

తాత్పర్యము.

పురోహితులు లోనగు వారు పీటలమీఁదను, శ్రోత్రియులు దర్భాసనముల మీఁదను, కొందఱు లోనగువారు నేలఁ బఱచిన కంబళ్ళమీఁదను రావణు నాజ్ఞ ప్రకారము కూర్చుండిరి.

సీ. అర్థనిశ్చయ సము♦న్నాత్మ్ములౌ పండితుల్, సర్వజ్ఞులును బుద్ధి♦చక్షువులును
గుణయుక్తు లగు మంత్రి♦కుంజరుల్ నూఱుగుఁ, గొలఁదిగ నుండిరి ♦ కూటమునను
యోధులు పెక్కురు ♦ నొప్పి రా యాస్థాని,సందఱుఁ బతిసేమ ♦ మారయుటకు
నపుడు విశాలమై ♦ హాటకచిత్రితం, బగు మేలిగుఱ్ఱాల♦స్యందనమున
తే. వరయశశ్శాలియు మహాను♦భావుఁ డైన, యవ్విభీషణుఁ డరుదెంచి ♦ యన్న కాళ్ళ
తనదు పేరు వచించి పా♦దముల మ్రొక్కె, నట్ల శుకుఁడు ప్రహస్తుఁడు ♦ నాచరించె.

అర్థములు. ఆ సభయందు వెళ్ళినవా రెందఱనిన:—అర్థ నిశ్చయ సమర్థాత్ములు = ఈ కార్యమిటు చేసిన బాగు, ఇటు చేసిన నోగు అని నిర్ణయించి చెప్పఁగల మనస్సు గలవారు, పండితుల్ = సకల శాస్త్రవేత్తలు, సర్వజ్ఞులు = ఏ విషయ మడిగినను జెప్పఁగలవారు, బుద్ధిచక్షువులు = జ్ఞాన మనెడి కన్ను గలవారు, శాస్త్రము నాధారము చేసికొని యింద్రియ గోచరములుగాని వానిని బుద్ధిబలముచేఁ జెప్పఁగలవారు. గుణయుక్తులు = మంచిగుణములు గలవారు, మంత్రికుంజరుల్ = మంత్రిశ్రేష్ఠులు. ఆస్థాని = సభయందు.

తాత్పర్యము.

కార్యము నిశ్చయించు సామర్థ్యముగల మనస్సుగల పండితులు, సర్వము దెలిసినవారు, జ్ఞాననేత్రము గలవారు, గుణవంతులు నగు మంత్రిశ్రేష్ఠులును ఆ సభ యందు వందలకొలందిగ నుండిరి. యుద్ధనిపుణులైన వారనేకులా సభయందుండిరి. వీరంద ఱున్నట్టుండి తమ్ముఁ బిలిపించుటచే నేమి యపాయము వచ్చెనో యని రావణుని క్షేమము విచారింప వచ్చిరి. అపుడు వెడలుపై బంగారు నగలు ధరించిన గుఱ్ఱాలు కట్టిన తేరెక్కి గొప్పకీర్తిగలవాఁడును, మహానుభావుఁ డైన విభీషణుఁడు వచ్చి యన్న యొద్దకుఁ బోయి పాదములు స్పృశించి తనపేరు చెప్పి నమస్కరించెను. ఆ ప్రకారమే శుకుఁడు, ప్రహస్తుఁడు చేసిరి.

క. వారల కుచితాసనముల, వేరుగఁ బతి యొసఁగ వారు ♦ వెలసిరి వానన్
సారపరార్థ్యాగురు క, ర్పూరస్రక్సురభి గొనుచుఁ ♦ బొలిచెఁ బవనుఁ డున్. ౨౨౨

అర్థములు. ఉచితాసనములు = తగిన యాసనములు, వేరుగన్ = వేర్వేరుగ—వేరు వేఱు అని రెండురూపములు గలవు. 'కౌరవుల సేన మెల్ల వేర్వేర నడిగె' నని భార, ఉద్యో ౨ ఆ - వానన్ = వానియందు, అది యిది యెది యనువానికి

దృతీయాసప్తమ్యేక వచనంబులందు దాన, దీన, దేన ననియు, వానిబహువచనంబుల యందు వాన, వీన, వేన ననియు రూపంబులు, పౌ్రి-వ్యా-సర్వా-ఋ-అసూ-సార=సత్తువ గల, పరార్థ్య = శ్రేష్ఠమైన, అగురు, కర్పూర, స్రక్ సురభి= అగురు యొక్కయు, పచ్చకర్పూరముయొక్కయు, పూలదండల యొక్కయు పరిమళమును.

తా త్ప ర్య ము.

వారికిఁ దగిన యాసనములు వేఱుగ నేర్పాటు చేయఁగా వానియందు వారు కూర్చుండిరి. శ్రేష్ఠమైన అగరు, పచ్చకర్పూరము, పూలదండలు వీని వాసన గ్రహించి గాలి కమ్మగ వీచెను.

ఉ. గట్టిగఁ బల్కఁ డెవ్వఁడు నొ♦కండును సక్రమవాది లేఁ డట్టుల్
మట్టును మీఱి సద్దిడఁడు ♦ మానవభోజుల నొక్కఁ డేని ద్ర
త్యేట్టుని యాసనంబుఁ గను ♦ చెల్లరు ధీరులు వీరు లుండ స్వా
రాట్టు వసుల్ భజింపఁగను ♦ రాజిలు భంగి సతండు రాజిలెన్. ౨౩

అర్థములు. సద్దిడఁడు = చప్పుడు చేయఁడు, ద్రైత్యేట్టుని = రాక్షసశ్రేష్ఠుని యొక్క, ఆసనంబు=ముఖము, ధీరులు=పండితులు, వీరులు=శూరులు, స్వారాట్టున్= ఇంద్రుని, వసుల్ = వసువులు, స్వర్ + రాట్టు = స్వారాట్టు.

తా త్ప ర్య ము.

ఆ రాక్షసులలో నొకఁడైన గట్టిగ మాట లాడినవాఁడు లేఁడు, అక్రమముగా వాదించువాఁడు లేఁడు, మర్యాదఁదప్పి చప్పుడు చేసినవాఁడు లేఁడు. అందఱు ధీరులు. వీరులు. రావణుని ముఖముఁ జూచుచు నింద్రుని వసువులు గొలుచునట్లు గొలువఁగా సతండు ప్రకాశించెను.

—♦ ౧౨-వ సర్గము. రావణుఁడు రాక్షసుల సంబోధించుట ♦—

సీ. కలయంగ సభ నెల్ల♦గనుఁగొని దళవాయి, యగు ప్రహస్తునితో ద♦శాస్యుఁ డనియె
సేనాపతీ ! నీవు ♦ చెచ్చెరఁ జని చతుర్విధకళాధుర్యుల ♦ వీరవరుల
నెక్కుడు కాపుంచు♦మీ యస నతేఁడును, రాజశాసనమున ♦ రక్ష నిలిపె
వీటిలోపల మఱి ♦ వెలుపల నెల్లెడఁ, బురరక్షణార్థంబు ♦ పూర్ణముగను
ఆ. వేఱు వేఱ యసుర♦వీరుల నిటు నిల్పి, సర్వసైన్యములను ♦ సకలదిశల
రక్ష నిలిపినాఁడ రాక్షసవల్లభ!, శంక లేక పనులు ♦ సలుప వచ్చు. ౨౪

అర్థములు. దళవాయి = సేనానాయకుఁడు, చతుర్విధ కళాధుర్యులన్ = నాలుగు విధములైన విద్యలయందు సమర్థులు- రథికులు, అశ్వారోహకులు (రౌతులు) గజారూఢులు - పదాతులు - (కాలిబంట్లు) అను నాలుగు విధముల యోధులు.

తా త్ప ర్య ము .

అప్పుడు రావణుఁడు సభయం దుండు వారి నందఱను సలుపక్కలఁ గలయఁ జూచి సేనానాయకుఁ డగు ప్రహస్తునితో నిట్లనియె, సేనాపతీ! నీవు త్వరగాఁ బోయి

నాలుగు విధము లగు యోధులను వీరు లగువారిని నిదివఱ కుండు కాపునకంటె నెక్కు-వగాఁ గాపుంచుము. అని చెప్పఁగా నతఁడును రాజాజ్ఞ ప్రకారము పట్టనము లోపల, వెలుపల, నన్ని ప్రదేశములందును, బట్టనము రక్షించుకొఱకు వేఱువేఱు రాక్షసుల వేఱువేఱు స్థలముల నుండ నియమించి, రాక్షసేశ్వరా! యన్ని సేనలను నన్ని ప్రదేశముల నిలిపినాఁడను, భయములేదు, సందేహము లేక మీ కార్యము మీరు చేయవచ్చును.

క. అనవుడు రాజ్యహితైషుఁడు, దనుజాధిపుఁ డతని వాక్యతతి విని సుఖమం
దనురక్తి కలిమి సుహృదులఁ, గనుగొని యిట్లనియెఁ బ్రకృత కార్యము దెలియన్.

అర్థములు. రాజ్యహితైషుఁడు = రాజ్యముయొక్క మేలు కోరువాఁడు, సుఖమందుః = తన సౌఖ్యమందు, అనురక్తి కలిమిః = అనురాగము కలుగుటచే, సుహృదులః = మిత్రులను, సుహృత్తులు - మిత్రులు - వయస్యులు నను నీ శబ్దములు పర్యాయవాచకముగ నుపయోగింపఁబడినను వానియందుఁ గొంత భేదము గలదు.

దుఃఖే విపది సంమోహే, కార్యకాలాత్యయేపి చ
హితాన్వేషీ చ హితకృత్, య స్సుహృ త్సోభిధీయతే.
సత్త్వా గార్జవరతి, రుపకుర్వ న్ప్రియం వదన్
భజతే య స్స్వయం ప్రీతిం, ప్రియ స్స పరికీర్తితః.
సమాన శీలవ్యసనో, గుహ్యాఖ్యా నైకభాజనమ్
విపత్ప్రతిక్రియాభిజ్ఞో వయస్యః పరికీర్తితః.

ఉపకారము గోరి యుపకారము చేయువాఁడు మిత్రుఁడు.

తాత్పర్యము.

ఈ ప్రకారము ప్రహస్తుఁడు చెప్పఁగా రాజ్యము మేలుగోరువాఁ డగు రావణుఁడు తన సౌఖ్యమునందలి ప్రేమచే స్నేహితుల నందఱఁ జూచి యప్పుడు సలుపఁ బూనిన కార్యము దెలియ నిట్లనియె.

రాజ్యహితము గోరినవాఁడును, తన సుఖమునం దనురక్తి గలవాఁ డనుటచే - సీతవలనఁ దాను బొందఁగోరిన సౌఖ్యమునకు హాని రాఁగూడదు. ఇది వాని ముఖ్యోద్దేశము - ఆ నిమిత్తమునఁ బ్రజలకుఁ గీడు రాఁగూడ దని భావము.

ఈ విషయము స్పష్టముగా ౨౯౯ వ పద్యమునఁ జెప్పఁబడును.

చ. అసురలు! ధర్మకామములు ♦ నర్థమునం దగు దేనిఁ బూనఁగా
వెస నని యోజనః జలుపు♦వేళల లెస్సగ దాన దాన నే
దోసఁగులు మేళ్ళు సౌఖ్యములు ♦ దుఃఖములుం బ్రియవిప్రియంబులుం
బొసఁగునో లెస్సగా నరసి ♦ పూర్ణమనీషను నిశ్చయింపుఁడీ. ౨౨౬

అర్థములు. దానఁ దానఁ=దానిచే దానిచే; (౨౨౨వ పద్య వ్యాఖ్య చూచునది) దొసఁగులు = కీడులు; పూర్ణమనీషను = నిండు మనస్సుతో.

తాత్పర్యము.

రాక్షసులారా! ధర్మము, అర్థము, కామము వీనిలో నేది చేయఁదగినది యని యాలోచించునపుడు ఏది, యేదిచేసిన కీడులు, మేళ్లు, సౌఖ్యములు, దుఃఖములు, ప్రియములు అప్రియములు కలుగునో యని లెస్సగా విచారించి యఱగొఱలేని మనస్సుతో నిశ్చయింపుఁడు.

ఉ. ఎప్పుడు నేమికార్యముల ♦ నే నొనరించిన మీర లెల్లరుం
జెప్పిన పద్ధతి న్నడతుఁ ♦ జే టొనఁగూడద యుంట నేని, నే
నప్పురుహూతుఁ డిందు మిహి♦రామరసమ్మతిఁ బోవుమాడ్కి మీ
రొప్పుగఁ జెప్పినట్లు చని ♦ యొందుదుఁ గాదె నితాంతసంపదన్. ౨౨౭

తాత్పర్యము.

మాకేది మేలో, మీకేదిమేలో నీకుఁదెలియదా, మమ్ము నడుగవలయునా యందురేమో; నాకుఁ దెలిసినను దెలియకున్నను నింతవఱకు నెప్పుడు నే నేకార్యము చేసినను మీ రందఱు చెప్పినవిధముగానే నడచుచున్నాను. దానివలన నే కార్యము చెడినది లేదు - అన్నియు ననుకూలములుగానే వచ్చెను. కావుననే యిప్పుడు మీ యాలోచనపరిశారము పోవఁదలఁచి యడుగు చున్నాను. ఆ యింద్రుఁడు, సూర్యుఁడు చంద్రుఁడు దేవతలు సమ్మతించిన మార్గమునఁ బోవునట్లు మీరు చెప్పినట్లు చేసికదా నే నీ సంపద పొందినవాఁడ నైతిని. మీరు సంపాదించి యిచ్చినది మీరేకదా కాపాడవలయును.

ఉ. మీకిది సర్వముం దెలుపఁ ♦ మేకొనియుండియుఁ గుంభకర్ణ ని
ద్రాకలితత్వముం గనుటఁ ♦ గ్రిన్నన యప్పుడ చెప్ప నైతి, న
స్తోకపునిద్ర నాఱ్నెలలు ♦ పోలెను, నిప్పుడ మేలు కాంచె, నీ
ప్రాకటసర్వశస్త్రధర♦వర్యుఁడు కావున నేఁడు చెప్పెదన్. ౨౨౮

అర్థములు. మేకొని యుండియున్ = సమ్మతించి యుండియు.

తాత్పర్యము.

ఇప్పుడు నేను మీకుఁ జెప్పఁ బోవునది సమస్తము ముందే చెప్పవలయు నని మనస్సు నం దుండెను. కాని కుంభకర్ణుఁడు నిద్ర పోవు చుండుటచేఁ దెలుప లేదు. ఆఱు నెలలు నిద్రించి యిప్పుడే మేలుకొన్నాఁడు కావున నేఁడు చెప్పఁబూనితిని.

ఆఱునెలలు కుంభకర్ణుఁడు నిద్రపోయినచో సీతాదేవిని దెచ్చి పదినెల లయినదికదా! ఆఱునెలలకు ముందు వాఁ డొకసారి మేలుకొనెఁగదా! అప్పుడేల చెప్పి యుండ రాదు? వాస్తవ మేమన, సీతను దాను దెచ్చిన విషయము రావణుఁ డెవ్వరికిఁ దెలియకుండ దాఁచెను. ఎవరికిఁ దెలియ రాదనియే తన యంతఃపురస్త్రీలు మాత్రము

సంచరించు నుద్యాన వనములో నుంచెను. కావున నంతఃపురమునకు వచ్చుచుఁ బోవు చుండువారికి మాత్రమే తెలియును. ఆఁడువారిమూలమున విభీషణాదులకుఁ దెలిసెను. హనుమంతుఁడు బహిరంగపఱచు వఱకు నగరములో ననేకులకుఁ దెలియదు. ఇంతయేల, యుద్ధమునకుఁ బోవు భటులకు నేల యుద్ధమో, యెవరితోయుద్ధమో యా గడియవఱకుఁ దెలియదు. (చూ- ప ౭౦౦) ఈ కట్టితో పాయము నేఁటి దేశాధిపతులు యుద్ధవేళల ననుసరించు చున్నారుగదా! ఇది రాజనీతియే కాని దుర్నీతి. రాజనీతి రెండువిధములు. సునీతి, దుర్నీతి యని. సునీతి ధర్మము ననుసరించి యుండును. దుర్నీతి ధర్మవిరుద్ధముగ నుండును. రాజుల కుభయనీతులం దధికారము గలదు. తక్కినవారికి దుర్నీతియం దధికారము లేదు.

—♦ రావణుఁడు రాక్షసులతో సీతావృత్తాంతముఁ జెప్పుట. ♦—

ఉ. రాముని దేవి సీతఁ బ్రియురాలి విదేహతనూజ దండకా
భూమిని నుండఁ దెచ్చితిని ♦ బుష్పసుగంధిని, మందయాన యా
భామిని నాదు శయ్యపయిఁ ♦ బండఁగ నొల్లదు, మూఁడులోకముల్
వేమఱు రోయ సీత సరి ♦ లేమ లభింప దటంచుఁ దోఁచెడిన్. ౨౭

తాత్పర్యము.

పూలవాసనవంటి వాసనగలదియు, మెల్లగా నడచునదియు నగు రాముని భార్యను, విదేహరాజుకూఁతు రగు సీతను దండకారణ్యమునుండఁగాఁ దెచ్చితిని. ఏల తెచ్చితి వందురా - మూఁడు లోకములలో వెదకినను అటువంటి సుందరి వేఱొకతె లేదు. ఆమెను నా భార్యగాఁ జేసికొనఁ దలఁచి తెచ్చితిని గాని యామె నా పాను పెక్క సమ్మతింపలేదు.

చం. తనుతరమధ్య సత్పృథులతాపరిశోభినితంబబింబ కం
జనిభవిశాలలోచనను ♦ శారదపూర్ణసుధాకరాస్య నా
కనకపుబొమ్మ సుందరిని ♦ గాంచినచో మయుఁడే సృజించెనా
వనజదళాయతాక్షి యని ♦ భావమునం దలపోఁత గల్గెడిన్. ౨౮

అర్థములు. తనుతరమధ్య = మిగుల సన్నని నడుముగల దానిని, సత్పృథులతాపరిశోభి = బలిసియుండుటచేఁ బ్రకాశించు, నితంబబింబ = పిఱుఁదులు గల దానిని, కంజనిభ = తామరలతో సమానమైన, విశాలలోచనను = వెడలుపాటి కన్నులు గలదానిని - శారదపూర్ణసుధాకరాస్య=శరత్కాలమునాఁటి నిండు చంద్రుని వంటి ముఖము గలదానిని - తలపోఁత = ఆలోచన.

తాత్పర్యము.

మిగుల సన్నని నడుము, బలసిన పిఱుఁదులు, తామరలవంటి కన్నులు, శరత్కాలము నాఁటి నిండుచంద్రునివంటి ముఖము గల యా బంగారుబొమ్మను, అందగత్తెను,

చూచినపుడు మయుఁడే దీనిని సృజించెనా యని తోఁచును. మయుఁడు దానవుఁడు కావున వాఁడు సృజించినది తాను గ్రహించుట దోషము కాదని సూచన.

తే. అరుణతలములు కడుమనో♦హరతమములు
సుప్రతిష్ఠితములు నైన ♦ సుందరాంగి
చరణములు తామ్రనఖములు ♦ చక్కఁ జూడఁ
జూఁడు నను బుష్పబాణుండు ♦ వాఁడి మెఱసి. ౨౩౧

అర్థములు. అరుణతలములు = ఎఱ్ఱని యడుగులు, సుప్రతిష్ఠితములు = చక్కఁగా నేలమోపునవి, హెచ్చుతగ్గులు లేనివి, తామ్రనఖములు = ఎఱ్ఱనిగోళ్లు, వాఁడి = పరాక్రమము.

తా త్ప ర్య ము .

ఎఱ్ఱని యడుకాళ్లు గలవియు,మిగుల మనోహరము లైనవియు, నేల చక్కఁగా మోపఁబడునవియు నగు నా సుందరి పాదములు- ఎఱ్ఱని గోళ్లు చక్కఁగాఁ జూడఁగాఁ జూడఁగా నన్ను మన్మథుఁడు పరాక్రమించి కాల్చుచున్నాఁడు.

కం. సారహుతాగ్నిజ్వాలల,తీరున నీరజహితద్యు♦తి న్వెలిఁగెడి యా
సారసదళనయనం గని, మారుని వశ మైతి ననుక♦మండనులారా. ౨౩౨

అర్థములు. సారహుతాగ్నిజ్వాలలతీరున=అగ్నియొక్క సారవంతములైనజ్వాలలు— హోమముచేయఁబడిన యగ్నిహోత్రుని సారములైనజ్వాలలవలె - (౨) సారమైన హవిస్సుచేత హోమము చేయఁబడిన యగ్నిజ్వాలలవలె- ఈయుపమానమునసీతాదేవి పవిత్రతను, తపోమహిమను దెలుపుచున్నది - నేనైతాఁకినఁ గాల్చునని యామెయే సమ్మతించువఱకుఁ గాచియున్నా నని భావము.నీరజహిత=సూర్యుని, కాంతివంటి,ద్యుతి=కాంతిచే; ఎండను జూడవచ్చునే కాని, సూర్యుని జూడ రానట్లు లామె కాంతిని జూడవచ్చునే కాని, యామెను జూడ సాధ్యపడ దని భావము - (౨) సూర్యకాంతియే మనలను దపింపఁ జేయునపుడు, సూర్యుఁ డెంత చేయ లేఁడు - అగ్నిసెగకే కమరునవి యగ్నిలోఁ బడిన నే మగును? సారసదళనయనన్= కమలముల ఱేకులవంటి కన్నులు గలదానిని, మారుని వశ మైతిన్= (౧) మన్మథుని వశమైతిని - (౨) మృత్యుదేవతకు వశ మైతిని - మారయతీతి మారః- చంపువాఁడు గావున మారుఁడు - మృఙ్ ప్రాణత్యాగే—

యుద్ధమునందుఁ జత్తునో, చావనో సందేహముగాని,సీత నాకు లభింప దేని నేను మదనతాపమునఁ జచ్చుట నిజము. కావున నేను బ్రతికియుండఁగోరిన సీత నాకుఁ దక్కు నుపాయము చెప్పు డని భావము.

తా త్ప ర్య ము .

సారవంతము లైన మంత్రములచే, హోమ ద్రవ్యములచే హోమము చేయ

బడిన యగ్నియొక్క శిఖలవలెను, సూర్యుని కిరణములవలెను వెలిఁగెడి యీ సీతను జూచి రాక్షసశ్రేష్ఠులారా! నేను మన్మథుని వశమైతిని.

అగ్నిజ్వాలలు - సూర్యునికాంతి పట్టుకొనఁబోయినఁ జేతికిఁ జిక్కనవి కావు- అట్టిదే సీతయు - ఆమెను నేను గ్రహింపఁగోరుట నా చావునకే యని ధ్వన్యర్థము - 'సత్యా వాణీ సరస్వతీ' యని కలదుకదా-ఇట్టులే ఖరుఁడు చెప్పెను - కుంభకర్ణుఁడు చెప్పఁబోవుచున్నాడు - రాఁగల యనిష్టములను ముందు వాక్కు సూచించును.

క. తీరైన యున్నసంబును, హారులు విపులంబులైన ♦ యక్షులుఁ గల యీ
నారి ముఖముఁ గని వివశత, మారుని వశ మైతి నసుర♦మండనులారా ! ౩౩

అర్థములు. ఉన్నసము = ఎత్తగు ముక్కు, హారులు = మనస్సు హరించునవి, విపులంబులు = విశాలములైనవి, అక్షులు=కన్నులు, నారి=స్త్రీ, వివశతన్= పరవశత్వముచేత, అల్లైత్రా డను సర్థమందు నారీశబ్దము దేశ్యవిశేష్య మని శబ్దరత్నాకరమందుఁ గలదు గాని "నారీ యోషితి మార్యాంచ" యని రభసుఁడు చెప్పుటచే రెండర్థము లందును నది సంస్కృత శబ్దమనియే యెఱుఁగ నగు. 'నారిఁ గూర్చి నిశాచర నారిఁగూర్చి' యనుచో రెంటను సంస్కృత శబ్దముగా గ్రహించిన రాఁగల బాధ లేదు.

తాత్పర్యము.

చక్కగాఁ దీరిన యెత్తైన ముక్కు, మనోహరములు విశాలములునైన కన్నులు గల యీ స్త్రీముఖముఁ జూచి రాక్షసులారా! మారుని వశమైతిని.

క. అలుకను ముదమునఁ దుల్యుఁడు, బలియించును శోకతాప♦భరముం గాంతిం
దొలఁగించు నట్టి స్మరుచేఁ, గలుషితచిత్తుఁడ నిశాట♦కాండములారా ! ౩౪

అర్థములు. నిశాటకాండములారా=రాక్షస సమూహములారా,అలుకను= కోపమునందు, ముదమునన్ = సంతోషమునందు, తుల్యుఁడు = సమానుఁడు, కలుషిత చిత్తుఁడను = కలఁతపెట్టఁబడిన మనస్సు గలవాఁడను (౨) పాపపు బుద్ధి గలవాఁడను, స్మరుచే - విభక్తి మార్చి యన్వయింప వలెను.

తాత్పర్యము.

ఎట్టి మన్మథుఁడు కోపమునందును, సంతోషము నందును సమానుఁడో, ఎవఁడు శోకతాపాతిశయమును అధికముచేయునో, తొలఁగించునో యట్టి మన్మథునిచేఁ గలఁత నొందిన మనస్సు గలవాఁడనైతిని.

మన్మథునకుఁ గోపము వచ్చినను, సంతోషము వచ్చినను పర్యవసానము విరహులఁ జంపుటే యనియైనఁ జెప్పవచ్చును. లేక మనుష్యులకుఁ గోపము వచ్చినను సంతోషము వచ్చినను మన్మథబాధ తప్పదనియైనఁ జెప్పవచ్చును. అక్షాదులు చచ్చి దుఃఖించుచున్నను మదనతాపము పోలేదని భావము. "ఏడ్చుచు నైకముఖ్ల విప్పువాఁ"డని సామెత కలదుగదా.

క. తనమగఁడు రామచంద్రుఁడు, చనుదెంచెడి ననెడి యాస ♦ సంవత్సరముల్
సను గడువు వేఁడెఁ దత్కా,మిని నే నా మేలిమాటఁ ♦ గైకొంటిఁ జుఁడీ. ౨౩౫

తాత్పర్యము. స్పష్టము.

సీతాదేవి గడువుగోరె ననుట యసత్యము.

క. చక్కఁగ స్వారి యొసర్చుట, మిక్కిలి వడఁబడిన తేజి♦మిహినా నేనుం
జిక్కితిఁ గాముని దాడికి, స్రుక్కితి నిది నా విధం బ♦సురవరులారా ! ౨౩౬

అర్థములు. వడఁబడిన = గాసిపడిన, తేజిమిహి = శ్రేష్ఠమైన గుఱ్ఱము.

తాత్పర్యము.

మిక్కిలి సవారి తీయుటచే గాసిపడిన యుత్తమాశ్వమువలె నేనును మన్మథుని ధాటికి స్రుక్కితిని.

ఉ. ఏ కరణిం దరింతురు మ♦హిష్ఠభయంకర సత్త్వయుక్త నీ
రాకరవర్య మా ఘనవ♦నౌకసు లేని నృపాలు రేని నా
నా కపియొక్కఁడే కద మ♦హాహవము న్మనతో నొనర్చె, నె
ట్టే కరణిం గ్రియాసరణి ♦ యేగెడినో తెలియంగ శక్యమే. ౨౩౭

అర్థములు. మహిష్ఠభయంకర = మిగుల భయమును గలిగించు, సత్త్వ = జంతువులచే, యుక్త = కూడిన, నీరాకరవర్యమును = శ్రేష్ఠసముద్రమును, వనౌకసులు = కోఁతులు, మహాహవముల్ = గొప్పయుద్ధమును.

తాత్పర్యము.

కోఁతులైనను రాజకుమారులైనను మిగుల భయంకరమైన జంతువులు గల సముద్రము నెట్లు దాఁటి రాఁగలరని యూరకుండరాదు. ఏలన, నొకకోఁతిగాదా సముద్రము దాఁటివచ్చి మనతో సంతి పెద్దయుద్ధము చేసెను. ఏకార్యమే సమయమున నెట్లు జరుగునో యెట్లు తెలియ సాధ్యమగును.

ఉ. దాన భవిష్యదర్థము య♦థామతి యోజనచేసి చెప్పుఁడీ
మానవుచే భయం బొదవు ♦ మాటయు లే దది చక్కఁజూడుఁడీ
దానవదేవయుద్ధములఁ ♦ దద్భుజశౌర్యము నేను నూఁతగాఁ
బూని కదా జయించితిని ♦ బోరుల గెల్చెడినారు మీ రెకా. ౨౩౮

అర్థములు. భవిష్యత్ + అర్థము = ముందుఁ జేయవలసిన కార్యము, యథామతి = మీ మనస్సు చొప్పున.

తాత్పర్యము.

ఆ కారణముచే నిఁక ముందు నేను జేయవలసిన దేమియో యది మీ యిష్టప్రకార మాలోచించి చెప్పుఁడు. మనుష్యుల వలన మనకు భయములే దనుమాట మనస్సులో నిలుపుఁడు. దేవదానవ యుద్ధములందు మీ భుజశౌర్య మాధార

ముగఁ జేసికొనికదా జయించితిని. యుద్ధములందు మీరేకదా నాకు జయము గలిగించినవారు. ఇవి యిచ్చకాలమాటలు.

ఉ. ఆ వసుధాధిపాత్మజులు ♦ క్ష్మాత్మజ పోబడి తా రెఱింగి సు
గ్రీవపురస్సరం బగు హా♦రిధ్వజినీతతిఁ గూడి వార్ధి వే
లావనిఁ జేరినారు, వసు♦ధాత్మజ నీయఁగ రాదు, వెండి సీ
తావిభుఁ జంపఁగా వలయు ♦ దానికిఁ జెప్పుఁడు మంచియుక్తులన్. ౨౯

అర్థములు. వసుధాధిపాత్మజులు = రాజకుమారులు, క్ష్మాసుత పోబడి = సీతాదేవి యిందున్న జాడ, సుగ్రీవ పురస్సరంబగు = సుగ్రీవుఁడు ముందుగాఁ గల, హారిధ్వజినీతతి = వానర సేనాసమూహము, వార్ధి వేలావని = సముద్రతీర భూమిని.

తా త్ప ర్య ము .

ఆ రాజకుమారులు సీతాదేవి యిందున్న జాడ దెలిసి సుగ్రీవుఁడు ముందుగాఁ గల వానరసేనతో సముద్రతీరమున వచ్చి దిగియున్నారు. మీరు నాకుఁ జెప్పవలసిన యాలోచన యేమనఁగా సీతాదేవిని మరల నీయరాదు. రాముని జంపవలెను. దానికిఁ దగిన యుపాయముఁ జెప్పుఁడు.

దీనివలన రావణుఁడు సామ దాన భేదోపాయములు తలఁచినవాఁడేకాఁడు. దండము మాయ ఇంద్రజాలము వీనిలో నేది యనుష్ఠింపవలయు ననియే వాని ప్రశ్న.

సామ దానంచ భేదశ్చ దండశ్చేతి చతుష్టయమ్
మాయోపేక్షేంద్రజాలం చ సప్తోపాయాః ప్రకీర్తితాః.
అదేశ కాలాపరోక్ష్యం పరోక్షస్యైవ వస్తునః
మంత్రౌషధ క్రియాభేదై రింద్రజాలం ప్రచక్షతే॥ అని యింద్రజాలలక్షణము.

—♦ కుంభకర్ణుఁడు రావణునిఁ గోపించి పలుకుట ♦—

ఉ. రాముఁడు దక్క వేఱొకఁడు ♦ రాఁడు సముద్రము దాఁటి వానర
స్తోమముతోడఁ గాన జయ♦శుద్ధి వినిశ్చిత మంచుఁ బల్క నా
కామపరీతచిత్త దశ♦కంఠుని రోదన మాలకించి కో
పామితదగ్ధచిత్తుఁ డయి ♦ యాతనిఁ బల్కెను గుంభకర్ణుఁడున్. ౩౦

అర్థములు. వానరస్తోమము = కోఁతిగుంపు, కామపరీతచిత్త = కామముచే విపరీతమైన బుద్ధి గల, దశకంఠునిరోదన = రావణుని యేడుపు, రావణుఁడు చెప్పినది యేడుపు వంటిదే కాని మంత్రాలోచనము కాదని భావము. నేను జేయఁదలఁచినది చేసినాను, ఇప్పుడు నా ప్రాణము మీఁదికి వచ్చినది, మీరు రక్షింపుఁడనియే కదా వాని యేడుపు. కోపామిత దగ్ధచిత్తుఁడయి=కోపముచే మిగుల దహింపఁ బడిన మనస్సు గలవాఁడై.

తాత్పర్యము.

వానర సేనతోడ సముద్రము దాఁటిరాఁగలవాఁడు రాముఁ డొక్కఁడే. రాముఁడు రానియెడల వానరులు రారు. కావున నాయొక్క రామునిఁ జంపితిమా మనకు జయము నిజము. దాని కుపాయము చెప్పుఁడని చెప్పఁగా కామముచేత వైపరీత్యము చెందిన మనస్సుగల రావణుని యేడ్పువిని కోపముచే మిగుల దహింపఁబడిన మనస్సుగలవాఁడై, కుంభకర్ణుఁడు వానితో నిట్లనెను.

సీ. రామసౌమిత్రిసం♦రక్షణీయను సీత, నపహరించితి వేరి ♦ నడిగి నీవు?
అటుచేయకయ మున్న ♦ యడిగినఁ జెప్పమే, యామునరక్షిత♦యమునవోలె
నీ చిత్త మెంతయు ♦ నిల్కడ భజియింప, నో మహారాజ! మేల్♦యుక్తి నొకటి
నటులైన నెంతొ మే♦లైయుండు నీపని, నిప్పుడు చింతింప ♦ నేమిఫలము?
తే. రాజకార్యంబు లెవ్వఁడు ♦ ప్రథమమంద, న్యాయపద్ధతి యోజించి ♦ యాచరించు
నట్టివాఁడెందు దుఃఖింపఁ♦డవలఁగార్య, మయ్యొ చెడిపోయె నేయని♦యాత్మయందు.

అర్థములు. సంరక్షణీయను = కాపాడఁబడు దానిని, యామునరక్షిత యమున = యమునానది యొడ్డుననుండు, యమునపార్శ్వపోకఁడఁ గాపాడు పర్వతము యమునను గాపాడినట్లు, కార్యములు చేయు పురుషు లుత్తమ మధ్యమాధములు గల రని నీవే చెప్పితివిగదా - (చూ. ప ౧౭౯) సమసుఖ దుఃఖబాంధవు లగు మాతో నెవ్వరితోనైన నాలోచించి చేసినవాఁడవు కావు. కావున నీ వుత్తమ పురుషుఁడవు కావు. దైవమే శరణ మని నమ్మి కార్యము చేయుఁబూనితివా ఇప్పుడు నీవే చేసికో, మ మ్మడుగనేల? మా సాహాయ్యము కోరుచున్నావు కావున నీవు మధ్యమపురుషుఁడవు కావు - నీవు అధమపురుషుఁడ వని కుంభకర్ణుఁడు చెప్పుచున్నాఁడు.

తాత్పర్యము.

రామలక్ష్మణు లిరువురు రక్షించు సీతను నీ వెవరి నడిగి తెచ్చితివి. ఆలోచించి యావలఁ గార్యము చేయవలయునా? కార్యము చేసి యాలోచింపవలయునా? కార్యము నీవు చేయకముందు మా యాలోచన మడిగియుండిన యామున పర్వతము రక్షించు యమునవలె నీకీ మనఃక్షోభము లేకుండ నుపాయము చెప్పియుందుము. అటు చేసియుండిన నెంతో మేలై యుండును. కార్యము చేసి యిప్పుడు ప్రాణము మీఁదికి వచ్చినప్పుడు విచారపడిన లాభ మేమి? రాజకార్యంబులను మొదటనే న్యాయ్యమార్గమున నాలోచించి కార్యము చేసినవాఁడు పిమ్మటఁ గార్యము చెడినను వాఁడు విచారపడఁడు. మనము న్యాయ్యముగఁ జేయవలసినది చేసితిమి. దైవము ప్రతికూలించిన మన మేమి చేయఁ గల మని వ్యసనపడకుండును.

క. విపరీతాలోచనఁ బని, నిపుణత లేకాచరింప ♦ నెఱి చెడు మఱియున్
విపరీతఫలము లొందవును, నపవిత్రపుఁ దవెల నున్న ♦ హవిఁ దిన్నట్లు. ౨౮-౨౯

అర్థములు. నెఱి = అందము, తవిలె = పాత్రము, హవి = హోమము చేయబడిన యన్నము.

తా త్ప ర్య ము.

ఎంత మంచి కార్యమైనను విపరీతముగ నాలోచించి చేయుటయందును సామర్థ్యము లేదేని యాకార్యముయొక్క యందమే చెడును; చెడుటమాత్రమే కాదు - చెడుఫలమునుగూడఁ గలిగించును. ఎట్లనిన హవిస్సు పవిత్రమైన దైనను పాత్రము శుద్ధమయినది యగునా కాదా యని చూడక చిలుముపాత్రములో వండితిమేని మంచిఫలము లేకుండుటేగాక యది తినిన విషమించును. మంచికార్యములే యిట్లు విపరీతఫల మిచ్చుచుండఁగా నీవుచేసిన యకార్యము వలనఁ జెడుఫలము గలుగుట యేమి వింత? కైకకు తగిన న్యాయము.

క. మొదలం దగు కార్యంబును, బిదపం గావించువానిఁ ♦ బిదపటిపనులన్
మొదల నొనరించునాతని, విదితంబుగ నీత్యనీతి♦విదుఁ డనఁ దగునా? ౩౪౩

అర్థములు. నీత్యనీతి విదుఁడు = ఇది నీతి, ఇది నీతి కాదు అను జ్ఞానము గలవాఁడు.

తా త్ప ర్య ము.

వెనుకఁ జేయవలసిన పని ముందు, ముందు చేయవలసిన పని వెనుకఁ జేయువాఁడు నీతి అనీతి తెలిసినవాఁడని చెప్పఁ గూడునా? కావున నీవు నీతి తెలిసిన వాఁడవు కావు.

క. బలియుఁడు దుస్సాధుం డని, తలఁపఁబడువాఁడు చపల♦తం బని సేయన్
సులువుగ భేదింతు రొరుల్, పులుఁగులు క్రౌంచాద్రిరంధ్ర♦మునఁ గాదె చనున్.

అర్థములు. దుస్సాధుఁడు=సాధింపరానివాఁడు, చపలతన్=బుద్ధి స్థిరత్వము లేక, పులుఁగులు = పక్షులు.

తా త్ప ర్య ము.

ఒకఁడు బలవంతుఁడు, ఆ కారణమున సాధింపరానివాఁడే అయినను వాఁడు బుద్ధి స్థైర్యము లేక నియమము దప్పి కార్యములు చేయునేని వాని యందలి దోషము గనిపెట్టి సులువుగా విరోధులు భేదింతురు. క్రౌంచపర్వతము బలిష్ఠము భేదింపరానిదైనను దానిలో నుండు రంధ్రమునఁ దూఱి గదా పక్షులును ఆవల కీవలికి పోవుచు వచ్చుచుండును. కుమారస్వామి క్రౌంచపర్వతమును శక్తిచే భేదించెను. అప్పుడు దానిలో రంధ్ర మేర్పడెను. ఆ రంధ్రములోఁదూఱి హంసలు మానస సరోవరమునకుఁ బోవుచుండును.

క. దుష్ట మనాలోచితమును, గష్టం బగు పనిని జలుపఁ ♦ గలిగితి విషసం
శ్లిష్టాన్నభుక్తిభంగి న,దృష్టము పో చంపఁ డయ్యె ♦ శ్రీరాముఁ డటన్. ౩౪౫

అర్థములు. దుష్టము = దోషముతోఁగూడినది, అనాలోచితము = ఆలోచన

లేక చేయఁ బూనినది - కష్టము = అపాయకర మైనది, విషసంశ్లిష్టాన్నము = విషముతోఁగూడిన యన్నము.

తాత్పర్యము.

నీవు దోషయుక్తము, అపాయముతోఁగూడిన పనిని ఆలోచనలేక విషము కలిసిన యన్నమును దినునట్లు చేసితివి. నిన్ను రాముఁ డచ్చటనే చంపక విడుచుట వలన నీవెంతో నిజముగ నదృష్టవంతుఁడవే.

సీ. పరులకుఁ జాల దుష్కర మైన కార్యంబు, నెత్తికొంటివి ఘటియించుటకును
(నీతోడఁ బుట్టుట ♦ నీతోడ నిల్వక, నాకుఁ దప్పునె దైత్య♦నాథ యిపుడు)
జరుగంగఁ దగు కార్య♦సరణి వచించెద, నీ పగతుర నేను ♦ నీల్గఁజేసి
కార్యంబు సరిపడఁ ♦ గావింతు శక్రాన,లార్కమరుచ్ఛ్రీదు ♦ లడ్డపడినఁ
ఆ. గేలఁ బరిఘ మూని ♦ లీలమైఁ ద్రిప్పుచు, గఱకుఁగోఱ డాలు ♦ కడలఁ గప్పఁ
గొండఁబోలు మేన ♦ గండుఁన గర్జింపఁ, గొండపగతుఁ డైన ♦ బెండువడఁడె. ౨౮

అర్థములు. పగతురన్ = శత్రువులన్, శక్రి - అనల - అర్క - మరుత్ - శ్రీదులు = శక్ర = ఇంద్రుఁడు, అనల = అగ్ని, అర్క = సూర్యుఁడు, మరుత్ = వాయుదేవతలు, శ్రీదుఁడు = కుబేరుఁడు, డాలు = కాంతి, కడలన్ = దిక్కులందు, కొండపగతుఁడు = ఇంద్రుఁడు, బెండువడఁడె = బెండువలె నిస్సారమై పోఁడా.

తాత్పర్యము.

ఇతరు లెవ్వరు చేయలేని దుష్కార్యముల నీవు చేయఁ దలపెట్టితివి. నీతోడఁ బుట్టిన కారణమున నిప్పుడు నీ తోడ నిల్వక నాకుఁ దప్పునా? తప్పదు. అయినదానికి వగచి లాభ మేమి? ఇఁక జరగవలసినది చెప్పెద వినుము. ఇంద్రుడు-అగ్ని-సూర్యుఁడు-వాయువులు - కుబేరుఁ డడ్డపడినను నీ శత్రువులఁ జంపి నేను నీ కార్యము చక్కఁ జేసెదను. నేను జేత గుదియ ధరించి త్రిప్పుచు కఱకైన కోఱలకాంతి దిశల వ్యాపింపఁగా కొండంత దేహముతో బలముకొలఁది సింహనాదము చేసితినేని యింద్రుఁ డైనను డీలు పడిపోవును.

క. రెండవశరమున రాముఁడు, ఖండించెను నంతలోఁ ద♦గఁగ నా నెత్రు
ద్దండత నేఁ ద్రావెదఁ జుమి, ఖండితసురజాల ! సుఖముఁ♦ గాంచుము మీఁదన్.

తాత్పర్యము.

ఓయయ్యా! నీవు పరిఘముతో సమీపమునకుఁ బోయికాని కొట్టఁ జాలవు. రాముఁడో దూరము నుండియే నీమీఁద బాణముల ప్రయోగించి కొట్టును. నీ వేమి చేయఁగలవు అందువేమో - రాముని మొదటిబాణముననే నేను జావను. (నేను వాలిని గాను) కావున రెండవ బాణము వైచి నన్ను ఖండించు లోపలనే పై పడి యా రాముని నెత్రు నేను బూర్ణముగఁ ద్రావెదను జుమా- ఆవల నీవు సుఖపడుము.

తగఁగన్ + ఆ నెత్తురని యొక పదచ్ఛేదము - తగఁగ + నా నెత్తు రని యొక

పదచ్ఛేదము. రెండవ యర్థమున నా నెత్తురు నేనే త్రాగెదను, ఆవల నీవు సుఖపడుము.

ఉ. రాముని గీటణంచి మఱి ♦ క్రచ్చఱ లక్ష్మణుఁ బిల్కుమార్చి శా
ఖామృగయూథము న్మెసవి ♦ గట్టునఁ ద్రేచుచు నీకు గెల్పునుం
గామముఁ దీర సౌఖ్యమును ♦ గల్గఁగఁ జేసెదఁ, ద్రాగు వారుణిన్
నీ మది కెక్కు కార్యముల ♦ నిర్భయతం జరియింపు స్వేచ్ఛమై. ౨౪౮

అర్థములు. గీటణంచి = చంపి, పిల్కుమార్చి = వధించి, మెసవి= తిని, వారుణిన్ = సారాయమును.

తా త్ప ర్య ము.

రామలక్ష్మణులఁ జంపి వానరుల నందఱ భక్షించి గట్టునఁ ద్రిప్పులు పుచ్చుచు నీకు గెలుపు, యిష్టమైన సౌఖ్యమును గలిగించెదను. నీవు సారాయము నీ యిష్టము కొలఁదిఁ దాగ్రవుము. ఇంకను నీ కిష్ట మైన కార్యములందు భయములేక యిష్టానుసారము వర్తింపుము.

క. భీమాహవ రంగంబున, శామనపురి కేగ మృత్యు♦సంగతి నల శ్రీ
రాముఁడు పడపడి సీతా, భామారత్నంబుఁ బొందు ♦ బొఘముదమునన్. ౨౪౯

అర్థములు. భీమాహవరంగంబునన్=భయంకర మైన యుద్ధభూమియందు, శామనపురి = యముని పట్టనము, మృత్యుసంగతిన్ = మృత్యుదేవతతో, బొఘముదమునన్ = మిగుల సంతోషముతో

తా త్ప ర్య ము.

ఆ శ్రీరాముఁడు భయంకరయుద్ధమందుఁ జచ్చి యమపురకుఁ బోఁగా నావలఁ సీతా భామారత్నముతో నీవు సంతోషింపుము. రెండవ యర్థము- కర్తృపదము 'నేను' అనునది అధ్యాహారము. నేను భయంకర యుద్ధభూమియందుఁ జచ్చి యమ పురమునకుఁ బోఁగా ఆవల శ్రీరాముఁడు సంతోషముతో సీతాభామారత్నమును బొందును. నన్నుఁ జంపినవాఁడు నిన్నుఁ జంపక విడుచునా? కావున నీవు చచ్చిన వాఁడవే. లేదా నీవు యుద్ధమునఁ జచ్చిన పడపడి యని చెప్పినను జెప్పవచ్చును. లేక మన మను పదము కర్తగాను గ్రహింప వచ్చును.

—♦ ౧౩-వ సర్గము. మహాపార్శ్వుఁడు రావణునితో సీతాదేవిని విడువరాదని చెప్పుట ♦—

క. రావణుఁడు క్రుద్ధుఁ డగుటను, భావించుచు శాంతుఁ డగు ను♦పాయము త్రుటి సం
భావించి మహాపార్శ్వుఁడు, కావించుచు నంజలిన్ స♦గర్వోక్తి ననున్. ౨౫౦

తా త్ప ర్య ము.

నీవు చేసిన పని సరికా దని యూహించుటచే రావణునకుఁ గోపము వచ్చిన

దని గ్రహించి మహాపార్శ్వుఁ డనువాఁడు నకనికిఁ గోపము చల్లారు నుపాయము కొంచెము కాల మాలోచించి నమస్కరించి గర్వముతో నిట్లనెను.

క. నానామృగ సత్త్వాన్విత, మైన వనం బెల్లఁ ద్రొబ్బి యటఁ జేపడఁగాఁ
 దేనియను ద్రాగఁ డెవ్వం, డా నరునిం బాలిశుం డటందురు ప్రాజ్ఞుల్. ౨౫౧

అర్థములు. నానా = అనేకములైన- మృగ = జింకలు మొదలగువాని తోను, సత్త్వ = పులులు మొదలగు జంతువులతోను, అన్వితము = కూడినది, బాలిశుఁడు = మూర్ఖుఁడు.

తాత్పర్యము.

అనేకవిధములైన క్రూరజంతువులు గల యడవికి నెంతో కష్టపడి పోయి యందుఁ దేనె లభింపఁగా దానిఁ ద్రావక యెవఁ డుపేక్షించునో వానిని బుద్ధిమంతులు మూర్ఖుఁ డందురు. అట్టులే నీవు ప్రాణగండమైన కార్యముచేసి, సీతను దెచ్చి యనుభవింపవేని మూర్ఖుఁడవే. తేనె సీతాదేవి యనియు రామలక్ష్మణులు తేనెటీగలనియు గ్రహింపనగు.

క. ఈశ్వరుఁడవు లోకంబుల, కీశ్వరుఁ డన్యుండు గలుగునే నీ కసురా
 ధీశ్వర ! శత్రునిబర్హణ !, శాశ్వతసుఖ మనుభవింపు జ్ఞానసుతతోడన్. ౨౫౨

తాత్పర్యము.

శత్రువుల వధించువాఁడా! నీవే లోకములకుఁ బ్రభువవు. నీకుఁ బ్రభువు వేఱొకఁడుఁ డున్నాఁడా ? కావున రాక్షసేశ్వరా! నీవు సీతతో నిత్యసుఖ మనుభవింపుము.

రెండవ యర్థము. లోకంబులకు రాముఁ డీశ్వరుఁ డవును. ఆయన కీశ్వరుఁడు లేఁడు. కావున సీతను రామున కిచ్చుటచే నామెను గరణముగాఁ జేసికొని శాశ్వత సుఖ మనుభవింపుము.

జ్ఞానసుతతోడన్=కరణార్థంబునఁ దృతీయఁగా గ్రహింపవలయును. లేక సహార్థంబున గ్రహించిన రాముఁడు కపులతో సేతువు దాఁటెను - అన్నట్టు సీతను నీ విచ్చితివేని నీవు సుఖింతువు. ఆమెయు సుఖించును అని భావము. ఇవి మహాపార్శ్వుని యుద్దిష్టార్థములు గావు.

క. మక్కువతో జానకి నినుఁ, దక్కఁ గొనఁగ నొల్లదేని తానుగ నీవే
 కుక్కుటవృత్తిఁ జరింపుము, తక్కుము సందేహ మేద సుధాభుగ్వైరీ ! ౨౫౩

అర్థములు. దక్కఁగొనఁగన్ = అనుభవయోగ్యముగాఁ జేసికొన, కుక్కుటవృత్తి = కోడిపుంజువలె, ఆఁడుకోడిని బలవంతముగాఁ బట్టుకొని మగకోడి రమించును. అట్టులే నీవు చేసి సుఖింపుము. ఆమె యంగీకారమునకై నీ వేల కాచుకొనవలె? 'ఎద్దు నడిగియా గంతకట్టుట' యను సామెత నెఱుఁగవా? "క్రుద్ధా మాక్రమ్య భోగస్తు కౌక్కుట స్సోఽపి సౌఖ్యద"యని కామందకము. సుధాభుక్ + వైరి=అమరవిరోధి.

తా త్ప ర్య ము.

సీతాదేవి ప్రేమతోఁ దానుగ నీతో సుఖ మనుభవింప నొల్లదేని కోడిపుంజు కోపించిన యాఁడు పుంజుతో బలవంతముగా రమించునట్లు నీవును రమించి సుఖింపుము. అందును సుఖము గలదు.

తే. వేగ నీ వాంఛితము నెఱ♦వేతెనేని, గలుగనీ భయ ముత్తర♦క్షణమునంద
కాక కాలాంతరంబునఁ,♦గలుగనిమ్ము, వాని నెల్ల సహింపఁగ♦వచ్చు నీవు. ౨౫౭

తా త్ప ర్య ము.

• శీఘ్రముగా నీ కోరిక నెరవేతెనేని యా యుత్తరక్షణమునందే చచ్చితివా చావుము. లేక కొంతకాలము వెనుక మరణము వచ్చిన రానీ. దానిని నీవు సహింప వచ్చును. ఇప్పుడు నీవు పడు బాధకంటె మరణము గొప్పది కాదనుట.

నీవు సీతను చెఱచితివేని రాముఁడు కోపించి యా నిమిషమందే చంపెనా చంపనీ, సీత యేమో చేసినది, ఇఁక రావణునిఁ జంపి లాభ మేమని పోయినా పోనీ, కాలాంతరమున మరణము రానీ యని భావము.

క. దంభోళిఁ గేలఁ గైకొని, జంభారియు వచ్చెనేని ♦ సమితిక్షితి సం
రంభమునఁ గుంభకర్ణుఁడు, జంభారిజితుండు మేముఁ ♦ జంపుదు మతనిన్. ౨౫౮

అర్థములు. దంభోళి = వజ్రాయుధము, జంభారి = ఇంద్రుడు, సమితి క్షితిన్ = యుద్ధభూమియందు.

తా త్ప ర్య ము.

రామునిఁ జంపుట యెట్లని యది యొక గొప్పకార్యముగా నాలోచించు చున్నావే, ఏల? వజ్రమును ధరించి యింద్రుఁడు రామునికిఁ దోడుగా వచ్చినను - కుంభకర్ణుఁడు, ఇంద్రజిత్తు, మేము శీఘ్రముగాఁ జంపుదుము. నీవాఁక రానిత్తుమా?

ఉ. ముందుగ సామదానములు ♦ మూఁడవ భేదము శక్తి లేని యా
పందలు మెచ్చుచుందురు సలు♦పం దగు నంచును, శక్తిశాలి దా
నెందును దండనీతిఁ జరి♦యించును, గావున దండపద్ధతిన్
పొందుము నీదు వాంఛితముఁ ♦ బూర్ణముగా మనుజాశనాధిపా! ౨౫౯

తా త్ప ర్య ము.

రాక్షసరాజా! కొందఱు సీత నిచ్చుట మంచి దని నీకు బోధించుచున్నారు. ఆ విషయమై నా యభిప్రాయము వినుము. శక్తిలేని పిఱికివాండ్రు ముందు సామము, దానము అనియు, నవి వ్యర్థము లగునేని భేదము సలుపుట దగు నని మెచ్చెదురు. కాని యది బలవంతుల మార్గము కాదు. శక్తిగలవాఁడు సర్వకాలము లందు దండనీతినే చరించు చుండును. కొట్టి తీసికొను శక్తియుండఁగా నడుగు కొనుట, లంచ మిచ్చుట యేల! కావున నీ కోరికను యుద్ధము చేతనే నెఱవేర్చుకొనుము.

ఉ. వచ్చిన యేని యిచ్చటికి ♦ వైరిసమూహము శస్త్రసంహతిన్
వచ్చి వధింప నోపుదుము ♦ వాస్తవ మియ్యది, సందియంబు లే,
దిచ్చఁ జరింపు మన్న నసు♦రేశ్వరుఁ డాతని వాక్యజాలమున్
మెచ్చుచు వాని కిట్టులను ♦ మేటిలు చింతను నాత్మవృత్తమున్. ౨౫౭

తాత్పర్యము.

పగవారిగుంపు లిచ్చటికి వచ్చెనా మేమే వారి నందఱను శస్త్రములఁ జీల్చి చంపుదుము. సందేహము లేదు. నీ యంతట నీవు నీ కోరిక ప్రకారము వర్తింపు మని చెప్పఁగా వానిమాటలను రావణుఁడు మెచ్చుకొని తన పూర్వ చరిత్రను విచారముతో నిట్లు చెప్పెను.

మహాపార్శ్వుఁడు చెప్పినట్లు కుక్కుటమువలె వర్తింప సాధ్యము గాదాయె గదా యనియే విచారము.

—♦ రావణుఁడు మహాపార్శ్వునితో బ్రహ్మ తన్ను శపించిన విధంబుఁ దెలుపుట ♦—

సీ. వినుము మహాపార్శ్వ! ♦ వినిపింతు మత్పురా,వృత్తంబు గోప్య మ♦విశ్రుతంబు
హాటకగర్భసే♦వార్థ మప్పొటికై, పుంజికస్థల యను ♦ పువ్వుఁబోణి
యభ్రమార్గంబున ♦ నరుగుచు ననుఁ జూచి, జంకుచు నొదుకుచు ♦ జనుచునుండ
నగ్నిశిఖయుఁబోని♦యద్దానిఁ గనుఁగొని, బలవంతముగను బై♦పడుచుఁ జెఱిచి
తే. కోటవిగఁ జేసి విడిచినఁ ♦ గోమలాంగి, నలువసభ కేగ నలిపిన♦నలిన మనఁగ
నబ్జభవుఁడును దాని వృ♦త్తాంత మెఱిఁగి, కోపమున నాకు నీ గతి♦శాప మిచ్చె.

అర్థములు. మత్పురావృత్తంబు=నా విషయమైన పూర్వచర్య, గోప్యము= రహస్యము, అవిశ్రుతంబు = మఱి యెవ్వరు విననిది, హాటకగర్భ సేవార్థము = బ్రహ్మను గొలుచు నిమిత్తము, అప్పొటికై =ఆయన సత్యలోకమునకు, కోటవి = దిస మొలది, నలువసభకు = బ్రహ్మసభకు, పైపడి కోటవిగఁ జేసి చెఱిచిన నని యన్వయము.

తాత్పర్యము.

మహాపార్శ్వ ! నా విషయమైన పూర్వచర్య యొకటి వినిపించెద వినుము. అది రహస్యము, ఎవరికిని దెలియదు. మును పాకనాఁడు పుంజికస్థల యను యప్సరస బ్రహ్మసేవకై యాకాశమార్గంబునఁ బోవుచు నన్నుఁజూచి భయపడుచు నొదిగి యొదిగి పోవుచుండెను. అగ్నిశిఖవంటి కాంతిగల దానిని నేను బలవంతముగఁ బట్టి చెఱచి చీరలేకుండ దిసమొలదానిని జేసి విడిచితిని. అది నలిపిన తామరవలె బ్రహ్మసభకుఁ బోయెను. బ్రహ్మ దానివృత్తాంత మెఱిఁగి యీ విధముగ నన్ను శపించెను.

ఎంత సిగ్గుమాలిన భోగముదైనను వస్త్రహీనయై సభలోనికిఁ బోవునా యని సందేహింపఁ బనిలేదు. ఆ దినము మేళము దాని వంతు. దానివా అందఱు వచ్చి

యదిమాత్రము రాకుండుటచే బ్రహ్మ యాలోచించి తెలిసికొనె నని గ్రహింప నగు. మఱి యెవరిదో యేదో వస్త్రము దీసి కట్టికొని యాలస్యముగా నది సభకుఁ బోయెను.

అగ్నిశిఖ యను నుపమానము కాంత్యతిశయముచేఁ జెప్పినను జెప్పవచ్చును. లేదా పురుషులఁ గరఁగించుట యం దని చెప్పినను జెప్పవచ్చును. "పొలతి దావవహ్ని పురుషుఁ డాజ్యఘటంబు కరఁగకుండరాదు కదిసెనేని" యను వాక్యము స్మరించునది.

కం. ఇది మొదలుగ దశకంఠా! మదిలో ని న్నొల్లనట్టి మానిని బలిమిన్
గదిసితివా నీతల యా,పదనున ధర వ్రాలు నూఱువ్రక్కలు గాఁగన్. ౨౫౯

అర్థములు. ఆ పదనున = ఆ సమయమందే, వెంటనే.

తాత్పర్యము.

ఇదిమొదలు రావణా! నీవు ని న్నొల్లని స్త్రీని బలవంతముగా జెఱుప సమీపించితివా యా వెంటనే నీ తల నూఱుతునుకలై నేలఁ బడును. ఈ కారణముచేతనే రావణుఁడు సీతను దాఁకినపుడు చావకుండినది. రావణుఁడు సీతను నంగీకరింపఁజేసి యావలఁ గూడవలయు నని యభిప్రాయము గలవాఁ డగుటచేఁ జావ లేదు.

నలకూబర శాప మొకటి కలదుగదా, యది యేల చెప్పలేదు? ఆ శాపమును రావణుఁడు లక్ష్యము చేసినవాఁడు కాఁడు. శాప మనునది తనకంటె దక్కువశక్తి గల వానిని బాధించునుగాని తనకంటె గొప్ప తపస్విని బాధింపదు. రావణుఁడు నలకూబరు కంటె గొప్ప తపస్సుచేసిన వాఁడు కావున వాని శాపము పాఱదు. ఆ శాపభయ ముండిన యెడలఁ బుంజికస్థల నిట్లు చెఱిచియుండడు. అది దీనికి వెనుకటి వృత్తాంత మందమా యనిన రంభను దాఁకినపుడే రావణుఁడు చచ్చియుండును. నలకూబర శాప ప్రసక్తికిఁ గారణ ముండదు. నలకూబరశాపము వ్యర్థ మని తెలిసియే బ్రహ్మ మరల శపించెను.

కం. ఈ శాపభీతిఁ గాదే, యాశింపక యున్నవాఁడ నవనిజ; గాదే
నా శయనంబున నెపుడో, యా శంపాదేహఁ గూడ నా, జంకుదునా? ౨౬౦

అర్థములు. శాపభీతి = శాపము వలని భయము, శంపాదేహన్ = మెఱుపు వంటి దేహము గలదానిని, జంకుదునా = సంకోచింతునా ?

తాత్పర్యము.

ఈ శాపమునకు భయపడి సీతను నాశింపక యున్నానుగాని, యీ భయమే లేనియెడల నెప్పుడో నా పానుపుమీద నామెతోఁ గూడుటకు సందేహింతునా ?

ఇవి భక్తుని మాటలో - కాముకుని మాటలో చదువరులు గ్రహింపనగు.

శా. నా వేగం బది సాగరం బెనసెడి న్వాతూలముల్ బోలెడిన్
నా వర్ధిష్ణుగతిప్రకార మనిఁ, గాన న్లేక యుద్ధాని సీ
తావామాక్షి నిమిత్త మిచ్చుటకిఁ బ్రోద్దామోగ్రసైన్యంబుతో
వే వచ్చుం గపినేత బాసటగఁ బృథ్వీకన్యకాకాంతుఁడున్. ౨౬౧

అర్థములు. అనిన్ = యుద్ధమందు, ఎనసెడిన్ = సరిపోలు చుండును, వాతూలము = సుడిగాలి, వర్ధిష్ణుగతి ప్రకారము = వృద్ధిపొందఁ గలిగిన విధము, కపినేత = సుగ్రీవుఁడు, బాసటగ = సహాయుఁడుగ, పృథ్వీకన్యకా కాంతుఁడున్ = సీతాదేవి మగఁడు.

తా త్ప ర్య ము .

యుద్ధమందు సముద్రవేగ మెట్టిదో నా వేగ మట్టిది. సుడిగాలి యెట్లు వృద్ధి చెందునో యట్లు నేను వృద్ధిచెందుదును. ఇది తెలిసికొనలేక సీత నిమిత్తమై యిచ్చటికి సుగ్రీవుఁడు సహాయుఁడుగ పెద్దదండుతో రాముఁడు వచ్చుచున్నాఁడు.

ఇది మహాపార్శ్వుఁడు ౨౫౧గిన పద్యములో కుంభకర్ణుఁడు, మేము, రామునిఁ జంపెద మన్నమాటకుఁ బ్రత్యుత్తరము. నేను రామునిఁ జంపలేక మీ సాహాయ్యముఁ గోరుచున్నా నని తలఁచితివేమో అది సరిగాదు. మహాకార్యము రాక్షసుల కందఱకు సంబంధించినది గావున రాజనీతి ననుసరించి మిమ్ము నడుగుచున్నా నని భావము.

ఉ. శైలగుహాప్రసుప్తహరి♦సత్తమము న్వడి నిద్రలేపు నా
పోలికఁ; గ్రుద్ధమృత్యువుఁ బ్ర♦బోధ మొనర్చెడి భంగి, మామకా
భీలభుజంగ సన్నిభసు♦విశ్రుతశాతశరాళి రాముఁ డే
వేళను గుర్తెరుంగమిని ♦ వేగమ వచ్చెడి న న్నెదుర్కొనన్. ౨౬౨

అర్థములు. శైలగుహా = పర్వతగుహయందు, ప్రసుప్త = నిద్రపోవు చున్న, హరిసత్తమమున్ = శ్రేష్ఠమైన సింహమును, మామక = నా యొక్క, ఆభీల = భయంకరమైన, భుజంగసన్నిభ = పాముతో సమానమైన, సువిశ్రుత = ప్రసిద్ధికెక్కిన, శాతశరాళిన్ = వాఁడి బాణముల సమూహమును, ఎదుర్కొనన్ = ఎదిరించుటకు.

తా త్ప ర్య ము .

కొండగుహలో నిద్రించు పెద్దసింహమును నిద్దుర లేపినట్లు, కోపించిన మృత్యువును మేల్కొలిపిన విధముగ, నా భయంకరములై పాములవంటి బాణములను రాముఁ డెప్పుడు చూచినవాఁడు కాఁడు. కావున నన్నెదిరించి యుద్ధముసేయ నిచ్చటికి వచ్చుచున్నాఁడు.

శా. దంభోళిప్రతిమానమామకధను♦ర్దండచ్యుతాభీలబా
ణాంభోవృష్టి సహస్రధాగతిఁ బయి ♦ న్వ్యాపింపఁగా జేయుచుం
గుంభీంద్రంబు నలాతకోటిబలె నా♦క్రోశింపఁగాఁ దోలుదున్
జంభద్వేషసహాయుఁడే స్రుఘుఁ డిటన్ ♦ సంగ్రామ రంగంబునన్. ౨౬౩

అర్థములు. దంభోళిప్రతిమాన = వజ్రాయుధముతో సమానము లగు, మామక = నాయొక్క, ధనుర్దండచ్యుత = వింటినుండి విడువఁబడిన, ఆభీల = భయంకరమైనబాణము లనెడి, అంభోవృష్టి = నీటివర్షము, సహస్రధాగతి = వేయి విధ

ముల, కుంభీంద్రంబు = శ్రేష్ఠమైన యేనుఁగు, అలాతకోటిబలె = కొఱవికట్టెల సమూహముచేతఁ బోలె, జంభద్వేషి=ఇంద్రుఁడు, సహాయుఁడేన్=తోడై వచ్చినను.

తాత్పర్యము.

నా వింటినుండి వెలువడిన వజ్రాయుధముతో సమానము లగు బాణముల వర్షము తనపయి వ్యాపింపఁగాఁ జేసి యేనుఁగును కొఱవికట్టెల గుంపులు చూపి పరువెత్తునట్లు చేయు రీతిగా నింద్రుఁడు సహాయుఁడై వచ్చినను యుద్ధరంగమునందు ముట్టి యనఁ జేసి రాముని బాఱఁదోలెదను.

ఉ. అల్ల సహస్రనేత్రుఁ డమ♦రాధిపుఁ డేనియుఁ బాశహస్తుఁ డ
బ్వల్లభుఁ డేని నాజి నిలు♦వఁ గలఁడా ననుఁ దాఁకి ? శ్రీదు పెం
పెల్ల నణంచి లంక హరి♦యింపనె ? తద్బల మెంత ? చుక్కలన్
బొల్లువడంగఁ జేయు నవ♦పూషునిభంగిని దేజు మాపెదన్. ౨౬౪

అర్థములు. సహస్రనేత్రుఁడు = వేయికన్నులు గలవాఁడు, అమరాధిపుఁడు = ఇంద్రుఁడు, పాశహస్తుఁడు = పాశములను జేత ధరించిన, అప్ + వల్లభుఁడు = జలాధిపతి, వరుణుఁడు, ఆజిన్ = యుద్ధమందు, శ్రీదు = కుబేరుని యొక్క, తద్బలము = రామునిబలము, నవపూషుని భంగిన్=క్రొత్తసూర్యునివలె.

తాత్పర్యము.

వేయి కన్నులు గల యా యింద్రుఁడైనను, పాశములఁ జేతధరించిన వరుణుఁడైనను నన్నెదిరించి యుద్ధమునందు నిలుపఁగలఁడా? కుబేరునిగర్వ మణఁగఁగొట్టి లంకను హరించితిని గదా! ఇఁక రాముని బల మెంత? ఉదయించు సూర్యుఁడు నక్షత్రముల కాంతి హరించినట్లు రామునిసేనను రూపు మాపనా?

—♦ ౧౪-వ సర్గము. విభీషణుఁడు సీతాదేవిని శ్రీరామున కిమ్మని రావణునకు బోధించుట ♦—

క. దనుజకులసార్వభౌముం, డనుమాటలుఁ గుంభకర్ణుఁ ♦ డతి గర్జితముల్
విని విని విభీషణుం డి, ట్లను దశకంఠునకు హితము ♦ నర్థయుతముగన్. ౨౬౫

అర్థములు. అతిగర్జితముల్ = వ్యర్థములైన యఱపులు, మొదట నీతి బోధించినట్లే బోధించి కడపట రావణు నభిప్రాయములోనే కలిసికొనెను. ఏమేమో వదరెను. అర్థయుతముగన్ = ప్రయోజనముతోఁ గూడినట్లు, ఇట్లనుటచే రావణ కుంభకర్ణుల మాటలు ప్రయోజనము లేని వని భావము.

తాత్పర్యము.

రావణుఁడు చెప్పిన మాటలు, కుంభకర్ణుని వదరుటలు వినివిని హితముగ సప్రయోజనముగ విభీషణుఁ డిట్లనెను.

మ. తత బాహ్వాంతరభోగరాశి భృశచిం♦తాకాలకూటంబు ను
గ్రతరస్మేరనిశాతదంష్ట్ర కరశా♦ఖాపంచకస్ఫారవి

స్ఫ్రుతపంచో గ్రశిరోతికాయము పతీ ♦ సీతామహాశీవిషం
బతిమేధావివి పట్టి తేరఁ దగ వౌ♦నా దాని భావింపుమా. ౨౬౬

అర్థములు. పతీ = రాక్షసరాజా, తత=విస్తార మైన, బాహు+అంతర= రొమ్మనెడి, భోగరాశీ=గొప్పపడగ గలది. (౨) తత=అధిక మైన, బాహ్వాంతర= రొమ్మునందలి, కౌఁగిలింత యందలి, భోగరాశీ=సౌఖ్యాతిశయ మనెడి, (3) తత= విశాల మైన, బాహ్వాంతర = భారెఁడు కొలఁతగల, భోగరాశీ = శరీరము నిడుపు గలది. ఆవృత్తిచే రూపకము, భృశచింతాకాలకూటంబు = గొప్పవ్యసన మనెడి విషము గలది. సీతాచింత ప్రాణము హరించునది కాన విష మనఁబడెను. ఉగ్రతర= మిగుల భయంకరమైన, స్మేర = చిఱున వ్వనెడి, సిశాత దంష్ట్రి=వాఁడియగు కోఱ, నరశాఖా పంచక = చింతాకాలమునఁ దలపైఁ బెట్టుకొనఁబడిన చేతియైదు వ్రే ళ్ళనెడి, స్ఫార = ప్రకాశమానమును, విస్ఫ్రుత = విచ్చినదియు నగు, పంచ = అయిదును, ఉగ్ర = భయంకరము నగు, శిరోతికాయము = తల లనెడి యతిశయ మైన శరీరభాగము గలది, సీతామహాశీవిషంబు = సీత యనెడి గొప్పపాము, తాఁకి నంతమాత్రమున నే చంపునది. అతిమేధావివి = మిగుల బుద్ధిబలముగలవాఁడవు. మేధావి - పతి శబ్దములు నిందాగర్భితములుగాఁ జెప్పినను జెప్పవచ్చును. సీతను మరల సీయఁగూడ దని రావణుఁడు చెప్పిన దాని కిది ప్రత్యుత్తరము. ఎందోయున్న సీతను నీ వేమని తెచ్చితివి? సొత్తుగానికి సొత్తు నీయఁ గూడ దనుట యేమి యాలో చించి చెప్పితివి. బుద్ధిబలము గలవాఁడ వైనచోఁ జెప్పు మని భావము.

తాత్పర్యము.

విశాలమైన రొమ్మనెడి దేహము, చింత యను విషము, చిఱున వ్వనెడి కోఱ తలపై నుంచుకొనిన వ్రేళ్లనెడి పడగలు గల సీత యనెడి మహావిషసర్పమును బుద్ధిమంతుఁడా తీసికొని వచ్చుట తగునా యాలోచింపుము.

క. భూమిధర కూటనిభు లు,ద్దామనఖాయుధులు భూరి♦దంష్ట్రులు కోతుల్
భీమగతిరాక మున్నే, రాముసకుఁ సీత నిమ్ము ♦ రాక్షసరాజా! ౨౬౭

అర్థములు. భూమిధరకూటనిభులు = పర్వతశిఖరములతో సమానులు, ఉద్దామనఖాయుధులు = గొప్ప గోళ్లాయుధములుగఁ గలవారు, భూరిదంష్ట్రులు = పెద్దకోఱలు గలవారు, భీమగతి = భయంకర విధముగ.

తాత్పర్యము.

రాక్షసరాజా! నీవు రాక్షసులను రంజింపఁజేయుట నీకుఁ గార్యము కాని వారికిఁ జేటు దెచ్చుట నీ కార్యము కాదు. నీవు చేసిన పనివలని కీడు నీ యొకనితోఁ బోదు. పర్వతశిఖరములవలె నెత్తైనవారును, గోళ్లు కోఱలు నాయుధములుగాఁ గల వారును భయంకరమైన గమనముగలవారు నగు క్రోతులు వచ్చి ముందు లంకను

ముట్టడించి పౌరులను బాధింతురు. ముందు బాధపడువారు రాక్షసులే. అందఱకు వెనుక నీవు, కావున వానరులు రాకముందే రామునకు సీత నిమ్ము.

క. సామీరజవము లశని, గ్రామనిభము లైన రామ♦కాండము లసుర
స్తోమముల తలలు ధరఁ బడఁ, బ్రామక మును సీత నిమ్ము ♦ రఘురామునకున్.

అర్థములు. సామీర = సామీరశబ్దము సంబంధార్థకమగు అణ్ప్రత్యయాంతము, సమీర సంబంధముగలది, పురుష - పూరుష, నరక - నా[illegible]లవలె సమీరమే సామీర మని చెప్పినను జెప్పవచ్చును. సామీరజవములు=వాయు వేగము గలవి, అశనిగ్రామ నిభములు = పిడుగుల సమూహముతో సమానము లైనవి, కాండములు = బాణములు, అసురస్తోమముల = రాక్షస సమూహముల, ప్రామక మును = తెలుగుటకు ముందే.

తాత్పర్యము.

ఒక్క వానరుఁడే యింత చేసినప్పుడు అందఱు వానరు లెంత చేయుదురు. ఆలోచింపుము. వానరు లట్లుండనీ, వారికంటె ముందు వాయువేగము గలవై, పిడుగుల గుంపుతో సమానములై రామబాణములు వచ్చి రాక్షసుల తలలు నేలఁబడ నఱకును. అవి రాకముందే సీతను రామున కిమ్ము. నీ వలన రాక్షసుల [illegible] కింత చేటు గలుగఁగలదు.

ఆ. కుంభకర్ణుఁ డైనఁ ♦ గుంభనికుంభులు, నైన [illegible] ♦ యైనఁగా[illegible]
యా మహోదరుఁడు మ♦హాపార్శ్వుఁ డీ యతికాయుఁ డైన రాముఁ♦గల[illegible].

తాత్పర్యము.

వానరులు, రాముఁడు వచ్చిన నిందుండు వారందఱు నిప్పుడుచున్నా రను కొంటివా యందువేమో? కుంభకర్ణుఁ డైనను, కుంభ నికుంభు లైనను, [illegible] యైనను, మహోదరు మహాపార్శ్వులైనను రాముని జెనకఁ గలరా?

ఉ. భానుఁడు నిన్నుఁ గాచిన సు♦పర్వచయంబులు ప్రోచినన్ దయా
న్యాసముగా బలారియు ని♦జోరుతలంబున నిన్నుఁ జేర్చినన్
మానక మృత్యు వడ్డపడి♦న న్బలిసీమ మఱంగిన న్బ్రహ
స్తా! నిను రామచంద్రుఁ డనిఁ ♦ బ్రాణముతో విడువం డెఱుంగుమా. ౭౦

అర్థములు. భానుఁడు = సూర్యుఁడు, సుపర్వచయంబులు = దేవతాసమూహములు, దయ+అన్యాసముగాన్ = కొంచెము తేలికయగుటతో, బలారి — ఇంద్రుఁడు నిజోరుతలంబునన్=తన తొడయందు, బలిసీమన్ = పాతాళమందు "అధోభువన పాతాళ బలిసద్మ రసాతలమ్" అని యమరుఁడు. మఱంగినన్ = దాగికొనినను, అనిన్ = యుద్ధమందు.

తాత్పర్యము.

ప్రహస్తా! నీవు అనాసరంబుగాఁ జంపద నంటిని. (చూ - ౧౫౧) యుద్ధము

సంను నీవు రాము నెదిర్చితివా సూర్యుడు తనలో నిన్నుఁబెట్టుకొని రక్షించినను, దేవతాసమూహములు ముప్పదిమూఁడుకోట్లు కాపాడినను, నీ యందు నిండారు దయతో సింహ్మీడు తన తొడలో నిను దాఁచినను, ఇప్పుడు వీనిని జంపవల దని మృత్యుదేవత యడ్డుపడినను, పాతాళలోకమునకుఁ బోయి దాగికొన్నను రాముడు నిన్ను ప్రాణముతో వదలఁడని తెలిసికొ.

చ. అనుడు విభీషణోక్తికిఁ బ్రహస్తుఁడు మా కొచిఋంచె సురాంశు నా
యనిమిషసిద్ధ కింపురుష ♦ యక్షనగాహులచేత నేనియుం
బొనగమువో భయంబు, రఘు♦పుంగవుఁడో నరనాథపుత్రుచే
గొనునయునె ? యేల యిట్టులు మ♦ము న్బెదరించెదు రిత్తమాటలన్. ౨౮౧

అర్థములు. విభీషణోక్తికి = విభీషణుమాటకు, మాఅు = గద్దులు.

తా త్ప ర్య ము .

అని చెప్పిన విభీషణునిమాటకుఁ బ్రహస్తుఁడు బదు లిట్లు చెప్పెను. దేవతలు, సిద్ధులు, కింపురుషులు, యక్షులు, వాసుకి మొదలగు నాగులను సర్పములు వీని చేతనైనను మాకు భయము లేదు. నిశ్చయము. ఇఁక రాజకుమారునిచేతనా మాకు భయముకలుగును. ఏల మమ్ము వ్యర్థవాక్యల బెదరించెదు.

—♦ విభీషణుఁడు ప్రహస్తుని గర్హించుట ♦—

సీ. అనుడుఁ బ్రహస్తు వా♦క్యంబుల నాలించి, ధర్మార్థకామ త♦త్పరమనస్వి
ప్రభుహితైషణుఁ డయి ♦ కాంక్షి విభీషణుం, డనియెఁ బ్రహస్త యి♦ట్లాడె దేల ?
యీవు మహోదరుం ♦ డీ కుంభకర్ణుఁడు, జలుపు యోచన రామ♦చంద్రుపట్ల
ధర్మవిరుద్ధవ♦ర్తనులకు స్వర్గంబు, ఫలియింపనట్లు స♦ఫలతఁ గనదు

ఆ. కలము లేనివాఁడు ♦ జలనిధిఁ దరియింపఁ, దలఁచినట్లు కార్య♦దక్షుఁ డైన
జానకీహృదీశు♦నే నైన నీ వైన, సకలదనుజు లైనఁ ♦ జంపలేము. ౨౮౨

అర్థములు. ధర్మార్థకామతత్పర మనస్వి = ధర్మార్థకామములం దాసక్తి గలవాఁడు, గొప్ప మనస్సుగలవాఁడు, ప్రభుహితైషుఁడు = ప్రభువు మేలుఁగోరువాఁడు, ధర్మవిరుద్ధవర్తనులకు = ధర్మమునకు విరోధముగ నడచుకొనువారికి, కలము = ఓడ.

తా త్ప ర్య ము .

ప్రహస్తుఁ డిట్లు చెప్పఁగా విని ప్రభువుమేలు గోరువాఁడగుటచే నతని ధర్మార్థకామములందు విశేషాసక్తి గల విభీషణుఁ డిట్లనియె. ప్రహస్తా ! యేల యిట్లు మాటలాడెదవు? నీవు, మహోదరుఁడు, ఈ కుంభకర్ణుఁడు రామచంద్రమూర్తి విషయమునఁ జేయు నాలోచన నధర్మవర్తనునకు స్వర్గము ఫలింపనట్లు ఫలింపదు. ఓడలేనివాఁడు మహాసముద్రమును దాటలేని యట్లు శక్తిలేని మనము కార్యనిర్వాహణమందు సమర్థు

డగు రాముని, నేను నీవు సకలరాక్షసులు కలసినను జంపలేము. అట్లు చంపసాధ్యమైన యెడల నే నేల యిట్లు చెప్పుచున్నానని యైన నీ వాలోచింపవలదా?

తే. పరమధర్మైకనిరతు నిక్ష్వాకువంశ, భవు మహారథు రాజేంద్ర•వర్యు, గార్య
దక్షు రణభూమి నెదుర న•దక్షు లగుచు, రూఢిగా వేల్పులెల్లగు•మూఢులైరి.

అర్థములు. పరమధర్మైకనిరతుఁ = కేవల ధర్మమే పర మని దానియందాసక్తి గలవాఁడు, ఆయన గెలుచుటకిది యొకటియే చాలును. 'ధర్మోజయతి' 'ధర్మో రక్షతి రక్షితః' యన్నట్లు తన్ను రక్షించునది ధర్మము. కావున ధర్మబల మాయనకుఁ గలదు, మనకు లేదు. ఇక్ష్వాకువంశభవుఁ = గొప్ప వంశంబున - ఇక్ష్వాకువంశమునఁ బుట్టినవానిని, పరాక్రమము జన్మసిద్ధ మని సూచన. మహారథుఁ = తన్ను సారథిని గుఱ్ఱములను గాపాడుకొనుచు శత్రువుల సంహరించువానిని, తనవారినిఁ జావనీయక యెదుటివారిని జంపువాఁడు మహారథుడు. "ఆత్మానం సారథిం చాశ్వాఁ రక్షఁ యుధ్యతి యో నరః। స మహారథసంజ్ఞస్స్యా దిత్యాహుర్నీతికోవిదాః" యను వచనము స్మరింపనగు. రాజేంద్రవర్యుఁ = రాజశ్రేష్ఠులలో శ్రేష్ఠుఁడగువానిని, కార్యదక్షుఁ = కార్యము సాధించు సామర్థ్యము గలవానిని, రామమూర్తిని.

తా త్ప ర్య ము.

ధర్మమే పరమ మని దానియందుఁ బ్రీతిగలవాఁడును, ప్రసిద్ధికెక్కిన యిక్ష్వాకు వంశమందుఁ బుట్టినవాఁడును, మహారథుఁడును, రాజులలో నుత్తమోత్తముఁడును, కార్యసాధన సామర్థ్యము కలవాఁడును నగు రామచంద్రుని నెదిరింపలేక దేవతలు గూడ నాయనశక్తి యింత యని తెలిసికొన లేకపోయిరి. ఇఁక మన మెంతమాత్రము.

ఉ. సాటి వచింపరాక హరి•శంబసమానజవాన్వితం బసూ
ద్ఘాటనకర్మశీల మగు • దాశరథిప్రవిముక్తము న్నిరా
ఘాటము నైన తచ్ఛరని•కాయము పోరఁ బ్రహస్త నీ మెయిఁ
నాటవు పూర్వ, మా కతము•న స్తగ పగ్గెలు కొట్టెదిమ్యోడన్. ౨౭౪

అర్థములు. హరిశంబ సమాన = ఇంద్రుని వజ్రాయుధముతో సమాన మైన, జవ = వేగముతో, అన్వితము = కూడినది, అసు+ఉద్ఘాటన కర్మశీలము = ప్రాణముల లేవఁదీయు పని స్వభావముగ గలది. బాణము తగిలెనా ప్రాణము పోవుట నిజ మని భావము. దాశరథి ప్రవిముక్తముఁ = రామునిచే విడువఁ బడినది. నిరాఘాటము = అడ్డము లేనిది, తత్ = ఆ రామచంద్రునియొక్క, శరనికాయము = బాణసమూహము. పోరఁ = యుద్ధమందు, నీ మెయిఁ = నీ దేహమునందు, నాటవు = నాటినవి కావు, ఆ కతమునఁ = ఆ కారణముచే, పగ్గెలు కొట్టెదు = ప్రగల్భలు పలుకుచున్నావు, గర్వించి పలుకుచున్నావు.

తా త్ప ర్య ము.

సమానమైన వని చెప్పుటకు సాధ్యపడక యొకవేళఁ జెప్పవలసి వచ్చిన నింద్రుని

వజ్రాయుధము వేగమువంటి వేగముతోఁ గూడినవై, ప్రాణములు లేవఁదీయుట స్వభావకర్మమై, రామునిచే విడువఁ బడినవై యెదురు లేనివగు రాముని బాణములు నీ దేహమందు యుద్ధరంగమున నింతకుఁ బూర్వము నాటినవి కావు. కావుననే యి ట్లజ్ఞానముచే గర్వించి పలుకుచున్నావు.

ఓయి విభీషణా! రామబాణములు నాకుఁ దగులలేదు. కావున వాని జవసత్త్వ ములు నాకుఁ దెలియవు. నీకును నవి తగులలేదు గదా. నీ వనుభవము గలవాని వలె మాటలాడుచున్నాఁడవే. అది యెట్లు లనెదవా? అకంపను డేమి చెప్పెనో మఱచి తివా? (అరణ్య-స-౪౮౩-౪౮౪-౪౮౬-౪౮౭-౪౮౮-౪౮౯) "ఈ వాకఁడంచుఁ బల్కు-సది యేటికి లోకమునందుఁ గల్గు రక్షోవరలోక మంతయును గూడియు నాతని డాయ లేవు" అని వాఁడు చెప్పలేదా. శూర్పణఖ యేమిచెప్పెను? వినలేదా? (అరణ్య ౫౩౮ వ ప.) ఇవి నీవు నేను నిచ్చటనుండు ప్రముఖులు విన్నవారే కదా! మారీచు డీ రాక్షసరాజున కేమి చెప్పెనో యది యచ్చటివారు పదపడి చెప్పఁగా వినలేదా? (చూ. ౭౫౭౨ వ పద్యము) యుద్ధప్రియుఁడైన మనరాజు పూర్వము స్త్రీలను వారి మగవారిని జయించి తెచ్చినట్లు కాక, సీతను, మోసగించి దొంగతనముగాఁ దేవలసిన పని యేమి వచ్చెను? ఆ బాణములకు భయపడియేకదా! అప్పుడు యుద్ధము వలదని తాలించుకొన్న వాఁడు ఇప్పుడు యుద్ధమునకు దిగఁ గారణ మేమి? పూర్వము లేని వానరబల మిప్పుడు రామచంద్రున కెక్కువగాఁ గలిగెఁగాని మనకుఁ బూర్వమున్న బలమేకదా! మనరాజుతో సమానబలుఁడు కాఁడా విరాధుఁడు? మనరాజుకంటె బలిష్ఠుఁడు కాఁడా వాలి? ఇవి యన్నియు నీ వాలోచింపవైతివిగదా! మొట్టమొదట నీ యింటికేకదా హనుమంతుఁడు చిచ్చుపెట్టెను. నీ యాఁడువారు నడివీథిలోఁబడి యేడ్చినపుడు నీవు నిద్రపోవుచుంటివా? ఇవి యన్నియు నాలోచించిన యుద్ధము ప్రశస్తమని నీ కెట్లు తోఁచెను. నీ యాలోచనప్రకారము పోయినఁ గీడెవ్వరికో యాలోచించితివా? హనుమంతుఁడు నగరమంతయుఁ దగులఁబెట్టినపుడు మే మేమంటి యుంటిమి మను మాట యేమి మాట? మీ౦ంద తేకమైనను మీ మీ యిండ్లను గాపాడు కొనఁగలిగితిరా? స్వపరబలాబలములు విచారింపవలదా?

ఉ. ఎందనుకఁ దురాసద మ♦హీనని శాతము తీవ్రవేగితా
స్పందముఁ గంకపత్రమును ♦ ధ్యాతనయాధవహాస్తముక్త ని
ర్మందశిలీముఖోచ్చయ మ♦మంథనరీతిని నిన్ను వచ్చునో
యాఁదనుకం బ్రహస్త! యిటు ♦ లాడుచు నుండు వికత్థనంబులన్. ౨౭౫

అర్థములు. దురాసదము = సహింపరానిది, అహీననిశాతము = మిక్కిలి వాఁడిగలది, తీవ్రవేగితాస్పందము=మిక్కిలి వేగమునుండి జాఱనిది, అతివేగముతోఁ గూడినది, కంకపత్రమును = గ్రద్దయీకెలు కిట్టఁబడినది, ధ్యాతనయాధవ = రామునియొక్క, హస్త = చేతినుండి, ముక్త = విడువఁబడిన, నిర్మంద = మందము

గాని, శిలీముఖోచ్చయము = బాణసమూహము, అమంథర రీతిని = అడ్డము లేని విధముగ, వఱచ్చునో = చీల్చునో, వికత్థనంబులన్ = ఆత్మస్తుతి వాక్యములు.

ఉ. రావణుఁ డైనఁ గాని సుర♦రాజజితుండును గుంభకర్ణుఁ డే
నీ వయినం ద్రిశీర్షకుఁడ ♦ యేని నికుంభనరాంతకాదు లేన్
గ్రావసమానసారగుఁ డ♦కంపనుఁ డే నతికాయుఁ డేని నీ
తావిభుదృష్టిమార్గమునఁ ♦ దాళఁగ నిల్వఁగ సంగరంబునన్. ౨౭౬

తాత్పర్యము.

ప్రహస్తా! నీ వొకఁడవే కావు. రావణుఁ డైనను, ఇంద్రజిత్తయినను, కుంభకర్ణుఁ డయినను, త్రిశిరుఁ డైనను, నికుంభనరాంతకాదు లైనను, పర్వతమంత బలము గల యకంపనుఁ డైనను, అతికాయుఁ డైనను వీరు వేఱు వేఱుగాఁగాని యందఱుకలసి కాని యుద్ధమందు రాముని కనుచూపు మేరలో నిలిచి సహింపలేరు. అందఱను గలిపి చెప్పుటకే తాళ రని బహువచన ప్రయోగము.

ఉ. మీర లమిత్రతుల్యు లయి ♦ మిత్రులు నా వ్యసనాభిభూతుఁ డై
క్రూరతరస్వభావుఁ డయి ♦ కొంచక తా ననమీక్ష్యకారి యై
కార్యము ఘటించు సుర♦కంటకనాథునకున్ నిశాటసం
హారవినాశనార్థముగఁ ♦ బంచన చేరితి రేమి చెప్పఁగన్. ౨౭౭

అర్థములు. అమిత్రతుల్యులు = పగవారితో సమానులు, "అపకారగోచరే లక్ష్మణ" మిత్రత్వము కీడుచేయువాఁడే పగవాఁడు. మిత్రులునా = స్నేహితులను పేర, వ్యసనాభిభూతుఁ డై = సప్తవ్యసనములలోఁ జేరిన స్త్రీవ్యసనముచే ఆవరింపఁ బడినవాఁ డై, అసమీక్ష్యకారి యై = ఆలోచన లేక కార్యము చేయువాఁ డై, సురకంటకనాథునకున్ = రాక్షసరాజునకు, నిశాటసంహారవినాశనార్థమునకున్ = రాక్షసు లందఱు నాశమై పోవుటకు.

తాత్పర్యము.

ప్రహస్తా! శత్రువులు చేయవలసిన పనులు మీరు చేయుచున్నారు. పైకి మిత్రులవలె నటించుచున్నారు. ఇట్టి హితశత్రువులు మీరు వ్యసనములచే మతిచెడి, మిగులఁ గ్రూరమైన స్వభావము గలవాఁడయి, యాలోచనలేక సందేహింపక, యే పని యైనఁ జేయు రావణునొద్ద సకలరాక్షసులు నాశమై పోవుటకొఱకుఁ జేరి యున్నారు. ఇట్లు సర్వనాశకు లగు మీకు నేనేమి చెప్పఁగలను?

క. శిరములు వేయియు నంతముఁ, బరికింపఁగ రాని మేను ♦ భయదాకృతియున్
గురుబల మగు నహి మొత్తెను, బరిరక్షితుఁ జేయనయ్య ♦ ప్రసభమునఁ బతిన్. ౨౭౮

అర్థములు. గురుబలము = గొప్పబలము, అగు = కల, అహి = రామద్వేష మను పాము, ప్రసభంబునన్ = బలాత్కారమున, పరిరక్షితున్ = బాగుగాఁ గాపాడఁబడిన వానిని.

తాత్పర్యము.

వేయి తలలు కలిగి తుదకానరాని దేహము, భయంకరమైన యాకారము, గొప్పబలముగల రామద్వేషమను పాము రాక్షసేశ్వరుని జుట్టుకొనినది. ఆయన దాని నుండి తప్పించుకొనలేక మతిచెడియున్నాఁడు. మీరైనను బలవంతముగ నాయనను బైకిలాగి రక్షింపుఁడు.

క. పరిపూర్ణకాము లగు హితవరులెల్లరుఁ జేరి కావఁ ◆ బలయును రాజుం
గురు లొడిసిపట్టి శత్రూత్కర మరుదేరకయ మున్న ◆ గ్రహావిద్ధు బలెన్. ౧౯

అర్థములు. పరిపూర్ణకాములు=రావణునివలన వారి వారి కోరిక లన్నియు సంపూర్ణముగా నెఱవేర్చుకొన్నవారు, ఇంతవఱకు నాయనసొమ్ము కావలసినంత దినినవారు, హితవరులు = ఆయన మేలుగోరువారిలో నుత్తములు, హిత కాంక్ష యున్నను శక్తిలేని వారేమి చేయఁగలరు? శత్రూత్కరము = విరోధుల సమూహము, గ్రహావిద్ధు బలెన్ = దయ్యము పట్టినవానివలె.

తాత్పర్యము.

ఇంతవఱకు రావణుని ద్రవ్యము కోరికదీరఁ బూర్ణముగాఁ దిని యతని మేలుకోరువారిలో నుత్తములగు వారు ఆయనను గ్రహపీడ గలవానిని మంత్రములచే రక్షించునట్లు శత్రువులు వచ్చి తలవెండ్రుకలు పట్టుకొనకముందే రక్షింపవలయును. అట్లు చేయలేని కృతఘ్నులు, ద్రోహులు నగుదురు. ఆయన బాగుండినఁగదా యింకను మీరు దినవచ్చును. కావున మీ మేలు కోరియైన నాయనను రక్షింపుఁడు.

దీనిని మఱియొకవిధముగ నన్వయింపవచ్చును. పరిపూర్ణకాము లగు హితవరు లెల్లరుఁ గురు లొడిసిపట్టి రాజుఁ జేర శత్రూత్కర మరుదేరకయ మున్న కావవలయును.

మైత్రిగలవాఁడు తన మిత్రుఁడు దుష్కృత్యములఁ జేయుచుండెనేని వాని తలవెండ్రుకలు పట్టి యీడ్చియైన వానినుండి తప్పింపవలయు ననియే నీతిశాస్త్రము చెప్పుచున్నది.

"కేశగ్రహణా న్మిత్ర మకృత్యేభ్యో నివర్తయేత్" నీళ్ళలోబడి మునుఁగుచు దేలుచుఁ జచ్చుటకు సిద్ధముగా నుండువానిని తలవెండ్రుకలు పట్టిలాగికదా బయట వేయవలయును.

తే. ప్రళయకరమైన సౌమిత్రి ◆ జలధిలోన, మునిఁగి శ్రీరామపాతాళ ◆ ముఖముఁ జొచ్చు
పంక్తికంఠునిఁ గావరే ◆ ప్రాజ్ఞులార, పట్టి బలవంతముగ నైన ◆ బయట వేసి. ౨౦

తాత్పర్యము.

సర్వవినాశకరమైన లక్ష్మణుఁ డను సముద్రములో మునిఁగి శ్రీరాముఁ డనెడి బడబాగ్నియందుఁ బడబోవు రావణుని, బుద్ధిమంతులారా! బలవంతముగనైన బయట వేసి రక్షింపుఁడు. "పాతాళం బడబాగ్నిశ్చ" యని నిఘంటువు. ఇక్కడ నీ శబ్దమున

కీ యర్థమే తగినది. పాతాళలోక మనినచో నది రావణునకు మేనమామలు, తాత లుండు స్థలము గనుక సుఖమే.

క. ఈయది లంకకు ననుదని, కాయమునకు రాజునకును ♦ గనుమే యిమ్మన్
జేయ నిటు తగును సీతా, నాయకునకు సీత నీయ ♦ నా మతము సుఁడీ. ౨౧

తా త్ప ర్య ము .

ఈ ప్రకారము మీరు చేసితిరేని రాక్షససమూహమునకు, రావణునకు మిగుల మేలు గలుగును. ఇది చేయఁదగిన కార్యము. రామచంద్రునకు సీత నిచ్చుట మేలను నా యభిప్రాయము.

క. తనబలము నెదిరిబలమును, దన స్థానము క్షయము వృద్ధి ♦ దాయలవిధముల్
దనమదిఁ దలంచి తెల్పఁగ, దన జేనిక మాటమంత్రి యొప్పు ♦ దగు మంత్రులకున్.

అర్థములు. ఎదిరిబలము = విరోధిబలము.

తా త్ప ర్య ము .

మంత్రులారా! మీరు చేయవలసిన దేది చేయఁదగునని నేను చెప్పరాదు. మంత్రులగు మీరు చేయవలసిన కార్యము మీకు నేను చేయఁదగునని చెప్పుచున్నాను. ఏమి మా కార్య మంటిరా! మనరాజు బల మెంత? శత్రుబల మెంత? స్థానము స్థితి, తనస్థితి యెట్టిది? శత్రుస్థితి యెట్టిది? శత్రువులు తగ్గియున్నారా? మనము తగ్గియున్నామా? వృద్ధి శత్రువుల కున్నదా? మన కున్నదా? యని యాలోచించి తనరాజునకు మేలగు దానిని జెప్పుట మంత్రికృత్యము. దానినే మీరు చేయఁదగునని చెప్పు చున్నాను. స్థానము మనఁగ నిచ్చుట దండెత్తిపోక నిలచుట. ఇది సంధి విగ్రహము యానము ఆసనము ద్వైధము ఆశ్రయ మను వానిలోనిది. ఈ యాసన మైదు విధ ములు. సంధాయాసనము, ప్రసంగాసనము, విగృహ్యాసనము, సంభూయాసనము, ఉపేక్ష్యాసనము. శత్రువులు క్షీణదశయం దుండిన దండెత్తి పోవలయును. శత్రు వులు వృద్ధియం దుండిన సంధి సేయవలయును. సమానులుగ నుండిన నాసనము తగును. ఇప్పుడు శత్రుపక్షము వృద్ధిలో నున్నదా, మనపక్షము వృద్ధిలో నున్నదా? ఆలోచించితిరా? సీతాహరణకాలమున రామలక్ష్మణు లిరువురు మాత్రమే. అప్పుడు వారికి బలము తక్కువ. మనమా దండెత్తఁదగిన యప్పు డుపేక్షించి యూరకుంటిమి. ఇప్పుడో వారికి వృద్ధికాలము. వానరసేన యంతయు వారి పక్షమందే యున్నది. మనకు క్షయకాలము. మనపక్షమువా రగు ఖరాదులు, వాలి చచ్చిరి. ఇచ్చట నక్షకుమారాదులు పలువురు చచ్చిరి. పాతికసేన నాశ మయ్యెను. కోటలు విఱిగి పడెను. కావున నిది సంధికిఁ గాలము గాని కలహమునకుఁ గాలము గాదు. ఇది యాలోచించి మీ కృత్యము మీరు చేయుఁడు.

విభీషణుఁడు మంత్రి కృత్యములు న్యాయ్యముగనే చెప్పెను. కాని మంత్రు లందఱుఁ గలసి సీత నిమ్మని చెప్పినను రావణుఁడు వినియుండునా? యనునది

సందేహము. "ద్వావిమౌ పురుషౌ మూర్ఖౌ దుర్యోధన దశాననౌ। గోగ్రహం వన భంగంచ, దృష్ట్వా యుద్ధం పునః పునః" లోకములో మూర్ఖు లిరువురు. దుర్యోధనుఁడు, రావణుఁడు. ఉత్తరగోగ్రహణమందు దెబ్బఁదినియు దుర్యోధనుఁడును, వన భంగముఁజూచియు రావణుఁడును మరల యుద్ధము సేయుఁబూనిరి.

అన్నట్లు మంత్రు లందఱుఁ గలసి సీత నిమ్మని చెప్పినను రావణుఁడు విని యుండఁడు. అప్పుడు జరుగవలసిన దేమి? అందఱు రావణుతో విరోధింపవలయును గదా. అందఱు విరోధించియు నేమి చేయఁగలరు? వాఁడు పైఁబడి చంపమొదలు పెట్టిన నప్పు డేమిగతి? రాక్షసులచేత వాఁడు చావఁడు. అప్పుడైనను లంక పాడు కావలసిన దే కదా. అందఱు లంక విడిచి యెందుఁ బోఁగలరు? కావునఁ బ్రహస్తాదులు రావణునకుఁ దెగఁజెప్పక యతనినే యనుసరించిరి. పెట్టి నన్నినాళ్లు దిని సమయము వచ్చినప్పుడు తాము తప్పించుకొని వాఁడొకఁడే చచ్చుచుండఁ జూచుటయు సరిగాదు కదా. ఈ యాలోచన విభీషణున కేల కలుగ లేదు? అధర్మమున వర్తింప లేక, సర్వబంధు వినాశము చూడలేక, అందుఁ దాను భాగము గొనలేక. మంత్రు లందఱు రావణుతో విరోధించి రనుకొందము. అప్పుడు రావణుఁడు వారి నుపేక్షించి నేను సీత నీయను, మీరు తోడురాకుండిన నే నొక్కఁడనే యుద్ధము చేసెదను. గెలిచిన గెలుతును, చచ్చినఁ జత్తును- అని యూరకుండె ననుకొందము. అప్పుడు జరుగవలసిన దేమి? వానరులు లంకను ముట్టడి వేసినప్పుడు రావణుఁడొకఁడే యుద్ధమునకుఁ బోయిన వాని కొడుకులు, తమ్ము లూరక చూచుచుందురా? వారు పోయిన, వారి పోష్యవర్గ మూరకుందురా? అప్పు డీ మంత్రు లేమి చేయఁగలరు? వారు మాత్ర మెట్టు లింట నూరకుండఁ గలరు. ఉండి రనియే తలంతము. వానరులు లంకలోఁ బ్రవేశించి తమ కొంపలమీఁదఁ బడినపుడు తమ నిమిత్త మైన యుద్ధము చేయవలయును గదా! ఇట్లు నానాముఖముగ యుద్ధము చేయుట మేలా? ఏక ముఖముగా యుద్ధము చేయుట మేలా? ఇవన్నియు నాలోచించియే విభీషణుఁడు రావణున కెక్కువగ బుద్ధి చెప్పెను.

ఉత్తరకాండమునందలి ౨౧- ౨౧౪ పద్యములు చూడుడు. ఎట్టి కష్టదశయందైనను ధర్మబుద్ధి గలవాఁడై యుండునట్లు, చావు లేకుండునట్లు విభీషణునకు బ్రహ్మ వర మిచ్చెను. కావునఁ బరుని భార్య నపహరించుట, దాని మగనిఁ జంపుట, దానిని విధవను జేసి దానితో సంభోగింపనో, దానిని జంపనో యాలోచించుట-యిట్టి యధర్మ కార్యమును ధర్మబుద్ధి గల వాఁ డెవ్వ డంగీకరించును. ఇందరు చచ్చినను విభీషణుఁడు చచ్చువాఁడు కాఁడు. అప్పుడైన సీతను దాను రామున కప్పగింప వలసిన వాఁడే కదా. సీతాదేవిని లంకకుఁ దెచ్చిన దినమందే విభీషణుఁడు మండోదరితో నీ మగఁడు సర్వానర్థకరముహూర్తమునందు సీతను దొంగిలించి తెచ్చెను. దీని వలన మేలు లేదని చెప్పెను. దాని ననుసరించి యపశకునములు కనఁబడుచుండెను. త్రిజటాస్వప్నము,

లంకాదహనము మొదలైనవి దానినే బలపఱచెను. కావున యుద్ధమే జరిగెనేని రావణునకు జయము లేదని విభీషణునకు నమ్మకముగాఁ దెలియును. ఈ కారణముచే నొక్కి చెప్పవలసి వచ్చెను. ప్రత్యక్షముగాఁ గీడు కానవచ్చుచుండ నెట్లు చెప్పక యుండఁ గలఁడు.

—♦ ౧౫-వ సర్గము. ఇంద్రజిత్తు విభీషణుఁ దిరస్కరించి పలుకుట ♦—

తే. బుద్ధి సురగురుతోఁ సరిపోల్పఁజాలు, న విభీషణు వాక్యంబు ♦ లాలకించి
తండ్రి గని రాక్షసాళి యోధప్రబర్హుఁ,డైన వాసవజిత్తుఁ డిట్లు♦లనుచుఁ బల్కె.

అర్థములు. యోధప్రబర్హుఁడు = యుద్ధము చేయువారియందు శ్రేష్ఠుఁడు.

తాత్పర్యము.

బృహస్పతితోఁ బుద్ధియందు సమానుఁడైన విభీషణుఁడు చెప్పిన మాట విని తండ్రిని జూచి యోధులందు శ్రేష్ఠుఁడైన యింద్రజిత్తు తండ్రితో నిట్లు లనెను. విభీషణుని బుద్ధియందు బృహస్పతి యని, యింద్రజిత్తు యోధాగ్రేసరుఁ డని చెప్పుటచే నింద్రజిత్తు యుద్ధమునందు సమర్థుఁడే కాని కార్యాలోచనయందుఁ గాఁ డని భావము.

ఉ. ఏ మిటు నీదు సోదరుఁడె ♦ హీన మనర్థకముగ విభీతిదం
బై మనజాతి కర్హము ర♦వంతయుఁ గాని విధంబు పల్కె విం
తే, మన యన్వయంబున జ♦నింపనివాఁ డయిన న్వచించునే
యీమెయిఁ? జెప్పఁ బో విననె ♦ యెవ్వఁ డదెంతటి శక్తిహీనుఁడేన్. ౨౮

అర్థములు. హీనము = నీచము, అవమానకరము కావున, అనర్థకము = నిష్ప్రయోజనము, ఈ మాటలు విని యాప్రకారము వాఁడు నడుచుకొనకుండుటచేత, విభీతిదంబు = భయముకలిగించునది. అన్వయంబునన్ = వంశమునందు, ఈమెయిన్ = ఈ విధముగ,

తాత్పర్యము.

ఇది యేమి తండ్రీ! నీతోఁ డబుట్టిన వాఁడే 'యిటువంటి నీచము, నిష్ప్రయోజనము, భయము పుట్టించునదియై మనజాతికే కొంచెమైన యోగ్యముగాని విధముగాఁ బలికెను. విన్నావా? మన వంశమందుఁ బుట్టనివాఁడే యగునుగాక - ఈ విధముగ నెవ్వఁడైనఁ జెప్పునా? ఒకవేళ నితనివంటివాఁడు చెప్పిన నెంతటి శక్తిహీనుఁడైనను వినునా?

ఉ. శౌర్యము భూరిసత్త్వమును ♦ సాహసము న్బటువిక్రమంబునున్
స్థైర్యముఁ దేజము న్బ్రబల ♦ ధైర్యము నేమియు లేనియట్టి ని
ర్వీర్యుఁడు నీదు తమ్ముఁడు వి♦భీషణుఁ డొక్కఁడె సుమ్ము తండ్రి! యీ
యార్యకులంబునం బ్రభవ ♦ మందెను దుర్యశముం గడింపఁగన్. ౨౯

అర్థములు. భూరిసత్త్వము = విస్తారబలము, నిర్వీర్యుఁడు = వీర్యము లేని వాఁడు, సవీర్య మతిశక్తిభాక్ - దృఢమైన యుత్సాహము లేనివాఁడు, 'శుక్రం తేజో రేతసీచ బీజవీర్యేంద్రియాణిచ'-అమరము - నపుంసకుఁడు, మర్త్యశమున్ = అప కీర్తిని, గడింపఁగన్ = సంపాదించుటకు, శౌర్యము = శత్రువులపై పడిపోవుట, తేజము = "అధిక్షేపావమానాదేః ప్రయుక్తస్య పరేణ యత్, ప్రాణాత్యయే ప్యసహనం తత్తేజ స్సముదాహృతమ్" పరు లాక్షేపించినను అవమానించినను ప్రాణము పోవున ట్లుండినను సహింపకుండుట తేజ మనఁబడును - పరులను శుష్కింపఁజేయునది తేజము-స్థైర్యము మనసో నిర్వికారత్వం ధైర్యం సత్స్వపి హేతుషు చాపలేనానుప హాతా సర్వార్థే ష్వవికత్థనా, స్వాభావికీ చిత్తవృత్తి ర్ధైర్య మిత్యభిధీయతే॥ మనస్సు చలించుటకు హేతువు లుండినను చలింపకుండు స్వాభావమైన చిత్తవృత్తి ధైర్య మనఁ బడును.

తా త్ప ర్య ము.

శౌర్యముగాని, దానికిఁ గావలసిన బలముగాని, సాహసముగాని, దృఢమైన విక్రమముగాని, నిలుకడగాని, తిరస్కారమందు ససహనముగాని, బలిష్ఠమైన ధైర్యము గాని వీనిలో నొక్కటియైన లేని నపుంసకుఁడు నీ తమ్ముఁడు, విభీషణుఁ డొక్కఁడే యీ గొప్పకులమందు నపకీర్తి సంపాదింపఁబుట్టినవాఁడు అని తండ్రికిఁ జెప్పి విభీషణుఁ జూచి చెప్పుచున్నాఁడు.

మ. పిఱికీ! మాకఱు భీతి నేర్పెదవు? పృథ్వీనాయకద్వంద్వముం
బఱప న్లేఁడొకొ దేబెసోఁకుఁ డయిన న్నాలోన, నీ కేల ప
ల్లఱపు, ల్లోకము లేలు జిష్ణు నమృతాంధోధీశుని న్గర్వముల్
బఱిపోవం జెఱ నుంపనే! తఱుమనే భ్రాంతాత్ములా వేల్పులన్. ౨౮౬

అర్థములు. పృథ్వీనాయకద్వంద్వముల్ = రాజుల నిద్దఱను, రామలక్ష్మణు లను, పఱపన్ లేఁడొకో = పాఱఁదోలఁజాలఁడా యేమి, దేబెసోఁకుఁడు = బలహీనుఁ డైనను రాక్షసుఁడైనను, ఏకవచన ప్రయోగముచే నొక్క రాక్షసుఁడే చాలు నని భావము, పల్లఱపుల్ = వ్యర్థభాషణములు, జిష్ణున్ = ఇంద్రుని జయించు స్వభా వము గలవానిని, అమృతాంధోధీశునిన్ = అమృత మాహారముగాఁ గల చావులేని దేవతల కందఱకుఁ బ్రభువుగా నుండువానిని, పఱిపోవన్ = కొల్లపోఁగా.

తా త్ప ర్య ము.

ఇంద్రజిత్తుకూడ రామలక్ష్మణులను జయింపలేఁడని విభీషణుఁడు చెప్పిన కారణ ముచే నింద్రజిత్తు తన పరాక్రమపౌరుషములఁ జెప్పుచున్నాఁడు.

పిఱికీ! నీవు మాకా భయము నేర్పెదవు? మాలో నధముఁడైన రాక్షసుఁ డొక్కఁడు రామలక్ష్మణుల నిరువురఁ దఱుమఁగొట్టలేఁడా యేమి? ఏల వ్యర్థముగా నిన్నిమాటలు మాటలాడుచున్నావు. లోకముల నన్నిటిని పాలించువాఁడై జయించు స్వభావము గలవాఁ డగుటచే జిష్ణుఁ డని పేరుపొంది చావులేని దేవతల కందఱకుఁ

ప్రభువైన వాని గర్వము కొల్లపెట్టి నేను జెఱసాలయం దుంపలేదా? దిక్కు తెలియక తికమకలాడు దేవతలఁ దఱిమి తఱిమి కొట్టనా?

చ. కెరలిన నాదుశక్తిఁ గని ♦ గీయని కూయుచు నేలఁ బొర్లని
ర్జరపతి వారణంబు రద♦సంహతి నూడఁగఁ ద్రెక్కి దానిచే
నరులను ద్రోలనే? సురచ♦యంబుల దర్పమణంప లేదె? యా
శరులకు శోకదాత నయి ♦ సన్నుతిఁ గాంచనె? నీ వెఱుంగవే! ౨౫౭

అర్థములు. కెరలిన = విజృంభించిన, రదసంహతిన్ = దంతముల సమూహమును, నాలుగు దంతములను, అరులను = శత్రువులను, ఆశరులకు = విరోధి రాక్షసులకు.

తాత్పర్యము.

నేను విజృంభింపఁగా నా శక్తిఁ జూచి నేను గొట్టకముందే నేలఁబడి గీయని కూయుచున్న యైరావతము కొమ్ముల నూడఁబెఱికి వానితో శత్రువులను దఱుమలేదా! దేవతా సమూహముల గర్వ మణఁపలేదా? విరోధి రాక్షసులకు శోకదాతనై పొగడఁబడలేదా? ఇవన్నియు నీ వెఱుంగవా?

ఉ. అంతటివాఁడఁ బ్రాకృత నృ♦పాత్మజుల న్బలహీనమర్త్యులన్
వింత యొకో జయించుట వి♦భీషణ యంచు వచింప నంత దు
ర్దాంతబలుం డజయ్యు సుర♦రాజనిభున్ గురు తేజుఁ జూచి యా
వంతయుఁ గొంక కిట్లను మ♦హార్థసుభాషిత మెల్లరు న్వినన్. ౨౫౮

అర్థములు. ప్రాకృత నృపాత్మజులన్ = సామాన్య రాజకుమారులను, దుర్దాంతబలుండు = అణఁపరాని బలముగలవాఁడు, ఈ విశేషణము బలహీనుఁడై యింద్రజిత్తాక్షేపించినట్లు పిఱికివాఁడై విభీషణుఁడు చెప్పలేదని సూచించుచున్నది. అజయ్యున్ = జయింప సాధ్యముగాని వానిని, ఇది యింద్రజిత్తు రామలక్ష్మణుల జయింప లేఁ డనుట వాని బలశౌర్యములు తెలియక కాదని సూచించెడిని, ఆవంతయును = కొంచెమైనను, ఆవగింజంతయైనను, కొంకక = సందేహింపక, మహార్థసుభాషితము = గొప్ప ప్రయోజనముతోఁ గూడిన మంచిమాట.

తాత్పర్యము.

అంతటి కార్యములు చేసినవాఁడను సామాన్య రాజకుమారులను బలములేని మనుష్యులను విభీషణా, జయించుట యాశ్చర్యమా? యనఁగా విశేషబలశాలి యగు విభీషణుఁడు, జయింపరాని వాఁడును ఇంద్రునితో సమానుఁడును గొప్ప తేజస్సు గలవాఁడు నగు నింద్రజిత్తుఁ జూచి యందఱు వినుచుండ జంకక యిట్లు గొప్ప మేలు కూర్చు మంచి మాట చెప్పెను.

ప్రాకృతు లనుటచే నింద్రునివలె గొప్పవారు గా రనియు, నృపాత్మజు లనుటచే బాలురనియు బలహీను లనుటచే నైరావతమువలె బలముగలవారు గా రనియు

మస్త్ర లనుటచే అమస్త్రలను గొట్టిన వానికి నొక దెబ్బ గొట్టినఁ జచ్చునా రెంత మాత్రి మసియు గాహ్యము.

—♦ విభీషణుఁ డింద్రజిత్తును నిందించుట ♦—

ఉ. బాలుఁడ వీవు నాయన ! యపక్వమనీషుఁడ వౌట మంత్రికా
ర్యాళి యథార్థదృష్టిఁ గనునంతటివాఁడవు గావు, కావునన్
నీ లయ మే నెఱుంగక యొ స్సేచ్ఛుపయుక్తులు లేనిపోని వా
గ్జాల ముపన్యసించితివి ♦ కార్యము తీరెనె యంతమాత్రనే. ౨౮౯

అర్థములు. నాయనా = కుమారా! (గుడ్డువచ్చి పిల్లను వెక్కిరించినట్లు నీవే నన్నాక్షేపింపఁ జూచితివా! యని భావము. అపక్వ మనీషుడవు = పక్వము గాని బుద్ధిగలవాడవు, మంత్ర కార్యాళిన్ = ఆలోచనచేయు కార్యములందు, యథార్థదృష్టి = ఉన్న దున్నట్టు లాలోచించు.

తాత్పర్యము.

కుమారా - నీవు పిల్లవాఁడవు - 'బాలా దపి సుభాషితమ్మని లేదా యందు వేమో, బుద్ధిమంతు లగు పిల్లవాండ్రు చెప్పిన గ్రాహ్యమేకాని నీ బుద్ధి యింకను బక్వము గాలేదు. కావుననే మంత్రాలోచనమందు యథార్థము తెలిసికొను శక్తి నీకు లేదు. కావున నీవు చెడుటకూడ నీ వెఱుంగక తెలిసినవానివలెనే లేనిపోనిమాటల నుపన్యాస మిచ్చితివి. అంతమాత్రముతోనే కార్యము చక్కఁబడెనా? నీవు చెప్పునది యుద్ధవిషయములు. ఇక్కడ జరగు ప్రస్తావన నీ తండ్రి చేసినది తప్పా యొప్పా-తప్పైన సవరించుకొను ట్లెట్లు లనునది - కార్యము నిరపాయముగ నెఱవేఱుటకు నే యుపాయము మంచి దని యాలోచించునప్పుడు యుద్ధము తీర్మానమైన పిమ్మటఁ జెప్పవలసిన ముచ్చట లిప్పుడేల? సామము దానము దండము - వీనిలో నేది మంచి దని విచారింపఁ బడుచున్నది. నోటఁ బోవుదానికి గొడ్డలి ప్రయోగించువాఁడు బుద్ధిమంతుఁడా! ఇది యాలోచించు బుద్ధి నీకు లేదు. నీకు యుద్ధముసందే దృష్టియుండుటచేఁ దక్కినవి నీకుఁ గానరాలేదు. కావున నీ యాలోచనప్రకారము పోయిన నీవు నాశ మగుట యెఱుంగక యేవేవియో ముచ్చట లుపన్యసించితివి! ఈ ముచ్చటలతోనే కార్యము చక్కఁబడెనా?

క. పుత్రుఁడ వను నెపమునఁ బ్రియ మిత్రుని వలె రావణున కమిత్రుఁడవై మన్మ
పుత్రిపతి భయముఁ డన నీ,మాత్రము గనలేక చెనఁటిమాటలు వినుదే. ౨౯౦

అర్థములు. అమిత్రుఁడవు = పగవాఁడవు.

తాత్పర్యము.

కొడు కనుపేర ప్రియమిత్రునివలె నుండి వాస్తవమున నీ తండ్రికి నీవు పుత్రుఁడవ యుయున్నావు. సీతాపతియగు రామునివలన భయముగలదు. యుద్ధమువలన దని నేను చెప్పఁగా నేను నీకుఁ గీడుచెప్పినట్లు తలఁచి దుర్మార్గుల మాటలు "" యా

పక్షమున మాటలాడెదవా? నీకు నీతండ్రికి నేను గీడు కోరువాఁడను, పరాయివారు మేలుకోరు వారై రికదా. నీ వివేక మింతలో నున్నది.

చ. అరయఁగ నీవు దండ్యుఁడవ ♦ యంతియ కా దిటువంటి మంత్రిముం
జరపెడివేళ నిచ్చటికి ♦ సాహసముఖ్యుని బాలు ధీరతం
దిరుని సభాస్థలిం జొరఁగఁ ♦ దెచ్చిన దుర్మతికూడ వధ్యుఁ డౌ;
సరిపడునొక్కొ మంత్రి మది ♦ జాల్ములు మూఁగిన కొల్వులోపలన్. ౨౯౧

అర్థములు. దండ్యుఁడవు = దండింపఁదగినవాఁడవు. తిరునిక్ = స్థిరుని, దుర్మతి = చెడుమనస్సు గలవాఁడు, జాల్ములు = మూఢులు, మూఁగిన = గుంపు చేరిన.

తా త్ప ర్య ము.

నీ వహితము బోధించుచున్నావు కావున నీవు పగవానివలె దండింపఁబడఁ దగిన వాఁడవు. గొప్ప విషయ మాలోచన జరుగు సమయమున సాహసము ప్రధానముగా నెంచువానిని, పిల్లవానిని, పట్టిన పట్టు సాధింపఁ జూచువానిని నిన్ను సభకు రానిచ్చిన దుర్బుద్ధి కూడ దండ్యుఁడే. ఏల యన మూఢులు గూడిన సభలోఁ గార్యాలోచనము కుదురునా? గొప్ప కార్యము లాలోచించునపు డేడవ చెవి వినఁగూడ దని శాస్త్ర ముండఁగా నీ వంటి పిల్లవాండ్రను ఆలోచింప శక్తి లేని వారిని రానిచ్చుట తప్పుగదా.

చ. తెలివియొ సర్వమంగళము ♦ తీక్ష్ణత నీకు స్వభావసిద్ధముక్
దెలియు వణంకు వెట్టిదియొ ♦ తీర్పులు దిద్ద దెఱింగినట్టులే
యలుచపు స్వల్పబుద్ధివి దు♦రాత్ముఁడవు మోఱకండవుం గడు
ల్బిలుకవు మేటిదుర్మతివి ♦ పిల్లతనంబునఁ బ్రేలె దీ గతిన్. ౨౯౨

అర్థములు. సర్వమంగళము = సున్న, "కైదువు సున్న పూజ్యములు కంకటఖేట శిరస్త్రలత్రిముల్, లేదరదంబు తత్తడి హుళిక్కి సహాయము సర్వమంగళంబు" మను. ర-౧౦౫. అణంకువ = వినయము, అలుచవు=మందుఁడవు, స్వల్పబుద్ధివి = కొంచెపు బుద్ధిగలవాఁడవు, మొఱకఁడవు = మూర్ఖుఁడవు, బాలుఁడవు, నీవు మేటి దుర్మతివి= ప్రహస్త మహాపార్శ్వకుంభకర్ణాదులు దుర్మతులు. వారి కంటె నీవు హెచ్చు దుర్మతి వని భావము.

తా త్ప ర్య ము.

ఇంద్రజితా! నీకుఁ దెలివి సున్న. క్రౌర్యము నీకు స్వభావగుణము. పెద్దల సేవించినవాఁడవు కావు. కావున వినయ మెట్టిదో యెఱుఁగవు. తెలిసిన వానివలె దీర్పులు దిద్దెదవు. మందుఁడవు. బుద్ధి విశేషము లేనివాఁడవు, చెడుబుద్ధి గలవాఁడవు, నీకుఁ దెలియదు, ఒకరు చెప్పినను వినవు, మిక్కిలి బాలుఁడవు, దురాలోచనపరులందు మేటివి, కావునఁ బిల్లతనముచే నిట్లు వదరెదవు.

తే. ఎవఁడు సైరించు నొక్కఁ-డీ• తేఁకుఁ జేయు,బ్రహ్మదండనిభంబులు•రవితనూజ
దండకల్పంబు లర్చిర్యు•తంబు లుగ్ర,కాలతుల్యాకృతులు నైన•కాండములను.

అర్థములు. బ్రహ్మదండనిభంబులు = బ్రాహ్మణ శాపముతో సమానమైనవి,(-౨) ప్రలయకాలమున బయలు దేఱు నగ్నివర్ణ ధూమకేతువు, రవితనూజ దండ కల్పంబులు = యమునిదండముతో సమానములు, అర్చిర్యుతంబులు = జ్వాలలు గలవి, 'అగ్నేరార్చిజంతే అర్చయః' అని వేదమందు అర్చిశ్శబ్ద మికారాంతము గలదు, ఉగ్ర = భయంకరములైన, కాల=యమునితో, తుల్య=సమానములైన ఆకృతులు= ఆకారములు గలవి, కాండములను = బాణములను.

తా త్ప ర్య ము .

బ్రహ్మదండముతో సమానములై యమదండములను బోలి జ్వాలలు గలిగి భయంకరమైన యముని యాకారముతో సమానములైన యాకారములఁ గలిగిన రాముఁ డేయు బాణములను నెవఁడు సైరింపఁగలఁడు.

మ. దనుజాధీశ్వర! నాదు విన్నపము డెం•దంబందుఁ బొందింపుమీ
ధనము లౌత్నములుం బరిష్కరణసం•తానంబు దీవ్యన్మహా
ధనము ల్చిత్రమణు ల్ధరాసుతయుఁ దా•త్పర్యంబున నామచం
ద్రున కర్పింపుము, సౌఖ్య మంద నగు నెం•తో యెల్లవారుం బురిన్. ౨౯౪

అర్థములు. ఇట్లు లింద్రజిత్తునకు బదులుచెప్పి రావణుని గూర్చి చెప్పు చున్నాఁడు. పరిష్కరణసంతానంబు = సొమ్ముల సమూహము.

తా త్ప ర్య ము .

రాక్షసేశ్వరా! నా విన్నపము హృదయమున నాటనిమ్ము- ధనములు ఆ యా జాతియందు శ్రేష్ఠములైన పదార్థములు - సొమ్ములు ప్రకాశించునవియు మిగుల వెలగలవియు, చిత్రములైన మణులు- సీతను బుద్ధిపూర్వకంబుగ రామచంద్రున కర్పింపుము. ఊరిలో వారందఱు మిగుల సుఖపడుదురు. అటు చేయనియెడల వారికి నీకుఁ గీడు తప్పదని భావము.

విభీషణుఁడు చెప్పినది దాని నర్థానుసంధానము చేసి యాప్రకార మాచరించక పోయినను వినుటచేతనే మనస్సునఁ బ్రీతి జనింపఁజేయునది. ఆచరణమం దిష్టము లేకపోయినను వినరానిదికాదు, అవశ్యము వినదగినది.

—• { ౧౬-వ సర్గము. రావణుఁడు విభీషణునకు జ్ఞాతిలక్షణంబుఁ దెలిపి నిష్ఠురంబు లాడుట. } •—

తే. అనుచు సునివిష్టమును హిత•మైన వాక్యమును బలుకు విభీషణు• మోముఁజూచి
రావణుఁడు కాలచోదిత•భావుఁ డగుటఁ, బరుషవాక్యంబు లిట్లని • పలికె నతని.

అర్థములు. సునివిష్టము = చక్కఁగాఁ గూర్పఁబడినది, పదముల చేరిక మంచిదైనది - రావణాదుల కిందలి యర్థము రుచింపకున్నను వాక్యము చెవుల

కింపుగా నుండుటచే నడలుటకు సాధ్యపడలేదనియు విభీషణుఁడు చెప్పఁ దలచిన దంతయు నీ వాక్యమునం దున్నదని సూచితము. దీనివలన భగవద్విషయ ముపదే శించువారు భయముగాని దాక్షిణ్యముగాని లేక వారి మేలు గోరి ఖండితముగఁ దెగజెప్పవలయు ననియుఁ జెప్పుటయందు లోప ముండరాదనియుఁ దెలియనయ్యెడిని- భయదాక్షిణ్యములచే నిచ్చకము లాడువాఁ డాత్మద్రోహి - పరద్రోహియు నగును. హితము = చెవుల కింపుమాత్రమే కాక కీడు పోఁగొట్టి మేలు గూర్చునది, వచించు= చెప్పు, "నా సంవత్సరవాసినే బ్రూయా" త్తనునట్లు సంవత్సరము గురుశుశ్రూష చేసినవానికిఁగాని చెప్పరాని గొప్పవిషయము రావణుఁడు చెడిపోవుట యెఱ్ఱక నాలుగుమాటలలోఁ జెప్పినాఁడని భావము. విభీషణు మోముఁజూచి మఱి యెవ్వ రైనఁ జెప్పినఁ గోఁచివేయవచ్చును గాని సొంత తమ్ముఁడే చెప్పుటచే నే మాత్రము ద్రోచివేయరా దని భావము.

విభీషణుఁడు చెప్పినది సునివిష్టము హిత మనుటచే నీ వాక్యము లిట నను సంధించునది.

> ఆత్మా రాజ్యం ధనంచైవ కళత్రం వాహనానిచ
> ఏత ద్భగవతే సర్వ మితి తత్ప్రేక్షితం సదా. నను.

'పితరం మాతరం దారాన్ పుత్రాన్ బంధూన్ సఖీన్ గురూన్, రత్నాని ధన ధాన్యాని క్షేత్రాణిచ గృహాణిచ, సర్వధర్మాంశ్చ సంత్యజ్య, సర్వకామాంశ్చ సాక్ష రాన్, లోకవిక్రాంత చరణౌ శరణం తే వ్రజం విభో'' దీనివలన విభీషణుఁడు శరణాగతి బోధించె నని యేర్పడుచున్నది. అది రావణునంటి రాక్షసున కెట్లు రుచించును. ఇట్టి యభిప్రాయము లేదేని సీతను మాత్రమిమ్మనినఁ జాలును. ఈ పదార్థము లన్నియుఁ దాత్పర్యముతో నిమ్మని చెప్పనేల? శత్పరత్వమే తాత్పర్యము. ఇది భక్తిని నను కూలభావమును సూచించును. దుష్బుద్ధులకు భగవద్విషయ ముపదేశించినఁ గలుగు ఫలముఁ జెప్పుచున్నాఁడు.•

రావణుఁడు "రావయతీతి రావణః'' యను వ్యుత్పత్తి ప్రకారము జనుల నేడ్పిం చుట యందు లోకప్రఖ్యాతుఁ డని భావము (౨) రాతీతి రావణ యను వ్యుత్పత్తి ప్రకారము ఇంద్రియ సౌఖ్యములకై యేడ్చువాఁడని భావము, కాలచోదిత భావుఁడు= యమునిచేఁ బ్రేరింపఁబడిన మనస్సుగలవాఁడు - రామునకు శరణాగతి చేయు మని విభీషణుఁడు చెప్పినమాట వినవల దని యముఁడు ప్రేరేంచుచున్నాఁడని భావము. ఇన్ని పాపములు చేసి తన లోకమునకు రావలసినవాఁడు శరణాగతి చేసినఁ దప్పించుకొనునే యని యముఁడు విభీషణుమాట వినవల దనుచున్నాఁడని భావము. లోక విరుద్ధచర్య నడచి నరకమునకుఁ బోవ నున్నవానికి శరణాగతి రుచింప కుండుటయేగాక వికటించు నని సూచితము - కావుననే, మోముఁ జూచి = చాటుగఁగాదు - రహస్యముగఁగాదు• ఎదురుగనే - పరుషవాక్యములు - అటువంటి మంచిమాటలు విన్నవాఁడు నీ సద్వా

క్యములచే నా సందేహము దీఱెనని యైనఁ జెప్పియుండవలెను. నీవు నాకు మహోప కారము చేసితి వని స్తోత్ర మైనఁ జేసియుండవలెను. ఇట్టి మహోపదేశము చేసిన వారికిఁ జాలినంత ప్రత్యుపకారము చేయనైతినిగదా యని యనుతాప మైనఁ బడి యుండవలెను. ఈ సన్మార్గము వదలి పామునకుఁ బాలుపోయఁ బోవ నది పైపడి పీకినట్లు రావణుఁడు పరుషవాక్యము లనుచున్నాఁ డని భావము.

తాత్పర్యము.

ఈ ప్రకారము చక్కనికూర్పు గల మాటలచే హిత ముపదేశించు విభీ షణు ముఖముఁ జూచి రావణుఁడు మృత్యుప్రేరితుఁ డగుటచేఁ గఠినవాక్యము లిట్లు పలికెను.

దీనివలన భాగవతుని పరుషముగా మాటలాడుట తన వినాశసూచక మని సూచన.

క. కినిసినఫణితో నేనియుఁ, దన శత్రువుతోడ నేనిఁ ♦ దగు వసియింపం
దన మిత్రునివలె మెలఁగెడి, తనరిపు సేవకునితోడఁ ♦ దగదు వసింపన్. ౭౯౬

అర్థములు. కినిసినఫణితోన్ = కోపించిన పాముతో, తనరిపు సేవకుని తోడన్ = తన విరోధిని గొలుచువానితోడ.

తాత్పర్యము.

తనపైఁ గోపించిన పాముతోనైనను, తన్నుఁ జంపఁజూచు ప్రత్యక్షశత్రు వుతో నైనను గూడియుండవచ్చును. కాని తన మేలుగోరు మిత్రునివలె నటించుచు లోలోపలఁ దన శత్రువునకు సేవకుఁడై యుండువానితో వసింపరాదు. ఇక్కడ సేవకుఁ డనఁగాఁ బక్షపాతము గలవాఁ డనియే గ్రహింపనగు.

మన కొకఁడు ప్రత్యక్షశత్రు వని స్పష్టముగాఁ దెలిసినప్పుడు మన జాగ్రత్తలో మన ముందుము. కావున నపాయము తక్కువ. అటుగ్రాక "రాజులలోఁ గొలువు, నవాబులలో నొళవు" అన్నట్టు శత్రువునకు లోకువై యుండి మిత్రునివలె నటించు వానివలనఁ బ్రమాదముచేఁ జెడుదుము. ఇట్లు చెప్పుటచే విభీషణుఁడు రామునకు నొళవై తన కీడు వెదకు చున్నాఁడని సందేహపడినట్లు భావము. ఇది దూషింప వలసి దూషించిన మాటయేకాని సీతాదేవిని దెచ్చిన దినము మొద లప్పుడప్పు డీ విషయమే విభీషణుఁడు చెప్పుచుండిన కారణముచే నిండు మనస్సుతోఁ జెప్పిన మాట గాదు, తనకు విరోధముగాఁ జెప్పెనే యని యాక్రోశముతోఁ జెప్పిన మాట. కోపించిన సర్పముతోను,ప్రత్యక్ష శత్రువుతోడను నొకచోట నుండుట యెట్లు సరిపడదో యట్లు నీతోఁ గూడియుంటడు నాకు సరిపడదు. కావున నా నగరము విడిచి పొమ్మని సూచన.

క. జ్ఞాతుల స్వభావ మంతయు, నా తెలియని యదియె త్రిభువ♦నంబులలోనన్
జ్ఞాతులకు వ్యసన మబ్బిన, జ్ఞాతులకును సంతసంబు ♦ సమకూడుఁ గదా. ౭౯౭

అర్థములు. జ్ఞాతుల = దాయాదులయొక్క, నా తెలియని యదియె = నాకుఁ దెలియని విషయమూ, ధాతుజవిశేషణ భావార్థక పూర్వావ్యవహితావ్యవహిత కర్తృపద ప్రథమకుఁ దఱుచుగ యొక్కషష్ఠి యగు. ప్రౌ. వ్యా. కారక. ౧౫ సూ. "అపారపారావారపర్యంత మహీతలంబునందు నా చూడని రాజు లెవ్వరును లేరు." భార. అరణ్యా. ౨. ఆ.

తాత్పర్యము.

మూఁడు లోకములందును దాయాదు లగువారి సహజగుణము నాకుఁ దెలియదా యేమి? దాయాదులకుఁ గష్టము కలిగినచో వాని దాయాదులు సంతోషించుచుందురుగదా! "జ్ఞాతి శ్చే దనలేన కి"మ్మని భర్తృహరి. దాయాదుఁ డుండెనేని యగ్నితో నేమి పని.

మూఁడు లోకములం దనుటచే మనుష్యులందు, దేవతలందు, రాక్షసులందు, నన్ని జాతులందు, భూతములందుఁ గలదని భావము.

క. ఆతతమతియుతు ధర్మో,పేతు ననుత్తముని శూరు ♦ హితసాధకునిన్
జ్ఞాతులు మెచ్చరు మఱి పరి,భూతియు నొనరింతు రొ్రసమయ♦ముం గనుఁగొనుచున్.

అర్థములు. ఆతతమతియుతున్=విస్తారమైన బుద్ధిగలవానిని, ధర్మోపేతు= ధర్మముతోఁ గూడినవానిని, అనుత్తముని = మిగుల శ్రేష్ఠుని, హితసాధకునిన్ = తనకు హితమైనదానిని సాధించు వానిని, పరిభూతి = అవమానము, తిరస్కారము.

తాత్పర్యము.

జ్ఞాతులలో మిగుల బుద్ధిమంతుఁడు, ధర్మమునం దుండువాఁడు, మిగుల నుత్తమ గుణములు గలవాఁడు, శూరుఁడునై హిత మగుదానిని సాధించువానిని, దక్కిన వాని జ్ఞాతులు మెచ్చను మెచ్చరు. పై పెచ్చు ఏదైనఁ గొంచెము సమయము దొరకెనా యవమానింతురు. నీవు నట్టివాఁడవే.

ఆ. కలసి మెలసినట్ల ♦ కనఁబడు చుందురు, క్రూరకర్మములకు ♦ రోయకుందు
మనసు నీయ రెడరు♦నను జంపఁ జూతురు, భీతికరులుగాదె ♦ జ్ఞాతు లెందు.

అర్థములు. మనసునీయరు = మర్మము విడిచి మాటలాడరు, ఎడరునను = ఆపత్కాలమందు, భీతికరులు = భయము గలిగించువారు.

తాత్పర్యము.

మిగుల నొద్దిక, నైకమత్యము గలవారివలెఁ దమతోఁగలసి మెలసి తమలో నొకఁడుగాఁ దిరుగుచుందురు. సమయము వచ్చెనా యెంతఘోరకార్య మైనఁ జేయుటకు జుగుప్సపడరు. తమ మనస్సు బయటబెట్టరు. ఆపదలందుఁ జంపఁ జూతురు. కావున జ్ఞాతు లెప్పటికైన నపాయము గలిగించువారే. ఇట్లు సామాన్యముగ జ్ఞాతి లక్షణము చెప్పినను ఇవి యన్నియు నీయం దున్నవని నీవు నిట్టివాఁడవే యని భావము.

క. మును పాశహస్తనరులను, గని పద్మవనంబునందుఁ ♦ గల వారణముల్
విని చె నొక కొన్ని పద్యములను వానిని వినుము జ్ఞాతి♦లక్షణ మెఱుఁగన్. 300

అర్థములు. పాశహస్తనరులను = తమ్ముఁబట్టుటకుఁ బగ్గములు చేతఁబట్టుకొని వచ్చిన మనుష్యులను.

తా త్ప ర్య ము.

తమ్ముఁబట్టుటకుఁ గొందఱు మనుష్యులు పగ్గములను, వారికి మచ్చికపడిన యేనుఁగులను దీసికొనిరాఁగా వారినిఁజూచి పద్మవనంబు నందలి యేనుఁగులు వారితో నిట్లు చెప్పెను. ఆ మాటలు వినినచో నీకు జ్ఞాతు లెట్టివారైనది తెలియఁగలదు.

ఆ. భయము లేదు మాకుఁ ♦ బాశచయంబుల, నిప్పువలన శస్త్ర♦నిచయములను
స్వార్థపరులుఁ గ్రూరు♦లైన దాయాదుల, వలననే భయంబు ♦ గలుగు మాకు. 301

అర్థములు. స్వార్థపరులు = తమ మేలు చూచుకొనువారు.

తా త్ప ర్య ము .

మనుష్యులారా! మీ పగ్గములకు మేము భయపడము. మీరు వేయు మంటలకు, మీరు చూపు కొఱవులకు మేము భయపడము. మీరు ధరించిన ఆయుధములకు మేము భయపడము. కాని తమ మేలుగోరి కఠినచిత్తులైన మా దాయాదులకు మేము భయపడుదుము.

ఆ. మీరు దెచ్చినట్టి♦వారణంబులు మమ్ముఁ, బట్టుకొనఁగ నుపమఁ ♦ బలుకు నిజము
సకలభయము లందు ♦ జ్ఞాతిభయం బది, దుస్సహంబు మాకు ♦ లెస్స తెలియు.

అర్థములు. ఉపమ = ఉపాయము, దుస్సహంబు = సహింపరానిది.

తా త్ప ర్య ము .

అవి మిమ్మేమి చేసెనందురా- మీ పోషణ మందుండి మీరు తోడి తెచ్చిన యేనుఁగులు మమ్ముఁ బట్టుకొను నుపాయము మీకుఁ జెప్పును. అన్ని భయములందు జ్ఞాతులవలని భయము సహింపరానిది. ఇది మాకు బాగుగఁ దెలియును.

కట్టెలు కొట్టువాఁ డొకఁడు గొడ్డలి తీసికొని యడవికిఁ బోయెను. వానిని జూచి యొక చెట్టు మఱియొక చెట్టుతో వీఁడు మనలఁ గొట్టుటకై వచ్చెను, మనలో నెవరిని గొట్టునో యేమో యనెను. ఆ రెండవ చెట్టు మన వారెవ్వరైన వానితోఁ గలిసినారా చూడుము. మనవారు కలసిననే మనకు భయము. మనవారు కలియకుండువఱకు మనకు భయము లేదని చెప్పెను. కట్టెలేని గొడ్డలి యేమి చేయఁగలదు? ఇది దాయాదుల లక్షణము.

ఆ. గోవులందు భాగ్య♦గుణ మది సైజంబు, విప్రులందు దమము ♦ విశ్రుతంబు
స్త్రీస్వభావగుణము ♦ చిత్తచాంచల్యంబు, జ్ఞాతి కెడరు సేత ♦ సహజగుణము.

అర్థములు. భాగ్య గుణము = తమ్ము మేపువారికి నైశ్వర్యము గలిగించు గుణము - పాలు పెరుఁగు నెయ్యి మొదలైనవి యిచ్చి యని భావము. దమము =

ఇంద్రియ నిగ్రహంబు - చిత్తచాంచల్యంబు = చపలచిత్తము - ఎడరు సేఁత= కీడు సేయుట.

తా త్ప ర్య ము.

గోవుల స్వభావ మైశ్వర్యము నిచ్చుట - బ్రాహ్మణుల స్వభావము ఇంద్రియ నిగ్రహము, చపల చిత్తము స్త్రీల స్వభావము, కీడు సేయుట జ్ఞాతుల స్వభావము.

క. కావున లోకము నను సం,భావించుట నిరుపమాన♦భాగ్యము గనుటన్
నే వైరులతలఁ ద్రొక్కుట, నీ వెదఁ జూపోప వైతి♦వే సౌమ్యుండా! ౨౦౪

అర్థములు. చూపోపవైతివే = చూడలేకపోయితివా.

తా త్ప ర్య ము .

ఈ కారణములచే నీవు నాకు జ్ఞాతి వగుట- లోకులు నన్ను గౌరవించుట, అసమానసంపద నాకు లభించుట, నేను వైరుల తలలపై నెక్కి వారి నవమానించుట చూచి పెద్దమనుష్యుఁడా! సహింపఁజాలకపోయితివిగదా! కావున నా శత్రువులకు నన్ను లోపడచేసి యవమానింపఁ జూచుచున్నావు. ఇది ౨౯౮ పద్యమునఁ జెప్పిన దానికి నన్వయము.

క. అంటియును దామరాకున, నంటని జలబిందుసమితి♦యట్టు లనార్యుం
డొంటుకొని చేయు స్నేహం, బంటియుంటకయ యుండు♦నో రాక్షసుఁడా. ౨౦౫

అర్థములు. ఒంటుకొని = కూడనుండి, అంటియుంటక=తాఁకియుండఁడాఁకక,
త్వార్థకద్వంద్వంబున నర్థవిశేషంబునఁ బూర్వపదంబునకు దీర్ఘము విభాష నగు, దీర్ఘమురాని చో సముచ్చయ మధ్యాహార్యం బొండే నగు. సు.వ్యా.వాక్య. ౫౮ సూ.
"కం. నమ్మమి మృత్యువు పెద్దయు, నమ్ముట యపమృత్యు వగుట నరపతి నమ్మీ
నమ్మక పనిగొనునది ని,త్యమ్మును సూక్ష్మమతిఁ దాన యరయఁగవలయున్."
భార - శాంతి ౨-౧౫౧ ప.

తా త్ప ర్య ము .

తామరాకునందలి జలబిందువులు దానిని దాఁకియుండును గాని, దానిఁ దడుపలేవు. కావున దాఁకకుండిన నెట్లో తాఁకియున్నఁ నట్లే. తాఁకుటవలనఁ గలుగు గుణము కానరాదు. అట్లులే నీచుఁ డగుఁవాడు కలసిమెలసి చేయుస్నేహము స్నేహఫలము చూపదు. రాక్షసుఁడా ! యిది నీచసంబోధనము. నీవు నిజముగ రాక్షసుఁడవే.

క. విను విరులఁ దేనెఁ గ్రోలిన, వెనుక మధుపములు వాసి ♦ విడిచెడి గతి దు
ర్జనులు తొలిమైత్రిఁ దలఁపరు, పని తీరినవెనుక నిజము ♦ పలికెద నసురా! ౨౦౬

అర్థములు. విరులన్ = పుష్పములందు, మధుపములు = తుమ్మెదలు.

తా త్ప ర్య ము .

పుష్పములయందుఁ గల తేనె ద్రావి తమ యాకలి దీర్చుకొనిన వెనుక నా తుమ్మెద లా పువ్వులందలి తేనె వలనఁ గదా తమ యాఁకలి దీరె నని తలఁపక

విడిచిపోవునట్లు దుష్టులు తా మొనరించిన బాగుపడిరో వారిని వారితోఁ దమ పని తీరినవెనుకఁ దలఁపరు. రాక్షసుఁడా! నేను నిజము చెప్పుచున్నాను. నీవు నట్టివాఁడవే.

క. మును జలకేళిం దేలియుఁ, దనశిరమునఁ దనకుఁ దాన ♦ తన తొండమునన్
మను వైచుకొనెడు నేనుఁగు, ననువున ఖలమైత్రియును నిరర్థక మసురా! ౩౦౭

తా త్ప ర్య ము.

తొలుత స్నానము చేసి యొడ్డునకు వచ్చి యేనుఁగు తన నెత్తిమీఁదఁ దానే మన్ను కొట్టుకొనునట్లు దుష్టులతోడి స్నేహము వ్యర్థము - పూర్వస్నేహమును దుష్టులు తామే నాశము చేసికొందురు. నీవు నట్టులు చేయుచున్నావు.

క. శారద వేళల గర్జ ల,పారంబుగ నించి చినుకు ♦ పడరాలిచియున్
ధారిణి తడియనిగతి ని,స్సారము నిష్ఫల మనార్య♦సంగతి యసురా. ౩౦౮

తా త్ప ర్య ము.

శరత్కాలమునందు మేఘములు మిగుల గర్జించియు, చినుకులు రాల్చియు నేల తడియక యుండునట్లు నీచుల సంగతి సారహీనము, వ్యర్థము.

క. ఈపాటి నన్నుఁ బలికిన, వే పొన్గదె వాని శిరము ♦ పృథివిని దుమ్రిటిలోఁ.
బాపాత్మా! కులపాంసన, ఛీ పో నాయెదుట నిలువఁ♦జెల్లదు నీకున్. ౩౦౯

తా త్ప ర్య ము.

నీవు పలికిన విధముగ మఱియొకఁడు పలికియుండిన వాని తల నిమిషములో నేలమీఁదఁ బొరలియుండదా? నీవు తమ్ముఁడ వని చంపక విడువవలసి వచ్చినది. పాపాత్ముఁడా! కులద్రోహీ! ఛీ. పో. నా యెదుట నీవు నిలువఁదగదు.

ఇది చంపుటకు మాఱుగాఁ జేసిన శిక్ష యని యెఱుఁగ నగు. లక్ష్మణుని రామచంద్రమూర్తి చంపవలసి వచ్చినప్పుడు నాయొద్ద నుండవలదు, నిన్ను విడిచితిఁ బొమ్మనెను. (చూ. ఉత్త. ౧౬ వ సర్గ పద్యము)

రావణుఁ డిట్టివాఁడని యెఱిఁగియే చావునకు వెఱచి మంత్రులెవ్వరు హితముఁ జెప్ప భయపడిరి.

——♦ విభీషణుఁడు సభ విడిచి మింటికెగసి రావణునకు హితముఁ దెల్పుట. ♦——

తే. అనుచుఁబరుషంబు లాడుచు♦న్యాయవాది,యగువిభీషణుఁడునుగదా♦హస్తుఁడగుచు
నలువు రసురులతో పియ♦న్మార్గ మెగసి,యలుగి శ్రీమంతుఁడన్నతో♦నని యెనిట్లు

అర్థములు. పరుషంబులు = కఠినమాటలు, వియత్ + మార్గము = ఆకాశమార్గము, శ్రీమంతుఁడు = లక్ష్మీసంపన్నుఁడు.

ఈ విషయమున ఛాందోగ్యోపనిషత్తు ౭ వ యధ్యాయము ౧౫ వ ఖండము రెండవ మంత్రమున నిల్లున్నది. "స యది పితరంవా మాతరంవా భ్రాతరం స్వసారం వాచార్యంవా బ్రాహ్మణం వా కించిత్ భృశమివ ప్రత్యాహ ధి క్త్వాస్త్వి త్యేవైన మాహుః పితృహా వై త్వమసి, మాతృహా వై త్వమసి, భ్రాతృహా వై త్వమసి, స్వసృహా

వైత్వమ స్యాచార్యహా వైత్వమసి, బ్రాహ్మణహా వైత్వమసీతి." ఎవఁడైనను తండ్రిని గాని, తల్లినిగాని, తోడఁ బుట్టినవానిఁగాని, తోడఁ బుట్టినదానిని గాని, ఆచార్యునిఁ గాని, బ్రాహ్మణునిఁ గాని, ఛీ, పో, యని కఠినముగా మాటలాడెనేని నీవు తండ్రిని జంపినవాఁడవు, తల్లిని జంపినవాఁడవు, సోదరునిఁ జంపిన వాఁడవు, తోఁడబుట్టినదానిని జంపినవాఁడవు, ఆచార్యుని జంపినవాఁడవు, బ్రాహ్మణుని జంపినవాఁడవు అందురు. ఈ కారణము చేతనే శ్రీరామచంద్రమూర్తి లక్ష్మణుఁ బ్రత్యక్షముగాఁ జంపఁజాలక నా యొద్ద నుండ వలదు, పొమ్మనెను.

తా త్ప ర్య ము.

ఈ ప్రకారముగఁ గఠినముగ రావణుఁడు పలుకఁగా ధర్మమార్గమును జెప్పు విభీషణుఁడు కాలెడి యినుకమీఁద నిలువ లేనట్లు చేత గద తీసికొని తన మంత్రు లగు నలుగురు రాక్షసులతో నిఁక నీ పాపాత్ముఁ డగు రావణుని నేలమీఁద నడుగు పెట్ట రాదని రావణుని పంచప్రాణము లెగిరిపోవుచున్నవా యన్నట్లు లాకాశమున కెగసి కోపముతో లక్ష్మీసంపన్నుఁ డన్నతో నిట్లనియె. అన్నతో ననుటచే రావణుఁడు తన్ను దూషించినను వానియందు భ్రాతృభావము వదల లేదని భావము. కావుననే తాను సర్వము విడిచి తొలఁగి పోవుచు మరల నొకసారి హిత ముపదేశించు చున్నాఁడు.

శ్రీమంతుఁడు = "నెయ్యుర, లంక, సిరిం, ద్యజించితిఁ" అని సర్వము వదలి యింటికైనఁ బోక యెట్లున్నవాఁ డట్లు రామునియొద్దకుఁ బ్రయాణమైన వాఁడు శ్రీమంతుఁడని వాల్మీకి చెప్పెను. ఇప్పుడు విభీషణుఁడు శ్రీమంతుఁ డనుటచే నింత వఱ కాయన దరిద్రుఁడే యని వాల్మీకి యభిప్రాయము. ఇంతవఱకు నిల్లు, వాకిలి, ధనము, ధాన్య మున్నను నవి నశ్వరములు గావున విభీషణుఁడు దరిద్రుఁడే. ఇప్పుడు శ్రీరామ చంద్ర పాదారవింద సేవాలక్ష్మి లభించెను గనుక శ్రీమంతుఁ డయ్యెను. ప్రతికూల సాంగత్యము వదలుటయేగాక రామచంద్రమూర్తియందుఁ బ్రేమ జనించుటకంటె లక్ష్మీప్రాప్తి మఱియేది గలదు. నిజమై నిత్యమైన శ్రీ భగవత్ప్రాప్తియే సోపాధిక బంధుల విడుచుట - నిరుపాధికబంధు వగు భగవంతు నాశ్రయించుట భాగ్య హీనులకు లభించునా? ఇట్టులే యరణ్యమునకు రాముని వెంట బయలుదేఱిన లక్ష్మణుని వాల్మీకియు, శ్రీ భాగవతమున కృష్ణపాదారవింద తాడితుఁడైన కాళియుని వ్యాసులును శ్రీమంతు లని చెప్పిరి.

ఈ విభీషణునిచర్యవలన భగవద్విషయ మైన హితవాక్యములు వినక కేవలము ప్రతికూలభావము గలవార లెట్టి విడువరాని బంధువులైనను కాలుచున్న యింటివలె విడువవలయు ననియు, భగవద్భాగవతద్రోహు లున్నచోటఁ బ్రపన్ను డుండక తొలఁగి పోవుట యావశ్యక మనియు నేర్పడుచున్నది. ఇది యొక విధమైన ప్రాతికూల్య వర్జనము.

ఉ. అన్నవు నీవు రాజ వటు ♦ లౌటను నిచ్చకొలంది పల్కు మే
చెన్నన నైన మాన్యుఁడవు ♦ జ్యేష్ఠుఁడవు న్పితృసన్నిభుండ వ
ట్లున్నను ధర్మమార్గమున ♦ నుండమి నీ యనృతంబులుం గడుం
బన్నము దెచ్చు నిష్ఠురపుఁ♦బల్కులు సైఁపఁగ లే నొకింతయున్. ౩౦౦

అర్థములు. పితృసన్నిభుండవు = తండ్రితో సమానుఁడవు, అనృతంబులు = అసత్యవాక్యములను, నేను శత్రుపక్షము వహించి వారికి వశుఁడనై నీ కీడు కోరి నీ కవమానము గలిగింప నాలోచించితి నని నీవు చెప్పినవి యనృతంబులు, బన్నము = అవమానము.

తా త్ప ర్య ము .

నీవు నా కన్నవు గావునఁ బెద్దవాఁడవు. తండ్రితో సమానుఁడవు. కావుననే నేను నీకు నెదురు చెప్పరాదు. అందు రాజవు. బంధువు కాకపోయినను కేవల రాజ వని చూచినను నీ కెదురాడ రాదు. కావున నీ యిష్టము వచ్చినట్లు నీవు మాటలాడ వచ్చును. అయినను నీవు సీతను దొంగిలించి తెచ్చి యధర్మకార్యము చేసితివి. నేను శత్రువులకు లోబడి నీకుఁ గీడు కలిగింప నీ కీ మాటలు చెప్పితి నని యంటివి. ఇవి యసత్యములు. అధర్మమందు, నసత్యమునం దుండు నీవు ధర్మము, సత్యము నాధార పరుచుకొనియుండు నన్ను సభలో నవమానించి పలికితివి. ఆ యవమానమును నేను సహింపఁజాలను. ఈ మాటలు పడియు నం దుండెనేని దానిని సత్యపఱిచినట్లై కదా యగును.

క. హితకాముఁడ నై నీకును, వితతముగ సునీతివిధము ♦ వినిపించితి నీ
మతి కెక్కదు కాలవశా, గతుఁ డకృతాత్మకుఁడు హితము ♦ గ్రహియించు నొకో.

అర్థములు. హితకాముఁడనై = మేలుగోరినవాఁడనై, వితతముగ = విపులముగ, సునీతి పథము = మంచినీతి మార్గము, నేను జెప్పినది యుక్త రాజనీతి మార్గమే కాదు. ధర్మముతోఁ గూడి యిహపరసాధక మైన నీతిమార్గము. ఎక్కదు = నీ మనస్సునకు సరి పడినది కాదయ్యె, కాలవశాగతుఁడు = మృత్యువునకు వశపడిన వాఁడు. అకృతాత్మకుఁడు = మనస్సు కామమునకు వశపడి తన వశమున లేనివాఁడు.

తా త్ప ర్య ము .

నీ మేలు గోరువాఁడనై విపులముగఁ జెప్పవలసిన యన్నివిధముల నిహపర సాధక మైన మంచి నీతిమార్గముఁ జెప్పితిని. అది నీకు మనస్సున కెక్కలేదు. ఏల యందువా? నీ మనస్సునఁ గామ మెక్కియున్నది. కావున నందు నీతియెక్కుట కెడము లేదు. అదియును గాక నీవు మృత్యుదేవతకు వశపడి యున్నాఁడవు. అది దాని కను కూలముగ నిన్నుఁ బ్రవర్తింపఁ జేయునేకాని, మఱియొక విధముగ నడవ నిచ్చునా? హితము విన నిచ్చునా?

క. అనయము ప్రియవాక్యంబుల, ననియెడి జను లెందు సులభు ♦ లప్రియ మయ్యున్
గనఁ బథ్య మైన సూక్తిని, ననువాఁడును వినెడివాఁడు ♦ నగు దనుజేంద్రా! ౩౧౩

అర్థములు. ఈ పద్యము మారీచుఁడు చెప్పినదే. (అరణ్యా. ౫౭౬ ప. చూచునది) అందు ౫౭౦వ పద్యమునందు విభీషణాదుల నడిగి చూడు మనియు మారీచుఁడు చెప్పెను. మారీచుఁడు చెప్పిన ప్రకారము జరిగినది. తక్కినది జరుగఁ గలదని రావణునకుఁ దోఁపఁ జేయుటకై విభీషణుఁడు మారీచుని వాక్యములనే యనువదించెను. మారీచుఁడు నీకు హితము చెప్పినను దురకు నీ యిష్టప్రకారము వర్తించి చచ్చెను. నీ యభిప్రాయప్రకారము పోవు నీ యందఱ గతియు నంతే కాఁగలదు. నీవు చెప్పినట్లు విని యధర్మపక్షము వహించి చావ నొల్లను గావున నీవు చెప్పినట్లు వెడలిపోయెదను.

లోకములో నీ మంత్రులు నీకుఁ జెప్పునట్టు లిచ్చకములు చెప్పెడివారు పెక్కురు గలరు. అప్రియ మయ్యును పథ్యముగ చెప్పెడువాఁడు మారీచునివంటివాఁడు, నా వంటివాఁడు అరుదు. ఒకవేళ మావంటివారు కొందఱు చెప్పెడి వారున్నను వినెడి వాఁ డుండఁడు. దానికి నీవే నిదర్శనము.

ఉ. కాలెడుగేహము న్విడువఁ♦గా మన సొప్పనిభంగి సర్వభూ
తాళి వినాశహేతు వగు ♦ సంతకుపాశముచేతఁ జిక్కి ని
న్నాలము సేయ నొల్ల, నవ♦హాటకపుంఖము దీప్తపావకా
భీలము రాఘవాశుగము ♦ పృథ్విని నుంగన నొల్లఁ గూల్పఁగన్. ౩౧౪

అర్థములు. ఆలము = ఉపేక్ష. నవహాటకపుంఖము = క్రొత్త బంగారు పింజ గలది. దీప్తపావకాభీలము = మండుచున్న యగ్నివలె భయంకరము, రాఘవాశుగము = రామబాణము.

తాత్పర్యము.

లోకమునందుఁ దన యిల్లు కాలుచుండుట చూచి యిఁక దీనితో మన కేమి పని వదలి పోదమని యెంచక ఆ మంట చల్లార్చి మరల దానినే చక్కఁజేసికొనుట చూచుచున్నాము. దీనికి మన లంకలోఁ గొంపలు కాలినవారే దృష్టాంతము. అట్లులే నేను కొంప కాలకముందే హెచ్చరిక పడుట బాగని తలఁచి లంకయందలి సమస్తజనులు నీవు యమపాశములకుఁ బాలుపడుట సహింపలేక ముందుగనే హెచ్చరించితిని. ఇదియే నా దోషము. ఏల ముందుగా జెప్పెద వనిన బంగారు పింజలు గలిగి మండెడు మంటవంటి రామ బాణములు నిన్ను నేలబడఁగొట్టఁగాఁ జూచి సహింపలేక చెప్పితిని.

క. వాలుమగ లేని కడు బల, శాలులునే నస్త్రశస్త్ర♦చతురులునై నం
గాలునిచేఁ జిక్కిన తఱి, వాలుకసేతువులు పోలెఁ ♦ బసచెడుదు రిలన్. ౩౧౫

అర్థములు. వాలుమగలు = శూరులు, వాలుకసేతువులు = ఇసుకతోఁ గట్టిన యానకట్టలు, విసుచేయుదురు = నిస్సారమై పోవుదురు.

తాత్పర్యము.

ఎంతటి శూరులైనను, మిగుల బలవంతులైనను, అస్త్రశస్త్రములందు నిపుణులైనను మృత్యువుచే చిక్కిన సమయంబున నేటికిఁ గట్టిన యిసుకయానకట్టవలె నిస్సారమై పోదురు.

నీవు శూరుఁడవే, నీ మంత్రులు కుంభకర్ణాదులు బలవంతులే, ఇంద్రజిదాదులు నస్త్రశస్త్రసంపన్నులే గాని మృత్యువుచేతఁ జిక్కితిరి. కావున మీ గట్టితనము వ్యర్థము.

ఉ. అన్నవు నీ వటంచు హిత♦మార వచించిన యట్టి నా నుడుల్
మన్నన సేయవైతి, వికఁ ♦ లంకను రాక్షససంఘ యుక్తముల్
నిన్నును లెస్స కాచుకొని ♦ నెమ్మది నుండుము, స్వస్తి నీ కగుఁ,
న న్నడఁచాసి సౌఖ్యము ఘు♦సంబుగ నందుము, పోయి వచ్చెదన్. ౭౧౬

తాత్పర్యము.

నీవు నా యన్న వని నీ మేలుకోరి చెప్పుట నాకు విధి యని నేను జెప్పిన మాటలు నీవు గౌరవింపకపోయితివి. నా మాట లాదరింపకపోవుట యటుండ నేను బాముని, శత్రు వని, నా సాహసము నీ కపాయకర మని నన్ను వెడలిపొమ్మని చెప్పితివి. అట్లులే పోయెదను. ఇఁక నన్ను విడిచి రాక్షసులతోడి లంకను, నిన్నుఁ జక్కఁగాఁ గాచుకొని సిర్విచారముగ నుండుము. నీకు మే లగునుగాక. నీ వెట్లులైన బాగుపడుటే కదా నేను గోరునది. కావున నేవేళ కీ పాము నిన్నుఁ బీఁకి చంపునో యను భయము వదలి సుఖముగా నుండుము.

క. హిత మెంచి యెంత చెప్పిన, మతి కెక్కఁగ నీవు నాదు♦మాటలు నీవుల్
హితసూక్తులు రుచియించునె, గతజీవితు లగు పరీత♦కాలుర కెందున్. ౭౧౭

అర్థములు. గతజీవితు లగు = అవ్యవహిత భవిష్యత్తునకు వర్తమాన భూతము లగు సు. వ్యా. వాక్య. ౪౧ సూ. ప్రాణము పోనున్న వారగు - పరీతకాలురకు=మృత్యువు సమీపించిన వారికి.

తాత్పర్యము.

నేను నీ మేలు కోరి యెంత చెప్పినను నా మాటలు నీవు మనస్సునకుఁ బట్టనీయవు. మృత్యువు సమీపించి ప్రాణము పోన సిద్ధముగా నుండు వారికి హిత వాక్యములు రుచించునా ?

రావణాసురుఁడు చేసిన తెలివితక్కువ కార్యములలో నెల్ల విభీషణుని విడుచుట పెద్ద దనవచ్చును. కేవల కామ క్రోధములకు వశుఁడై నా యభిప్రాయమునకుఁ కెదురు చెప్పువాఁడా యను మదహంకారముచే విభీషణుఁ దిరస్కరించెను.

అటు చేయక విభీషణా, యిది యందఱకు సంబంధించిన కార్యము గనుక నందఱి యభిప్రాయముఁ దెలియఁగోరి సభ చేసితిని. అందఱు నొక మాటగా నున్నారు. నీ వొకఁడవే మఱియొకవిధముగ నున్నావు. పదుగురు చెప్పినట్టు పోదునా నీ వొకఁడవు చెప్పినట్టు పోదునా? నీవు నా మేలు కోరినట్లు వీ రందఱు నా కీర్తి సౌఖ్యములు గోరువారే కదా. నిన్నొక్కనిఁ బురస్కరించుకొని యందఱి యభిప్రాయము నెట్లుపేక్షింతును. కావున మేలో, కీడో నీవు నేను బదుగురు పోవు త్రోవఁ బోద మని శాంతితోనే చెప్పియుండవచ్చును. గర్వాంధకారము కన్నులఁ గప్పి యుండఁగా, మృత్యుదేవత తలవెండ్రుకలు పట్టి యీడ్చుచుండఁగా సౌమ్య మార్గ మెట్లు స్ఫురించును? రావణుఁ డిట్లు చెప్పియుండెనేని విభీషణుఁడు శత్రు పక్షమునఁ జేర సాధ్యపడియుండదు. ఒకవేళ పోయినను నన్నవమానించి పొమ్మనుటచే వచ్చితి నని చెప్ప నోరు వచ్చియుండదు. విరోధమునకుఁ గారణ ముండదు. పదుగురిలో నవమానించుటచేఁ గదా శత్రు వయ్యెను.

ఫాల్గున బహుళమునఁ బాడ్యమి సాయంకాలము రామచంద్రమూర్తి సముద్రతీరమునఁ జేరెను. ఇది విజయ యుద్ధయమున జరిగిన వృత్తాంతము.

—♦ { ౧౭-వ సర్గము. విభీషణుఁడు నలువురుమంత్రులతో శ్రీరాముఁ డున్నచోటికిఁ బోవుట. } ♦—

క. అని పరుషం బగువాక్యము, నని ఖలు రావణుని రావణానుజుఁ డా వెం
టనె వచ్చె సలక్ష్మణుఁ డౌ, జనకసుతానాథుఁ డున్న స్థలమున కంతన్. ౩౧౮

తాత్పర్యము.

ఈ ప్రకారము కఠినవాక్యములు చెప్పి దుష్టుఁడైన రావణుని విడిచి రావణానుజుఁడైన విభీషణుఁడు లక్ష్మణుతోడ నుండు సీతాపతియు రామచంద్రమూర్తి యున్నచోటికి వచ్చెను.

ఈ క్రింది విషయము గోవిందరాజీయము నుండి సంగ్రహింపఁ బడెను. "ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనం । రక్షిష్యతీతి విశ్వాసో గోప్తృత్వ వరణం తథా । ఆత్మనిక్షేపకార్పణ్యే షడ్విధా శరణాగతి" యన్నట్లు శరణాగతి యనెడి యుపాయమునకు నంగము లారు. అందు భరసమర్పణము ప్రధానము - తక్కినవి తద్గుణంబులు - అందు ఆనుకూల్య సంకల్పమును, ప్రాతికూల్య వర్జనమును శరణాగతి ననుష్ఠింపఁబోయెడి విభీషణుని యెడఁ గల వని ఈ తొమ్మిది సర్గములందును జెప్పుచు వచ్చెను. రామ పరాక్రమమును బలుమారు ఉపన్యసించుటచేత నీయుపాయ మునందు విభీషణునకు మహా విశ్వాసము కలదనియు నీ సర్గములందే సూచితము. ఇఁక రక్షకునికి వేగిరము కృప కలిగించెడి యాకించన్యనివేదనమును (తాను గత్యంతరములేని వాఁడని తెల్పుకొనుట) ప్రధానమైన శరణాగతి స్వరూపమును నీ సర్గమందుఁ జెప్పు

చున్నాఁడు. అందు మొదటిపద్యమందు రావణుఁడు తన్నుఁ దిరస్కరింప నిట్టిదుర్మార్గుని దేశము తనకు వాసార్హము కాదు, సర్వథా పరిత్యాజ్య మనియుఁ బరమధార్మిక శ్రీరామాశ్రయమే కర్తవ్య మనియు నిట్టి ధర్మబుద్ధి ధార్మికుఁడైన విభీషణునికి జనించెఁ గదా యని కవి యాతనిని స్తోత్రము చేయుచున్నాఁడు. అని యిట్లు 'రామునకుఁ సీత నిమ్ము' అని కర్తవ్యకార్యము మిక్కిలి సులభ మైన దనియు అట్లు చేయనిచో "రామకాండము లసురస్తోమముల తలలు ధరఁబడ ద్రామక మును" అని ప్రత్యవాయము కలుగు ననియు, అను నీ ప్రకారముగా ఈ 'అనికిఁ' పై 'యని'తో నన్వయము. పరుషంబు = భార్యలతోఁ గూడియున్న వారికి సుఖకర మైన మందమారుతము భార్య నెడఁ బాసిన వారికి దుఃఖకర మైనట్లు విభీషణుని హితోపదేశము రావణునికిఁ దన యజ్ఞానదోషముచేత కఠిన మైనది. వాక్యమును, వక్తవ్యము లైన సర్వహితములును నిండఁ బరిపూర్ణములై యున్నవి-అని విభీషణుఁడు ఎవరి కెప్పు డేది హితమో యని తెలిసియుండియు సోదరుఁడై యుండియుఁ గష్టదశలో నున్న తన యన్నను వదలి పెట్టి పోయెనుగదా యనెడి యపకీర్తి తనకు రాకుండునట్లు వలసినంత మట్టుకు చెప్పి విభీషణుని హితోపదేశము రావణునికిఁ బరుష మగుటకుఁ గారణములను జెప్పుచున్నాఁడు. ఖలుని రావణుని = తాను దుర్మార్గుఁడు కాన నితరులు బలవంతులు దుర్బలు లను విచారములేక యందఱ నేడ్పించువాఁడు కాఁబట్టి యట్టివానికి శత్రు బలవర్ణనము పరుషముగాక మఱెట్లుండు నని భావము. రావణానుజుఁడు=ఇట్టి దుర్మార్గుని తమ్ముఁడయ్యును విభీషణుఁడు సత్త్వగుణాధికుండు కాన సర్వవిధముల హితోపదేశము చేసె నని కవి విభీషణుని స్తోత్రము చేయుచున్నాఁడు. హితోపదేశమందుఁ బెద్దచిన్న లక్కఱ లేదు. పెద్దవారు చిన్నవారికి వలె జిన్నవారును బెద్దవారికి హితముపదేశింప వచ్చును. ఇందు జ్ఞానాజ్ఞానంబులే ముఖ్యము. "పిత్యా నధ్యాపయామాస శిశురాంగిరసః కవిః। పుత్రకా ఇతి హోవాచ, జ్ఞానేన పరిగృహ్య తాన్।అజ్ఞం హి బాల మిత్యాహుః । పితే త్యేవ చ మంత్రద"మ్మను మనువాక్య మీ యర్థమందుఁ బ్రమాణము. ఆ వెంటనె వచ్చె = "పరం హుతవహజ్వాలాపంజరాంతర్వ్యవస్థితిః । న శౌరి చింతావిముఖ జనసంవాద వైశస"మ్మన్నట్లు విభీషణునికి రావణ గృహ వాసము మండెడి నిప్పులో నడుగుపెట్టి నట్లుండె ననియు, మెడపలుపు విచ్చిన దూడ తన తల్లి యొమ్ము చేపుటకై యెక్కడను జాగుచేయక పరుగెత్తుకొని వచ్చినట్లంత వేగముగా విభీషణుఁడు రాముని సన్నిధికి వచ్చె ననియు దీనిచేత సూచితము. విభీషణుఁడు తనకు రావణసభయందుఁ జోరన లేనప్పుడు రామసన్నిధానమే స్వగృహ మని తలంచినాఁడు. కాన కవి—విభీషణుఁడు రామసన్నిధానమునకుఁ బోయె నని చెప్పక, వచ్చె నని చెప్పెను. స్వగృహమునకు వచ్చెను, పరుల గృహమునకుఁ బోయె ననిగదా లోకవ్యవహారము. సలక్ష్మణుఁడు (1) రామునికి లక్ష్మణుఁడు వ్యావర్తక విశేషణము. (2) పురుషకారసాన్నిధ్య మీ పదము చెప్పు

ననియు నగును. జనకసుతానాథుఁ డున్న స్థలమునకుఁ = రాముని కంటెను రామ నివాస దేశ మత్యంత ప్రాప్య మని సూచితము. ఈ పద్యము నందు భగవంతుని విరోధించుకొను వారి దేశమును వదలివేయవలె ననియు భగవత్సంబంధము గల దేశమే వాసార్హ మనియు సూచితము. అంతును అట్టి భగవత్సంబంధ దేశమును భాగవతాభిమానపాత్రము కాదేని 'సా కాశీతి న చాకశీతి' యన్నట్లు పరిత్యాజ్యమే యనియు, భాగవతాభిమానపాత్రమై భగవత్సంబంధము గల దేశమే జనులకుఁ బ్రాప్య మనియు సలక్ష్మణుఁడను శబ్దముచేత సూచితము.

విభీషణుఁడు బ్రహ్మ విశ్రవస్సు మొదలగు మహనీయుల యపారకరుణచేత సకల ధర్మముల నెఱిఁగినవాఁడు. అంతియకాక 'విభీషణస్తు ధర్మాత్మా'యని యచ్చటచ్చట విశేషించి పొగడఁ బడినవాఁడు. రావణుఁ డన్ననో 'జ్యేష్ఠభ్రాతా పితృసమ' యన్నట్లు విభీషణునికిఁ దండ్రివలె సేవింపఁ దగినవాఁడు. మఱియు విభీషణునికి బాల్యమునుండియుఁ బోషకుఁడు. అంతేకాక శత్రువు లిప్పుడు రావణుపైఁ బడ దండెత్తి వచ్చియున్నారు. ఇట్లుండఁగా నింతటి ధర్మాత్ముఁ డైన విభీషణుఁడు తన కింతటి మహోపకారి యైన రావణుని నింతటి మహావిపద్దశలో శత్రుబుద్ధివలె వదలిపెట్టిపోవుట యుక్తమా? వదలెనుబో నేరుగా వానితల తెఱుగవలె నని యున్న రాము నొద్దకా పోవలెను. పోయెనుబో, రావణుని రాజ్యము తనకు వచ్చునట్లు చేయవలె నని రాముని వేఁడుట యుక్తమా? వేఁడెనుబో, రావణుఁడు చచ్చుటకుఁ దగిన యుపాయములను రామునికిఁ జెప్పుట యెంతయుఁ దగదు. అను నీ యాక్షేపణములు విభీషణునిపైఁ గలుగవచ్చును. కాని "గురోర ప్యవలిప్తస్య కార్యాకార్య మజానతః ఉత్పథం ప్రతిపన్నస్య పరిత్యాగో విధీయతే" "కార్యం భవతి శాసనమ్" అన్నట్లు తప్పులకుఁ బుట్టినిల్లైయున్న రావణుని వదలి పెట్టుట విభీషణునికి దోషము కాదని సంక్షేపముగఁ గొందఱు సమాధానము చెప్పుదురు.

శ్రీ వేదాంతాచార్యులవారు ఈ యాక్షేపణములకు విస్తరించి సమాధానము చెప్పియున్నారు. అదెట్లనఁగా:—విభీషణుఁడు బ్రహ్మయిచ్చిన వరము ప్రకారము గొప్ప జ్ఞానసంపన్నుఁ డగుటచేత సర్వవేదాంతవేద్యుఁడై, సర్వలోకేశ్వరుఁడై సర్వలోక శరణ్యుఁడై, ముక్తప్రాప్యుఁడై, బ్రహ్మమైన శ్రీమన్నారాయణుఁడే లోకోజ్జీవనార్థమై శ్రీరాముఁడుగా భూమిపై నవతరించి యున్నాఁడని నిస్సందేహముగఁ దెలిసికొనియున్నాఁడు. ఇట్టి విశేషజ్ఞానము గల విభీషణునికిఁ దా ననుష్ఠించు ధర్మములలో సామాన్య విశేషములను బరీక్షించి విశేషధర్మముతో విరోధించు నపుడు సామాన్యధర్మము వదలి విశేషధర్మము మాత్ర మనుష్ఠించుటయు, అట్లు విరోధము లేనపుడు రెంటి ననుష్ఠించుటయు నిట్టివి కర్తవ్యములు - అట్లుగాన నీతనికి నన్న ననుసరించియుండుట సామాన్య ధర్మము - పరమాత్మ యగు శ్రీరాము ననుసరించి యుండుట విశేషధర్మము - యజ్ఞాదులు తాము సాక్షాత్తుగాఁ

ప్రధాన పరమాత్మారాధనములు గాక ప్రధాన పరమాత్మారాధనమున కంగము లైనట్లు ఫలాభిలాష లేని శ్రేష్ఠానువర్తనమును బరమాత్మారాధనాంగమై, యప్రధానమైన సామాన్య ధర్మము. రామానువర్తన మట్లుగాక తానే పరమాత్మారాధన మగుటచేతఁ బ్రధానమైన విశేష ధర్మము. ఈ సామాన్య విశేష ధర్మములకు విరోధ ముండిననే తప్ప నితర సమయములందు నీరెండును ననుష్ఠేయములే. కాఁబట్టియే విభీషణుఁడు ఈ రెంటికిని విరోధము కల్పించి రెంటిని ననుష్ఠింపఁ దలంచి రావణునికి వలసినంతమట్టుకు హితోపదేశము చేసెను. రావణుఁడు రామునికి లోఁబడినచోఁ దనకు రామరావణోభయానువర్తనమును దటస్థించు నని విభీషణుని తలంపు గాని యసురస్వభావుఁడైన రావణుఁడు రామునిపై వైరమును దృఢముగా మనస్సున నుంచుకొని విభీషణుని హితోపదేశము నే మాత్రమును వినఁడయ్యెను. విభీషణుఁడు దీనిని జూచి రామవిరోధి యైన రావణుని దా ననుసరించి యున్నచో రావణునికి వలెఁ దనకును రామవిరోధము తప్పదు. ఇది మహానర్థకరము అనియెంచి "వరం హుతవహజ్వాలా" యను న్యాయప్రకారము దురాత్ముఁడైన యీ రావణుని సాంగత్యము వదలి విశేష ధర్మమైన రామసేవనే యనుష్ఠింపఁబోయెను. కాఁబట్టి యిం దేమి తప్పో నిరూపింపుఁడు.

ఇంతవఱకు నుపకరించిన రావణుని వదలి రాజ్యాపేక్షచేత రాము నాశ్రయించుట విభీషణునికిఁ గృతఘ్నత కాదా యనియు నాక్షేపించరాదు. విభీషణుఁడు రాజ్యాపేక్షచేత రాముని నాశ్రయించినట్టు లెచ్చటను జెప్పియుండలేదు. విభీషణుఁడు తన్ను రామునికిఁ దెలిపి కాపాడవలె నని వానరులను వేఁడుకొను నపుడు "ఆలు బిడ్డలను దొరఁగిడి యియ్యెడ రామచంద్రునిఁ శరణము చొచ్చినాఁడ" నని తన కున్న వైరాగ్యము స్పష్టపడునట్లు నొక్కి చెప్పియున్నాఁడు. ఇట్లే విభీషణుఁడు శ్రీరాముని చరణంబుల పైఁబడి తన్ను నివేదించుకొనునపుడు 'నిను శరణంబుఁ జొచ్చితిని, నెయ్యుర లంక సిరిం ద్యజించితిఁ। మనుజవరా! భవద్గతము మత్సుఖ జీవిత రాజ్యభోగముల్' అని తనకు రాజ్యాదులపై నభిలాష లేదనియు రాముని పాదసేవయే తనకు సకలవిధ పురుషార్థము లనియుఁ జెప్పియున్నాఁడు. వీనిని బట్టి చూడఁగా విభీషణుఁడు రాజ్యమునకై రాము నాశ్రయింపలే దనుట స్పష్టము. 'వినుమా రావణుఁ బుత్రమిత్ర సచివాన్వితుఁ...ప్రాణాన న్విడం జున్మ ని న్ననఘా, కట్టెద పట్ట మమ్మనురరాజ్యశ్రీకి సత్యంబుగఁ" అని రాముఁడు విభీషణునికి రాజ్య మిచ్చునట్లు చెప్పుటయు విభీషణునిపై రామునికిఁ గల్గిన నిరతిశయప్రీతియొక్క యానుషంగిక ఫలము వెుుుఁగునది. 'ఆయురారోగ్య మర్థాంశ్చ భోగాంశ్చైవానుషంగికాఁ। దదాతి ధ్యాయతాం నిత్య మపవర్గప్రదో హరి' యని యనన్యప్రయోజనులై తన్నాశ్రయించిన వారికి భగవంతుఁడు సకల పురుషార్థంబుల నిచ్చునని చెప్పఁబడెను గదా. ఇంత మాత్రమే తప్ప విభీషణుని కే మాత్రమును రాజ్యాభిలాష లేదు. "తానును రాజ్యము

వేడుకొంటి నీ, తామహీశేశ నీయెడకుఁ దారసిలె నృతిపూర్వకంబుగన్” అని హనుమంతుఁడును ‘స్థిరమతి రాజ్యకాంక్షఁ జనుదెంచిన వాఁడగు’ నని శ్రీరాముఁడును సుగ్రీవునితోఁ జెప్పుట, విభీషణుని జేర్చికొంటిమేని రామునికేమి కీడు కలుగునో యని భయపడియున్న పరమ భక్తుఁడైన సుగ్రీవుని యజ్ఞానము తీరుటకై లోకసిద్ధమైన రాజనీతి ప్రదర్శనమే కాని వాస్తవ విభీషణాభిప్రాయము గాదు. ‘అంతరంగబహిరంగయో రంతరంగం బలీయ’ యని యొక న్యాయము గలదు. హనుమదాదుల వాక్యములకును విభీషణవాక్యమునకు విరోధము కల్గినపుడు విభీషణవాక్యానుసారముగనే తక్కిన వారి వాక్యముల కర్థము చెప్పవలెను. కాని విభీషణాభిప్రాయ మెఱుఁగని యితరుల వాక్యము ప్రకారము విభీషణ వాక్యమున కర్థము చెప్పరాదు. విభీషణవాక్య మంతరంగము. తక్కిన వారి వాక్యము బహిరంగము. అంతరంగ బహిరంగములలో నంతరంగము ప్రధానము. మఱియు, ‘నిన్నసఘా కట్టెద పట్టమయ్యసుర రాజ్యశ్రీకి సత్యంబుగ’ నని రాముఁడు చెప్పినమాటకు సరియే యని యొప్పుకొనక ‘అనఘశీల మదీయ దేహమునందుఁ బ్రాణము లుండు నందనుకఁ జొచ్చెద శత్రుసేన నితాంత సాహ్యమొనర్తులం, కను వినాశమొనర్ప రాక్షస కాండముం బరిమార్పఁగన్’ అని తాను రామునికిఁ జేయు పరిచరణమునే చెప్పుకొని యున్నాఁడు. దీనిని జూచినను విభీషణునికి రాజ్యాభిలాష లేదనుట స్పష్టము. విభీషణుని కిష్టములేకున్నను రాముఁడు బలాత్కరించి రాజ్యము నిచ్చిన ట్లుత్తరకాండమునందుఁ జెప్పియున్నది. “యావత్ప్రజా ధరిష్యంతి తావత్త్వం వై విభీషణ! రాక్షసేంద్ర మహావీర్య లంకాస్థ స్త్వం ధరిష్యసి॥ శాసితస్త్వం సఖిత్వేన కార్యం తే శాసనం మమ। ప్రజాస్సంరక్ష ధర్మేణ నోత్తరం వక్తుమర్హసి” యని యచ్చటి వాక్యము. ఇట్లు విభీషణుఁ డనన్య ప్రయోజనుఁడై శ్రీరాముల వారి నాశ్రయించినవాఁడు గనుకనే శ్రీరాముఁడును దన కులధనమైన శ్రీరంగనాథుని నితనిచేతనే వెంచేపు చేసియిచ్చెనుగాని మఱెవ్వరిచేతను నియ్యలేదు. విభీషణునికి స్వయముగా రాజ్య మిష్టము కాకున్నను ధర్మసంస్థాపనార్థమై యవతరించిన శ్రీరాములవారి యాజ్ఞను మీఱఁగూడదు కాన వారి యాజ్ఞానుసారమై శేషించిన రాక్షసులను ధర్మమార్గమునఁ ద్రిప్పి రక్షించుటకుఁగా రాజ్యము తా నంగీకరించెను. ఇదియు శ్రీరాములవారి యాజ్ఞానువర్తనమై కైంకర్యములలో నంతర్భవించుటచేఁ దన స్వరూపానురూప మని విభీషణుని తాత్పర్యము. సకల ధర్మముల జక్కఁగా నెఱిఁగినట్టి లక్ష్మణుఁడును, ‘అహం తావన్మహారాజ పితృత్వం నోపలక్షయే। భ్రాతా భర్తా చ బంధుశ్చ పితా చ మమ రాఘవ’ యన్నట్లు కర్మకృత పితృత్వ సంబంధము గల దశరథుని వదలిపెట్టి నిరుపాధికసకలవిధబంధువైన శ్రీరాము నాశ్రయించి ‘అగ్రతస్తే గమిష్యామి పంథానమనుతో భయం। అహం సర్వం కరిష్యామి జాగ్రత స్స్వపతశ్చ తే” యని శ్రీరామపరిచరణమే ఫలముగాఁ బ్రార్థించియున్నాఁడు. ‘సభ్రాతుశ్చరణౌ గాఢం నిపీడ్య రఘునందన’ యన్నట్లు శ్రీరాములవారిని శరణుఁ జొచ్చియు

నున్నాఁడు. అట్లుగనే శ్రీ విభీషణుఁడును కర్మకృత భ్రాతృత్వసంబంధము గల రావణాసురుని వదలిపెట్టి స్వాభావిక సకలవిధబంధువైన శ్రీరామునిఁ గైంకర్యాపేక్షచేతనే యాశ్రయించినాఁ డనుట ధ్వనితము. కాఁబట్టియే 'సతు నాగవర శ్శ్రీమాన్' అనియు 'లక్ష్మణో లక్ష్మిసంపన్న' యనియుఁ బొగడినట్లు విభీషణుఁడు రావణునిఁ బరిత్యజించి రాము నాశ్రయింప బయలుదేఱు సప్పుడు 'నలువు రసురులతో వియన్మార్గ మెగసి। యలుక శ్రీమంతుఁ డన్నట్లుగా నటయె నిల్చు' శ్రీమత్పదముచేత స్తోత్రము చేసెను. కాఁబట్టి విభీషణుని యెడ నధర్మాక్షేపణ మే మాత్రమును జేయరాదు. శ్రీరామలక్ష్మణులు నాగపాశబద్ధులై యున్నప్పుడు వారి నట్టిస్థితిలోఁ జూచి విభీషణుఁ డేడ్చుచు 'ధీరుల నేరిఁ జేతఁ బ్రతిష్ఠను గోరి నరేంద్రు లిట్టి తీరున మృత్యుభూమిఁ బడినారిఁక నేను మృగ్యుఁడ, నీరీతిఁ దప్పిన ట్లయితిఁ గాంక్షిత రాజ్యమనోరథుండనై కోరికయుం బ్రతిజ్ఞ సమకూరదె దుశ్శాసన కేమి పామో' యని తనకు రాజ్యము లభింపక పోయెఁగదా యని దుఃఖించి యున్నాఁడు. విభీషణునికి రాజ్యాభిలాషయే లేనిచో నీ మాట యెట్లు సమంజసము గు ననియు నాక్షేపింపరాదు. ఈ పద్యమునందు ప్రతిష్ఠ యనఁగా రామకైంకర్య ప్రతిష్ఠ యని యర్థము - అకుంఠితరాజ్యమనోరథుండనై యనఁగా "మనుజవరా, భవద్గతము మత్సుఖ జీవితరాజ్య భోగము"లన్నట్లు నే నపేక్షించిన కైంకర్యసామ్రాజ్యము లభింపక పోయెఁగదా యని భావము - ఆ సమయమున నా సుగ్రీవుఁడు "అల్లన లంక నీవ యేలెదు। తనయులతోఁ గనఁడు కాంక్షితము రావణుఁడు' న్నని విభీషణుని నూఱడించుటయు నాతని యభిప్రాయ మెఱుఁగక చెప్పినమాట యని తెలియునది - కేవల రామసేవార్థమే విభీషణుఁడు శ్రీరాములవారి నాశ్రయించినాఁడన్న సంగతి 'నీ యానతిఁ గొని చని, యాయా యెడలన్ నిల్పి సేన లన్నియును యథా, న్యాయంబుగ విభజించితి, చేయంగల యంత వట్టు చేసితి నధిపా' యని ఈ కాండమున నెనుబది నాల్గవ సర్గంబు నందలి పద్యము చేతఁగూడ స్పష్టమగుచున్నది. కావున విభీషణుని యం దెట్టి దోషశంకయు లేదు.

క. మేరుగిరిశిఖరతుల్యా,కారు జ్వలచ్చంచలాని♦కాశు సభస్సం
  చారుని ధరణీగతవన,చారిప్రాగ్రసరచయము ♦ సంవీక్షించెన్. ౩౧౯

అర్థములు. విభీషణుఁడు రావణుని వదలి యాకాశమున కెగురునపుడే సుగ్రీవాది వానరు లాతనిని గనిపెట్టి రనుచున్నాఁడు. మేరుగిరి శిఖరతుల్యాకారునిన్=ఎత్తు, లావు, సకలరత్నపరిపూర్ణత, వీనిచేత మేరుశిఖర సామ్యము. ఇంతియ కాక, విభీషణుఁడు తాను శత్రుపక్షము వదలి మనస్సు కుదుటఁబడి నిశ్చలుఁడై యున్నాఁ డనియు, మిక్కిలి ప్రకాశించుచున్నాఁ డనియుఁ దాను శ్రీరామునికిఁ బరతంత్రుఁ డని తెలుపు నట్లున్నాఁ డనియు మేరుశిఖరసామ్యముచేత వివక్షితములు. ఇట్టి గుణములచేత శృంగతుల్యుఁడైన విభీషణుఁడు రావణుని వదలుటచేత నతనికి శృంగభంగమైన దనియు రాముని సన్నిధికి వచ్చుటచేత నతనికి శృంగలాభమైన దనియు

సూచితము. జ్వలత్ + చంచలా + నికాశుఁ = మెఱయుచున్న మెఱుఁగు వంటివానిని = కాంత్యతిశయమును సందును, నాకాశ సంచారమునందును మెఱుఁగు దృష్టాంతము. రామభక్తులైన వానరులు తన్నుఁ దమలోఁ జేర్చుకొనరేమో యని భయకంపమును, తాను వారలలోఁ జేరనిచో బ్రతుకుటయే యసాధ్య మని గమన త్వరయు నీ దృష్టాంతమున సూచితములు. అతని సని విశేష్య మధ్యాహార్యము. కాఱు చిచ్చున విశేషతాపముఁ జెంది శీతల హ్రదము వెదకి పోవువానివలె మిక్కిలి యాత్రముతో వచ్చెడి విభీషణుని సభస్సంచారుని సంవీక్షించెను. రావణసభనుండి యాకాశమున కెగురుసప్పుడే యంతదూరమునసే చూచెను. ధరణీ........ చయము = ధరణీగత = (౧) భూమిపై నెట్టి కీడుగాని రాకుండ రక్షించువవలె సని మాత్రి మాజ్ఞప్తులై యున్నను ఆకాశ మార్గముగా వచ్చిన విభీషణునిఁగూడఁ గనిపెట్టిరిగదా యని వానరజాగరూకత దీనిచేత సూచితము.

(౨) అచ్చటచ్చటఁ జెట్లపైనున్న వానరులు ఆకాశమున విభీషణునిఁ జూచునప్పటికి రాముని కేమి కీడు కలుగునో యని యెంచి భూమిపై దూఁకి యందఱును రాముని జుట్టుకొనిరని భావము. ప్రాగ్రసరులు = శ్రేష్ఠులు, వీర లింత జాగ్రత్తతో రామునిఁ గాచుచున్నారు గదా యని కవి స్తోత్రము చేయుచున్నాఁడు వనచారి ప్రాగ్రసర శబ్దముచేత. వనచారి ప్రాగ్రసరచయము. సంవీక్షించెఁ = ఒక వానరుఁడుచూచి మఱి యొకనికిఁ జెప్పఁగా నిట్లందఱకును దెలిసినదనికాదు, అందఱు నేకకాలమందే చూచి రని భావము. ప్రతికూల సాంగత్యత్యాగము మాత్రమే కాక యనుకూల కటాక్ష పాత్రతయు విభీషణునకు లభించె నని యీ పదమునందుఁ జెప్పినట్లాయెను.

తా త్ప ర్య ము.

మేరుపర్వతముయొక్క శృంగముతో సమానమైన పొడవైన యాకారము గలట్టియు, ధరించిన యాభరణములచే మెఱయుచున్న మెఱుపుతో సమానమైనట్టియు, ఆకాశమునందుఁ బయలుదేరి వచ్చునట్టియు వానిని భూమియందుండు వానరశ్రేష్ఠ సమూహములు చక్కఁగాఁ జూచెను.

రాక్షసు లే పక్కనుండి యైన శత్రురు, వానర నాయకులు కనిపెట్టి యుండవలయు నని రామచంద్రమూర్తి యాజ్ఞాపించి యుండుటచేఁ బదిదిక్కులను బరిశీలించి హెచ్చరికతోఁ బదిదిక్కులందు జూచుచుండిన వానరశ్రేష్ఠులు విభీషణుఁడు దూరము నందుండఁగనే యతనిఁ జూచిరి.

వనచారి చయము సంవీక్షించెఁ = అనుటచే నొకఁడు చూచి మఱియొకనికిఁ జెప్పలేదనియు వానరసమూహ మంతయు నేకకాలమందే చూచె ననియు గ్రాహ్యము. అందఱు నంత హెచ్చరికతో నున్నారని సూచన.

క. తనతో నైదవవాఁ డయి, చనుదెంచెడు నతనిఁ జూచి ♦ చతురుఁ డసాధ్యుం
డినసుతుఁ డాలోచించుచు, వనచరతతితోడ నిమిష♦పర్యంతంబున్. ౩౨౦

అర్థములు. తనతో నైదవవాఁడయి = తానుగాక మఱినలుగురితోఁ గూడినవాఁడై, ఆ యాయుధములతో సన్నద్ధులైన నలుగురు మంత్రులతోఁ గూడి తనతో నైదవవాఁడగుటచే, తనకు రామచంద్రమూర్తి యం దెంతభక్తి, యెట్టి యభిప్రాయము గలదో తక్కిన నలుగురికి నంతటి భక్తియు, నట్టి యభిప్రాయము గల దని భావము. చతురుఁడు = మిగుల సమర్థుఁడు, ఆలోచనమందు, కార్యనిర్వహణమందు, యుద్ధమందు నేర్పు గలవాఁడు, కనుకనే విభీషణుని జూడఁగనే శత్రు వని భ్రమింపక వీఁ డెవఁడు? ఏల వచ్చు చున్నాఁడని యాలోచింపఁ గలిగెను. అసాధ్యుఁడు = తన్నుఁ జూచినంత మాత్రముననే వీనిని మనము జయింప లేమని భయపడి వెనుకంజ పెట్టవలసిన రీతిగ నుండు వాఁడు, ఆలోచించుచుఁ = వీఁ డెవ్వఁడు? వేఁగులవాఁడా, వేఁగువాఁడైన పత్తుముస మాఱు వేషముతో, సౌమ్యవేషముతో రహస్యముగ వచ్చును గాని యిట్లు బయలు మెఱసి యథాస్వరూపముతో నాయుధధారియై వచ్చునా? రాఁడే - ఇక యుద్ధమునకు వచ్చెసందునా? ఇంత సేనను ఐదుగురు గెలువఁ గల రను ధైర్యముతో వచ్చెనా ? ఒకవేళ బయలుదేఱునపుడు తోఁపకపోయినను ఇంత సేనను జూచిన పిమ్మట నైన జంకవలయునుగదా! జంకులేక ఱివ్వున పరిచితునివలె వచ్చుచున్నాఁడే? కావున వీఁడు యుద్ధమునకును వచ్చువాఁడు కాఁడు. ఈ యిరువురు కాకపోయిన వేఱుకార్య మితని కిం కేమి గలదు అని యాలోచనవిధము. నిమిష పర్యంతము = అల్పకాలము - దీర్ఘకాల మాలోచించుచుండిన శత్రువైనచో వచ్చి మీఁదఁ బడనే పడును. వనచర శతీత్రో పీస్వ = "కం. విను మొక రావలింబులు,గొనుటయుఁ బెక్కండ్రు నిమర గూడిన యెడ మేల్కొని యుండుట కార్యాలో,చనము దెరువు నడచుటయును జన దొక్కనికిఁ" భార - అని యుండుటచే నేను జతునుఁడను, ఒకరితో నే నాలోచింపవలెనా, నాకంటె వీరు బుద్ధి బలము గలవారా- యని రావణునివలెఁ దలఁపక కార్యము చేయుటకు ముందే పలువురతోఁ నాలోచించెను.

తాత్పర్యము.

తాను గాక మఱి నలుగురిని నీసికొని వచ్చుచున్న యతనిఁ జూచి కార్యనిర్వాహణమందు నేర్పుగల వాఁడును, అసాధ్యుఁడును నగు సుగ్రీవుఁడు అల్పకాలము వానరులతో నాలోచించెను. ఇట్లాలోచించి.

క. హనుమత్ప్రముఖుల కిట్లనుఁ, గనుఁడీ రక్కసులు గొల్వఁగా నల్వురు తఁ
మనుజాశనుం డఖల సాధనములతో మనలఁ జంపఁ దర్శ్యము వచ్చెన్. ౩_౨౧

అర్థములు. హనుమత్ప్రముఖులకు = హనుమంతుఁడు మొదలగు వారికి - హనుమంతుని పేరు చెప్పుటచే లంకయం దితని హనుమంతుఁడు చూచి యుండవచ్చును. ఎట్టివాఁ డైనది మాయనకుఁ దెలిసి యుండవచ్చునని యాయనతో నిట్లనెనని భావము. గౌరవకాలమందు వృద్ధుఁ డగు జాంబవంతుఁడు పూజ్యుఁడు. ఆలోచన కాలమందు బుద్ధిసంపన్నుఁ డైన హనుమంతుఁడు పూజ్యుఁడు. కావున హనుమంతుఁడు

చెప్పఁబడెను. మనుజాశనుండు = మనుష్యుల భక్షించువాఁడు. ఇట్లనుటచే రామలక్ష్మణులఁ జంపి తినుటకై వచ్చుచున్నాఁడని భావము. అఖిల సాధనములతో = సర్వాయుధములతో - విభీషణుఁ డొక్క గదతో బయలుదేఱి వచ్చెనని ముందు చెప్పఁబడెను. యుద్ధకాలమందుఁగూడ గదతోనే యుద్ధము చేసినట్లు చెప్పఁబడెను గాని మఱియొక యాయుధ మాయన పట్టినట్లు చెప్పఁబడ లేదు. ఇట్లుండ సర్వాయుధము లని యెట్లు చెప్పెను ?

(౧) ఎంతటి శూరు లైనను యుద్ధమునకు వచ్చునపు డొంటి యాయుధముతో రారు. రామలక్ష్మణు లంతటివారు విల్లు బాణములే గాక, కత్తులు ధరించి యున్నట్లు చెప్పఁబడెను. కావున వెలుపలికిఁ గాన వచ్చునది యొక యాయుధమే యైనను దక్కిన యాయుధములు ధరించి యుండవలయు నని యూహించి చెప్పెను.

(౨) తక్కిన నలువురు ధరించిన యాయుధములను గలుపుకొని చెప్పె నని చెప్పవచ్చును. ౩౧౧ వ పద్యమున గదాహస్తుఁ డను చోట గద యనునది తక్కిన యాయుధముల కుపలక్షణము.

విభీషణుఁడు విల్లుపట్టి యుద్ధము చేసినట్లు ౧౫౮౦—౨౧౦౩—౨౧౧౪ పద్యములయందుఁ గలదు. కావున విల్లు పొదులు కలవాఁడై వచ్చె ననుట తప్పుగాదు. ఆయనకు ముఖ్యసాధనము గద - దానిని చేత ధరించి వచ్చెను. విల్లు మూఁపున వ్రేలాడు చుండెను.

మనుజాశనుఁ డనుటచే జాతిచేతనే క్రూరకర్ముఁ డనియు, రక్కసులు నల్వు రనుటచేఁ గ్రూరసహాయులు కలవాఁడనియు, నఖిలసాధనములతో ననుటచేఁ గ్రూర కార్యము చేయఁ గావలసిన సాధనసంపత్తి గలదనియు, నా కారణముచే వీఁడు చంపవచ్చెనే కాని సాధుభావముతో సంధికై రాలే దనియుఁ దలఁచె నని భావము. తథ్యము = సత్యము.

తాత్పర్యము.

హనుమంతుఁడు మొదలగువారితో నిట్లనెను. ఈ మనుష్యభక్షకుఁడు నలుగురు రాక్షసులతో, సమస్తాయుధములతో నిజముగా మనలఁ జంపుటకై వచ్చుచున్నాఁడు.

ఉ. నావుడు వానరేంద్రు వచ♦నంబులు వీనుల సోఁకినంతనే
గ్రావములన్ ధరారుహని♦కాయములం గొని యిట్లు పల్కిరో
దేవ! దురాత్ములన్ వడి వ♦ధింపఁగ నానతి యిమ్ము, యిప్పుడే
జీవముఁ బాసి నేలఁ బడి ♦ చెల్లిరి చూడుము స్వల్పతేజులన్. ౩౨౨

అర్థములు. వీనులన్ = చెవులను, గ్రావములన్ = ఱాలను, 'గ్రావాణౌ పర్వతోపలౌ' యని నానా.ర. ధరారుహనికాయములన్ = చెట్ల సమూహములను; కర్తృపదము వానరయూథముఖ్యులు.

తాత్పర్యము.

అని సుగ్రీవుఁడు చెప్పిన మాటలు చెవులఁ బడఁగానే వానరయూథముఖ్యులు

తాలు, చెట్లు తీసికొని యిట్లనిరి. రాజా! వీరిని త్వరగాఁ జంపుఁడని యుత్తరువిమ్ము. బలహీను లగు వీరు త్వరలోనే ప్రాణములు పోయి నేలఁబడి పొర్లఁగాఁ జూచెదవు.

వీనుల సోఁకినంతనే యనునది కార్యమునందలి త్వర సూచించును. చెవిలో మాటలు చొచ్చెను. చేతికి తాలు చెట్లు వచ్చెను. రెండు నేకకాలమందే జరిగె నని భావము. తాలను జెట్లను ననుటచే చేతికి దొరకినదాని నసికాని యొకచేత తాయి, యొకచేతఁ జెట్టనికాని గ్రహింప నగును. ఇది రామసేవయందలి యాదరాతిశయమును సూచించును. రామసేవయందుఁ బట్టాభిషేకసమయమున నందఱు నొక్కొక్క వస్తువును దీసికొనఁగా లక్ష్మణుఁడు రెండుచేతులందు భద్ర చామరముల నేకకాలమునఁ దీసికొనెనుగదా - రాక్షసుల నశింపఁజేయుటయు భగవత్సేవయే కదా - ఇట్లు చెప్పుటచే భగవత్సేవయందుఁ గైంకర్యపరులు సదా దాస్యసిద్ధికొఱకు వారివారి కృత్యములందు వారువారు హెచ్చరిక పడియుండవలయు ననియు, నొకరు చెప్పినఁ జేయుద మని కాచియుండరా దనియు నేర్పడుచున్నది. దేవ కార్యమందుఁ దమ కెంత యుత్సాహ మున్నను ప్రభువు నాజ్ఞలేక యేకార్యము చేయరాదు. పారతంత్ర్యహాని మాకు రారాదు. కావునఁ బ్రభువైన నీ యాజ్ఞ వేచియున్నార మని సూచితము - దురాత్మ్మలక్ = వాఁడేల వచ్చెనో తెలియకముందే యెట్లు వానిని జంపుమందు ననెదవా! వారు స్వభావముచేతనే దుష్టులు - అట్టివారు మంచి యుద్దేశముతో వత్తురా - కావునఁ జంపవలసినదే - వడిక్ = ఆలస్యముచేసిన ముందు మించి నిన్ను వాఁడు తటాలునఁ జంపిన నేమి చేయవచ్చును- కావున వాఁడు పైపడకముందే యాజ్ఞయిమ్ము - వధింపఁగక్ = బంధింపరాదు - కొట్టి తఱుమనురాదు, అట్లుచేసిన వారు మరలఁ గీడుచేయకమానరు - కావునఁ జంపుటయే కర్తవ్యము- అనతియిమ్ము = చంపిన బాగేమోయని సందిగ్ధముగఁ జెప్పకుము. ఆజ్ఞచేయుము - ఇప్పుడే, మఱియెప్పుడో కాదు- నీ నోటిమాట నీ నోట నుండఁగనే; నేలఁబడి చెల్లిరి = ముందు నేలఁబడగొట్టెదము - మరల నాకాశమున కెగురకుండఁ జంపెదము - యుద్ధమున వారే గెల్తురో, మీరే గెల్తురో యనెదవా - వారల్పతేజులు = ఇట్టి తేజోహీనులు మమ్మెట్లు గెల్వఁగలరు. పల్కిరి = బహువచన ప్రయోగముచేఁ బ్రతి వానరుఁడు చెప్పె నని గ్రాహ్యము. రామకార్యాసక్తియందలి యతిశయముచేఁ బ్రభువు నెదుట నంద ఱొక్కసారిగ నడువవచ్చునా యను నౌచిత్య జ్ఞానముకూడ లేక యందఱుఁ బలికి రని భావము.

—♦ విభీషణుఁడు తనరాక శ్రీరామునకుం దెలుప వానరుల వేఁడుట. ♦—

మ. అనుచు న్వానరయూథముఖ్యు లిటు ల♦న్యోన్యంబు భాషింపఁ గ్రి
క్కునఁ దా వచ్చి విభీషణుండును నుద♦క్కూలంబునం జేరి మిం
టన ని ల్చుండి మహాత్ముఁడు న్సుమతి యం♦ద గ్గోత్రులక్ భానుమ
త్తనయుం జూచి వచించె స్వీయ మగు వృ♦త్తాంతం బుదారధ్వనిన్. ౩౨౩

అర్థములు. అన్యోన్యంబు = ఒకరితో నొకరు, సంభాషించుచుండఁ = ముచ్చటలాడుచుండఁగ, వాఁడు వచ్చి యేమిచేయఁగలఁడులే - ఏమిచేయునో చూత ములే - మనమేల ముందుగనే కలహమునకుఁ గాలు ద్రవ్వవలెనులే యని యుపేక్ష వహించియుండఁగనే; గ్రక్కునఁ = వేగముగ - ఆవునొద్దకుఁ బాలు త్రాగుటకై పరువెత్తు లేదూడవలె - విభీషణుండును = అనుటచేఁ దక్షిణ నలువురుకూడ, ఉద క్కూలంబునఁ = ఉత్తరతీరమున, మింటను = ఆకాశమందే, మహాత్ముఁడు=గొప్ప మనస్సుగలవాఁడు, సుమతి=మంచి మనస్సుగలవాఁడు, ద్రోహబుద్ధి లేనివాఁడనుట; అందఱు+శ్రోతులఁ = అందఱ్ శ్రోతులఁ = శకటరేఫము సంయుక్తమైనప్పుడు లఘు రేఫముగా మాఱును, భానుమత్తనయుఁ = సూర్యపుత్రుఁడైన సుగ్రీవుని, ఉదాత్త ధ్వనిఁ = పెద్ద కంఠధ్వనితో.

ఉదక్కూలంబునం జేరి = తన్నుఁ జూచి వానరులు కలవరపడుట, తన్నుఁ జంప ఱాలు చెట్లు తీసికొనుట పరికించియు వీరు తన్నేమి చేయుదురో యని భయ పడక వారేమైనఁ జెప్పుకొననీ సర్వజ్ఞుఁడు పరమకారుణికుఁడు సర్వశరణ్యుఁడు శ్రీరామ చ [illegible] పెడచెవిని బెట్టి తన్నుఁ జంప యత్నించుచున్న వానరుల యెదుటనే వారి సమీప మందే యాకాశమున నిర్భయముగ సందఱకుఁ దెలియునట్లు నిలిచియుండె నని భావము.

మహాత్ముఁడు='బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే వాసుదేవ స్సర్వ మితి సమహాత్మా సుదుర్లభః' అనేక పుణ్యజన్మముల కడపట జ్ఞానము గలవాఁడై దాని ఫలముగ నన్నుఁ బ్రపత్తిచేయును. అనఁగా నా శరణు చొచ్చును. ఏమని ? నాకు సర్వము అనఁగా 'రక్షక శ్శేషీ నివాస శ్శరణం మహాత్' నాకు రక్షకుఁడు, స్వామి, నిలువనీడ, గొప్పశరణము, అన్నట్లును, "స్వామి త్వేన, సుహృత్త్వేన, గురుత్వేన చ సర్వదా, పితృత్వేన సదా భావ్యో మాతృత్వేన చ మాధవః" స్వామి యని స్నేహితుఁడని గురువని తండ్రియని తల్లియని విష్ణువును దలఁపవలయును అన్నట్లును, "రాముఁడె భ్రాతయు భర్తయు రాముఁడె ప్రియ బంధువరుఁడు రాముడె చుమ్మీ, రాముడే నా జనకుండును" (అయోధ్య ౧౫౧౩) అని లక్ష్మణుఁడు చెప్పినట్లును నాకు సర్వము భగవంతుఁడే యను భావము కలవాఁడే శరణు చొచ్చును. ఇట్టి మహాత్ముఁడు సుదుర్లభుఁడు అని భగవంతుఁడు కృష్ణమూర్తి మహాత్ముఁ డని యెవనిని జెప్పెనో యట్టి మహాత్ముఁడు.

సుమతి = మంచి మనస్సుగలవాఁడు, వానరులు తన్నుఁ జంప యత్నించు చుండినను వారియందు భగవంతుఁడు శ్రీరామచంద్రమూర్తియంతేవాసులు గావున భాగవతు లను గౌరవము గలవాఁడు. వానరులు సన్నిపుడు చంప నాలోచించుట నాపై ద్వేషముచేఁ గాదు. రామచంద్రమూర్తి యందలి ప్రేమాతిశయము చేతనే

(లక్ష్మణుఁడు భరతునిఁ జంపెది నన్నట్లని యెఱుంగునది.) వారి స్థానమందు నే నుండిన నేను నిట్లు చేయవలసినవాఁడనే, చేసియుండువాఁడనే. రామునకు నేనేమి కీడు చేయుదునో యని వీరి సందేహము కావున నిది గుణమే యను మంచి మనస్సుగల వాఁడు. అందఱు క్రోతులను రామచంద్రమూర్తి పరిచారకులైన వీరిని నే నాశ్రయించి వీరియనుగ్రహము సంపాదించుకొనక నేని రామచంద్రమూర్తి యనుగ్రహము వచ్చియు నేమి లాభము. భాగవతులు మెచ్చిన వానిఁగాని భగవంతుఁడ మెచ్చఁడు గదా. కావున వీరినే నేనును దొలుత నాశ్రయింప వలెను, అను మనస్సు గలవాఁడు. అర్బుదముల కొలఁదినుండు వానరుల నందఱ నాశ్రయించుట దుష్కరము కావున వారి ప్రభువు నాశ్రయించిన నందఱ నాశ్రయించినట్టు లగు నని సుగ్రీవునిఁ జూచి యని చెప్పఁబడెను.

మింటనే నిల్చి = ఆకాశమున త్రోవ్వన వచ్చినవాఁడు అట్టులే వచ్చి తటాలున రామచంద్రమూర్తి పాదములఁబడి యుండవచ్చునే, యాకాశమున నిల్వనేల? యనిన, నట్లు చేసినచో నది సాహసమును స్వాతంత్ర్యమును దెలుపును. రామచంద్ర మూర్తి నే [illegible] రక్షించును ను మహావిశ్వాస మున్నను పురుషకారము నపేక్షింపని కారణముచే వానరుల నందఱ నలక్ష్యపఱిచినట్లగును. అది భాగవతాపచారమగును. మహాత్ముఁడు కావున పురుషకార మూలముగనే రామచంద్రు సమీపింప నెంచెను. కావున దూరమునందే నిలిచెను. ఆకాశమునందుండ నేల, నేల దిగి యుండవచ్చునే, భూమిమీఁదికి దిగిన తనమాటలు కొందఱకే వినఁబడును. కొందఱనే యాశ్రయించినట్లగును. అదియునుగాక వారితో సమానుఁడుగ నిలుచునట్టి యోగ్యత యింకను గలుగలేదు. గనుక దూరమునందే యుండెను. వారిలోఁ గలియుటకు వారి యనుమతి కావలయును. రాముఁడు రక్షింపనీ రక్షింపకపోనీ, వానరులు రక్షించినఁ జాలు నను యభిప్రాయముతో వానరులతో వచించెను. ఆ గుంపులో నల్పవానరులు గలరుగదా వారేమి చేయఁగలరు, రామచంద్రమూర్తికిఁ జెప్పఁగలరా, వారి నాశ్రయింపనేల? యనరాదు. వారిలో వారికిఁ దారతమ్య మున్నను భాగవతుఁడగు శరణాగతునకు నేకాంతవాసు లందఱు సమానులే కావున నందఱకుఁ గనఁబడునట్లు నిలచి యందఱకు వినఁబడునట్లు చెప్పెను. భగవంతుని దృష్టికి మనుష్యు లందఱు సమానులయినను వారిలోవారికి భేదములు గలవుగదా! వేరునకుఁ జెట్టంతయు సమానమైనను కొమ్మలు, రెమ్మలు, ఆకులు, పిందెలు, పండ్లు, కాయలు, పూలు నని రూపముల గుణముల భేదము గలదుగదా! భగవంతుఁ డుపేక్షించినను భాగవతు లనుగ్రహించి నచో భయములేదు. "సిద్ధి ర్భవతి వా నేతి సంశయోఽచ్యుత సేవినామ్, నసంశయోఽత్ర తద్భక్త పరిచర్యారతాత్మనామ్." రామచంద్రమూర్తిని విడనాడినను లక్ష్మణుని విడనాడకుండిన సీతాదేవికి లంకాప్రాప్తి లేదుకదా.

ఉదారధ్వనిః = పెద్ద గొంతుతో, అందఱకు వినవచ్చునట్లు, రామలక్ష్మ

ణులకును స్పష్టముగా వినవచ్చునట్టు «అకించన్యైక శరణాః కేచిద్భాగ్యాధికాః పునః మామేవ శరణం ప్రాప్య మామేవాంతే సమశ్నుతే" లక్ష్మీతంత్రము. కొంద అధిక భాగ్యము గలవారకించనులై నన్నే శరణుపొంది కడపట నన్నే యనుభవింతురు అని యుండుటచే రామచంద్రమూర్తికి వినవచ్చునట్లు దీనులై గట్టిగా నఱచువారు నేడ్చువారుగదా భాగ్యవంతులు. ఇట్లు చెప్పుటచే రామనామోచ్చారణము నిండుమనస్సుతో బిగ్గఱగాఁ జేయుటయే గుణ మని తెలియనయ్యెడి. నేను మానసిక ధ్యానము చేసెదను, బాహ్యముతో నాకుఁ బనిలేదని విభీషణుఁడు స్తంభమువలె నిలువఁబడలేదు. విభీషణుఁ డిట్టివాఁడు గనుకనే ౩౧౦ వ పద్యమున వాల్మీకి విభీషణుఁడు శ్రీమంతుఁ డనెను. భగవదనుగ్రహమున్నచో లౌకికైశ్వర్యము తనంతటఁదానే వచ్చును. ఈ యైశ్వర్య ముండినంతమాత్రమున సరిరాదు.

ఇందు షడంగపూర్తి గల శరణాగతి ప్రదర్శింపఁబడెనని మహేశ్వరతీర్థులు.

క. రాక్షసుఁడును దుర్వృత్తుఁడు, రాక్షసకులనాథుఁ డైన• రావణునకు నే
సాక్షాదనుజుఁడఁ జుండీ, యాక్షితిని విభీషణాఖ్య • నెఱుఁగం బడుదున్. ౩౨౮

అర్థములు. రాక్షసుఁడును = పరులను హింసించి తన్ను రక్షించుకొనువాఁడు రాక్షసుఁడు, కావునఁ గ్రూరప్రజాతికిఁ జేరినవాఁడు, రాక్షసజాతి కాఁగానే యేమి, వారిలో మంచివారు లేరా, నీవు రాక్షసుఁడవుకావా, బలిప్రహ్లాదులు రాక్షసులు కారా యందువేమో, దుర్వృత్తుఁడు = చెడ్డవృత్తి-వృత్తముగలవాఁడు, రాక్షసకుల నాథుఁడు=వీని చుట్టుపట్ల నుండువారందఱు నిట్టివారే, వారియందఱలో వీఁడు క్రౌర్యము నందు శ్రేష్ఠుఁడు, ఇట్లు చెప్పుటచే నటువంటి దుష్టునకు భృత్యుఁడనై యుండిన దోషము నాయందును గలదని భావము. ఒకనియొద్దఁ గొలువులో నుండుట యుండ కుండుట సేవకుని యిష్టము. నీ కొలువు నాకక్కఱలేదనినఁ గొట్టువారులేరు. దుష్టుఁడని తెలిసియు నతనితోడ నుండుట నా దోషమేకదా.

రావణునకు=అటువంటి రావణునకు, మాంసముఁ దినువారు మెడలోఁ బ్రేగులు వేసికొనరు. ఎంతచెడ్డవాఁడును బేరైన మంచి నుంచుకొనును. వీఁడు పేరుకూడఁ దన క్రౌర్యమును దెలుపునదే యుంచుకొనినవాఁడు.

సాక్షాదనుజుఁడను = ఉత్తయనుజుఁడనుగాను, కుబేరుఁ డనుజుఁడే, తల్లులు భేదించువారు. నేనో రావణునకు సోదరుఁడను. నా జన్మమునుండి యిటువంటి దుష్ట సాంగత్యము గలవాఁడను. ఇట్లు జన్మప్రయుక్త దోషము చెప్పఁబడెను. ఇది నా దోషము గాదు. «దైవాయత్తం కులే జన్మ, మదాయత్తంచ పౌరుష'మ్మన్నట్లు నా జన్మమునకు దైవము కారణము. నేను జేయుకార్యములు నా స్వాధీనములు. వానికి నే నుత్తరవాదిని. విభీషణుఁడు తన దోషములఁ జెప్పుచున్నాఁడు. "ఉపాయా నైవ సిధ్యంతి హ్యపాయా వివిధా స్తథా ఇతి యాగర్వహాని స్తద్దైన్యం కార్పణ్య ముచ్యతే" అన్నట్లు గర్వహాని లక్షణ కార్పణ్యము చెప్పఁబడెను.

### తాత్పర్యము.

రాక్షసుఁడును చెడునడవడి గలవాఁడును రాక్షసరాజును నగు రావణునకు నే నేకోదరుఁడ నగు తమ్ముఁడను, నా పేరు విభీషణుఁడు.

మ. ధరణీకన్యక దండకాటవి జన♦స్థానంబునం దుండఁగా
హరియించెన్ మఱి యజ్జటాయువును సం♦హారించె రోధించె నా
కరిణీయానను స్వావరోధమునన్ ర♦క్షస్స్త్రీలఁ గాపుంచె దీ
పురముల్ పల్కఁగఁ జేసె రావణుఁడు పూ♦వుంబోణి దుఃఖింపఁగన్. ౩౨౫

అర్థములు. రోధించెన్ = చెఱయం దుంచెను. కరిణీయానను = ఆఁడేనుఁగు నడకవంటి నడక గలదానిని, స్వావరోధమునన్ = తన యంతఃపురమందు, ధరణీకన్యక = భూపుత్త్రిక, ఇట్లు చెప్పుటచే లోకములోని కర్మబద్ధులు పుట్టునట్లు గర్భవాసాది దుఃఖము లనుభవించి పుట్టినది గాదనియు, నయోనిజ యనియుఁ బరత్వదశయందుఁ గల సౌకుమార్యాది గుణము లన్నియు నిప్పుడును గల వనియు భావము. ఇట్లు చెప్పుటచే సీతాదేవియందుఁ దనకుఁ గల పరత్వబుద్ధి, భక్తి తెలిపెను. దండకాటవి జనస్థానంబునందు = తక్కిన వారికి ఘోరారణ్యముగ రాక్షసావాసముగఁ దోఁచినను, ఆమెకుఁ బూలుగోయుటకు, స్వేచ్ఛగా విహరించుటకు నుపయోగించు నుద్యానమువలె నుండె నని భావము. జనస్థానమందలి వారు తన బంధువులని బిడ్డ లని తలంపు గలదై వారికే కీడు గోరినది గాకుండెను. రామునితో నిష్కారణముగ రాక్షసులఁ జంప వలదనియే కదా యామె చెప్పెను. ఏకాంత క్రీడకు ననువుపడుటచే నయోధ్యకంటె దండకయే యామెకుఁ బ్రియమై యుండె నని భావము. హరించెన్ = అపహరించెను 'భాస్కరేణ ప్రభా యథా' సూర్యుని నుండి యెండను వేఱుదీయుటవలె వ్యర్థప్రయత్న మని తలఁపక హరించెను. నిన్నుఁ బాసితిమేని మేము నీటిలో నుండి బయట వేయఁబడిన చేఁపలవలె నగుదు మని చెప్పినట్లు ఆమె మరణించు నంతటి ఘోరకార్యము చేసెను. "సింహము పాలి సొమ్ము గో, మాయువు గోరుచందమున మత్తుఁడు వైద్యుఁడు నీ పదాంబుజ, ధ్యాయిని నైన నన్ను వడిఁ దాఁ గొనిపోయెద నంచు నున్నవాఁ, డా యఘమాధముం డెఱుఁగఁ డద్భుత మైన భవత్ప్రతాపముల్" అన్నట్లు వాఁడు ప్రయత్నించిన పని వీఁడు చేయనే చేసెను. ఇట్టి "న క్షమామి క్షిపామ్యజస్రం నరకే" యన్నట్లు లీ భాగవతాపచారమే యెంతటి దండమునకైనఁ జాలును. ఇంతతో బోక, ఆ జటాయువును సంహరించెన్ = మీ కత్యంత ప్రియుఁడైన యా జటాయువును, మీకై ప్రాణము లైన నిచ్చి సేవ చేయువానిని, సీతను వలె నిర్బంధమందైన నుంచక సంహరింపనే సంహరించెను. సీతాహరణమును క్షమించినను నిట్టి ఘోరకార్యము క్షమింపఁ దగినది కాదని భావము. ఇట్లు పరమభాగవతాపరాధము హింసాత్మక మగు దానిఁ జేయుటచే వీఁడును సపుత్త్ర మిత్త్ర భృత్యుఁడై హింసింపఁ దగినవాఁ డని భావము. సంహార శబ్దముపైఁ గలిగిన నామధాతువు సంహరించెన్.

సీతాదేవిని హరించినవాఁడు భక్తితో గౌరవించెనా యనినఁ దన యంతః పురమున నెట్టివారికిని, నస్ఖలితబ్రహ్మచారియై, సవహ్యాకరణ పండితుఁడై జితేంద్రియుఁడైన హనుమంతునికిఁ గూడఁ జొరరానిచోట నిర్బంధమం దుంచెను. అడవియందు మహాభయంకరమృగము లుండు స్థలమునందుఁ దిరిగి నంత మాత్రము గూడఁ దిరుగుటకు లేక యుండునట్లు నిర్బంధించుటయే గాక చూచుటకు నాకార ములు, వినుటకు మాటలు, తలఁచుటకుఁ జేష్టలు భయంకరమైనవి గల రాక్షసస్త్రీలను నిటు నటు గదలకుండఁ గావలి యుంచెను. అంతతోఁ బోక - తీఁపురములు = ఆగడపుమాటలు పలుకఁ జేసెను. పూవుంబోణి = ౧ పుష్పముల వలె శిరస్సున ధరింప వలసిన దానిని (౨) దిరిసెనపూవువలె నతికోమల మైన దేహము గల దానిని - అత్యంత సుకుమారియై యెంతో సుఖ మనుభవింపఁ దగిన దానిని, దుఃఖింపఁగ = ఊరక యుండనీయ లేదు. ఏడిపించుచున్నాఁడు. మా యన్నయు మహాపాపములను జేయుచున్నాఁడు.

క. రామునకు సీత నిమ్మని, వేమాఱును హేతుయుక్తవివిధోక్తులచే
సామమున నెంతొ చెప్పితి, నా మానవభోజి కది నిరర్థక మయ్యెన్. ౩౨౬

అర్థములు. అన్నమీఁద దోషములు చెప్పెదవే, తమ్ముఁడవు నీ వేమి చేయుచుంటివి? నీవు మంచివాఁడవైన నన్నకు బుద్ధి చెప్పి యుండరాదా? యందు రేమో! "చరాచరాణి భూతాని, సర్వాణి భగవద్వపుః । తత స్తదానుకూల్యం మే కర్తవ్య మితి నిశ్చయః" చరాచరభూతము లన్నియు భగవంతుని శరీరము. కావున వాని కనుకూలుఁడనై ప్రవర్తించుట నాకుఁ దగిన కార్య మను నిశ్చయము ఆను కూల్య సంకల్పము-అట్టి శరణాగతి యంగము తా ననుష్ఠించితి నని విభీషణుఁడు చెప్పు చున్నాఁడని తీర్థీయులు, వేమాఱును= ఒకసారిగాదు, రెండుసార్లుగాదు - సీతను దెచ్చి నది మొదలు వెయ్యిమార్లు చెప్పితిని - నీవు సకారణముగఁ జెప్పిన నతఁడు విని యుండఁడా? యందురేమో - హేతుయుక్త = కారణములతోఁ గూడిన, వివిధోక్తు లచే = సామదానాద్యుపాయములతోడి మాటలచే - ఖరవధ-విరాధవధ - వాలి వధ యుదాహరించి చెప్పితిని - ఆయనసొత్తు నపహరించిన దోష మని నీతి వాక్యములు చెప్పితిని - ఎంతొ = విశేషముగ, నేను జెప్పవలసిన మర్యాద నతిక్రమించికూడఁ జెప్పితిని, ఆ మానవ భోజికి=ఆ రాక్షసునకు, నిరర్థకము=వ్యర్థ మయ్యెను.

దీనివలన నాకుఁ గాల విళంబ మయ్యెను. లేనిమొదలఁ గిష్కింధకే రావలసిన వాఁడను - ఇంకను బాగుపడు నేమో యను నాశచేఁ బలుమాఱు చెప్పుచుంటిని- అన్నిమార్లు చెప్పుట యేల యందురా? వాఁడు నామాట వినియుండిన సామాన్యధర్మ మైన జ్యేష్ఠ భ్రాతృసేవయు, విశేషధర్మమైన సీతారామచంద్ర సేవయు లభించును గదా యని యాశపడితిని - వాఁడు విననికారణముచే సామాన్యధర్మము వదలి విశేషధర్మమే గ్రాహ్య మని వచ్చితిని.

తాత్పర్యము.

రామునకు సీత నిమ్ము, అట్లు చేసితివేని ఆయన సౌత్రాయన కిచ్చునటులే గాక నీ సౌత్రాయన కిచ్చునట్లు రామచంద్రమూర్తి సంతోషించు నని వెయ్యిమార్లు నిదర్శనములతో, శాస్త్రవాక్యములతో, సంచిమాటలచే నెంతదూరము నేను జెప్ప వచ్చునో యంతకు మించియే చెప్పితిని. నేను జెప్పిన దంతయు వ్యర్థమై పోయెను.

క. అంతకవశుఁ డగువానికి, నెంతటిమే లౌషధంబు ♦ నిందనిగతి నే
నెంత హిత మాడినను నొక,సుంతయు మతిఁ గొనఁడు కాల♦చోదితుఁ డగుటన్.

అర్థములు. అంతకవశుఁ డగువానికిన్ = మృత్యుదేవతకు స్వాధీనపడి యుండువానికి, చావసిద్ధముగా నుండువానికి, ఇందనిగతి = దేహమునకు సరిపడని విధమున, సుంతయు = కొంచె మైనను, కాలచోదితుఁడు = యమునిచేఁ బ్రేరింపఁ బడినవాఁడు.

తాత్పర్యము.

చావ నున్నవానికి నెంత మంచి మందిచ్చినను దేహమునకు సరిపడక పోవు నట్లు నే నెంత హితము చెప్పినను మృత్యుప్రేరితుఁడై నా మాటలు వినినవాఁడు కాఁడు. విభీషణుఁ డిట్టి కార్యముచేసి సీతాదేవి యనుగ్రహమునకుఁ బాత్రుఁ డయ్యె నని యెఱిఁగియే రామచంద్రమూర్తియు విభీషణు ననుగ్రహించెను. విభీషణు విషయము సీతాదేవి హనుమంతునకుఁ దెలిపెను. ఆయన రామునకుఁ దెలిపెను. కావున విభీషణు విషయమై సీత యనుకూలాభిప్రాయము గల దని రాముఁడు గ్రహించెను. కావున రామచంద్రమూర్తి నిర్వ్యాజముగ విభీషణు ననుగ్రహించె ననుట సరిగాదు. జీవుఁడు తన కృత్యము తాను నెఱవేర్చునఁగాని భగవదనుగ్రహము రాదని చరమశ్లోకము లన్నియు జెప్పుచున్నవి.

రావణుఁడు నన్ను నిగ్రహించుటకును రామానుగ్రహమే కారణ మని నా యభిప్రాయము. జన్మప్రభృతి నేను ధర్మనిష్ఠగలవాఁడ నగుటను సీతాసేవచేసియు తన భక్తుడ నగుటను, రామచంద్రమూర్తి తెలిసికొని "సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి" నా ప్రాప్తికిఁ బ్రతికూలము లైన వాని నెల్ల నేనే తొలఁగించెద నన్నట్టు దీక్షగలవాఁడు కావున నా పరితాప మణఁప నా దుష్టసహవాసముఁ దొలఁగించి తన యొద్దఁ జేర్చుకొనుటకై రావణున కా బుద్ధి పుట్టించె నని విభీషణు నభిప్రాయ మని గ్రాహ్యము - ఈ కారణముచేఁ బరమపురుషార్థరూప రాము ప్రాప్త్యర్థము రామ చంద్రమూర్తినే శరణు చొచ్చితి నని చెప్పెను.

చ. పరుషము లాడి నన్ను నొక♦బంటువిధాన నవజ్ఞ చేసినన్
దురుసున, నాలుబిడ్డలను ♦ ద్రోసిడి యిమ్మెడ రామచంద్రునిన్
శరణముఁ జొచ్చినాఁడ, రఘు♦సత్తముతోడ జగచ్ఛరణ్యుతోఁ
బరమమహాత్ముతోఁ బ్లవగ♦వర్యులు! నా స్థితి వేగఁ దెల్పరే. ౩౨౮

అర్థములు. నీవు చెప్పిన మాటలకు నతఁడేమి ప్రత్యుత్తర మిచ్చెనందురా- పరుషములాడి = నేను దనకు ద్రోహినని, శత్రు పక్షపాతి,నని అసూయాపరుఁడనని తన కీడు కోరుచున్నా నని దూషించి, బంటువిధానక = తన యెంగిలి దిను దాసుని వలె, అవజ్ఞ చేసినక = ఛీ పో నా యెదుట నుండవలె దని యుంఛినఁ జంపెద నని యవమానింపఁగా, దురుసునక = కఠినమైన మనస్సుతోను, వాక్కుతోను; ఆలు బిడ్డల ననుటచేఁ దనకుఁ గల సర్వస్వ మని భావము.

"త్యజే దేకం కులస్యార్థే, గ్రామస్యార్థే కులం త్యజేత్। గ్రామం జనపద స్యార్థే, ఆత్మార్థే పృథివీం త్యజేత్" వంశమును రక్షించునిమిత్త మొకని వంశముసఁ బుట్టినవానిని వదల వలయును. గ్రామము రక్షించు నిమిత్తము వంశము వదల వచ్చును. ఊరిని రక్షింప గ్రామమును విడువవచ్చును. తన్ను రక్షించుకొను నిమిత్తము దేశమునే విడువవచ్చును. "ఆత్మానం సతతం రక్షేత్ దారైరపి ధనైరపి" భార్యలను, ధనమును వదలి యైనఁ దన్ను రక్షించుకొనవలెను - అని యుండుటచే, సోపాధికబాంధవు లెవ్వఁరు రక్షకులు కాఁజాలరు. నిరుపాధిక బంధువు శ్రీరామచంద్రమూర్తియే రక్షకుఁ డను తలఁపుతో సహధర్మచారిణులై సగము దేహము పంచుకొనిన భార్యలను, నరకమునుండి రక్షించు బిడ్డలను, తల్లిదండ్రు లను సర్వము వదలి వచ్చితి నని భావము. దీనిచేఁ బ్రపన్నుఁడు ప్రాప్యాభాసము లను ప్రాపకాభాసములను వదల వలయునని యేర్పడు చున్నది. ఆలుబిడ్డలను ద్రోపిడి యనుటచేఁ బ్రాతికూల్యమును విడువ వలయు నను నంగమును, రామచంద్రుని శర ణము జొచ్చినాఁడ ననుటచే ఆత్మనిక్షేప మనెడి యంగము చెప్పఁబడెను. ద్రోపిడి = ద్రోపు+ఇడి = వదలి, ఇది బుద్ధిపూర్వకత్యాగము చెలిపెడిని, ఈయ్యెడక = ఈ స్థలమునందు, ఈ సమయమందు- రఘునత్తముతోడక = శరణాగత రక్షణమే వ్రతముగాఁగల రఘువంశరాజులలో శ్రేష్ఠునితోడ, రాఘవేంద్రునిక = "క్విం త్వర్థి నామర్థితదాన దీక్షా కృతవ్రత శ్లాఘ్య మిదం కులం తే" యనునట్లు కోరినవారి కోరికల నెరవేర్చుట వ్రతముగాఁగల వంశముసఁ బుట్టినవారిలో శ్రేష్ఠుని, జగత్+శరణ్యు తోడ = ప్రపంచమున కంతయు సురనర వానర పశుపక్షి మృగ వృక్షాది సకల చరాచర సమేత మైన ప్రపంచమున కంతయు కులవిద్యాధన వృత్తి విపక్ష లేక యం దఱకు రక్షకుఁడైన వానితో, వీనిలో నేను జేరనవాఁడనే గనుక నాకు నాయనయే రక్షకుఁడు శరణ్యుఁడు="శరణే రక్షణే సాధుశ్శరణ్యః తత్రసాధుఃఇతి 'యత్' ప్రత్యయః" శరణ మనఁగా రక్షణము. దానియందు సాధువు శరణ్యుఁడు, శరణం భవితు మర్హ శ్శరణ్య ఇతి నిరుక్తిః,రక్షకుఁ డగుటకు యోగ్యుఁడు శరణ్యుఁడు. అట్టైన రావణాసురు నికి మాత్రము రక్షకుఁడు గాఁడా యందు రేమో, అనుకూలించివచ్చిన నాయనకు రక్షకుఁడే. అగ్నిహోత్రము తన్ను సమీపించిన వాని చలినే కదా పోఁగొట్టును. వాఁడు రాలేదు. కావున లాభము పొందినవాడు కాడు. నేను వచ్చితిని.

కావున నా కా లాభము కలుగవలయును అని భావము. ఓయీ! యీయన రక్షకుఁడని నీ వెట్లు విశ్వసించి యాశ్రయింప వచ్చితి వందురా, లోకమునఁ గేవలము హీనమై సులభమైన మట్టిపెళ్ళకై యెవఁడు నాశపడఁడు, కేవల పరత్వము నెవఁడు నాశింపఁడు. దుర్లభమైన మేరుపర్వతము నెవఁడాశించుచున్నాఁడు. కావున సౌలభ్యము పరత్వము రెండు గలవానినే జను లాశ్రయింతురు. రామచంద్ర మూర్తి రఘుసత్తముఁ డగుటచే సులభుఁడై యున్నాఁడు. పరమ మహాత్ముఁడగుటచే పరత్వముగలవాఁడై యున్నాఁడు. కావున నాశ్రయింప నర్హుఁడు. రఘుసత్తముఁ డనుటచే, మనుష్యస్వరూపమును వచ్చినవాఁ డగుటచే సమస్త జీవకోటికి లోచనగోచరుఁడై సులభముగా సేవింపఁ దగియున్నాఁడు. "చిన్మయ స్యాద్వితీయస్య నిష్కళస్యాశరీరిణః। ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా" అన్నట్లు భక్తుల సౌకర్యార్థమే కదా భగవంతుఁడు రూపము ధరించుచున్నాఁడు. ఇట్లు మనుష్యస్వరూపము ధరించుటచేఁ బరత్వహాని కలదా యనిన పరమ మహాత్ముఁ డనుటచే నట్టి హాని లేదనుచున్నాఁడు. పరముఁడు మహాత్ముఁడు నైనవాఁడు పరమమహాత్ముఁడు. "అభ్యాసయోగ యుక్తేన చేతసా నాన్యగామినా। పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్, భ. గీ. ౮-౮ అక్షరం బ్రహ్మ పరమం. ౮-౩. పరం బ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్ । పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్ భ. గీ. ౧౦ ౧౨ త్వ మక్షరం పరమం వేదితవ్యం త్వమస్య విశ్వస్యపరం నిధానమ్ భ.గీ. ౧౧-౧౮" ఇట్టివాఁడు పరముఁడు, మహాత్ముఁడు, ఆత్ముఁడు, జీవుఁడు. మహాత్ముఁడు = పరమాత్ముఁడు "భూతాత్మా పరః సౌమ్యనప్యర్థ్యహాత్మా" యనఁబడిన మహాత్ముఁడు. పరత్వ పరమస్వరూప స్వభావములు వదలక మనుష్యుఁడుగాఁ గాన వచ్చు భగవంతుఁడుగదా సేవ్యుఁడు. "భవతో యత్పరం రూపం తన్న జానాతి కశ్చన అవతారేషు యద్రూపం త దర్చంతి దివౌకసః" "యస్యావతార రూపాణి సమర్చంతి దివౌకసః। అపశ్యంతః పరం రూపం నమస్తస్మై పరాత్మనే॥ వి. పు. ౧-౧౯-౭౦ దేవతలు భగవంతుని పరస్వరూప మేదో తెలియక యవతారరూపములనే పూజించుచున్నారు. శ్రీ రామచంద్రమూర్తి యిట్టివాఁడు గనుక నాయన శరణుఁ జొచ్చితిని. కాఁబట్టి నా స్థితి మీరు రామచంద్రమూర్తికి, వేగన్ = శీఘ్రముగ, ఆలస్యములేక ఆయన నన్ననుగ్రహింపని నిమిష మొక కల్పము నరకమున నున్నట్లున్నది, నా బాధ తప్పింపుఁ డని భావము.

శరణాగతుడ ననిన నా మాట శరణాగతరక్షణవ్రత మవలంబించిన రామచంద్రమూర్తి విన్నమాత్రముననే కరిరాజును రక్షింపవచ్చినట్లు బయలుదేఱి వచ్చును. అప్పుడు మీకుఁ బురుషకారఫలము లేకపోవును. కావున నాయన యాసనము విడిచి లేవకముందే పోయి చెప్పుడు. శరణన్నవారిని దప్పక రక్షించు వ్రతము రామచంద్రమూర్తికిఁ గలదని సీతాదేవి రావణునకుఁ బోధించెను.

"రావణా, కొంకకు రామునితోఁ జెలిమిఁ గోరుము యప్పురుషోత్తముండు ధర్మాంకుఁడు నిన్ను నేలు శరణాగత వత్సలుఁడౌట సర్మిలిఁ." సుందర ౫౫౬.

ఈ విషయము విభీషణుఁ డెఱుగును. కావుననే జంకుకొంకు లేక రక్షించునను మహావిశ్వాసముతో వచ్చెను. ప్రపత్తియం దీ మహావిశ్వాసమే ప్రధానాంగము.

తెలుపరే = ఇది ప్రార్థనము.

తాత్పర్యము.

పామునకుఁ బాలు పోయఁబోయినఁ బైఁబడి పీఁకినట్లు తనకు హితము నుపదేశించు నన్ను ననరాని కఠోర వాక్యము లని తన యెంగిలి తిని బ్రదుకు దాసులవలెఁ గఠిన హృదయుఁడై యవమానించెను. కావున వానినేకాక నా భార్యను, బిడ్డలను దలిదండ్రులను ధన ధాన్యాదులను లంకను సర్వము వదలి శ్రీ రామచంద్రమూర్తియే మనకు రక్షకుఁ డనుకొని వచ్చి యాయన శరణు చొచ్చితిని - రఘువంశమునఁ బుట్టిన వారిలో నుత్తముఁడును పరమ మహాత్ముఁడు నగు రామచంద్రునితో శరణాగతుఁడై విభీషణుఁడు వచ్చినాఁ డని నా స్థితిఁ దెలుప మిమ్ముం బ్రార్థించెదను.

విభీషణుఁడు రామచంద్రమూర్తికిఁ గానవచ్చుచున్నాఁడు-విభీషణునకు రామచంద్రమూర్తి గానవచ్చుచున్నాఁడుగదా-విభీషణుమాటలు రామచంద్రమూర్తియు వినుచున్నాఁడు - ఇఁక నేమి చెప్పవలె ననిన:— ఇన్ని దినములు పరమ పాపి యగు రావణుతోడ నుండుటచే నపరాధ పరిపూర్తి గలవాఁడును, దానికై పశ్చాత్తాప పడుచు, ఈలోక పరలోక సుఖము లందలి రాగమును వదలిన వాఁడును, అపరాధముల క్షమించి తన వారిలోఁ జేర్చుకొనుటకై శరణాగతిని నుపాయముగా గ్రహించిన వాఁడును, రామ కైంకర్యమును రామ పరిచారకులతోడి, సాంగత్యమును గోరిన వాఁడు నగు విభీషణుఁడు వచ్చినాఁ డని నా స్థితిగతులఁ దెలుఁపుఁడు - నీవు దుష్టుఁడవే యెట్లు చెప్పెదు మందు రేమో? నేను దుష్టుఁడనుగాను - నా విషయము నా చెల్లెలు శూర్పణఖ 'దనుజచేష్టితకూరుండు ధర్మచిత్తుఁ డగు విభీషణుఁ డని (అరణ్యా ౭౯౯) ముందే రామచంద్రునకుఁ జెప్పినది - నాపే రాయనకుఁ దెలియును. కావున నా స్థితి శరణాగతుఁ డని మాత్ర మాయనకు మీరు దెలిపినఁ జాలును - శరణముఁ జొచ్చినాఁడను = నేను జేయవలసిన పని చేసితిని. ఇఁక రామచంద్రమూర్తి చేయవలసిన పనియే నిలువయున్నది. ఆ ఋణమును తీర్చుకొమ్మని వేగఁ దెలుపుఁడు. "ఋణం ప్రవృద్ధ ఇతి మే" యన్నట్టు లాలస్యము చేయుకొలఁది వడ్డి చెల్లింపవలసి వచ్చుననియుఁ దెలుపుఁడు. నా స్థితిఁ దెల్పుఁడు = నే నిచ్చటికి వచ్చియున్నా నని తెలుపుఁడు.

అతిహీనుఁడైనను తన రక్షణము గోరి తన్ను సమీపించి వచ్చినాఁ డను నదియే రామచంద్రుఁడు రక్షించుటకుఁ జాలినంత కారణము.

తెలుపరే = వాచాధర్మంబు గట్టుకొమ్మన్నట్లు, ఈ మాట మాత్రము

దెలుపు సాహాయ్యము చేసినఁ జాలును. అంత కెక్కువ మీరు చేయవలసినది లేదు. "అప్రార్థితో నగోపాయే దితి తత్ప్రార్థనామతిః గోపాయితా భవత్యేవం గోప్తృత్వ వరణం స్మృతమ్" అన్నట్లు గోప్తృత్వ వరణ మనెడి యంగము చెప్పఁబడెను.

శరణు జొచ్చెదను అనక చొచ్చినాఁడ ననుటచేఁ "రక్షిష్య త్యనుకూలా న్న ఇత్యేవం సుదృఢా మతిః । స విశ్వాసో భవే చ్ఛాత్రి సర్వదుష్కృతినాశనః" అని మహావిశ్వాసము చెప్పఁబడెను. అట్టి విశ్వాసము లేకుండినచో శరణు చొచ్చినాఁడ ననఁడు గదా.

ఓయీ! నీవు చెప్పినమాట వినలే దని ని న్నవమానించినాఁ డని యన్నపైఁ గోపించి వచ్చితివి గాని రామచంద్రమూర్తి యందలి భక్తితో రాలేదు కదా యందురేమో. రావణుఁడు చేసినది తత్కాలమునఁ గీడుగాఁ దోచి నాకుఁ గోపము గలిగించుట సత్యమేకాని వాఁడట్లు చేయుటచేఁగదా నాకు వైరాగ్యము శ్రీరామ చంద్ర శరణాగతిప్రాప్తి గలిగెను. కావున వాఁడు నా కుపకారము చేసినాఁ డనియే నా భావము.

ఓయీ! సీతాదేవిని దెచ్చినదిమొదలు వేయిమారులు చెప్పితినంటివే; అట్టి వాఁడ వింతకాల మూరకుండి యిప్పుడు రానేల యందువా? రావణుని కింకను బుద్ధి వచ్చునేమో యని కాచి కొన్ని దినము లుంటిని. మీ యుద్యమము దెలియరామిచే నా మాటలు వానికి నమ్మరాని వయ్యెను. వాఁడు దుర్ముహూర్తమందు సీతాదేవిని దెచ్చిన కారణముచే వానికి మీవలనఁ దప్పక కీడు కలుగు నని నే నెఱుఁగుదును. కావున మీరెవరైనఁ దప్పక వత్తు రనియు నప్పుడు చెప్పిననామాటలు వాఁడు విశ్వసించు ననియుఁ దలఁచి మీరాక కెదురు చూచుచుంటిని.హనుమంతుఁడు వచ్చి లంకగాల్చిన తరువాతఁ జెప్పితిని. అప్పుడు విన్నవాఁడుకాదు. గొంతుమీఁది కత్తివలె మీరు వచ్చి యిచ్చట విడిసినారని విని నేఁడు సభచేసెను.అందు నొక్కిచెప్పితిని. నా మాట వినక నన్నవమానించెను. ఇఁక నీ దుష్టసహవాసమువలన మేలు లేదని బయలుదేఱి వచ్చితిని.

పారమార్థిక బుద్ధితో విభీషణుఁడు వచ్చినట్లు ముందే వ్రాయఁబడెను. వ్యావహారిక బుద్ధి నతఁడు చేసినది తప్పొ యొప్పొ యని యాలోచింతము. రావణుఁడు ఛీ పో నాయొద్ద నుండవలదని చెప్పెనుగద. ఎందుఁబోవలె. లంకయందే యుదాసీనుఁడై యుండవచ్చునా? అది సాధ్యపడదు. తక్కినవారు కొందఱు హిత ముప దేశించినను దుదకు రావణుని యిష్టప్రకారము వర్తించిరి. విభీషణుఁ డట్లు గాదు. వ్యతిరేకించెను. పొమ్మన్నను నూరిలో నుండెనా? యింకను నేదో కుట్ర చేయుటకై యున్నాఁ డని రావణుఁ డెక్కువ సందేహము గలవాఁ డగును. అది యపాయకరము. లంకయందుండెనేని యుద్ధకాలమందు నీవు యుద్ధమునకుఁ బోవలసిన దని రావణుఁ డాజ్ఞాపించును. రాజాజ్ఞ మీఱెనా దండింప సిద్ధపడును.

మీఁదికి పోయెనా ప్రహస్తాదులలోఁ గలిసినవాఁ డగును. అంతఃకరణమునకు విరోధముగఁ బ్రవర్తించినవాఁ డగును. కావున లంక విడుచుటే యుత్తమకార్యము. లంకలో నుండుటచే రామరావణుల కిరువురకు మంచివాఁడు కానేరఁడు. అటుగాక లంకయం దుండక రామచంద్రమూర్తితోను గలియక యెందైన దేశముమీఁదఁ బోయెనా రావణవధానంతరము లంకను రామచంద్రమూర్తి యంగదునకో మఱి యెవ్వరికో యిచ్చి యుండునుగాని, తనయం దనుకూల బుద్ధిలేని విభీషణునిఁ బిలిపించి యుండఁడు.అప్పుడు విభీషణుఁడు రెంటను జెడిన రేవణుఁ డగును. వీఁడు రాక్షసుఁడు రావణ పక్షపాతి యని వానరులు వీనితోఁ బోరాడుచుందురు. లంకావాసము సాధ్యపడదు. కావున నే విధముగఁ జూచినను ధర్మపక్షపాతము వహించి రాముని పక్షము చేరుటే విభీషణునకు యుక్తికార్యము. తనకుఁ దగిన యాశ్రయమని రామచంద్రమూర్తి నాశ్రయించెను గాని లంకారాజ్యము దా నాశ్రయింప వలె నను కోరికతో లంకారాజ్యము నాకిచ్చెదరేని నేను మీకు సాహాయ్యము చేసెద నని బేరమాడ లేదని స్పష్టముగాఁ దెలియ నయ్యెడిని.

—♦ సుగ్రీవుఁడు రామునకు విభీషణురాక దెలిపి
రాక్షసుల నమ్మరా దనుట. ♦—

క. అను నా వచనంబుల విని, యినతనయుఁడు శీఘ్రగామి ♦ యేగి సుమిత్రా
తనయు సమక్షమునం ది, ట్లనియె స్రఘురాముతోడ ♦ న త్తరపడుచున్. ౩౬
శీఘ్రగామి = త్వరగాఁ బోఁగలవాఁడు, అత్తరపడుచున్=తొందరపడుచు, అత్తరము రూ. ఆతుర్రము.

తాత్పర్యము.

తా ననుకొన్న ప్రకారము వేగులవాఁడుగాక, దూతయుఁగాక ప్రత్యక్షవిరోధియుఁగాక శరణాగతుఁడను అనుమాటలు సుగ్రీవుఁడు విని శరణు అని విభీషణుని నోరరాఁగానే అభయ మ్మని రామచంద్రమూర్తి నోరవచ్చునేమో,కార్యము చెడునే యని 'అతిస్నేహః పాపశంకీ' అతిస్నేహము పాపపు సందేహములు గలిగించు నను సూక్తి ననుసరించి రామచంద్రునియం దత్యంతస్నేహము గల సుగ్రీవుడు అభయమ్మనుమాట రాకముందే పోయి నివారింపవలె నని మిగుల వేగముతో త్తరపాటుతోఁబోయి లక్ష్మణుఁడు వినుచుండఁగా నిట్లనెను. పరాయివాఁడు తాను జెప్పిన వినునో వినఁడో తమ్ముఁడవైన నీవు చెప్పిన వినును. కావున నీవును జెప్పుమని లక్ష్మణునిఁ దనతోఁ గలుపుకొనఁగోరి లక్ష్మణుముఖము చూచుచు రామచంద్రమూర్తితో జెప్పెను.

విభీషణుఁడు పగవానితమ్ముఁడు కావున నన్న పక్షమం దభిమానము గలవాఁడై యుండుట సహజగుణము. అందు నూతన సహాయ సంపత్తిఁ గోరవలసిన కాలము

కాని యున్నవారిని వదలుకొనవలసిన కాలముగాదు. కావున రావణుఁడు భేదోపాయము ననుసరించి పంపఁగా భక్తునివలె నటించుచున్నాఁడనియు, దగ్గఱఁ జేరనిచ్చిన సమయము వేచి రామునకో లక్ష్మణునకో తనకో కీడు చేయఁదలఁచిన ద్రోహియనియు గావున దగ్గఱఁ జేరనీయరాదనియు సుగ్రీవుని యభిప్రాయము. దీని ననుసరించియే మాటలాడుచున్నాఁడు.

క. తనపేరు విభీషణుఁ డఁట, యనుజుం డఁట దేవ! రావణాసురునకుఁ దా
మనుజాద చతుష్కముతోఁ; జనుదెంచి నరేంద్ర! నిన్ను శరణముఁ జొచ్చెన్.

అర్థములు. దేవ = సంబోధనము, మనుజాద చతుష్కముతోన్ = నలువురు రాక్షసులతో.

తాత్పర్యము స్పష్టము.

తే. యోజనలు సేయు తెఱఁగుల వ్యూహములను నుపములందేని, చారని యుక్తియందు
వానరులపట్ల నైరుల వలన మిగుల నప్రమత్తుండ వై యుండ నగు జయంబు.

అర్థములు. ఇట్లు విభీషణుని వృత్తాంతము దెలిపి తన యభిప్రాయము చెప్పుచున్నాఁడు. యోజనలు = ఆలోచనలు, వ్యూహములను = సేనలను వ్యూహాకారములుగాఁ బన్నునప్పుడు, ఉపమలందేని = ఉపాయములు చేయుట యందేని, చారనియుక్తి యందు = వేగువాండ్ర నియోగించుటయందు.

తాత్పర్యము.

దేవా! జయము కావలయు నని నీకుఁ గోరిక యుండెనా నీ వాలోచనలు చేయుటయందును వ్యూహములు దీర్చుటయందును ఉపాయములు పన్నుటయందును వేఁగుల నేర్పాటు చేయుటయందును వానరులకు నైరులవలనఁ గీడురాకుండ మిక్కిలి హెచ్చరిక గలవాఁడవై వర్తింపవలయును.

తే. కామరూపులు మఱియు నికారవిదులు, శూరవర్యులు రాక్షసు లూరివర్య
తెలియరాకుండఁ గనులకుఁ దిరుగుచుంద్రు, వారి నెన్నండు నమ్మంగ వలనుపడదు.

అర్థములు. వానరులకుఁ గీడు కలుగు పనిచేసితినా చేయఁదలఁచితినా, ఏల యిట్లు చెప్పెద వందువేమో, సూరివర్య = పండిత శ్రేష్ఠుఁడా! రాక్షసులు కామరూపులు = కోరినరూపము ధరింపఁ గలవారు. ఇది నీకు మారీచుని చర్యవలనఁ దెలిసిన విషయమే, నికారవిదులు = వంచనచేయఁ దెలిసినవారు. రావణుని చర్యవలన దెలిసిన విషయమే, శూరవర్యులు = శూరులందు శ్రేష్ఠులు, ఇది నీకు ఖరాదుల చర్యవలనఁ దెలిసినదే.

తాత్పర్యము.

పండితశ్రేష్ఠుఁడా! రాక్షసులు కోరినరూపము ధరింపఁగలవారు, మోసపువిద్య నేర్చినవారు, శూరులందు శ్రేష్ఠులు, ఎప్పటికే వేషభాషలచే శత్రువుల గెలువవచ్చునో యవి యన్నియుఁ దెలిసి యా ప్రకారము వర్తించువారు, ఇంతేకాదు. మన

కన్నులకుఁ గానకుండ మనలోఁ దిరుగఁ గలరు. కావున వారిని నెప్పటికి నమ్మరాదు.

క. ప్రణిధి యయి రావణునకుఁ, జనుదెంచెనొ నీతిశాలి ♦ స్వయముగఁ దానే
మనలోన నుండి సమయముఁ, గని మనలం బిలుకుమార్పఁ♦గా వచ్చెనొకో. ౩౩౩

ప్రణిధి = వేగులవాఁడు, "యథార్హవర్ణః ప్రణిధి రపసర్ప శ్చర స్పశః చారశ్చ గూఢపురుష" యని యమరుఁడు, నీతిశాలి = నీతివిద్యచేఁ బ్రకాశించు వాఁడు, పిలుకు మార్పఁగాఁ = చంపఁగా.

తా త్ప ర్య ము.

రావణుఁడు పంపఁగా వేగులవాఁడై వచ్చెనో లేక నీతి విద్య సామదాన భేదోపాయములు చక్కఁగాఁ దెలిసిన వాఁడగుటచేఁ దనంతటఁ దానే మనలోఁగలసి మెలసియుండి నమ్మిక పుట్టించి సమయము కాచివేచి మనము హెచ్చరిక తప్పియున్నప్పుడు మనలఁ జంపనే వచ్చెనో, కాని వీఁడు నిజముగ భక్తిచే వచ్చినవాఁడు కాఁడు.

క. తనహితు లనిచిన బలముఁ, వనచారులబలము మూల♦బలముం దనవే
తనమునఁ గుదిరిన బలమును, జను నమ్మఁగ, నమ్మరాదు ♦ శాత్రవబలమున్. ౩౩౪

అర్థములు. అనిచిన = పంపిన, వనచారులు = అడవియందుండు వారల, వేతనమున = జీతము తీసికొనుటచే.

తా త్ప ర్య ము.

మనకు సహాయ సంపత్తి యెక్కువ, శత్రువులకుఁ దక్కువయగుట మేలేకదా. ఏల విభీషణుఁ జేర్చుకొనవల దందువేమో.

తనమిత్రులు పంపిన సేనను నమ్మవచ్చును. తన రాష్ట్రములోని యడవులందుండు వారి బలమును నమ్మవచ్చును, పరంపరగా వచ్చిన మూలబలమును నమ్మవచ్చును. జీతమునకుఁ గుదిరిన భటులబలమును నమ్మవచ్చును. వీరివలన నపాయము లేదుగాని శత్రువులు పంపిన సేనను నమ్మరాదు, కీడు కలుగును.

'మౌలం, భృతం, సుహృ, ్చ్ఛ్రేణీ, ద్విషదాటవికం బలమ్,' అనిబలము లాఱు విధములు, ఇందు పరంపరఁగా వచ్చిన గర్భదాసాదుల నిలుకడ యగు బలము మూల బలము, జీతమిచ్చి చేర్చినది భృతబలము, మిత్రులు పంపినది సుహృద్బలము, పల్లెల నుండి గ్రామములనుండి తెచ్చినది శ్రేణీబలము, మనవిరోధులకు విరోధులుగా నుండు వారు మనపక్షమునకుఁ బంపిన బలము ద్విషద్బలము, కిరాతాదుల బలము ఆటవిక బలము.

పూర్వము మన స్వదేశరాజులు అడవులను చెంచులు, బోయలు, ఎఱుకలు, ఏనాదులు లోనగువారి స్వాధీన మందుంచి వారడవి ఫలముల వలనఁ గలుగు లాభ మనుభవించుచు రాజునకుఁ గావలసిన విచ్చుచు యుద్ధసమయంబుల సేనలు పంపు నట్లొడంబడిక గలవారు, ఈ విధముగ వచ్చు సేనకు నాటవికబల మని పేరు, ఈ సేనల నమ్మవచ్చును.

క. రాక్షసుఁ డఁట సహజంబుగ, రాక్షసనాథునకు ననుఁగు భ్రాతయు నఁట ద్వి
ట్పక్షమున వచ్చినాఁ డఁట, యీక్షింపుము నమ్మవచ్చునే వీని మదిన్. ౩౩౫

అర్థములు. ద్విట్ + పక్షమునన్ = విరోధి పక్షమునందుండి, "రిపౌ వైరి సపత్నారి ద్విషద్ద్వేషణ దుర్హృదః, ద్విడ్విపక్షాహితామిత్ర దస్యు శాత్రవ శత్రవః అభియాతి పరారాతి ప్రత్యర్థి పరిపంథినః" అమరుఁడు.

తా త్ప ర్య ము .

పుట్టువుచేతనే కూ్రరకర్ముఁ డగు రాక్షసుఁడఁట. అట్టి రాక్షసులకుఁ బ్రభువగు వానికిఁ గూరిమి గల తోడఁబుట్టినవాఁడఁట. ప్రత్యక్షముగ శత్రువుల యొద్దనుండి వచ్చినాఁడఁట. ఇవన్నియు వాఁడే చెప్పుచున్నాఁడు. ఇట్టివానిని నమ్మవచ్చునా? నీవే యాలోచింపుము,

చ. వినుము విభీషణుండు రఘువీర! దశాస్యునిచారుఁ, డాతఁడే
పనుపఁగ వక్రబుద్ధియయి వచ్చినవాఁ డిట, కీవు నమ్మినన్
జనవర! మాయచే మనలఁ జంపుట సత్యము, వీని నిప్పుడే
పొనుఁగుపడంగఁ జేఁత దగుఁ బో క్షమవద్వర! నాకుఁ జూడఁగన్. ౩౩౬

అర్థములు. చారుఁడు = వేగులవాఁడు, వక్రబుద్ధి=మోసపుబుద్ధి, పొనుఁగు పడంగ జేఁత = చంపుట, క్షమవత్ + వర = సామర్థ్యము గలవారిలో శ్రేష్ఠుఁడా.

తా త్ప ర్య ము .

సుగ్రీవా! శరణని వచ్చినవారిని నెట్లు చేరఁదీయుని నిరాకరింపవచ్చు నందువేమో! నిజమైన భక్తిశ్రద్ధలు గలిగి శరణు గోరిన వారిని రక్షింపవలసినదే సిద్ధమే. అది నేను గాదనను. ఈవిభీషణుఁడో రావణుని వేగులవాఁడు- వాఁడే పంపఁగా మోసపు బుద్ధితో నిచ్చటికి వచ్చినాఁడు. నీవు శరణాగతుఁడుగదా యని నమ్మి చేరఁదీసితివా యేదియో వంచనచేసి మనలఁ దప్పక చంపును. కావున వీని నిపుడే చంపుట దగిన కార్య మని నా యభిప్రాయము. నీవు సమర్థుఁడవే- నేను కాదనను. గాని నిద్రపోవు సింహమును నక్కలు పరిభవించును. మన మేమఱియున్న సమయమున మనలఁ జంపును. కావున శరణాగత రక్షాన్యాయ మిం దన్వయింపదు.

చ. వెరవరి యైన దాయ యరివీరుల నేనలలోనఁ జొచ్చి యే
యరమర లేక తిమ్మరుచు సంతట నం చోరయింతి గ్గినన్
బొరిగొను శత్రుసంతతులఁ బూర్ణముగాఁగ నులూకసంహతిన్
గరటముపోలెఁ గాన నెటు కార్యము గాదు విరోధి నమ్మఁగన్. ౩౩౭

అర్థములు. వెరవరి = ఉపాయశాలి, దాయ = పగవాఁడు; అరి=శత్రువుల యొక్క, అరమర = భేదము, తిమ్మరుచున్ = తిరుగుచు; పొరిగొనున్ = చంపును; ఉలూకసంహతిన్ = గుడ్లగూబల సమూహమును, కరటముపోలెన్ = కాకివలె.

తాత్పర్యము.

ఉపాయశాలి యగు శత్రువు తన శత్రువుల సేనలలోఁజొచ్చి వారిలోఁ దానొకడుగఁ గలిసి మెలసి భేదబుద్ధిగలవాఁడని కానరాకుండఁ దిరుగుచు సమయము దొరికినపుడు శత్రువులఁ జంపును. పూర్వ మొక కాకి గూబల నిట్లేగదా చంపెను. కావున విరోధిని నమ్మనేరాదు.

కాకి గూబల కథ పంచతంత్రమునఁ గలదు. కాకులకు గూబలకు నెప్పటికి విరోధమే. పగలు గూబలు బయటవచ్చినా కాకులు కొట్టును. రాత్రులందు గూబలు పోయి కాకులఁజంపును. ఇట్లుండ నొక కాకుల గుంపునకు గూబలగుంపునకుఁ గల హామము జరుగుచుండెను. అప్పు డొక కాకి యుపాయము చేసి గూబలలోఁ జేరుకొని కాకుల నన్నిటినిఁ జంపు నుపాయము మీకుఁ జెప్పెద నని నమ్మించి యవి యేమఱి యుండఁగా నొకనాఁటి పగలు కాకుల కన్నిటికిఁ జెప్పి యవి కొఱవులు తీసికొనిరాఁగా గూబ లుండు తొఱ్ఱల నన్నిటిని జూపఁగా వానిలో గడ్డికూరి నిప్పుపెట్టెను. గూబలన్నియు చచ్చెను. కావున విభీషణుఁడు నట్లే చేయును గావున నమ్మరాదు.

క. క్రూరుఁ డగు రావణాసురు, క్రూరమితమ్ముండు సేవ♦కులతో వీనిన్
గ్రూరంబుగఁ జంపుటయే, సారమతీ! కృత్య మిపుడు ♦ చర్చింపంగన్. ౩౩౮

తాత్పర్యము.

రావణాసురుఁడు క్రూరుఁడు. వాని క్రూరమి తమ్ముఁడు వీఁడు కావున వీనిని వీని సేవకులతోడఁ గ్రూరముగఁ జంపుటయే తగిన కార్యము.

వీనిని ద్రోహబుద్ధిని జిత్రవధ చేసి చంపవలెఁ గాని వాలివలె నొక్క బాణముతోఁ దటాలునఁ జంపరాదు. వీనిని విడువనురాదు. విశ్వామిత్రు యాగమున మారీచుని విడుచుటచేఁ గదా వెనుక వాఁ డంత పాపకార్యము చేయఁగలిగెను.

క. అను నినజుని సంరబ్ధం, బున నాడిన వాక్యములను ♦ బురుషోత్తముఁడున్
విని నికటపార్శ్వవర్తుల, హనుమత్ప్రముఖాగచరుల ♦ కను సంప్రీతిన్. ౩౩౯

అర్థములు. సంరబ్ధంబునన్ = తొందరగా, రామచంద్రమూర్తి యభయమునునేమో, ఆడినమాట తప్పడే యనియే తొందర, నికటపార్శ్వవర్తులన్=సమీపమునఁ బ్రక్కల నుండువారిని, హనుమత్ప్రముఖాగచరులన్ = హనుమంతుఁడు మొదలగు వానరులను, సంప్రీతిన్ = సంతోషముతో, విభీషణు మాటలకు రావణుఁడు కోపించినట్లు కోపింపక తన మనస్సును దాఁపక పచించెఁ గదా యని సంతోషించెను.

—♦ శ్రీరాముఁడు విభీషణువిషయమై కపుల యభిప్రాయ మడుగుట. ♦—

చ. వలిముఖనేత యా యసుర♦వల్లభుతమ్ము నెడాటమందుఁ దాఁ
బలికిన యుక్తియుక్త మగు♦పల్కులు మీరును వింటిరే కదా
బలితపుఁగార్యసంకటము♦పట్ల హితుం డొకఁ డాడ నంతతోఁ
బలుకమి యొప్ప దన్య మగు♦ప్రాజ్ఞ సమర్థ శుభేప్సుపాళికిన్. ౩౪౦

అర్థములు. వలిముఖనేత = వానరనాయకుఁడు = సుగ్రీవుఁడు; ఎడాట మందుః = విషయమందు; పలుకమి = మాటలాడకుండుట; ప్రాజ్ఞ = బుద్ధిమంతులు = సమర్థులు; శుభేప్సు=మేలుకోరినవారు నగు, పాళికిః = సమూహమునకు.

తా త్ప ర్య ము .

సుగ్రీవుఁడు విభీషణునుగుఱించి యుక్తియుక్తముగఁ జెప్పినమాటలు మీరందఱు విన్నారుగదా - గొప్పకార్యము చేయవలసి యందు సందేహము గలిగినపుడు హితుఁడొకఁడు చెప్పినదానితో నందఱు సంతుష్టిపడి మౌనము వహింపరాదు. ప్రాజ్ఞులు - సమర్థులు మేలుకోరువారితరులును వారివారి యభిప్రాయము దెలుపవలయును.

క. కావున నియ్యెడ మీ మీ, భావంబులు దెలుపుఁ డన్నఁ ♦ బ్లవగవరుల్ త
ద్భావుకచికీర్షులై సం,భావించుచు దమమతంబుఁ ♦ బలికి రతనికిన్. ౩౪౧

అర్థములు. భావుక చికీర్షులై =శ్రీరామమూర్తికి మేలుచేయు నాలోచన గలవారై; 'భావుకం భవుకం భవ్యం కుశలం క్షేమ మస్త్రియామ్' అమరుఁడు.

తా త్ప ర్య ము .

ఇది నీతివిధముగావున మీ మీ యభిప్రాయ మేమో వానరులారా చెప్పుఁడని యడుగఁగా మెట్లుచేసిన రామచంద్రమూర్తికి మేలో దానిని జేయఁగోరి తమ యభిప్రాయ మిట్లు పలికిరి.

సుగ్రీవుని యభిప్రాయమునకు విరోధముగఁ జెప్పిన నతఁ డేమనుకొనునో యని తలంపక నా స్థానమున మీరుండిన మీ రేమిచేయుట బాగని తలంచియుందురో దానిని దెలుపుఁడు.

చ. తెలియని దింత లేదు జగ♦తీత్రియమందు మహాత్మ! నీకు మా
వలని నిగారపుంజెలిమి♦బల్మిని బ్రశ్న యొనర్చి తింతయే,
యెలసెఁ బరీక్ష్యకారిత సు♦హృత్పరతంత్రత ధార్మికత్వముం
బలదృఢశౌర్యసత్త్వము ల♦పారపరాక్రమ! జ్ఞప్తి, నీయెడన్. ౩౪౨

అర్థములు. నిగారపుఁజెలిమిన్ = నిర్మలమైన ప్రేమయొక్క; బల్మిః = అతిశయముచే, పరీక్ష్యకారిత = ఏదియైనను జక్కఁ బరీక్షించి కార్యముచేయుట, సుహృత్పరతంత్రత = మిత్రుల యిష్టప్రకారము నడచుకొనుట, మీఁదఁజెలిమియన్నప్పుడు సౌహార్దము భావము మాత్రము చెప్పఁబడెను. ఇచ్చటఁ బారతంత్ర్యము చెప్పఁబడెను. సద్వ్రతిత్వముః = శ్రేష్ఠమైన శరణాగతరక్షణవ్రతము ననుసరించి వర్తించుట. బల = దేహబలము, దృఢశౌర్యము = అధికశౌర్యము,సత్త్వము = సాధుస్వభావము, జ్ఞప్తి= స్మరణము, ధర్మము; ఎలసెః= చేరియున్నవి. తెలియని దింతలేదు సర్వజ్ఞుఁడ వనిన-చో బహుత్వమును దెలుపునుగాని నిశ్శేషత్వము దెలుపదు. గావున దెలియని దింతలేదు అని చెప్పఁబడెను. అపారపరాక్రమ యనుటచే నిన్ను నెవ రేమి చేయఁగలరని భావము. చెలిమి బల్మిని ప్రశ్నచేసితివి (౧) మాయందు నీకుఁగల

స్నేహము ప్రకటించుటకుఁగాను అడిగితివి. (౨) రామచంద్రమూర్తి వానరులకు మిత్రుఁడు అను కీర్తి మాకుఁ గలిగింపఁ బ్రశ్నించితివి.

తాత్పర్యము.

మహాత్మా! నీకుఁ దెలియనిది మావలనఁ దెలిసికోవలసినది లవమైన లేదు. అయినను మాయందు నీకుఁగల నిర్మలమైన స్నేహము నతిశయముచే రాముని మిత్రులు వానరులను కీర్తి మాకు సంపాదించి యీయ నడిగితివి కాని మఱియొండు గాదు. ఏది నిర్ణయమైనను నీవు ముందు పరీక్షింపక చేయవు. మిత్రుల యిష్టప్రకారము నర్తించువాఁడవు. నీవు చేయఁదలఁచిన కార్యము మిత్రులచే సరి యనిపించి యావలఁ జేయుదువు. సత్యమైన వ్రతము గలవాఁడవు. నీవు పట్టిన వ్రతమును వదలవు. మే మేమి చెప్పినను నీ శరణాగత రక్షణ వ్రతమును నీవు విడువవు. సత్యమే నీకు వ్రతము. ఏది చేసినను ధర్మమును ననుసరించి చేయుదువు. బలము దృఢశౌర్యము దృఢసత్త్వము శక్తి యివి నీయందు దృఢముగ నిలచియున్నవి. ఇట్టి నీ వేమి చేసిన నిన్నుఁ గాదనువా రెవరు? పరాక్రమము చేతనే సర్వకార్యములు నీవు సాధింపఁ గలవు. ఇట్టి నీకు మే మేమి చెప్పఁగలము ?

క. మతిసంపన్నులు క్రియలం, దతినిపుణులు నీదు సచివు లందఱు నగుటన్
హితమె యొక్కొక్కఁడు తనతన, మత మనుటయ మేలు హేతుమానితఘటితిన్.

అర్థములు. మతిసంపన్నులు = ఆలోచించు శక్తి గలవారు. క్రియ లందున్ = కార్యములు చేయుటయందు, సచివులు = మంత్రులు, మతము = అభిప్రాయము, హేతుమానితఘటితిన్ = కారణముచే గౌరవింపఁబడిన మాటలచే.

తాత్పర్యము.

నీ మంత్రు లందఱు చక్కఁగా నాలోచించి చెప్పఁగల బుద్ధిమంతులు. మాటలు చెప్పుటయందే కాదు, కార్యములు చేయుటయందు సమర్థులు కావున అందఱుఁ గలసి యొక్కటిగఁ జెప్పుటకంటె నొక్కొక్కఁడు ఈ యీ కారణములచే వీనిని జేర్చుకొనవచ్చును, ఈ యీ కారణములచే వీనిని జేర్చుకొనరాదని వాని వాని యభిప్రాయము వాఁడు వాఁడు చెప్పుట బాగు.

— అంగదాదులు వారివారి యభిప్రాయంబులఁ దెలుపుట. —

చ. అని విని వాలిపుత్త్రుఁడు ధరాధిపుతోడ విభీషణుం డరా
తినికటమందు నుండి చను దెంచుటచే ననుమానపాత్రుఁడే,
చనదు తటాన నమ్మఁ, దమ చందము మార్పడఁ జేసి రంధ్రముం
గని ప్రహరింతు రొక్కెడల, నటు గాన ననర్థము గల్గు నెంతయున్. ౩౪౪

అర్థములు. అరాతినికటమునుండున్ = పగవాని యొద్దనుండి.

తాత్పర్యము.

ఆ మాటలు విని రామచంద్రమూర్తితో నంగదుఁ డిట్లనియె. దేవా! విభీషణుఁడు మనశత్రువులయొద్దనుండి వచ్చినవాఁడు కావున సందేహింపఁదగిన వాఁడే-కావునఁ బూర్వోత్తరములు విచారింపక తటాలున నమ్మరాదు. - ఏలన ద్రోహులు తమ యథార్థస్థితి దాఁచి మాఱువేషము వేసి సమయము వచ్చినపుడు కొట్టుదురు. కావునఁ గీడు కలుగును.

ఉ. కావున నట్టివారలను ♦ గార్యములం దిడి తత్ప్రవర్తనన్
వావిరి నిశ్చయించి గుణ♦వంతుఁడ యేని గ్రహియింపవచ్చు, దు
ర్భావుఁడ యేని వీడు టది ♦ భావ్యము, దోషబహుత్వ మున్నచోఁ
జే విడువం దగుం గుణవి♦శిష్టుఁడ యేనియుఁ గైకొనం దగున్. ౩౪౫

అర్థములు. తత్ప్రవర్తనన్ = వారి నడవడిని, వావిరి = చక్కఁగా; దుర్భావుఁడు = చెడుతలంపుగలవాఁడు; భావ్యము = మేలు; దోషబహుత్వము = పెక్కు దోషములు; గుణవిశిష్టుఁడు = ఎక్కువ మంచిగుణములు గలవాఁడు; కైకొనం దగున్ = గ్రహింపవచ్చును.

తాత్పర్యము.

కావునఁ గ్రొత్తవారినిఁ జేర్చుకొనునప్పుడు వానిచేతఁ గొన్నిపనులు చేయించి యవి వాఁడెట్లుచేయునో వాని నడవడి యెట్టిదో చక్కఁగా నిర్ధారించి గుణవంతుఁ డాయెనా గ్రహింపవచ్చును. దురభిప్రాయము గలవాఁడని తోఁచెనా విడువవచ్చును.

ఓయీ! "యోగ్యః పురుషో నాస్తి" "అయోగ్యః పురుషో నాస్తి" అన్ని సద్గుణములు గలవాఁడు లేఁడు-అన్ని దుర్గుణములు గలవాఁడు లేఁడు గదా, యందు వేమో! దోషములు పెక్కు లున్న విడువవలయును. గుణములు పెక్కులున్న గ్రహింపవచ్చును, అని యువరాజగుటచే నంగదుఁడు తొలుతఁ జెప్పెను. సుగ్రీవుఁడు విభీషణుని సమీపమునకే రానీయరాదని చెప్పెను. అంగదుఁడు పరీక్షించి దుష్టుఁడైనచో విడువ వలయును అని చెప్పెను. ఇది భేదము.

ఉ. ఆ నుడు లాలకించి శర♦భాహ్వయుఁ డిట్లను సాధ్యసూక్తులన్
దానవు చిత్తశోధన మొ♦నర్పఁగ వేగుల సూక్ష్మబుద్ధులన్
బో నియమించి వా రితని♦పోకల నెల్ల నెఱింగి వచ్చినన్
మానవలోకపాల యను♦మానము మాని గ్రహింపు పిమ్మటన్. ౩౪౬

అర్థములు. క్రొత్తవానిని మనలోఁ జేర్చుకొని వానిచే మన పనులు చేయించుకొని గుణదోషములు నిశ్చయింపవలె నన్నమాట శరభునకు రుచించినది కాదు. ఏలన:—ఎప్పుడు మనలో నొకనిఁ జేర్చుకొంటిమో మనలో గుట్టులన్నియు

వాఁ డప్పుడే తెలిసికొనఁ గలఁడు. ఆవల వానిని నుంచుకొనినను గీడే, పొమ్మనినను గీడే, యని తలఁచి శరభుఁడు తన యభిప్రాయమును చెప్పుచున్నాఁడు.

సాధ్యసూక్తులన్ = చేయుటకు సాధ్యమైన మంచిమాటలచే, ఇట్లు చెప్పుటచే నంగదు నభిప్రాయ మసాధ్య మని సూచన.

తా త్ప ర్య ము .

ఆ మాటలు విని శరభుఁడు చేయ సాధ్యమైన మంచి మాటలచే నిట్లనెను. రామచంద్రా! వీనిని మనలో నిప్పుడే కలుపుకొనక దూరమందే యుంచి సూక్ష్మ బుద్ధి గల వేగుల నియమించి పరీక్షించి వీని నడవడుల నన్నిటిని వారు పరీక్షించి తెలిసికొని వచ్చిన పిమ్మట వీనియం దనుమానింపఁ గారణము లేదని తోఁచిన గ్రహింపుము.

చ. అనవుడు జాంబవంతుఁడు గుణాఢ్యము దోషవివర్జితంబుగా
మనవి యొనర్చె రావణుఁడు మత్సరచిత్తుఁడు బద్ధవైరుఁ డా
తని నెడఁ బాసి మిమ్మితఁడు దాయఁగ వచ్చె నహేతుకంబుగాఁ
గనఁగ నదేశకాలములఁ గావున నమ్మకుఁ డీ విభీషణున్. ౩౪౭

అర్థములు. ఈ యభిప్రాయము జాంబవంతునకు సరిపడినది కాదు. గుణాఢ్యము = గుణాధిక్యముగలది. దోషవివర్జితము = దోషములేనిది; ఇట్లు చెప్పుటచే శరభుని యభిప్రాయమందు గుణములేదు, దోషముగలదని జాంబవంతుని యభిప్రాయము. వేగుల నెప్పు డేర్పాటు చేసితిమో యప్పుడే వాఁడు హెచ్చరికపడి వాస్తవమునుదాఁచి మంచివానివలెనే నటించును. అదియునుగాక వీరు నన్ను నమ్మరైరికదా యను నభిప్రాయము వారికిని గలిగించి నట్లగును.

తా త్ప ర్య ము .

శరభుఁడిట్లు చెప్పఁగా గుణవంతము దోషరహితము నగు మాటను జాంబవంతు డిట్లు చెప్పెను. రావణుఁడు మనయందు మాత్సర్యము గలవాఁడు. విరోధమునే సాధింప వలయు నని కంకణము గట్టుకొన్న వాఁడు. అటువంటివానిని విడచి వీఁడు వచ్చుటకుఁ దగిన కారణము వీఁడు చెప్పలేదు. వీఁడు చెప్పినది నమ్మఁదగిన కారణముగాదు. అదియునుగాక వీఁడు వచ్చినది దేశకాలవిరుద్ధమైనది. మనమా లంకకు నూఱామడ దూరమున నున్నాము. మన ముఖములు వారు చూడలేదు. వారిముఖములు మనము చూడలేదు. మనవలన వారికి వచ్చిన యుపద్రవము లేదు. కావున నింతదూరము వెదకి కొనుచు రాఁ గారణములేదు. అన్న తిట్టెను వచ్చితి ననెను. తనయెదుటికి రావల దనెనుగాని లంకలోనే యుండవల దనెనా? కావున వీఁడింతదూరము రావలసిన పని లేదు. వీఁడు వచ్చుట కిది తగినకాలముగాదు. అన్నమాట తమ్ముఁడు వినవలయునా? తమ్ముని మాట యన్న వినవలయునా? తనమాట యన్న వినలేదని యతని యాపత్కాలములో విడిచి వచ్చుట కాలవిరుద్ధము కావున మీా రీతని నమ్మరాదు.

ఉ. మైందుఁడు నీత్యనీతుల స♦మంబుగ బుద్ధిఁ దలంచి పల్కె ము
న్నుందు విభీషణుం దఱిసి ♦ ముచ్చట కీడిచి తేనెమాటలన్
సందున రావణాసురుని♦చందము మాటలపొం దెఱింగి మీా
దం దగు యుక్తముం జలుప ♦ దాశరథీ! ఖలుఁడే నదుష్టుఁడేన్. ౩౪౭

అర్థములు. జాంబవంతుఁడు చెప్పినమాట మైందుఁడు మెచ్చక యిట్లను చున్నాఁడు. నీత్యనీతులన్ = నీతిని, నీతికాని దానిని, సమంబుగ బుద్ధిదలంచి యను టచే జాంబవంతుఁడు చెప్పిన దానియందు నీత్యనీతులు సమముగా లేవని సూచన, తేనెమాటలన్ = తేనెవంటి తియ్యని మాటలచే, ఇది యుపమానపూర్వపదకర్మ ధారయము, ఖలుఁడేన్ = దుష్టుఁడైనను,అదుష్టుఁడేన్ = దుష్టుఁడు కాకున్నను.

తా త్ప ర్య ము .

జాంబవంతుఁడు చెప్పిన మాటలు విని మైందుఁడు నీతి యనీతులను సమ ముగా నాలోచించి యిట్లనియె. ముందుగా విభీషణుఁ జేరఁదీసి ముచ్చటలు పెట్టు కొని యా మాట ధోరణివలన రావణువిధము, వాని విషయమున వీని యభిప్రాయము నిజము దెలిసికొని దుష్టు డని తోఁచిన దండింప వచ్చును. శిష్టుఁడని తోఁచిన గ్రహింపవచ్చును.

తే. అంత సంస్కార సంపన్నుఁ ♦ డఖిల మంత్రి
సత్తముఁడు నగు హనుమ ప్ర♦శస్త ఘణితి
నర్థవంతంబు మధురంబు ♦ నగుచుఁ బ్రియము
మితము నగు వాక్యములు పల్కె ♦ హితము దోఁప. ౩౪౮

అర్థములు. సంస్కారసంపన్నుఁడు = శాస్త్రమునందు చక్కని శిక్ష యభ్యాసము గలవాఁడు, ప్రశస్తఘణితిన్ = మెచ్చుకొనఁదగిన వాక్యములచే, అర్థ వంతము = ప్రయోజనము గలది, మధురము = వినసింపైనది, మితము = ఎక్కువ మాటలు లేనిది.

తా త్ప ర్య ము .

ఇట్లందఱు చెప్పినపిమ్మట శాస్త్ర జ్ఞానము శిక్షాపూర్వముగఁ దెలిసినవాడును- మంత్రులందరిలో శ్రేష్ఠుఁడును, (ఇది సుగ్రీవుని సిషేధించు చున్నది) నగు హనుమం తుడు మెచ్చఁదగిన ప్రయోజనము గల తియ్యఁదనము ప్రియము హితము మితము నగు మాటల నిట్లనియె.

ప్రభువుగావున సుగ్రీవుండు చెప్పిన దానిని బూర్వపక్షము చేయక తక్కినవారు చెప్పిన యాలోచనములు సరిగా దనుచున్నాఁడు. ఆలోచన సరిగా దనుచున్నాఁడే కాని యది చెప్పినవారిపేరు చెప్పలేదు. ఆలోచన దుష్టముగాని యాలోచన చెప్పినవాఁడు దుష్టుఁడు గాఁడని భావము.

—♦ విభీషణుని గ్రహింపవచ్చునని హనుమంతుఁ
డభిప్రాయముఁ దెలుపుట ♦—

క. మతిమంతులలో శ్రేష్ఠుఁడ, వతికుశలుఁడ వర్థములఁ మహావాగ్మివి ని
న్నతిరేకించి వచింపఁగ, శతమఖు నాచార్యుఁ డైనఁ ♦ జాలఁడు రామా. ౩౫౦

అర్థములు. అర్థములన్=ధర్మార్థ కామమోక్షముల విచారణయందు; మహావాగ్మివి = మిగులఁ జక్కఁగ యుక్తియుక్తముగఁ జెప్పఁగలవాఁడవు; అతిరేకించి = అతిక్రమించి; సరిగాదని; శతమఖు నాచార్యుఁడు = బృహస్పతి.

తాత్పర్యము.

రామచంద్రా ! బుద్ధిమంతు లనిపించుకొనిన వారిలో నీవే శ్రేష్ఠుఁడవు. నీకు సమానులులేరు, అధికులులేరు, పురుషార్థముల నాలోచించి చేయుటయందు మిగుల నేర్పరివి. నీవు చేయుకార్యము పరులు మెచ్చునట్లు మాటలు యుక్తి యుక్తముగ శాస్త్రసమ్మతముగఁ జెప్పఁగల సామర్థ్యము గలవాఁడవు. నీవు చెప్పినది సరిగాదనుటకు బృహస్పతి యైనను సమర్థుఁడు గాఁడు.

సీ. వాగ్వాదముల నేను ♦ వావదూకుఁడ నంచుఁ, దర్కనైపుణిఁ జూపఁ ♦ దలఁపలేదు
అన్యమతంబుల ♦ నణఁచి నా వాదంబె, గెలిపింప వలయు న♦ న్నెలఁపు లేదు
ఎల్లవారలకన్న ♦ నేన మిన్నయటన్న, గౌరవంబును గాంచు♦ కాంక్షలేదు
నా వచోజృంభణ ♦ మావిష్కృతము సేయ, నిది సమయం బంచు ♦ నెంచలేదు
తే. దనుజునందలి పక్షపా♦తమునఁ గాదు, త్వద్గురుత్వాప్తి నభిలాష♦వలనఁ గాదు
రాజవల్లభ! దశరథ♦రాజతనయ, కలది వచియింతు శ్రీరామ!♦గౌరవమున. ౩౫౧

అర్థములు. వాగ్వాదములను = పూర్వపక్ష సిద్ధాంతరూపముగా మాటలాడుటయందు, నేన = నేనే, వావదూకుఁడను = యుక్తిగా మాటలాడుటయందు సమర్థుఁడను, "వాచోయుక్తిపటు ర్వాగ్మీ వావదూకోఽతివక్తరి" అనుసరము. తర్కనైపుణి = యుక్తి చమత్కారము, మిన్న = గొప్పవాఁడు, వచోజృంభణము = మాటల యుద్దండత, ఆవిష్కృతము = వెల్లడి, త్వద్గురుత్వాప్తి=నీ వలన గొప్పవాఁడ ననిపించుకొన వలయు నను, గౌరవమున = (1) కార్యముయొక్క గొప్పతనము వలన, (2) ఇన్ని దినములుగ నాయందు నీకుఁ గల గౌరవమున. కలది = వాస్తవము.

తాత్పర్యము.

ఇతరుల యభిప్రాయముల ఖండించి నా యభిప్రాయము స్థాపించుటయందు యుక్తి యుక్తముగ మాటలాడఁ గల నని నా తర్కచాతుర్యము చూప నే నాలోచించినవాఁడఁ గాను. ఇతరుల యభిప్రాయములు తప్పనిపింపవలె, నా యభిప్రాయంబె స్థాపింపవలె నని యభిప్రాయము లేదు. తక్కిన యందఱ కంటె హనుమంతుఁడు

బుద్ధిమంతుఁడు మంచి యాలోచన చెప్పును అని గౌరవమును సంపాదించుఁ గోరికయు లేదు. నే నుద్దండముగా మాటలాడఁ గల నని నా గట్టితనము ప్రకటింప వలయు నని నే నెంచలేదు. వీఁడు లంకలో నా కనుకూలుఁడై పలికెను కావున వాని యందలి పక్షపాతముచే నేను జెప్పరాలేదు. నీ వలన నొక గౌరవము బిరుదు సంపాదింపవలె నని కాదు. రామచంద్రా! కార్యగౌరవమును బట్టి నన్ను నీవు చూచు గౌరవమును బట్టి యున్న వాస్తవము చెప్పెదను. సీతాదేవి వృత్తాంతము నేను నీకుఁ జెప్పినపుడు "భృత్యకార్యము పవమానసుతుండు దీర్చెఁ బ్రస్తవ్య గతిఁ" అనియు, నే నుత్తమ భృత్యుఁడ ననియు నీవే చెప్పితివి. నన్నుఁ గౌఁగిలించి గౌరవించితివి. అట్టి యుత్తమ భృత్యుఁ డను గౌరవము నేను బోఁగొట్టు కొన రాదు. కావునఁ జెప్పెదను.

తక్కిన వానరు లీ పీఠిక యే లేక వారి యభిప్రాయము దెలిపిరి కదా. ఈయన కీ పీఠిక యేల ? ఈయన చెప్పఁబోవునది తక్కిన యందర యభిప్రాయముతో విరోధించునది. అందఱు నొక్క విధముగఁ జెప్పిన దా నొకఁ డొక విధముగఁ జెప్పె నని తక్కినవారు లేనిపోని దురూహలు పన్నఁ గారణము కలుగును. విభీషణుఁడు తనకు లంకలోఁ జేసిన మే లిదివఱకే చెప్పియున్నాఁడు. ఆ పక్షపాతముచే నిప్పు డాయన కనుకూలుఁడై చెప్పెనే కాని కార్య మాలోచించి చెప్పలేదను దూఱు రాఁగలదు. అట్టి యభిప్రాయము లేవియు నా యందు లేవని ముందుగా జెప్పుకొనవలసి వచ్చెను.

తే. అర్థము ననర్థమును నారఁ♦యంగ నీదు
సచివవర్యులు పలికిన♦చందములను
దోష మొక్కండు నా మదిఁ ♦ దోఁచుచున్న
దది గ్రహించుట కిపుడు సా♦ధ్యంబు గాదు. 36౨

అర్థములు. అర్థము = గుణము, అనర్థము = దోషము, అరయంగఁ = విచారింపఁగా.

తా త్ప ర్య ము .

మతఖండన కాలమందు వారి వారి పేర్లు చెప్పిన వారి వారికిఁ గోపము వచ్చును. అందు సంగదుఁడు యువరాజు. ఆయనకుఁ గోపము రాకుండుటకై యాయన పేరు చెప్పక సామాన్యముగ నందఱఁ గలిపి నీ మంత్రు లని చెప్పెను. అంగదుఁడు చెప్పిన దానిని ఖండించు చున్నాఁడు. విభీషణుని గ్రహించుటయందు గుణమును దోషమును నీ మంత్రివర్యులు చెప్పిన విధములందు నొక్కొక్క- దోషము కానవచ్చుచున్నది. అంగదుఁడు చెప్పినది గ్రహింప నిపుడు సాధ్యపడదు.

క. పనులందు నియోగింపక, పనివానితనంబు తెలియఁ♦బడదు తటాన౯
బనులందు నియోగించుట,యును దోషమ యనుచుఁ దోఁచె ♦ నుర్వీశవరా·

తా త్ప ర్య ము.

ఒకనిని బరీక్షించి చేర్చుకొనవలయు ననిన వానిని బనులందు నేర్పాటుచేయ కుండిన వాని గుణదోషములు తెలియవు. ఒకని గుణదోషములు తెలియక వానిని గొప్పరాజకార్యములందు నెట్లేర్పాటు చేయ సాధ్యమగును? పనులందు నేర్పాటు చేసితిమా మనగుట్టు రట్టగును. కావున నిట్టిపరీక్ష సరిగాదు. (ఇది ౩౪౫ వ పద్యమునఁ జెప్పఁబడిన దాని ఖండనము) ఇందనన్యోన్యాశ్రయత్వదోషము గలదు. పిచ్చి కుదిరిననఁగాని పెండ్లికాదు. పెండ్లియైనఁగాని పిచ్చి కుదురదు. ఇట్టిది యన్యోన్యాశ్రయత్వము.

క. చారప్రణిహిత మిప్పు డను, వారు ననుచు ననిరి యది నిరర్థక మగుఁ జూ
దూరప్పుఁబనికిఁ వేగులు, చేరువల న్వార లేమి సేయఁగ వచ్చున్. ౩౫౪

అర్థములు. చారప్రణిహితము = వేగులవారి నేర్పాటు చేయుట; అనువారుఁ = బాగుగ నుండును. (ఇది ౩౪౬ వ పద్యమునందలి శరభుని మతము) అనునది వ్యర్థము = దానివలనఁ బ్రయోజనములేదు. ఏలన దూరముగ నుండువారి విషయమై విచారించి తెలుసుకొనవలయు ననిన వేగులు కావలయును. దానికిఁ గాలము పట్టును. ఎదురుగానుండి యవునో కాదో యీ క్షణమందే ప్రశ్నించి తెలిసికొన వలసిన సందర్భములందు వేగు లేమి చేయఁగలరు.

ఉ. ఈతఁడ దేశకాలముల నిం దరుదెంచె నటన్న మాటకుఁ
నా తలఁ పేమినా ననుర నాయకుదౌష్ట్యము నీకు శౌర్యముం
జేతముగం దెఱింగి యిటు చేరె గుణోన్నతునిన్ భవద్దిశన్,
యీతని బుద్ధికిం దగిన దియ్యది గాదె? యదేశ మెట్లగుఁ ? ౩౫౫

తా త్ప ర్య ము .

ఈతఁడు దేశము గాని దేశమునందుఁ గాలము గాని కాలమందు వచ్చె నన్న విషయములోఁ (ఇది ౩౪౭ వ పద్యములోని జాంబవంతుని యభిప్రాయము) నా యభిప్రాయ మే మంటివా, రావణుఁడు సర్వరాక్షస నాశనకరమైన సీతాహరణము వలన మరల నాతని నీయమిని దుష్టుఁ డనియు, ఖరవాలి వధచే నీవు శూరుఁడ వనియు, విభీషణుఁడు చక్కఁగా నెఱిఁగినవాఁడే. కావున నే గుణములచే గొప్పవాఁడగు నిన్ను ఏ సమయమందుఁ జేరవలెనో యా సమయమందే, నే ప్రదేశమునఁ జేరవలెనో యా ప్రదేశమందే చేరెను. ఈతని సౌమ్యబుద్ధికిఁ దగిన దియ్యదియే. సముద్రము దాఁటిన తరువాత వచ్చియుండరాదా యందు రేమో మనము నిన్న రాత్రి యిచ్చటఁ జేరితిమి. ఆ వార్త తెలిసి యీ దిన మూదయమున రావణుఁడు సభ చేసెను. అం దితనికి రావణునకు వాద ప్రతివాదములు జరిగియుండును. వాఁడు దుష్టుఁడు గావున నీతని నవమానించి యుండును. మనము సముద్రము దాఁటు టెప్పుడో. అంతవఱకు లంక విడిచి యెందుండవలె. ఏమి చేయుచుండవలెను. ఉండిన

నచ్చోటనో లేక యిచ్చటనో యుండవలెను. అది విడిచెను గావున నిచ్చటికి వచ్చెను. సముద్రము దాటిన తరువాత వచ్చియుండిన నేనాడో యవమానించిన నీ నాఁ డేల వచ్చితి వని మనమే యడుగవలె! అప్పు డేమి చెప్పఁ గలఁడు?

జాంబవంతుఁడు చెప్పిన యాలోచనమందు స్వరూపాసిద్ధి యను దోషము గలదు. చెప్పిన హేతువు సరి గానిచో స్వరూపాసిద్ధి యను దోష మగును.

ప్రతికూలునిపై దోషము దృష్టపడినప్పుడే వానిని విడువఁ దగిన కాలము. అనుకూలునిపై గుణము నిశ్చయమైన యప్పుడే యాశ్రయింపఁదగిన కాలము. ఈ రెండు నిప్పుడే నిశ్చయము లైనవి.

శరణాగతికి దేశకాలనియమములు లేవు.

"ప్రపత్తికి దేశనియమమును, కాలనియమమును, ప్రకారనియమమును, అధికారినియమమును, ఫలనియమమును లేవు. విషయనియమమే కావలసినది" శ్రీవచన భూషణము.

ప్రపత్తి యనఁగా:— భగవంతుని శరణుజొచ్చుట. దేశనియమ మనఁగా, పుణ్యదేశములయందుఁ జేయవలయును. తదితర దేశములందుఁ గూడదు అనునది. కాలనియమ మనఁగా వసంతాది కాలములందుఁ జేయవలయును, తదితర కాలముల యందుఁ జేయఁగూడదు అను నియమము. ప్రకారనియమ మనఁగా, స్నానపాదప్రక్షాళనాది పూర్వకముగఁ జేయవలయును, వేఱొకవిధముగఁ జేయఁగూడదు అను నియమము. అధికారినియమ మనఁగా త్రైవర్ణికులుగానే యుండవలయును, తక్కినవారు పనికిరారు అనునది. ఫలనియమ మనఁగా, దృష్టాదృష్ట ఫలములలో నీ ఫలమున కిది సాధనము, వేఱొక్క ఫలమున కిది సాధనముగాదు అను నియమము. దేశకాలముల మంచి చెడ్డల మూలమున నొక యతిశయమునుగాని, యొక సంకోచమునుగాని పొందు నట్టిది కానందునను, నదిలో దిగి స్నానముఁ జేయఁదలంచినప్పుడు అది యపరిశుద్ధమైనదా కాదా అనెడి వివక్ష లేకుండ దిగి స్నానముఁ జేయునట్లు స్వయముగఁ బవిత్రమై ఇది పరిశుద్ధము, అది పరిశుద్ధముకాదు అనెడి వివక్ష నెంతమాత్రము చేయనక్కఱ లేకుండ తనతో సంబంధించి యుండదగి యున్నందునను, వర్ణాదుల కనుగుణమైనదై యుండునట్టిది కాకుండ స్వరూపమున కనుగుణముగా నుండునదియైనందునను, చేతనుల రుచి కనుగుణముగా నానావిధ ఫలములకు సాధనభూతమైనందునను, ఈ నియమము లేవియు దీనికి లేవు. అది యెట్లనిన: "న జాతిభేదం న కులం న లింగం న గుణక్రియాః న దేశకాలౌ నావస్థాం యోగోహ్యయమపేక్షతే, బ్రహ్మక్షత్రవిశశ్శూద్రాః స్త్రియశ్చాంతరజాతయః సర్వ ఏవ ప్రపద్యేరన్ సర్వధాతార మచ్యుతమ్" సర్వమును ధరించియుండు వాఁడగు శ్రీమన్నారాయణుని శరణుజొచ్చువిషయమున జాతిభేదముగాని, కులభేదముగాని, లింగభేదముగాని, గుణముగాని, క్రియలుగాని, దేశకాలావస్థలుగాని యావశ్యకములు గావు. బ్రాహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రజాతులవాఱందఱును, స్త్రీలును,

వీరిలో నంతర్గతము లగు నితరజాతులవారును వీరు వారనక నందఱును శరణు జొచ్చి వచ్చును.అని యిట్లు ప్రపత్తికి దేశకాలాధికారి నియమములు లేకుండుటను గుఱించి భారద్వాజ సంహితయందుఁ జెప్పఁబడినది. మఱియు"ప్రపత్తేఃక్వచిదప్యేవం పరాపేక్షా నవిద్యతే, సాహి సర్వత్ర సర్వేషాం సర్వకామఫలప్రదా" ప్రపత్తికి వేఱొక్కదాని యపేక్ష లేదు. అది సర్వకాల సర్వావస్థలయందును అందరకును అన్నికోరికలను నెర వేర్చునది. అన్ని ఫలముల నిచ్చునది. అని ప్రపత్తికి ఫలనియమము లేకుండుటను గుఱించి సనత్కుమార సంహితయందును జెప్పఁబడినది.

(సఏష ఇత్యాది) "బద్ధవైరాచ్చ పాపాచ్చ రాక్షసేంద్రా ద్విభీషణః। అదేశ కాలే సంప్రాప్తః సర్వథా శంక్యతా మయం" (రా. యు. ౧౭-౪౬.) బద్ధవైరుండును పాపియును నగు రావణాసురుని యొద్దనుండి విభీషణుండు కాలముగాని కాలమునను తావుకాని తావునను మీ యొద్దకు వచ్చియున్నాఁడు. కావున నీతని రాకను గుఱించి యనుమానింపవలసి యున్నది- అని యిట్లు జాంబవంతుఁడు శ్రీరామచంద్రునితో విన్నవింపఁగా దానిని దూషించుచు శ్రీ యాంజనేయుఁడు "అదేశకాలే సంప్రాప్త ఇత్యయం సవిభీషణః,వివక్షా చాత్ర మేఽస్తీయం తాం నిబోధ యథామతి॥సఏష దేశ కాలశ్చ భవతీహ యథాతథా,పురుషాత్పురుషం ప్రాప్యతథాదోషగుణావపి॥ దౌరా త్మ్యం రావణే దృష్ట్వా విక్రమంచ తథా త్వయి, యుక్త మాగమనం తస్య సదృశం తస్యబుద్ధితః" రావణునిచే నవమానింపఁబడి నైచ్యమును దలంచుచు శరణుజొచ్చిన శ్రీ విభీషణాళ్వారులు కాలముగాని కాలమున,తావుగాని తావున వచ్చినా రని దేవర వారి మంత్రులు ఏదో చెప్పియుండిరి. ఈ విషయమును గుఱించి నే నొక్కటి విన్న వింపవలసియున్నది. వారు ఏకాలమున, ఏదేశమున దేవరవారిని శరణు జొచ్చిరో అందుల కదియే దేశము,అందుల కదియే కాలమని యేదోయొకవిధమున నాకు తెలిసి నంతవఱకు నేను విన్నవించుదానిని కృపతో నాలకించుదురుగాక. అది యెట్లనిన తమో గుణ స్వభావుం డగుటచే పరహింసయే వృత్తినిగాఁ గలిగియుండు రావణుకంటెను సత్త్వగుణ ప్రధాను లగుటచే పరరక్షణమే వృత్తిగా గలిగియుండునట్టి దేవరవారిని ప్రాప్యులనుగాఁ దలంచియు, రావణుని విడిచిపోక పోయినట్లయిన వాని యకృత్య ములకుఁ దోడ్పడి వానికిఁగల ప్రాతికూల్యముతోఁగూడ నశించిపోవుట యనెడి దోషమును, ధార్మికులగు దేవరవారితోఁగూడ నుండినట్లయిన, అందులకు ఫలముగా దేవరవారి శ్రీపాదముల సన్నిధిని కైంకర్యము లభించి సుఖించుట యను సుగుణ మును యోజించి దేవరవారి హృదయమునకు ఎక్కువ కష్టమును గలుగఁజేయు నట్టి పాపంబులను లెస్సగాఁ జేసియున్నట్టి రావణుని దుష్టస్వభావమును, దుష్టులను అనాయాసముగ దండింపఁగల దేవరవారి పౌరుషమును యోజించినట్లయిన విశేషజ్ఞుఁ డగువాని కిట్లు చేయుటయే యుక్తము, న్యాయమార్గమున సంచరించునట్టి వాని బుద్ధికిని యిది-సరి యైనది యనికదా చెప్పియున్నాఁడు కావున నిట్టిభావశుద్ధి గల శ్రీ

విభీషణులవారు శరణుజొచ్చినట్టి దేశకాలముల మంచిచెడ్డలను గుఱించి విచారింప నక్కఱ లేదు. ఆయన వచ్చినకాలమే యందులకుఁ దగినకాల మనియు,ఆయన వచ్చిన తావే యందులకుఁ దగిన తావనియు శరణాగతి ధర్మమును గుర్తెఱింగినట్టి శ్రీ యాంజనేయులవారు నిర్ణయించుటం జేసి ప్రపత్తికి దేశకాలనియమములు లేవని యెఱుంగునది.

తే. పనిచి యజ్ఞాతరూపు లౌ♦వారి దేవ! ప్రశ్న యొనరింపఁ దగు నని♦పలుకఁ బడియె
నీ విచారంబునందు నా♦భావమునను, దోఁచు చున్నది యొక్కండు♦దోష మధిప.

అర్థములు. పనిచి = పంపి, అజ్ఞాత రూపులు = తెలియఁబడని రూపము గలవారు, మాఱు వేషములు ధరించిన వారు,(ఇది మైందుని మతము.౫౮౮ పద్యము)

తాత్పర్యము.

కొందఱ దూరముగఁ బంపి వారు మాఱువేషములతో వచ్చి విభీషణుని బ్రశ్నింప వలయు నను విషయమునందు నా కొక్క దోషము కానవచ్చుచున్నది.

చ. పరిచితిలేనివాఁ డొకఁడు ♦ ప్రశ్నలు వేయఁ గడంగినంతనే
వరమతి యైన వానికి స♦వశ్యము సందియ ముద్భవించి యే
పరుసునఁ జెప్ప నేమొ యని ♦ పల్కు సదుత్తర మీక, దానిచే
దురితము లేని మిత్రుఁడును ♦ దూషితుఁ డౌ సరిగాని ప్రశ్నలన్. ౬౫౭

అర్థములు. పరిచితి=పరిచయము, మైత్రి, వరమతి=బుద్ధిమంతుఁడు, ఏ వరుసన = ఏ విధముగ, సదుత్తరము = మంచి ప్రత్యుత్తరము, దురితము=దోషము, దూషితుఁడు = దోషిగా నెన్నబడు వాఁడు.

తాత్పర్యము.

పూర్వ పరచయములేని క్రొత్తవాఁడు తన్నుగుఱించి ప్రశ్నలు వేయఁబూనినచో బుద్ధిమంతుఁడు వానికి సదుత్తర మీయక యేమి చెప్పిన నేమో యని సందేహించి యెదుటివానికి వాస్తవము దెలియరాక, యర్థముగాక యుండునట్లు ప్రత్యుత్తర మిచ్చును. దానివలన వీఁడు సరి యైన ప్రత్యుత్తర మీయలేదు, కనుక దోషి యని ప్రశ్న లడిగెడివాఁడు తలఁచును. ఈ విధముగ సంబంధములేని వక్ర ప్రశ్నలడుగుటచే నిర్దోషికూడ దోషిగానే యెన్నఁబడును. అడిగినవారి కందఱకుఁ దన విషయము తేటతెల్లముగ విప్పిచెప్పవలయు నని నియమము లేదు. ఆప్తులకుఁ జెప్పఁ దగినవి యనాప్తులకుఁ జెప్పవచ్చునా? శత్రువులందు వారిలో వారికి భేదము పుట్టించి కొందఱఁ జీలఁదీసి మనలోఁ గలుపుకొనుటకు మనమే యత్నింపవలసి యుండఁగా వారిలో వారు కలహించి యొకపక్షమువాఁడు తానై వచ్చినను కొంటెప్రశ్నలచే వానిని నిరాకరించుటవలన మిత్రలాభము చెడిపోవును. కావున నది నీతిశాస్త్రసమ్మతము గాదు. హనుమంతుఁడు లంకలో దండనీతి నవలంబించునపుడు చేసిన యాలోచన యిదియేకదా - అది కొంతకుఁ గొంత ఫలించెను. అట్లు చెప్ప

కుండినంత మాత్రమున వాఁడు దొంగ యగునా? మైందుఁడు చెప్పినదానియందు వ్యభిచరితదోషము గలదు. ఏ కారణమువలన సరియైన కార్యము కలుగదో విపరీత ఫలము గలుగునో యద్ది వ్యభిచరితకారణము.

ఉ. మాటలఁ దాన యెంతయు స♦మర్థుఁడ నంచుఁ దలంచువాఁడు ధీ
పాటవ మేర్పడం దనదు♦భావ మెఱుంగఁగనీక పల్కు నా
మేటరి మాటకాని మది ♦ మేర నెఱుంగఁగ లేఁడు నిక్క, మ
ట్లాటఁ దదీయయుక్తియు ని♦రర్థక మంచుఁ దలంతు రాఘవా. ౬౦

తాత్పర్యము.

మాటలాడుటయందుఁ దానే నేర్పరి యని తలంచువాఁడు బుద్ధిబలముచేఁ దన భావముఁ దెలియనీక పలుకు వాని వాస్తవాభిప్రాయ మెఱుంగ లేఁడు. కుట్రప్రశ్నలకు బుద్ధిమంతుఁడు కుట్రప్రత్యుత్తరములే యిచ్చును. అప్పుడు వాస్తవాభిప్రాయ మేమో తెలియరాదు. కాబట్టి యీ యుక్తియు వ్యర్థ మనియే నా యభిప్రాయము.

ఉ. ఆతఁడు మాటలాడు నెడ ♦ నారసి చూచిన దుష్టభావతా
రీతియు నేని దోఁపదు గ♦రిష్ఠగుణాఢ్య! ప్రసన్నమౌ ముఖం
బీ తఱి నంచకుం డిటుల ♦ యెంతయు నిబ్బర మూని రాఁడు శం
కాతురవృత్తి లేక, నుడిఁ ♦ గానఁగరా దొక దోష మేనియుఁ. ౬౧

అర్థములు. దుష్టభావ రీతి = దురభిప్రాయము గల వాని విధము, తోఁపదు = కానరాదు, గరిష్ఠగుణాఢ్య = మిగుల గొప్ప దగు గుణసంపత్తి గలవాఁడా! శంకాతుర వృత్తి లేక=సందేహము భయము లేక, నుడిన్ = మాటలయందు, ఎదుటి వాని చిత్తవృత్తి తెలిసికొనుటకు శాస్త్రములందు - ఇంగితము - ఆకారము-చేష్ట - భాష యను నాలు గుపాయములు చెప్పఁబడెను. మాట లాడుట యందు దుష్టభావము గాన రాలే దనుటచే నింగితము, ముఖము ప్రసన్న మనుటచే నాకారము. నిబ్బరముగ=నిస్సందేహముగ, నిర్భయముగా వచ్చినా డనుటచేఁ జేష్టయును, నుడి దోషము కానరా దనుటచే భాషయు శుద్ధ మని చెప్పఁబడెను.

ఇతరులు చెప్పినవాని యందు దోషములు చెప్పితివే నీ యభిప్రాయ మే మందువా? చెప్పెద నని హనుమంతుఁడు తన యభిప్రాయము చెప్పుచున్నాఁడు.

తాత్పర్యము.

ఎదుటి వాని మనశ్శుద్ధి తెలిసికొనుటకు శాస్త్రములందు నాలు గుపాయములు చెప్పఁబడెను. అవి ఇంగితము - ఆకారము - చేష్ట - భాష యనునవి. వీఁడు మాటలాడు నపుడు వీఁడు దుష్టభావము గలవాఁడు కాఁడని యింగితము తెల్పుచున్నది. ముఖము ప్రసన్నమై వికారములు లేకుండుటచే ఆకారము శుద్ధమని యేర్పడు చున్నది. మోసగాఁడు నిబ్బరముగ జంకు గొంకు భయము లేక రాఁడు, వీఁడు వచ్చినాఁడు, కావున చేష్ట శుద్ధ మని యేర్పడు చున్నది. మాటలయందుఁ దడఁబాటు పూర్వోత్తర

విరుద్ధములు సందిగ్ధములు గలవా యనిన నవి లేవు. కావున భాషాశుద్ధి గలదు. కావున వీఁడు నిర్దోషి యనియే నా యభిప్రాయము.

క. ఏ విధి గోరిన రూపం, బా విధి మార్చుఁ గొనవచ్చు ♦ సంతర్గత మా
భావంబు దాఁప శక్యమె? భావంబును బయలు పుచ్చు ♦ వదనం బెటులేఁ. ౩౬౦

తా త్ప ర్య ము.

నీ వింగితము, ఆకారము ప్రబల ప్రమాణములుగాఁ జెప్పుచున్నావే, భావ మొక విధముగా నుండిన ముఖనయనాదులు మఱియొక విధముగ నుండ రాదా యందు రేమో. వాఁడు వాఁడు కోరినట్లు వేషమును మార్చవచ్చును గాని లోపలనుండు భావము బయట పడకుండ దాఁప సాధ్యపడదు. లోపలి భావమును ముఖ మే విధముగ నైన బయలు పఱుచుచుండును. (Face is the index of mind) అనఁగా ముఖము మనస్సుయొక్క విషయసూచిక యని సామెత గలదు.

ఉ. కావున సందేయింపఁ దగు ♦ కారణ మేదియు లేదు, వీని స
ద్భావముసన్ గ్రహింపఁ దగుఁ ♦ బార్థివసత్తమ! దేశకాలముల్
భావనచేసి కార్యమును ♦ బాగుగఁ జేసినఁ దత్ఫలంబు పెం
పొ వహిఁ నైశ మబ్బు, మహి♦తాత్మక! నీకు వచించువాఁడనే. ౩౬౧

అర్థములు. సద్భావమునన్ = మంచి యభిప్రాయముతో, దగ్గఱఁ జేర్చుకొనుట గీడు చేయునేమో యను సందేహము లేక, భావన చేసి = ఆలోచించి, పెంపు + ఓ + వహిన్ = వృద్ధిపొందు విధముగ, నైశము = శీఘ్రముగ.

తా త్ప ర్య ము.

ఈ కారణములచే వీఁడు దుష్టుఁ డని సందేహింప హేతువు కానరాలేదు. మంచి యభిప్రాయముతోనే చేరదీయవచ్చును. దేశము కాలము నాలోచించి కార్యమును జక్కఁగఁ జేసినచో ఫలముకూడ త్వరగానే వృద్ధిచెందును. వీనిని నిరసింపక చేర్చుకొనిన మేలుఫలము కనఁబడునుగాని కనఁబడకపోదు. మహాత్మా! నీకుఁ జెప్పగలవాఁడనా నేను?

ఉ. నీ మహితోద్యమంబు రజ♦నీచర నాయకు దుర్నయంబు సు
త్రామసుతున్ వధించి కపి♦రాజ్యము భాస్కరసూతి కిచ్చుటల్
తా మును విన్నవాఁ డగుటఁ ♦ దానును రాజ్యము వేఁడుపొంటె నీ
తామహిపేశ! నీ యెడకుఁ ♦ దారసిలెం గ్మతిపూర్వకంబుగన్. ౩౬౨

అర్థములు. నీ మహితోద్యమంబు = నీ గొప్ప ప్రయత్నము, వాలినిఁ జంపుట, యింతసేన గూర్చుట, దండెత్తి వచ్చుట, సముద్రము దాఁట యత్నించుట యను ప్రయత్నము. దుర్నయంబు = దుర్నీతి, సుత్రామసుతున్ = వాలిని, భాస్కరసూతికి = సుగ్రీవునకు, వేఁడుపొంటె = ప్రార్థించుకొఱకు, తారసిలెన్ = వచ్చెను, మతిపూర్వ

కంబుగ్రీ = నిండు మనస్సుతో, ఇది రావణుఁడు పంపఁగా వచ్చినవాఁడు కాఁడని తెలుపుచున్నది.

తాత్పర్యము.

హనుమంతా! 'ప్రయోజన మనుద్దిశ్య న మందోపి ప్రవర్తతే' ప్రయోజనము నుద్దేశింపక మందుఁడుకూడ నొక కార్యముఁ జేయఁడుకదా! వీఁడు బుద్ధిమంతుఁ డని నీవు చెప్పుచున్నావే - వీఁడు ప్రయోజన ముద్దేశింపక వచ్చియుండఁడుకదా - ఆ యుద్దేశ్య మేది యని నీ యభిప్రాయము. రావణాసురుఁడు చంపు నను భయముచే ప్రాణము కాపాడుకొనుటకై వచ్చెనా? ఎక్కడ నిలువ నీడలేక కొన్నాళ్లిచ్చట నుంద మని వచ్చెనా? నీ యభిప్రాయ మేమందువా? నీవు చేయుచుండు గొప్ప ప్రయత్నము రావణుఁడు సీతాహరణాది నీతిమాలిన కృత్యంబులు చేయుట చూచి నీచే రావణుఁడు చచ్చు నని నిశ్చయించి నీవు పూర్వము దుర్నీతిపరుఁ డగు వాలిని జంపి సుగ్రీవునకు రాజ్య మిచ్చినట్లు విన్నవాఁ డగుటచే నీవు రావణు జంపి రాజ్యమును దన కిమ్మని ప్రార్థించుటకై బుద్ధిపూర్వకముగ నీ యొద్దకు వచ్చె నని నా యభిప్రాయము.

ఇది హనుమంతుని యూహ. వాస్తవము హనుమంతునికిఁ దెలియదు. సీతాదేవి ప్రశ్నలకు సముచితముగ నమ్మఁదగిన విధముగఁ బ్రత్యుత్తరము లిచ్చినట్లు రామచంద్రమూర్తికిని నుండిన నుండవచ్చు నని నమ్మఁదగిన కారణము చెప్పెను. విభీషణు నభిప్రాయ మదియేని నీకు సాహాయ్యము చేసెదను, నాకు రాజ్య మిమ్మని విభీషణుఁడు బేరము పెట్టను లేదు. వెనుకనైన వేఁడను లేదు.

తే. దీని నంతయు యోజించి • వీని సాధు,గుణముఁ బల్కితి నా శక్తి•కొలఁది రామ
బుద్ధిమంతులలో నుత్త•ముఁడవు నీవు, శేషకార్యంబు నీవ యో•జింపవయ్య. ౩౬.౩

తాత్పర్యము.

ఈ విషయము లన్నియు నా బుద్ధిబలము కొలఁది నాలోచించి వీఁడు సాధు వర్తనము గలవాఁడని చెప్పితిని - నీవు బుద్ధిమంతులలో నుత్తముఁడవు. ఇఁకఁ జేయవలసిన కార్యము వీనిని జేర్చుకొనుటో విడుచుటో నీవే యాలోచింపుము.

అంగదాదుల వాక్యమువలన నూతనాశ్రితునియందుఁ బ్రాఁతవారి (భాగవతుల) యభిప్రాయ మిట్టిదై యుండునని చెప్పఁబడెను.

హనుమంతుని వాక్యములవలన నాచార్య పరతంత్రుఁడై యుండువాఁడైనన నూతనముగ వచ్చిన యాశ్రితునియందుఁ దన తోడివారికి సందేహము కలిగె నేని భగవత్ప్రేమాతిశయమువలన న య్యాశ్రితుని పక్షము వహించి మాటలాడుటయే యాచార్యునకుఁ బ్రీతిజనకం బగు నని యేర్పడుచున్నది.

### ౧౮-వ సర్గము. శ్రీరాముఁడు కపులతో విభీషణుఁడు గ్రాహ్యుఁడని చెప్పుట.

ఉ. మారుతపుత్రుఁ డాడిన స◆మంజససూక్తుల నాలకించి దు
ర్వారమతిన్ సువిశ్రుతుఁడు ◆ రామవిభుండు ప్రసన్నచిత్తుఁడై
వారలతో నిజాశయముఁ ◆ బల్కె. వినుండు హితేచ్ఛ లౌటచేఁ
గోరెద నీ విభీషణుని◆గూర్చి వచింపఁగఁ గొంత నేనునున్. ౩౬.౪

అర్థములు. సమంజస సూక్తులన్ = న్యాయముతోఁ గూడిన మంచి మాటలు, హనుమంతుఁడు చెప్పినవి సమంజస సూక్తులనుటచేఁ దక్కినవారు చెప్పినవి సమంజసములు గావు. సూక్తులు గావని భావము. శరణాగతుని ద్రోచిపుచ్చు మనుట సమంజసము గాదు. నిర్దోషిని దోషి యని దూషించుట సూక్తియుఁ గాదు. దుర్వారమతిన్ = అడ్డగింపరాని మనస్సుతో, వసిష్ఠాదులైన పెద్దల వలనఁ గపోతోపాఖ్యానము కండూపాఖ్యానము, శిబి చరిత్రమును ఈ మొదలైనవి విన్నవాఁ డగుటచే శరణాగతుని విషయమున నడవడియందు దృఢపడిన మనస్సుగలవాఁడై సుగ్రీవాదుల మాటలకుఁ గలఁతఁ జెందిన మనస్సుగలవాడు కాఁ డయ్యెనని భావము, సువిశ్రుతుఁడు = చక్కని వినికిడి గలవాఁడు, ప్రసన్నచిత్తుఁడై = నిర్మలమైన మనస్సు గలవాఁడై, సుగ్రీవుడు మొదలు మైందునివఱకు నంద ఱేకవాక్యముగ విభీషణునికిఁ బ్రతికూలముగఁ జెప్పినవారే. వారి మాటలు విన్నప్పుడు ఏమిరా! వీరందఱు నా యభిప్రాయమునకు విరోధముగఁ జెప్పుచున్నారే, ఇది కాదనిన వీరి కందఱకుఁ గోపము వచ్చునో, అంతఃకలహము లే పుట్టునో యని వ్యాకులపాటు గలవాఁ డగుటచే ముఖము ప్రసన్నముగా లేదు. హనుమంతుఁడు చెప్పిన పిమ్మట నొకఁడైన ననుకూలముగఁ జెప్పెఁగదా యని ప్రసన్నుఁ డయ్యెనని భావము. నిజాశయము=తన యభిప్రాయము, హితేచ్ఛలౌటచేన్= నా మేలుగోరిన వార లగుటచే, ఇది తాను జెప్పఁబోవు వానివలన వానరులకుఁ గోపము రాకుండుటకై చెప్పిన శాంతివాక్యము, నేనునున్ = నేనుగూడ, మీ రందఱు ఎట్లు చెప్పితిరో యట్లనే నేను గూడ నా యభిప్రాయముఁ జెప్పెదను.

తాత్పర్యము.

ఆంజనేయుఁడు చెప్పిన న్యాయముతోఁ గూడిన మంచిమాటలు విని యిట్టి సందర్భములందు శాస్త్రము లేమి చెప్పుచున్నవో, పూర్వు లెట్లు లాచరించిరో యది వసిష్ఠాది వృద్ధులవలన విన్నవాఁడై చేయవలసిన పని నిశ్చయించుకొన్న రామచంద్రమూర్తి ప్రసన్నమైన మనస్సు గలవాఁడై వానరులతో నిట్లనియె. మిత్రులారా, మీ రందఱు నా మేలు గోరువారు. మీ మీ యభిప్రాయములఁ దెలిపితిరి. విభీషణుని గుఱించి నా యభిప్రాయమును నేను దెలిపెదను. అది మీరు విని యేది బాగని మనము నిర్ణయించెదమో యా ప్రకారమే చేసెదను.

తే మైత్రి భావించి తాన సంప్రాప్తుఁ డైన, వాని నెపు డేని చేపీడు వాఁడఁ గాను
వానియెడ నుండె నేని నేం దేని దోష, మద్ది గర్హ్యంబు గాదు సంద్భాళులకును.

**తా త్ప ర్య ము.**

ఇట్లు మంత్రులతో మంచిమాటలాడి తన కొక్క స్వభావసిద్ధమైన గుణ మున్నదని చెప్పుచుఁ దన్మూలమున విభీషణుని గుఱించి స్వాభిప్రాయమును సహేతుకముగా వెలిఁబుచ్చుచున్నాఁడు.

విభీషణుఁడు దుష్టుఁడు కాఁబట్టి యంగీకరింప రాదని సుగ్రీవాదులు చెప్పిరి. వారు చెప్పిన వానిలో హేతువును సాధ్యమును రెండును సరిగావు. విభీషణుఁడు నిర్దోషి కాన నంగీకార్యుఁడే యని హనుమంతుని యభిప్రాయము. దీని యందు సాధ్యము మాత్రము సరిగాని హేతువు సరిగాదు. కాఁబట్టి శరణన్న వానిని రక్షింపవలె ననుటయే సహేతుకమై యుక్తమైన మాట. ఈకడపటి యభిప్రాయమునందు విభీషణాంగీకారము సాధ్యాంశము. ఇది యబాధితమైనది. శరణుఁజొచ్చుట హేతువు. దీనికి స్వరూపాసిద్ధ్యాది దోషములు లేవు. అట్టి యీ హేతువునే మైత్రి భావించి యను వాక్యమునందుఁ జెప్పుచున్నాఁడు. మైత్రి భావించి=వాస్తవ మిత్రత్వము లేకున్నను మిత్రనటన మాత్ర మున్నను జాలునని యర్థము. "శరణవరణవాగియం యోదితా సభవతి బత సాపి ధీపూర్వికా" యను పెద్దల మాట యుందుఁ బ్రమాణము. భావశబ్దము నకు లీల యనియు నర్థము గలదు. "భావో విద్వల్లీలా స్వభావేషు భూత్యభిప్రాయ జంతుషు" నానా॥ ర॥ కావున భావించి యనఁగా నటించి యని యర్థము. ఈ ప్రకరణమునందు మొదట రామచంద్రునిన్ శరణము జొచ్చినాడ నని యుండుట చేతను నిను శరణంబుజొచ్చితి నని పైని జెప్పఁబోవుటచేతను, నీనడుమనున్న యీ మైత్రిశబ్దము శరణాగతినే తెలుపు నని యెఱుఁగునది. ఇట్లే సుందరకాండమునందును రామునితోఁ జెలిమి కోరుము యని చెలిమి శబ్దముతో నుపక్రమించి శరణాగత వత్సలుఁ డౌట నని శరణాగతి శబ్దముచే నుపసంహారము చేసియున్నది. ఇచ్చటను నుపసంహారానుగుణముగను నితర హేతువును బట్టియు నుపక్రమములో నున్న మైత్రిశబ్దము శరణాగతి పరమే యనియుఁ దెలియునది. లేదా యీం చేయునట్టి కార్యము ఆశ్రయించు వానికి శరణాగతిగాఁ దోఁచినను నట్లు లాశ్రయించిన వానిని గనఁబోపు చూచుకొనెడి భగవంతుని యభిప్రాయమున కది మైత్రిగనే తోఁచును. కాఁబట్టి మైత్రి యని చెప్పెనని యైనను జెప్పవచ్చును. (2) మైత్రిక=స్నేహము. అద్వేషాభిముఖ్యములను భావించి మమ్ము నాశ్రయించువానికి అద్వేషాభిముఖ్యములే చాలును. ఇంతమాత్రమునకే మే మతని సంగీకరింతుము. ఇందుకై పరిపూర్ణభక్తియు ననపసరము. అది లేకున్నను దప్పు లేదని భావము. "త్వాం మామనంతి కవయః కరుణామృతాబ్ధే, జ్ఞానక్రియాభజన లభ్య మలభ్య మన్యైః। ఏతేషు కేన వరదోత్తరకోసలస్థాః పూర్వం సదూర్వ మభజంత హి జంతవ స్త్వా" మ్మను పెద్దలవాక్య మీం యర్థమునందుఁ బ్రమాణము.

(3) మైత్రీ=సుహృదం సర్వభూతానా మ్మని శాస్త్రములందు జెప్పియున్నట్లు నాకు జనులపై నున్న స్నేహమును భావించి యిట్టి భగవంతుని స్నేహము మనకును గార్య కారి యగు నని గదా యని యెంచి (4) మైత్రి భావించి=ఆనుకూల్య సంకల్పాదులం గలిగియుండి (5) మైత్రీ = మితాత్ + త్రాయతే మిత్ర మ్మని వ్యుత్పత్తి. ఒకఁడు తనకుఁ జేసిన యుపకారమును దన మనస్సున నిది యింతగదా యని నిర్ణయించి చూచి దానికిఁ దగినట్లు వానికిఁ బ్రత్యుపకారము చేయువాఁడే మిత్రము. అట్టి వానిగుణము మైత్రి. అనఁగా నీశ్వరుఁడు తనకుఁ జేయు నుపకారమునకుఁ దగినట్లు ఈశ్వరునికిఁ బ్రత్యుపకారము చేయుటయే యిచ్చట మైత్రి. భావించి= నల్గి (6) మైత్రీ=సన్ముఖమును. 'సన్ముఖం యాతి విశ్వాస'యను వాక్య మిందుకుఁ బ్రమాణము. భావించి=చెంద" త్యాదిత్యాది."(1) త్రా + అసంప్రాప్తుఁడైన వానికి అనుపపచ్ఛేదము. భగవంతు నాశ్రయించువాఁడు తా నున్న చోటనుండి శరణాగతి చేసినను జాలును. భగవంతుఁ డున్న చోటికిఁ బోనక్కఱ లేదని భావము. (2) త్రాన+సంప్రాప్తుఁడైన వానికి, అనియుఁ బదచ్ఛేదము. తానున్న చోటనుండియే భగవంతు నెడ నద్వేషాభి ముఖ్యములు చూపినవానిని "శ్రీ రేవాహి మమాతులా" యన్నట్లు నేనే వెదకుకొని వానియింటికిఁ బోయి రక్షించుచుండఁగా వాఁడే నా స్థలమునకు వచ్చి శరణన్న పిదప నే నెట్లు వదలవచ్చు నని భావము. (3) సంప్రాప్తుఁడు=చెప్పులను గుడివెలుపల విడిచి పెట్టి లోనఁబోయి దేవుని గన్నులతోఁ జూచుచు జెప్పులను ధ్యానించువానివలెఁ గాక యితర వస్తువులం దపేక్ష యే పెట్టక "నెయ్యార లంక సిరిం ద్యజించితి"నని యితర విషయ వైరాగ్యపూర్వకముగ వచ్చినవాఁడు. (4) "మాతా పితా భ్రాతా నివాస శ్శరణం సుహృద్గతి ర్నారాయణః" యన్నట్లు నన్నే సకలవిధబంధువులుగ నెంచి వచ్చినవాఁడు. (5) నా యంతరంగుల న మిమ్ముఁ బురుషకారముగా జేసికొని వచ్చినవాఁడు. (6) త్రానసంప్రాప్తుఁడు = లంకలోనుండి శ్రీరాముని నేను శరణు జొచ్చినాఁడనని చెప్పనేని వీనిని రక్షించుటకై నేను "అతంద్రిత చమూపతి ప్రహిత హస్త" మన్నట్లు యిచ్చటినుండి పరుగెత్తి పోవలసి యుండును. అట్లుగాక తానై మనయొద్దకు వచ్చి శరణు జొచ్చుట గంగానది కుంటివానిపై తానై వచ్చి పడిన ట్లున్నది. ఇంత మనకు లాభము చేసినవాని నెట్లు వదలవచ్చు నని భావము. (7) వీఁడు నా యొద్దకు వచ్చినంతమాత్రముననే వీనిని నేను తప్పక రక్షింతును. వీఁ డంత మాత్రముతో నిలువక మానసిక, వాచిక, కాయిక, రూపమైన పరిపూర్ణ ప్రాప్తినే చేసినాఁడు. ఇట్టివాని నెట్లు వదలవచ్చు నని భావము. ఈ యర్థములు సంప్రాప్త శబ్దముతో సం అను దానివల్ల నేర్పడినవి. ఎట్లైనఁ జేవిడువాఁడఁ గాను. (1) నాకు వీనిని వదలుటకు శక్తి లేదు. నేను సర్వ శక్తుఁడనై యుండియు శరణని చెప్పిన వాని మాత్రము వదలుటకు శక్తి లేని వాఁడనై యున్నానని భావము. (2) సంప్రాప్తుఁడైన వానినిఁ జేవిడువాఁడఁగాను. "శరణాగతస్య మాలిన్యం

వృషశ్శైలేశ కృషీవలం ధినోతి" యని పెద్దలన్నట్లు ఎవఁడైనను నన్ను రక్షింప రావయ్యా యని పిలుచునా యని నే నెదురుచూచుచుండఁగా తానై నన్ను వెదకికొనివచ్చి నన్నురక్షింపవయ్యా యని వేఁడుచున్న ఈ విభీషణుని నేనెట్లు వదలుదు నని భావము. (3)చేపీడు వాఁడఁగాను- వీని సంబంధమును బట్టి రావణాదులనుగూడ నేను రక్షింపవలెనని యుండఁగా వీనినే వదలుట యెట్లు సంభవించును. ఇందువలన నేకదా ఘంటాకర్ణునికి మోక్ష మిచ్చునపుడు వాని తమ్మునికిఁగూడ మోక్ష మిచ్చుటయు, మాలాకారునిఁ గటాక్షించునపుడు వాని సంతతివారల కందఱకును దీర్ఘాయుస్సు కలుగునట్లు లాశీర్వదించుటయు నచ్చటచ్చటఁజెప్పియున్నవి. (4)చేపీడువాఁడఁగాను=వీనిని త్యజింపవలె నని యాలోచనయు నాకు లేదని భావము. వీనినిఁ ద్యజింపవలెనని యాలోచన నాకుఁ గల్గెనేని యాయుత్తరక్షణముననే నా సత్తకే హానిశటస్థించును. కాఁబట్టి వీనిని ద్యజింపవలె ననెడి యాలోచనమాత్రము నాకు లేదు. అట్టి యాలోచనయే లేనప్పుడు ఏకారణమును బట్టి వీనిని వదలుదమా యని కారణాకాంక్షయే నాకు సంభవింప నేరదని భావము. శరణాగతుఁడైన వీనిని త్యజింపవలె నని యాలోచించినపుడు మీకు సత్తాహాని కలుగు నని వీని నంగీకరించుటయే యుత్తమమని మీకుఁ దోఁచినయెడల వీని నంగీకరించి తన్మూలమున వీని దౌష్ట్యముచే మీకే ప్రాణహాని సంభవించినయెడల త్వదేకాధారకులైన మాకు సత్తాహాని కలుగు నని పాటించి మాకై వీనిని వదలిపెట్టవలసినదే యను వానరుల యాక్షేపమునకు సమాధానము. ఎటులైనను (1) ఈనినయావు అప్పటి దూడపై వాత్సల్యముచేత దానికి పెద్దదూడను గసరునట్లు వీనికై మిమ్మునను గూడ వదలవలసి వచ్చెనేని యటులఁ జేయుదు నని భావము. 'అప్యహం జీవితం జహ్యాం' మ్మనిగదా నా స్వభావము. (2) సర్వదేశ సర్వకాల సర్వావస్థలందు నైనను (3) శరణాగతునియందు గుణములు లేకున్నను, అంతియకాక వానియందు దోషములు మెండుగ నున్నను, అట్టి వానిని నంగీకరించుట యందఱు నిరసింతురైయున్నను, తన్మూలమున దృష్టాదృష్టములందు నాకుఁ బెక్కు కీడులు సంభవింపనున్నను, నాకే ప్రాణహాని సంభవింప నున్నను గూడ నేను వీనిని వదల నని భావము.

ఇంతేకాక వానియెడ నేదేని దోష ముండెనేని (1)నా యభిప్రాయప్రకారము వీనియందుఁ దప్పులే లేవు. అస్థానభయశంకులైన మీకు వీనియందుఁ దప్పున్నట్లు తోఁచినను అట్టి తప్పును నేనంగీకరించెదను. వాత్సల్యగుణ పరిపూర్ణుఁడైన నాకు నాశ్రితుని తప్పులు క్షమించి వానిని మనస్సునకే రాకుండ చేసికొనుటయేగదా నాయందున్న వాత్సల్యము. (2) రాజకుమారుఁడు సుకుమారుఁ డయ్యును సువాసనయైన కురువేరు మున్నగు వేళ్ళ ననుభవించునపుడు వాని యందలి మట్టి ననుభవించునట్టులే కొంచెము మట్టి యున్నను ఆ కారణమున దానిని వదలనటుఁ దలంచె నని భావము. (3) దోష ముండెనేని —— శరణాగతునియందు దోషమే

యుండదు. "యద్వైకతూల మగ్నౌ ప్రోతం ప్రదూయేత ఏవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే" యని శ్రుతి చెప్పినట్లు శరణాగతి చేసినవాని కే దోషము నంటదని భావము. (4) ఏదేని దోష ముండెనేని యది వానియెడ=వానిదిగదా! శరణాగతి యను గొప్ప గుణముగల వానియొద్ద నున్న దోష మెంతమాత్రమును గర్హ్యము కానేరదు. భగవంతుఁడు ప్రపన్నుని దోషమును భోగ్య వస్తువుగా గ్రహించునని యొక మతమువారు చెప్పుదురు. దీనికి వారు చెప్పెడి దృష్టాంతములు (౧) ఆవు దూడ నీనఁగానే దాని దేహమునందలి మురికికి నాకుట (౨) రాజ కుమారుఁడు కురువేసులో నైన వెళ్ళు శిరస్సున ధరించునపుడు దానిలో నుండు మట్టినిగూడ ధరించుట. మఱియొక మతమువారి నిదర్శనములు భగవంతుఁడు దోషమును భోగ్యవస్తువుగా గ్రహించు నని చెప్పుటయందు సమర్థములు గా వందురు. ఏలనః— ఆవు లేదూడ దేహమును నాకునపుడు ఆ మురికి భోగ్యవస్తు వని యాశచే నాకుట లేదు. తన బిడ్డయందలి మురికికి పోఁగొట్టులే దాని యుద్దేశము. ఆ మురికియున్న కారణముచే బిడ్డను విడనాడదు. అట్టులే రాజకుమారుఁడు కురువేరు ధరించునపుడు అందలిమట్టి భోగ్యవస్తువనియూ నెత్తిపైన బెట్టుకొనును. ఆ మట్టిని అలక్ష్యము చేసి ఆ కారణమున వదలక కురువేరు ధరించును. ననగూఁడి నార తల కెక్కిన దన్నట్లు పూలతోడ దారమునుశిరసున ధరించువారు అది భోగ్యవస్తువని యూ ధరించుచున్నారు? కావునభగవంతుఁడు ప్రపన్నుల దోషము లక్ష్యము చేయనివాఁడై ఆ దోష కారణమున వానిని రక్షింపక విడువఁ డని మఱికొందఱ యభిప్రాయము. రామచంద్ర వాక్యము రెండవ యభిప్రాయమును బలపఱచుచున్నది. శరణాగతుని దోషము గ్రాహ్యము కాదని చెప్పనేకాని గ్రాహ్య మని చెప్పలేదు. దోషము చెప్పుటకే దోషములే. అవి సుకృతములు గావు. సీతారాము లసత్య మాడిరి. లేని యసత్యము లైనను "పంచానృతా న్యాహు రపాతకాని" యని వానివలన పాపము లేదని చెప్పఁబడెను, కాని సుకృతములు గావున గ్రాహ్యము లని చెప్పఁబడ లేదు. చంద్రునియందలి కిలంకము కలంకము గాకపోదు. ఆ కారణమునఁ జంద్రుఁడు నింద్యుఁడుకాఁడు. (5) వానియెడ నిత్యాది-ఉండ నిమ్మని శేషము. గుణవంతుని రక్షించినపుడు నాకంతగాఁ గీర్తి లేదు. పరమదోషిని రక్షించినపుడేగదా నాకుఁ గీర్తి కలుగును.కాఁబట్టి శరణాగతునియందు దోషము నాకుఁ బ్రసిద్ధియమే యని భావము. (6)వానియెడ నిత్యాది-ఏదేని దోష ముండెనేని, నాకును బ్రాణాపాయకర మైన కార్య మేదైన నుండినను అనఁగా వీఁడు నా యొద్దనుండి నన్ను వేగముగాఁ జంపనెంచి శరణాగతుఁడు కానిచో నా యొద్దఁ జేరుట సంభవింపదని తలఁచి యందుల కైన నన్ను శరణుఁ జొచ్చినను, వాని యెడ నుండ నిమ్ము. తన్మూలమున వాని కైనను సుఖము కలుగును గదా. అదియే నా కపేక్షితము అని భావము. ఈ యోజనను రాఁ గల కపోతోపాఖ్యానమును జూచియు తదనుసారిగాఁ బెద్దలు చెప్పిరి. (1) ఇ దంత ఘనకార్యమై యుండఁగా గొప్ప

గొప్ప మీ మంత్రులే దీనిని దూషించుటకుఁ గారణ మేమి యనఁగా నుత్తరము చెప్పుచున్నాఁడు - అర్ద్ది యిత్యాది - అర్ద్ది=ఆశ్రితునిదోషము, సత్ + ఆళులకు= గొప్పవారి సమూహమునకు, గర్హ్యంబు = నింద్యము; కాదు. మా యందలి ప్రేమాతిశయముచేత నిష్కారణ భీతులై యున్న యీ మంత్రులవంటి వారి కది తప్పుగాఁ దోఁచినను గపోతము వంటివారి కది నింద్యమే కాదని భావము. (2) ఈదుష్టు సంగీకరించుటచే మీ కేమైన నొకపురుషార్థము రాఁ గలదా? లేక యే దైనఁ గొంత పాపక్షయము కలుగఁ గలదా. లేక వీని సంగీకరింపని యెడల నే దైన ప్రత్యవాయము వచ్చునా ? ఏదియు లేదు. అట్లుండ వీనిని నే లాభమును బట్టి యంగీకరింపఁ దలంచి యున్నాననుట కుత్తరము చెప్పుచున్నాఁడు. అర్ద్ది యిత్యాది, అర్ద్ది = దుష్టుని రక్షించుట. సదాళులకుఁ = తమ ప్రాణములను దీయ వచ్చిన వానిని గూడ రక్షించిన కపోతాదులకుఁ, గర్హ్యంబుగాదు=నింద్యము గాదు, కపోతాదుల వంటివారి సద్గోష్ఠియందు నాకు నింద లేకుండుటకై నేను వీనిని రక్షించెదనే గాని వేఱు ఫలము లేదని భావము. (3) దుష్టులను రక్షించిన వారిని శిష్టు లెప్పుడు గర్హింంతురు. అంతియ కాక యీ కార్యము శాస్త్ర విరుద్ధము. ఇట్లుండ నీ కార్యమును నీవు చేయుట తప్పని వారు లాక్షేపింపఁగా నుత్తరము జెప్పుచున్నాఁడు. అర్ద్ది యిత్యాది- అర్ద్ది = దుష్టుఁడు శరణాన్న మాత్రాన వాని సంగీకరించుట. స దాళులకును = ఇది సామాన్యశాస్త్రము, ఇది విశేషశాస్త్ర మను జ్ఞానము కలవారికి, గర్హ్యంబు కాదు = నిందింపఁ దగినది కాదు. సామాన్య శాస్త్రములందు దుష్టుని రక్షింప రా దని యున్నను "తస్మాదపి వధ్యం ప్రపన్నం నప్రతిప్రయచ్ఛంతి" యని విశేష శాస్త్ర ముండుటం బట్టి సామాన్య విశేష శాస్త్రజ్ఞానము గల పెద్దలు, శరణాగతుఁడు కాని దుష్టుని రక్షింప రాదని సామాన్యశాస్త్రములకును, ఎంత దుష్టుఁ డైనను శరణాగతుఁ డైన వాఁ డప్పక రక్షింప వలసినదే యని విశేష శాస్త్రములకును నర్థము వర్ణించి యున్నారు. కాఁబట్టి నే నీ శరణాగతుని రక్షించిన యెడల నాకు సామాన్యవిశేషశాస్త్ర తాత్పర్య ముపదేశించిన వశిష్ఠ విశ్వామిత్రాదులైన పెద్దలు వారి యుపదేశానుసారము అనుష్ఠించి నందులకు నన్ను శ్లాఘింతురే గాని యే మాత్రమును దూషింపరు. ఇందు శాస్త్రవిరోధమును లేదని భావము.సర్వశక్తుఁడై యున్న భగవంతునికి శరణాగతులఁదోసివేయఁ జాలనట్టి యొక్క యశక్తి యున్నదనియు సర్వజ్ఞుఁడై యున్నను భగవంతునికి శరణాగతుని ద్రోచివేయు నుపాయజ్ఞానము శ్రీరామునందు లేకుండుటచేఁ గొంచె మజ్ఞానము గల దని గోవిందయతి యభిప్రాయము. నీవు శత్రువు తమ్ముఁడవు గావున నిన్ను నేను రక్షింపనని చెప్పుట కే యుపాయము తెలియవలెను ? నిరాకరించియుండిన నీతి హీనుఁ డని లోకము నిందించి యుండదు. కాని శరణాగతరక్షణపరతంత్రు లగు మహాత్ములు తప్పక నిందించి యుందురు. శ్రీరామచంద్రమూర్తి విభీషణు నిరాక

రింపకుండుటకు భయార్తుఁడై వచ్చిన వానియందలి దయయు శరణాగత రక్షావ్రతము కారణములు.

అహ మస్మ్యపరాధానా మాలయో௨ కించనో௨గతిః
త్వమేవోపాయభూతో మే, భవేతి ప్రార్థనామతిః॥ శరణాగతిః॥

౧. నేను సమస్తాపరాధములను జేసినవాఁడను అని తా నంతవఱకుఁ జేసిన దోషముల నెఱిఁగి వానికై నిర్వేదపడుట.

౨. అకించనుఁడు=భగవత్ప్రాప్తిసాధనధనము కొంచెమైనను లేని దరిద్రుఁడు.

3. అగతి = భగవంతుఁడుతప్ప మఱియొక రక్షకుఁడును, భగవత్ప్రాప్తిదప్ప వేఱొక ప్రాప్తియు, భగవంతుఁడు తప్ప భగవత్ప్రాప్తికి వేఱొక యుపాయమును లేనివాఁడు.

౪. నీవే నా కుపాయము గమ్ము అని ప్రార్థించు మనస్సు.

౫. దీనిని దేవుని సన్నిధానమునందుఁ జేయవలయును.

ఇట్లు చేయువాఁడుగదా శరణాగతి కర్హుఁడు. విభీషణునం దీ గుణములు కలవా? కలవు.

రాక్షసుఁడును దుర్వృత్తుఁడు రాక్షసకులనాథుఁడైన రావణునకు నే సాక్షాదనుజుఁడ నని చెప్పుటచేత రాక్షసుఁడు కావున జన్మమువలన వచ్చిన దోషము, దుర్వృత్తుఁడైన రాక్షసనాథునకు భృత్యుఁడుగా నుండుటచే సాంగత్యదోషము, రావణునకు ననుజుఁడ ననుటచే సంబంధదోషము తనయందుఁ గలఁదని చెప్పినవాఁ డయ్యెను. భార్యను బిడ్డలను లంకను సిరిని సర్వము త్యజించితి ననుటచే, తన్ను రక్షింపఁ గలవారెవ్వరు లే రనుటచే ఆకించన్యము చెప్పఁబడెను.

అన్న కూడ నన్నుఁ జేయువిడిచెను. ఇక్కడఁ దప్ప మఱియొకచోటికిఁ బోవ స్థలమే లేదు. ఎవ్వరు నన్నుఁ జేరఁదీయువారు లేరు. కావున నగతికుఁడను. తండ్రితో సమానుఁడగు జ్యేష్ఠభ్రాత నన్ను రక్షింపవలసినవాఁడు వాఁడే నన్నవమానపఱిచి తిట్టిపంపెను. ఈ రాక్షసుని మఱియెవ్వరు దగ్గఱఁ జేర్తురు.

రామచంద్రుని శరణము వొచ్చితి ననుటచే నీవే నన్ను రక్షించు నుపాయ మని చెప్పినట్టు లయ్యెను.

పాదంబులర శరణార్థియై పడెద = అనుటచే శరణాగతి దేవుని సన్నిధానమందు జేయవలసిన దన్న యర్థము చెప్పఁబడెను.

కాన శరణాగతున కుండవలసిన లక్షణములు విభీషణుని యందున్న వని యేర్పడెను.

సుగ్రీవాదుల యభిప్రాయమునకు ఖండన మీ పద్యమునం గలదు. విభీషణుఁడు రాక్షసుఁడు, రావణుని తమ్ముఁడు గాన వానిని గ్రహింపరా దని సుగ్రీవుఁడు వానియందు దోషము చెప్పెను. మీ యభిప్రాయమున నది దోషము, నా యభిప్రా

యమున నది దోషముగాదు. అది దోషమే యైనను శరణాగతుని యందలి దోషము నింద్యము కాదు. ఆ దోష ముండిన నుండును గాక. ఆ నెపముపెట్టి నేను రక్షింపక యుండరాదు అని ఖండనము. అంగదుఁడు పరీక్షించి గుణవంతుఁడైన యెడల గ్రహింపవచ్చును, దోషియైన వదలవచ్చు ననెను. రామచంద్రమూర్తి శరణాగతుని యందు దోష మున్నదా యని పరీక్షయే చేయరా దనెను. గంగానదిలో స్నానము చేయఁదలచినవాఁడు దానిలో నడుగున బురద యున్నదని స్నానము మానవచ్చునా? హనుమంతుఁడు విభీషణుఁడు దుష్టుఁడుకాఁడు కావునఁ బరిగ్రహింపవచ్చు ననెను. పరిగ్రహింపవచ్చు ననుట గ్రాహ్యమే కాని దానికిఁ జెప్పిన కారణము గ్రాహ్యము కాదు. శరణాగతుఁడు దుష్టుఁడైనను బరిగ్రహింపవలసినదే యని ఖండనము.

వానరు లందఱు చెప్పినది సామాన్యవిధి. రామచంద్రమూర్తి చెప్పినది విశేష విధి యని యెఱుఁగనగు. కావున విశేషవిధి సామాన్యవిధిని బాధించును.

తా త్ప ర్య ము .

నిజమైన మైత్రికలవాఁడుకాని, మిత్రునివలె నటించువాఁడుకాని, సమీపించి రానీ, దూరమందేయుండనీ, శరణాగతుని విడువను. దానివలన నాకు మేలుగలుగనీ కీడుగలుగనీ వానియందేదేని దోషముండెనా యది సత్పురుషులు నిందింపవలసిన విషయము గాదు. ఆ నెపము పెట్టి శరణాగతుని ద్రోచిపుచ్చరాదు. అట్లు ద్రోచి పుచ్చితినేని నేను దుష్టులలో జేరుదును.

క. అను రాము భాషణంబులు, విని సుగ్రీవుండు దాని ♦ వెండి తలఁచి యి ట్లను నిశ్శ్రేయసకరముగ, వినయోక్తుల రామచంద్ర♦విభునకు మైత్రిన్. ౩౬౬

అర్థములు. వెండి = మఱియును, తలఁచి = విమర్శించి, నిశ్శ్రేయస కరముగ = శుభము కల్గునట్లుగ, మైత్రిన్ = స్నేహభావముచే - నేనుజెప్పినది కాదనెను జూచితివా యని విపరీతభావము లేనివాఁడై యని యర్థము.

తా త్ప ర్య ము .

ఇది నా స్వభావ మని రామచంద్రమూర్తి చెప్పఁగా నిట్టి స్వభావ మపాయ కర మైన సాహస మని యెంచి సుగ్రీవుఁడు భయపడి నీతిశాస్త్రప్రకారము దానిని విమర్శించి తప్పని తోఁచుటచే స్నేహభావముతో వినయముతో నిట్లు చెప్పెను.

ఉ. ఈతఁడు దుష్టబుద్ధి యగు♦నేనియు దుష్టుఁడె కాక యుండెనే
నీతనిచేతఁ గాఁగలుగు ♦ నెయ్యది? యెవ్వని కౌను వీఁడు? స్వ
భ్రాతను నిట్టికష్టదశఁ ♦ బాసినవాఁ డెడఁబాయకుండునే
యే తఱి నెవ్వనిం బరుల♦ కీతఁడు నాదుకొనంగ నేర్చునే? ౩౬౭

తా త్ప ర్య ము .

రామచంద్రా! విభీషణుఁడు దుష్టుఁ డని నే నంటిని. నా యభిప్రాయమున దుష్టుఁడు గాఁ డని నీ వంటివి. ఆ విచార మట్లుండనీ. వీఁడు దుష్టుఁడే కాని

శిష్టుఁడే కాని వీని వలన మనకు రాఁ గల లాభ మేమి ? నా యభిప్రాయ ప్రకారము దుష్టుఁ డాయెనా యుపాయము తప్పదు. నీ యభిప్రాయము సరి యాయెనా భయము లేదు. అది యనుభవము మీఁదఁ దెలియవలసిన విషయము. వీఁ డెట్టి వాఁడై నను నెవరి కేమి సాహాయ్యము చేయఁ గలఁడు? తనకు మన వలన మే లున్న దని తోఁచినంత వఱకు మనతో నుండును. మేలు లే దని తోఁచెనా వెడలిపోవును. తన మేలు గోరి వచ్చినాఁడు గాని, నిన్ను, నన్ను నుద్ధరింప వచ్చినవాఁడు కాఁడు. వీఁ డిట్టి వాఁ డని నీ కెట్లు తెలియు నందువా? ప్రాణాపాయమైన కష్టదశ ప్రాప్తించిన యిట్టి సమయమందు తండ్రితో సమానుఁడగు నన్నను వదలిపెట్టి వచ్చినవాఁడు నిన్ను విడిచిపోకయుండునా? నిన్నే కాదు, నన్నే గాదు, ఎవరినైన వీఁడు వదలువాఁడే. ఎవరికిని వీఁడు సాహాయ్యపడువాఁడు కాఁడు. కావున నిష్ప్రయోజనమై, యపాయకరమైన కార్యము నీవు చేయవచ్చునా ?

చ. అనవుడు రామభద్రుఁడు వ♦నౌకసులం గని మందహాస మా
ననము నలంకరింపఁ దగు ♦ నర్మిలిఁ దమ్మునివంకఁ జూచి యి
ట్లను ననధీతశాస్త్రుఁ డయి ♦ యార్యుల వృద్ధులఁ గొల్వకుండినం
బనుపడు నొక్కొ యిట్లు ప్రతి♦భాయుతవాక్కుశలత్వ మేరికిన్. ౩౭౮

అర్థములు. వనౌకసులన్ = వానరులను, మందహాసము = చిఱునవ్వు, ఆననము = ముఖము, అర్మిలిన్ = ప్రేమచే, అనధీతశాస్త్రుఁడు = శాస్త్రము నధ్యయనము చేయనివాఁడు. పనుపడునొక్కొ = దృఢపడునా? ప్రతిభా = అప్పటి కప్పటికి వికసించు బుద్ధితో, యుత = కూడిన, వాక్కుశలత్వము = మాటల నేర్పు, ఏరికిన్ = ఎట్టివారికి.

తాత్పర్యము.

ఈప్రకారము సుగ్రీవుఁడు చెప్పఁగా ధర్మసూక్ష్మముగాని, నా పరమ శక్తిగాని నా శరణాగత రక్షణ ప్రతినిష్ఠగాని తెలియక యుక్తివాదము చేయుచున్నాఁడుగదా యని తనలోఁ దాను నవ్వుకొనుచు వానరులను లక్ష్మణునిఁ జూచి యిట్లనెను. లక్ష్మణా! యీ సుగ్రీవుఁడు శాస్త్ర మధ్యయనము చేయక యోగ్యులగు పెద్దల సేవింపక యుండెనేని యిట్లు సమయోచితముగ మాటలాడు నేర్పు దృఢపడి యుండునా? ఈ ప్రాగల్భ్య బోరగిల ద్రోయుటకే. వగచినట్టే యుండవలె, వాఁత పెట్టినట్టే యుండవలెను. పరుషముగా నీవు చెప్పినది తప్పు, ఆలోచన లేక మాటలాడుచున్నావనుట మర్యాదగాదు. కావున నిట్లు చెప్పుచున్నాఁడు.

ఇచ్చట లక్ష్మణుతో నీ మాటలు చెప్పుటచేతను, ౩౭౯ వ పద్యమందు సుమిత్రాతనయు సమక్షమం దిట్లనియె నని చెప్పుటచేతను లక్ష్మణ సుగ్రీవు లేకాభిప్రాయము గలవా రనియు నిరువురు విభీషణుని జేర్చుకొనవల దని శరణాగతి చేసి రనియు పూర్వ వ్యాఖ్యాతలు వ్రాసిరి. వారే ౩౧౮ వ పద్యంబున సలక్ష్మణుఁడౌ జనకసుతానాథుఁ

డున్న స్థలమునకు విభీషణుఁడు వచ్చె నన్నచోటఁ బురుషకార భూతుఁడైన లక్ష్మణుఁ డని వ్రాసిరి. ఇది పరస్పర విరుద్ధముగాఁ గానవచ్చుచున్నది. శరణాగత లక్షణము రఘువంశ సంభూతుల కులమర్యాద యనియు, రాముఁడు దానిని విశేషముగఁ బాటించు చున్నాఁడనియు లక్ష్మణుఁ డెఱుఁగఁడా? ఆ వంశమునఁ దాను బుట్టినవాఁడుకాఁడా? రామచంద్రమూర్తి కట్టివ్రతము లేదని యెఱిఁగియుండెనేని తానెట్లు శరణాగతుఁ డయ్యెను. వశిష్ఠాదులవలన రామచంద్రమూర్తి వినినంత తాను వినలేదా? అట్టి వాఁడు శరణాగతుని రక్షింపవలదని చెప్పునా? యని సందేహము. అట్లైన నేల సుగ్రీవునితో పాటు గుంజళ్ళుపెట్టుచుండె ననిన, సుగ్రీవుని కన్నీళ్ళు తుడుచుటకే. రాముఁ డేమో యెవరెన్ని చెప్పినను తన వ్రతము మానఁడని లక్ష్మణుఁ డెఱుఁగును. సుగ్రీవునకుఁ దన విషయమున దురభిప్రాయము కలుగకుండుటకై యాయనకుఁ బ్రక్కగ నిలుచుండెను.

పూర్వవ్యాఖ్యాతల యభిప్రాయము ననుసరించితిమేని సుగ్రీవలక్ష్మణుల శరణాగతి వ్యర్థమయినది. దానివలన నితర భాగవతులకు విరోధముగాఁ జేయు శరణాగతిని భగవంతుఁ డంగీకరింపఁ డని యేర్పడుచున్నది.

చ. కల దొక సూక్ష్మధర్మము ప్రకాశముగా నిఖిలావనీశులం
బలికెద వి న్మనంతరపు ♦ క్ష్మాపతు లేకకులోద్భవు ల్విరో
ధులు, వ్యసనంబు లొత్తుతఱి ♦ ద్రోహ మొనర్చుచు నుందు, గావునన్
లలితగుణా! విభీషణుఁడు ♦ న న్నిటఁ జేరఁగ వచ్చెఁ గానిచోన్. ౩౬౯

అర్థములు. సూక్ష్మధర్మము = ధర్మమునందు సూక్ష్మబుద్ధిచే గ్రహింప వలసిన విషయము. ప్రకాశముగా = స్పష్టముగా, ఇది రహస్యవిషయము గాదు. నిఖిలావనీశులన్ = అందఱురాజులందు సప్తమ్యర్థమున ద్వితీయ. కొన్నియెడల సజ డంబు తృతీయాసప్తములకును, బహుత్వంబున ద్వితీయ యగు. ప్రౌ. వ్యా. కా. ౧౮ సూ. "అనిన నలుగాలివానగోవును నశేష,శబ్దముల మంత్రమును లోహజాతిఁగాంచ, నమును మనుజుల విప్రుండు సమధికత్వ,భాజనములంద్రు వేదప్రపంచవిదులు" భార శాంతి. ౧ ఆ. కలదు = ఉన్నది. ఊహ గాదనుట - అనంతరపు క్ష్మాపతులు = తమదేశమున కానుకొని పొలిమేరలు కలియునట్లుండు దేశముల రాజులు, ఏకకులో ద్భవుల్ = జ్ఞాతులు.

తాత్పర్యము.

సుగ్రీవా! విభీషణుఁడు మనయొద్దకు వచ్చిన కారణము చెప్పెద వినుము. రాజు లగు వారందఱియందు నొక సూక్ష్మధర్మము సుప్రసిద్ధముగాఁ గలదు. అది రహస్యవిషయముగాదు. ఏరాజుల రాజ్యముల పొలిమేరలు కలసియుండునో యెవ రొక వంశమునఁ బుట్టినారో వారు పగవారు. వీ రితరులకుఁ గష్టము వచ్చినపుడు పరస్పరము ద్రోహము చేయుచుందురు. కావున విభీషణుఁడు రావణుఁడు జ్ఞాతులు.

కావున విరోధులే. ఆ కారణముచే వీఁడు మనయొద్దకు వచ్చెనుగాని, నీవు తలఁచినట్లు రావణుఁడు పంపఁగా వానిమీఁది ప్రేమచే వచ్చినవాఁడు కాఁడు.

క. కలుషవిహీనాత్ములు తత్కులజులు స్వీయు లగు హితులకుఁ గౌరవమును
గలిగింతు రైన నృపతులు, కలుషింతురు ప్రాయికముగఁ గడు నిర్మలులన్. ౩౭౦

అర్థములు. కలుషవిహీనాత్ములు = పాపములేని మనస్సుగలవారు. ఇట్లు చెప్పుటచే మీఁదిపద్యంబునఁ జెప్పఁబడినవారు కలుషాత్మకులని గ్రాహ్యము. తత్కులజులు = ఆవంశమునందుఁ బుట్టినవారు.

తా త్ప ర్య ము.

పాపవిచారములేని మనస్సు గల జ్ఞాతులు తమ వంశమందుఁ బుట్టి తమమేలు గోరువారికి గౌరవము గలిగింతురు. ఇది ప్రభువులుగాని వారు ప్రభువుల విషయమై నడచు విధము. మన యన్న ప్రభువైననేమి? నేనైననేమి? యని యన్నకే యెక్కువ గౌరవము కలిగించుచుందురు. అట్లున్నను ప్రభువులు మాత్రము ప్రజ్ఞాశౌర్యసామర్థ్యములచే నిర్మల మనస్సుగల జ్ఞాతులందును దఱచుగ ద్రోహబుద్ధిగలవారై వీఁడేవేళకు మనకేమి కీడు చేయునో యని యూరఁగ దొరిక్కయే యుందురు. అట్లు వారుండుటచే నిర్మలులైనవారును మన మెంత శుద్ధముగా నున్నను మనలను నమ్మక వృద్ధికి రానీయకున్నాఁడు గదా యని వాఁడును కలుషితచిత్తుఁ డగును. అట్టులే విభీషణుఁడు నిర్మల మనస్కుఁడైనను రావణుఁడు దుష్టుఁడు కావున నీయనను సందేహించి యుండవచ్చును. ఇప్పుడు తన కేమి కీడుచేయునో యను సందేహభయములచే నీయనను వెడలఁగొట్టి యుండవచ్చును. విభీషణుఁడు వచ్చుటకుఁ గారణ మిది, కాని నీవు చెప్పినది కాదు.

చ. అరిఁ దను జేరనిచ్చు టనయం బని యాడితి వీవు, శాస్త్రస
త్సరణి వచించెద న్వినుము జ్ఞాతుల మెవ్వరుఁ గాము వానికిన్
స్థిరమతి రాజ్యకాంక్షఁ జను దెంచినవాఁ డగు, వారిలోన నుం
డరె మతిమంతు? లట్టు లగుటన్ గ్రహియింపఁ దగు న్విభీషణున్. ౩౭౧

అర్థములు. అరిన్=శత్రువును, అనయము=నీతివిరుద్ధము, శాస్త్రసత్సరణిన్ = నీతిశాస్త్రము నందుఁ జెప్పఁబడిన మంచిమార్గము.

తా త్ప ర్య ము.

వీఁడు మనకు శత్రు వనియు, వీనినిఁ జేరనిచ్చిన మన కపాయము గలఁ దనియు నది నీతిశాస్త్ర విరుద్ధమనియుఁ జెప్పితివి. నీతిశాస్త్రప్రకార మెవ్వరి కెవ్వరు విరోధులో చెప్పితినిగదా. వీనికి మన మెవ్వరము జ్ఞాతులము గాము. ఆ కారణమున వానికి మనకు విరోధము లేదు. రాజ్యవిషయమైన విరోధమును లేదు. హనుమంతుఁడు చెప్పినట్లు వాఁడు రాజ్యము సంపాదించుకొనఁగోరి వచ్చియుండవచ్చును. అట్లు వచ్చినవాఁడు మనకుఁ గీడుచేసెనేని తనకె త్రిప్పఁ దానేకదా మన్ను వేసికొని రెంటను జెడిన

వాఁడగును. రాక్షసులకే మాత్రము తెలివితేటలు గలవా యందువేమో, వారిలో మాత్రము బుద్ధిమంతులు లేరా యేమి? ఈ కారణమున విభీషణుని గ్రహింప వచ్చును.

ఉ. శూరులలోన హృష్టులును ♦ శుద్ధమనస్కులు నైనవారిలో
వేరిమి యొక్క వేళఁ బ్రభ♦వించును, గాననె యిట్టి రచ్చ, త
త్కారణజాత మౌ వెఱపు ♦ గల్గుట నీతఁడు చీలి వచ్చె న
న్జేరఁగ నిప్పు, డట్లగుట♦చే గ్రహియింపఁ దగు న్విభీషణున్. ౩౭ ౨

అర్థములు. వేరిమి = వైరము, ప్రభవించును=పుట్టును, రచ్చ=కలహము, తత్కారణ జాతము = ఆ కారణమువలనఁ గలిగినది, చీలి = వేఱుపడి.

తాత్పర్యము.

ఇదివఱకు జ్ఞాతులలో నొకఁ డెక్కువ యొకఁడు తక్కువ, ఒకఁడు దుష్టుఁడు వేఱొకఁడు శిష్టుఁడు నగువాని విషయము చెప్పితిని. శూరులం దిరువురు సమానముగ సంతుష్టచిత్తులు నిర్మలులుగా నుండినను ఒక్కొకవేళ వారిలో వారికి విరోధము సంభవించును- అప్పుడే యిప్పుడు రావణ విభీషణులకుఁ గలిగిన కలహము వంటి కలహము కలుగును. ఆ కారణముగఁ గలిగిన భయముచే నీతఁడు వానితోఁ గలిసి యుండక వేఱుపడి నన్నుఁ జేర వచ్చెను. ఆ కారణముచే వీనిని గ్రహింప వచ్చును.

తే. భ్రాత లెల్లరు భరతుని♦పాటి గారు, జనకునకు నన్నుఁ బోలిన♦తనయుఁ డున్నె
హితులయందును నీయట్టి♦హితుఁడు లేఁడు, తండ్రి! లోకంబున నిది♦తథ్యమయ్య.

తాత్పర్యము.

రామచంద్రా! నీవు చెప్పినది భిన్నోదరుల విషయము. ఏకోదరుల విషయమున నట్టి కలహములు గలుగునా యందువేమో? గుణములు ప్రధానములు గాని యేకోదరత్వ భిన్నోదరత్వములు ప్రధానములు గావు. నీవు, వాలి యేకోదరులే కదా. ఏల కలహించితిరి? భరతుఁడు నాకు సవతితల్లి కొడుకే కదా. తనకుఁ దండ్రి యిచ్చిన రాజ్యము నా కిచ్చుటకై యడవులకు వచ్చి యెంతో ప్రార్థించియు నేను గైకొనకుండఁగ నా వలెనే వానప్రస్థుని వలెఁ గాలము త్రోయుచున్నాఁడే! న్యాయముగ నాకు రావలసిన రాజ్యము నా కీయకుండుటయే గాక నన్ను మా తండ్రి యడవులకుఁ బొమ్మనినఁ దథాస్తని వచ్చితినే! తండ్రి కిటువంటి కొడు కేఁడీ? నీ మాట ప్రకారము నీవు వర్షాకాలము దాఁటఁగానే రాకుండుటచే లక్ష్మణునిఁ బంపి తిట్టించినను నా యందు మైత్రి వదలవయితివి కదా! ఇప్పుడును నా యందలి ప్రీతిచేఁ గదా విభీషణుని జేర్చుకో వల దనుచున్నావు. నీ వంటి మిత్రుఁ డేఁడీ? కావున గుణములు ప్రధానములు, బంధుత్వము గాదు.

ప్రశంస రాజ్యవిషయ మగుటచేతను, లక్ష్మణునకు రాజ్యము లేకుండుటచేతను, తమ్ముఁడు కుమారుఁడు సమానులు గావున ప్రత్యేకమునఁ బ్రశంసింప రాకుండుట

చేతను భరతునిపేరు చెప్పఁబడెను. నావంటి కొడుకు లేఁడనుట యాత్మశ్లాఘ కాదు. ఒక ప్రయోజనము నుద్దేశించి చెప్పవలసి వచ్చినపుడు జరగిన విషయము నలువురకుఁ దెలిసిన విషయము చెప్పుట దోషము గాదు. వ్యర్థ ప్రగల్భములు దోషావహములు. యుద్ధములందు శత్రువుల భయపెట్టుటకై వీరులు తమ్ముఁ దాము పొగడుకొందురు. అదిదోషముకాదు. దుష్యంతుఁడు శకుంతలను జూచినపుడు 'సతాంహి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయ' యని తన్ను సత్పురుషుఁ డని యంతఃకరణశుద్ధి గలవాఁడ నని చెప్పుకొనెను. అట్లులే యాంజనేయుఁడు సముద్రము దాఁటుటకు ముందు వానరుల యుత్సాహము నిమిత్తమై తన ప్రతాపము చెప్పుకొనెను. వీనియం దాత్మప్రశంసాదోషము లేదు. కావ్యాదర్శమందు దండియు 'స్వగుణా విష్క్రియా దోషో నాత్ర భూతార్థశంసినః। అపి త్వనియమో దృష్ట స్తథా త్వన్యైరుదీరణా'' త్తని చెప్పెను.

జనకునకు నన్నుఁబోలిన తనయుఁ డనుటను మఱియొకవిధముగ విభక్తిమార్చి చెప్పవచ్చును. కొడుకును విడిచినంత మాత్రముననే ప్రాణము విడుచు తండ్రి గలవాఁడను నే నొక్కఁడుగాక మఱి యెవ్వఁడున్నాఁడు? నాయనా! లోకమునం దిది సత్యము.

క. అను రాముని వాక్యంబులు, విని లక్ష్మణుతోడ లేచి ♦ వినయంబు మెయిన్
దినకరతనయుఁడు ప్రజ్ఞా,ధనుఁ డిట్లను రామచంద్ర♦ధరణిపుతోడన్. 328

తాత్పర్యము.

ఈ ప్రకారము రామచంద్రమూర్తి చెప్పఁగా విని బుద్ధిమంతుఁ డగు సుగ్రీవుఁడు లక్ష్మణుతోడ లేచి యణఁకువతో నిట్లనియె,

క. రావణుని వేగువాఁ డని, భావింపు విభీషణున్ క్ష♦పాచరవర్యున్
గావున క్షమవద్వర! నీ, వే విధి నితనిన్ వధింప ♦ నెంచుట తగ వౌ. 329

అర్థములు. క్షపాచరవర్యున్ = రాక్షసశ్రేష్ఠుని, క్షమవత్ వర = సమర్థులలో శ్రేష్ఠుఁడా! ఈ విశేషణము రామచంద్రమూర్తి చెప్పఁదలఁచినదానిని సమర్థించు నేర్పుగలవాఁ డని తెలుపుచున్నది.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి తొలుత వీఁడు నిజముగ శరణాగతుఁడే కావున రక్షించుట యవశ్యకర్తవ్య మనెను. అది సుగ్రీవునకు నచ్చినది కాదు. ఆవల నీతిశాస్త్రప్రకార మిది యన్నదమ్ముల కలహము, అన్నతో వాస్తవముగ విరోధించి వచ్చెనని చెప్పెను. అదియు నాయనకు సరిపడినది కాదు, కావున నీ రాక్షసుఁడు వేగులవాఁడు, వీఁడు మోసగాఁడు, వీఁడు చెప్పునది సత్యముగాదు, కావున వీనిని సంహరింప నాలోచించుటయే తగిన కార్య మనెను.

ఉ. వచ్చినవాఁడు వీఁడు దశకంఠుఁడు వక్రపుబుద్ధిఁ బంపఁగా
నచ్చితి మేని మాయల నొకించుక పిమ్మట దప్పుబుద్ధి నుండగాఁ
గ్రచ్ఛఱ నన్నొ, నిన్నొ, మఱి లక్ష్మణునో వధించు నో
సచ్చరితా! యటౌటఁ దగు నిక్కడ నీకు సచివాన్వితంబుగన్. 328

అర్థములు. వక్రపుబుద్ధి = మోసబుద్ధి, నచ్చితిమేని = నమ్మితిమా, చక్కడపన్ = చంపఁగా, సచివాన్వితంబుగన్ = మంత్రులతో.

తా త్ప ర్య ము.

వీఁడు మోసబుద్ధిచే రావణుఁడు పంపఁగా వేగులవాఁడై వచ్చినాఁడు. నమ్మితిమా మన మేమఱి యున్న వేళ నేదో టక్కు చేసి నిన్నో, నన్నో, లక్ష్మణునినో చంపును. కావున వీనిని మంత్రులతోఁ జంపుటయే తగిన కార్యము.

క. అని మిన్నకున్న సుగ్రీవుని వాక్యము లాలకించి యిపుడిఁ జక్క విమ
ర్శన మొనరిచి శుభతరసూక్తిని సీతానాథుఁ డనియెఁ గీశాగ్రణితోన్. 329

అర్థములు. మిన్నక + ఉన్నన్ = ఊరకుండఁగా, శుభతరసూక్తిని = మిగులమేలైన మంచిమాటలను- నీతి బోధించుటయందు విభీషణ సుగ్రీవు లిరువురు సమాన స్కంధమునందే యున్నారు. విభీషణుఁడు నీవు సీతను మఱల నీయకుండిన నీవు చచ్చెదవు. బంధువులు చచ్చెదరు. లంకయుఁ బాడగు నని రావణుతోఁ జెప్పెను. సుగ్రీవుఁడు నట్టులే విభీషణుని నీవు చేర్చుకొంటివా, నిన్నే చంపునో, నన్నే చంపునో, లక్ష్మణునే చంపునో, కాకి కూబలను జంపినట్లు వానరుల నందఱఁ జంపునో! ఇట్లు తేరకుఁ జచ్చుటకా నీ వెంట వచ్చినది యని నిర్దాక్షిణ్యముగఁ జెప్పెను. ఇరువురు ప్రేమచేఁ జెప్పినవారే. సుగ్రీవుఁ డిట్లు చెప్పుటచే నిరవధిక స్నేహముగల వా రిట్టులే చెప్పవలయు నని యేర్పడుచున్నది. మిత్రుఁ డిట్లు ఖండితముగాఁ జెప్పుటవలన నాయం దితనికి నెంత ప్రేమ లేనిదే యిట్లు నామాటకు విరుద్ధముగాఁ జెప్పునా యని రామచంద్రమూర్తి సంతోషించెను. దీనివలన నాయన యతిశయము బయలుపడెను. 'ప్రియో హి జ్ఞానినోత్యర్థమ్' నా యంతరంగభక్తునకు నా యందెంత ప్రేమగలదో యది నేనుగూడఁ జెప్పలే నని కదా కృష్ణభగవానులు చెప్పిరి.

ఇఁక రామచంద్రమూర్తి వాక్యములవలనఁ బ్రభువు తానెంత నిర్వాహకుఁడైనను తన మేలు కోరి చెప్పువారు తనకు విరుద్ధముగాఁ జెప్పినను వారిని ధిక్కరింపక తనయభిప్రాయమున వారు కలిసి వచ్చునట్లు తగిన కారణములు చెప్పి యంగీకరింపజేయవలయు ననియు, విరోధాభిప్రాయ మిచ్చినంత మాత్రము చేతనే శత్రు వనియు రావణు వలెఁ దలంపరా దనియు నేర్పడు చున్నది. ఇట్టి నిరవధిక స్నేహము గలవారే నాకుఁ బ్రియులు. "సచ మమ ప్రియః" యని కదా కృష్ణభగవానుఁడు చెప్పెను. "ప్రియతమ ఏవహి వరణీయో భవతి" ఇట్టి ప్రియతములే యభిమానపాత్రు లగుదురు- అని చెప్పఁబడెను. భగవంతునకు వరణీయుఁ డగుటచే

భగవంతుఁడే స్వప్రాప్తిని దానే కలుగఁజేయు చున్నాఁడని భావము. కావుననే కదా తాను పరమపదమునకుఁ బోవునప్పుడు పిలిపించి కూడఁబిలుచుకొని పోయెను.

తాత్పర్యము.

అని చెప్పి యూరకుండఁగా సుగ్రీవుని మాటలు విని రామచంద్రమూర్తి యిదివఱకుఁ జెప్పిన నీతిశాస్త్ర వాక్యముల కంటె మేలైన దానిని జెప్పుచున్నాఁడు. మైత్రి భావించి యెవఁడు వచ్చినను నేను జేర్చుకొనెద నని రామచంద్ర మూర్తి చెప్పెను.

ఇది కేవలము రాముని సాహస కార్యమే కాని దానికిఁ బ్రమాణవాక్యములు గాని, శిష్టానుష్ఠానముగాని లేదని సుగ్రీవుఁడు దాని నిరాకరించెను. ఇప్పుడు శరణాగతి ధర్మశాస్త్ర వాక్యముల పూర్వుల యనుష్ఠానముఁ జెప్పి సుగ్రీవు సంగీకరింపఁ జేయుచున్నాఁడు.

—♦ శ్రీరాముఁడు సుగ్రీవునకు శరణాగతరక్షణం బవశ్యకర్తవ్యం బని చెప్పుట ♦—

ఉ. ఈతఁడు దుష్టబుద్ధి యగు ♦ నేనియు దుష్టుఁడె కాకయుండె నే
నీతనిచేతఁ గాఁగలుగు ♦ నెయ్యది? యొక్కరవంతయేని వాఁ
డే తఱి నేని కీడు ఘటి♦యింపఁగ శక్తుఁడు గాఁడు మామక
వ్రాతము లందు నా యెడ, ది♦వాకరనందన! నన్ను నమ్ముమీ. ౩౭౮

అర్థములు. మామకవ్రాతములందు = నా వారియందు, అనఁగా నీకుఁగాని లక్ష్మణునకుఁగాని, వానరులం దెవ్వరికిఁగాని యని యర్థము.

తాత్పర్యము.

సుగ్రీవా! వాఁడు దుష్టుఁడు, మనలో నెవ్వరికైన నేదైనఁ గీడుచేయు నని యేల భయపడెదవు. వాఁడు దుష్టుఁడుకాని, కాకపోనీ, వాఁడేమి చేయఁగలఁడు? మనము హెచ్చరికగా నుండినను, హెచ్చరిక తప్పియుండినను నిద్రపోవుచున్నను, నాకుఁగాని నావారికిఁగాని, వారివారికిఁగాని, యెట్టి కీడుచేయుటకు వాఁడు సమర్థుఁడు గాఁడు. నా మాట నమ్ముము. నేను బ్రగల్భములు చెప్పువాఁడను గాను. ఎంత చెప్పెదనో యంతయు జరగవలసినదే.

క. ఈ నిఖిలావని యక్షుల, దానవరక్షఃపిశాచ♦తతులను వలతేఁ
భానుజ! యంగుళికొనచే, నే నిమిషములోనఁ జిమ్మ♦నే మిత్తిఁ గనన్. ౩౭౯

అర్థములు. నిఖిలావనిఁ = సమస్తభూమియందు, వలతేన్ = వలయునేని (౧) చేయవలసిన పని వడెనేని (౨) నాకు సంకల్పము కలిగినయెడల అంగుళికొన గూడ నక్కర లేదు. సంకల్పముచేతనే చంపనా? అంగుళి = వ్రేలి; మిత్తిగనఁ = చచ్చునట్లు.

తా త్ప ర్య ము .

మనము నిద్రపోవునపుడు వాఁడు రాక్షసుల నందఱను బిలుచుకొని వచ్చి కాకులు గూబలను జంపినట్లు చంపునని కదా నీ భయము. ఒక రాక్షసులనే కాదు. లంకలో నుండువారిని మాత్రమే కాదు, ఈభూమిమీఁద నెందఱు యక్షులదానవుల రాక్షసుల పిశాచుల గుంపులుగలవో యందరు కలసి వచ్చినను దేహమంతటితోఁ గాదు - రెండు చేతులతోఁగాదు- ఒక చేతియంతతోను గాదు- అన్ని వ్రేళ్ళతోనుగాదు- ఒక వ్రేలితోనుగాదు- ఒక వ్రేలి కొనచే నొకసారిగఁ జిమ్మినట్లు లందఱను మీఁటి పాఱవేయనా ? వీరిని జంపుటకు నా కాయుధములు సేనలు కావలయునా ? వ్రేలికొనయు నక్కఱ లేదు. నా సంకల్పము చేతనే చంపఁగలను. వీని యన్న కుబేరునితోఁ జెప్పుకొని యక్షులనందఱను, వీనిమామ మయునితోఁ జెప్పి దానవుల నందఱను, వీని స్వాధీనమం దుండు వీని తల్లినంక రాక్షసులను, వీనికి వరమిచ్చిన శివుని పరిచారకులగు పిశాచముల నందఱను బిలుచుకొని వచ్చినను వ్రేలితో మీఁటి పారనైచెదను. అటులైన నిందఱు వానరులకు నీకు నా కీ కష్టమేల? లంకలోని రాక్షసుల మీఁటరాఁదా యందువా ? విభీషణునివలె మనయొద్దకు రాకున్నను, లంకయందు మనయందుఁ బ్రతికూల భావము లేనివా రెందఱున్నారో? వారుగాక ముదుసళ్ళు బాలురు స్త్రీలు లేరా ? వారి నందఱ నొకటిగాఁ గలిపి యెట్లు చంపుదును? కావున మన మీఁదకిఁ బ్రత్యక్షముగా వచ్చినవారిని మాత్రమే చంపఁదలఁచితిని. కావున వీఁడు మనతోఁబ్రతిఘటించి పిలుచుకొని వచ్చినా అప్పుడు వారందఱు ప్రత్యక్షవిరోధి సమూహము గావునఁ జంపెదను.

ఈ సందర్భమున నీ వాక్యంబులు స్మరణీయములు. "విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్" కార్యకారణ రూపమైన యీ ప్రపంచము నంతయు నా యొక్క యంశముతో నిలువఁబెట్టి యున్నాను. భ. గీ. ౧౦-౪౨.

'యస్యాయుతాయుతాంశాంశే విశ్వశక్తి రియం స్థితా' వి. పు. ఎవనియొక్క- పదివేల పదివేలవ భాగముతో నీ ప్రపంచశక్తి నిలచియున్నదో,

"కిం స్విద్వనం, క ఉ స వృక్ష, ఆసీద్యతో ద్యావాపృథివీ నిష్టతక్షుః మనీషిణో మనసా పృచ్ఛతేదు తద్యదధ్యతిష్ఠ ద్భువనాని ధారయన్" శ్రుతి. ఇల్లు కట్టుటకు స్తంభాదులు కావలెఁగదా! ఆ సామాను యేవనములోని యే వృక్షమునుండి వచ్చెను? అట్లులే యీ భూమ్యాకాశములను బ్రపంచసృష్టికిఁ గావలసినది యేవనమునుండి యేవృక్షమునుండి వచ్చెనో మేధావులారా! చక్కఁగాఁ బ్రశ్నింపుడు. మఱియు నీ ప్రపంచమును నేది యెందుండి ధరించుచున్నది. అదియు నడుగుఁడు. వనము సమష్టి ప్రపంచము,వృక్షము వ్యష్టిరూపము. ఈప్రశ్నమునకుఁ బ్రత్యుత్తరము బ్రహ్మవనము బ్రహ్మ వృక్ష మని ప్రత్యుత్తరము. పెద్దవనములో నొక వృక్ష మెట్లులో యీ ప్రపంచము భగవంతున కట్టి దని భావము.

మ. వినవా మిత్రమ బోయవాఁ డొకడు పృథ్వీం గూల్చి స్వప్రేయసిన్
దనప్రాణంబులు పెన్బుభుక్ష నడలన్ రక్షార్థి యై చేరినం
దన మాంసంబు లొసంగి వానికిఁ గపోతం బాతనిం గాచెఁ గా
ననచారీ! శరణాగతు న్విడుచుటల్ న్యాయంబె నాబోఁటికిన్ ? ౩౮౦

అర్థములు. స్వప్రేయసిన్ = తనభార్యను, పెన్బుభుక్ష = గొప్పయాఁకలిచే, రక్షార్థియై = రక్షణము కోరినవాఁడై, కపోతంబు = పావురము, కాననచారీ= అడవులందుఁ దిరుగువాఁడా! (౧) పావురము అడవియం దుండునదే, నీవు నడవియం దుండువాఁడవే, ఆ పక్షికున్న తెలివి నీకుండఁ బనిలేదా? (౨) కనఁబడిన మృగమును జంపి తినుటే స్వభావముగా గల యడవిమృగములలో దిరుగువాఁడవు. జీవి రక్షావిషయము నీకేమి తెలియును. వీని వలన నాకేలాటి కీడు రాదని యింతవఱకుఁ జెప్పెను. ఒకప్పుడు వీఁడు మోసగాఁడై యుండి నా ప్రాణహాని సంభవించునట్లు దుర్మార్గము చేయనున్నను నేనేమో వీని నుపద్రవపెట్టను. ఏ మాత్రము వదలను.తప్పక యంగీకరించి రక్షింపవలె ననియే యున్నాను అని కపోతోపాఖ్యానముచే విశదపఱచుచున్నాఁడు. (౧) వినవా - యనుటచేత నీ కథ మిక్కిలి ప్రసిద్ధ మని భావము. (౨) వినవా యనుటచేత నిది యందఱు వినవలసినదేగాని యెవ్వరును ననుష్ఠింప లేరనుట సూచితము. (౩) ఈ శరణాగత రక్షణ చరిత్రము శ్రుతివంటిది యనియు భావము. బోయవాఁడొకఁడు—వీఁడు పక్షికి సహజశత్రువు. ఇట్టి వానినిగూడఁ గపోతము రక్షించినది. విభీషణుఁడు మనకు సహజ శత్రువు గాఁడు. అట్టుండ నతనిని రక్షింపకుండుట యెట్లనిభావము. బోయవాఁడు పక్షికి సహజశత్రు వగుటయేకాక, పృథ్వింగూల్చి స్వప్రేయసిన్ - ఇట్టి భార్యానాశకునే కపోతము రక్షించినది. విభీషణుఁడు తానై మన కేటువంటి తప్పును జేయకున్నను భార్యాపహారి యూరినుండి వచ్చినాఁ డన్నమాత్రమున మనము వానిని వదలిపెట్టుట యుక్తమా యని భావము. భార్యాపహారి యైన రావణుఁడు వచ్చినను, మనము తప్పక రక్షింపవలె ననుట యీ పదముచేత సూచితము. బుభుక్ష=ఆఁకలి, రక్షార్థియై - 1. "సోంజలిం శిరసా బధ్వా వాక్య మాహ వనస్పతిం, శరణంహి గతోఽస్మ్యద్య దేవతా మిహ వాసినీ" మ్మని యా కపోత మున్న వృక్షములోని దేవతను దన్ను రక్షింపవలె నని ప్రార్థించువాఁడై - ఇంతియగాని కపోతము తన్ను రక్షింపవలె నని యపేక్షతో వచ్చినవాఁడు కాఁడు. విభీషణుఁ డన్ననో యట్లుగాక రఘురాక్షస సంవాదము నందలి శరణాగతి రక్షణమును జ్ఞప్తి పెట్టుకొని యీ వంశములోని నేను నా కూటస్థుఁ డైన రఘువువలె శరణాగతుని రక్షింతు నని యెంచి నను శరణుఁ జొచ్చినట్లు "రఘుసత్తముతో''నని మీతోఁ జెప్పిపంపినాడుగదా.

2. రక్షార్థియై=తనతల దాఁచుకొనవలె నని యొకచెట్టునీడ నపేక్షించినవాఁడై; చేరినన్ = కపోతము వసించెడి చెట్టునొద్దకు రాఁగా, కపోతము బోయవానిని

రక్షించినందులకు హేతువు బోయవాఁడు కపోతవాస వృక్షమును సమీపించుటయే. వాఁడు చెట్టులోని దేవతతోఁ జెప్పుకొన్న శరణాగతివాక్యమును గపోత మే మాత్రమును విననే లేదు. కాన నది హేతువు కానేర దని యీ పదము చేత సూచితము. తన మాంసంబు లోసంగి వానికిఁ - సహజశత్రుఁడై భార్యాపహర్తయై యున్న యీ బోయవాని కాపద వచ్చినపు డా కపోతము చావనీ యీ ముండ వాఁ డని యుపేక్ష యైనను జేయవలెను. లేదా వానిని జంపుటకు యత్న మైనను బడవలెను. ఈ రెండు విధములును గాక యింటికి వచ్చిన యతిథిని దేవతగా భావింప వలె నను శాస్త్రము ననుసరించి వాని నొక దేవునిగా భావించి యది శీతకాలము కాన శీత నివారణార్థము వానికిఁ గుంపటి తెచ్చి యిచ్చి మఱియు షోడశోప చారంబులును జేసి తన యెరకై సంపాదించి తెచ్చిన వస్తువులను బెట్టి యంత టితోఁ గాని లేదా, తన యంగములలోని కొంతమాంసము పెట్టి యంతటితోఁగాని వానిని బంపివేయవలె నని యెంచక నిష్కల్మషమైన బుద్ధితో వాని యాఁకలి తీఱు నంతవఱకును దన దేహము నిచ్చివేసినది. ఈ కపోతోపాఖ్యాన కథ భారతమున శాంతి పర్వంబున ౧౪౬వ యధ్యాయమునఁ గలదు. అజ్ఞు లందఱును శరీరమునే యాత్మగా భావించి దానియందు విశేషాభిమాన ముంతురు గదా! ప్రాజ్ఞులు గూడ "శరీర మాద్యం ఖలు ధర్మసాధన"మ్మని యం దభిమాన ముంతురు గదా. అట్టి తన శరీరమును గూడ నీ కపోతము దీనిని వీనికిఁ బచ్చిగ నిచ్చినచో వండుకొన వల సిన శ్రమము వీనికిఁ దటస్థించు నని యెంచి యా శ్రమమును లేకుండునట్లు శరభంగ మహర్షి వలె 'ఇదమేకం మహత్తప' యన్నట్లు తానై నిప్పులోఁబడి పచనమై వానికిఁ దృప్తికర మైన మాంస మాయెను. మన మన్ననో "సచ్చరితా యటౌటఁ దగుఁ జక్కఁడుపఁ సచివాన్వితంబుగ"న్నని కదా వీనిఁ దృప్తిపఱచుచున్నా మని భావము.

కపోతంబు=నావలె ధర్మానుష్ఠానయోగ్యమైన వంశము నందును బుట్టినది గాదు. శరణాగతరక్షణమే బిరుదుగాఁగల వంశమునందును బుట్టినది కాదు. ధర్మాను ష్ఠానానధికారి యైన యొక తిర్యగ్జాతిలోని దని భావము. ఇంతటి హీనజాతియే శరణా గత రక్షణము చేసినపుడు మన కేమి చెప్పవలసియున్నది. సహాయములేని యీ కపోతమే శరణాగత శత్రురక్షణము చేసినపుడు సహాయ సంపన్నుఁ డైన నేను శత్రు భిన్నమై శరణాగతుఁడైన వీనిని రక్షింపవలె ననుట కేమి చెప్పవలసియున్నదని యేకవచన తాత్పర్యము.

అతనిఁ = ఈ బోయవానికి జాతియు హీనము, నడతయు నట్టిదే. మఱియు "పక్షిణాం కాలసమ్మిత"మన్నట్లు పక్షి జాతికి సహజ విరోధి. వీనియందు రక్షణార్హమైన గుణ మేదియు లేదు. అంతియేగాక విపరీతగుణంబులును గలవు. అనుతాపము కొంచె మైనను లేదు. అంతరముగా ననుతాపము లేకున్నను నట్టి నటనయు లేదు. అంతియకాక యాఁకలిదే నల్లాడుచు వచ్చి యా చెట్టుక్రిందఁబడెనేకాని యా పక్షికి

శరణాగతుఁడై యచ్చటికి రాలేదు. ఇట్టివానినిగూడఁ గాఁచెను. తన శరీర మిచ్చి యాఁకలితీర్చి రక్షించెను. ఈ కపోతము శ్యేనకపోతోపాఖ్యానమందలి కపోతమువలె కపోతరూపముఁదాల్చిన యొక దేవతగాని, ఋషిగాని కాదు. వాస్తవకపోతజాతిలోనిదే. అట్లయ్యుఁ బురాతన సుకృత విశేషమును బట్టి గజేంద్రాదులకు వలె నింత జ్ఞాన సంపత్తియు, నింత ధర్మానుష్ఠానయోగ్యతయుఁ గల్గిన వని యెఱుంగునది.

కాననచారీ = వానరమా, కపోత జాతిలోని తిర్యక్కువలె వానర జాతిలోని మఱొక తిర్యక్కును నొక వ్యాధుని రక్షించెను. నీవు నా జాతివాఁడవుగా నుండియు, మఱి యాజాతికి రాజుగా నుండియు నీ వ్యాధ వానరకథను వినలేదా. వినియు ననుష్ఠింప కుండెదవే యిది మేల యని భావము. ఒక యడవిలో నొక వానర మొక వృక్షముపై నుండఁగా నొక పులి యొక బోయవానిని దఱుముకొని వచ్చెను. వాఁడు దన ప్రాణరక్షణార్థమై యా చెట్టునే యెక్కెను. అప్పు డా చెట్టుపై కెక్కిన యాబోయ నా వానరము బాధింపక రక్షించెను. ఆ పై నా పులి వానిని భక్షింప వలె నని యాచెట్టుక్రిందఁ గాచుకొని యుండెను. అంత నా వానరము నిద్రపోయెను. పులి యా వానరముచేత వానిని సులభోపాయమున భక్షింప నెంచి నీ వా వానరమును బడఁద్రోయుము. నేను దానిని భక్షించిపోయెదను. ఆపై నీ ప్రాణములు సురక్షితము లగునని యా బోయవానితోఁ జెప్పెను. పాపిష్ఠుయైన యా బోయ తన్నిది రక్షించి నదిగదా యని యెంచక యా వానరమును బడఁద్రోసెను. అంత నాపులి మనుష్య మాంసమును గోరి వచ్చినది కాన వానరమును జంపక దానితో నిట్లనియె. నిన్నుఁ జంపక వదలెదను. అందులకై నా కొక యుపకారము చేయుము. నీ వాశ్రయించిన యుపకారమును భావింపని యా బోయవానిని బడఁద్రోయుము. వానిని భక్షించి నేఁ బోయెదను. నీవు సురక్షితముగ నుండుము. ఆపదయం దబద్ధము తప్పుకాదని భావించిన యా వానర మట్లే యని యంగీకరించి వ్యాఘ్రము వదలిపెట్టఁగాఁ జెట్టునెక్కి యీ బోయవాఁడు ఇపుడు నన్నుఁజూచి భీతిల్లి యింమండి పాఱిపో వీలులేక యగతికముగ నిందే మిణకరించుచు నున్నాఁడు. ఇట్టి యనాథను నే నెట్లు త్రోయుదు నని యెంచి రక్షించెను. శరణాగతు న్విడుచుటల్ న్యాయంబె నాబోంటికిఁ (౧) ఇట్టి కపోతాది చరిత్రములను వినియున్న నాబోంట్లకును శరణాగతత్యాగము యుక్తమా యని భావము. (౨) నాబోటికిన్ - శరణాగత రక్షణ బిరుదాంకిత వంశమున జనించిన నావంటివానికి (-) "షష్టిర్వర్ష సహస్రాణి లోకస్య చరతా హితం। పాండర స్యాతపత్రస్య ఛాయాయాం జరితం మయా" యన్నట్లు అఱువది వేలేండ్లు లోకరక్షణ దీక్షితుఁడై యున్న దశరథుని పుత్రుఁడై వసిష్ఠ విశ్వామిత్రాదుల శిష్యుఁడై యోగిజనాగ్రేసరుఁ డైన జనకమహారాజున కల్లుఁడై 'రామో విగ్రహవాన్ ధర్మ' యని ప్రసిద్ధుఁడై "మర్యాదానాం చ లోకానాం కర్తా కారయితా చ స" యన్నట్లు లోకసంగ్రహార్థమై ధర్మానుష్ఠానపరాయణుఁడై యున్న నే నిట్లు శరణాగతుని రక్షింపకుంటినేని.

తక్కిన వా రా ధర్మ మేమని యాచరింతురు. (౪) నామాట యటుండనిమ్ము "ధర్మసేతు ర్నృపాణా"మ్మని మావంటి వారందఱును నొప్పుకొన్నట్టిది గదా యీ శరణాగత రక్షణధర్మము (౫) నా వంటివాఁడు శరణాగతుని రక్షింపకుండునా? దుర్మార్గు లైన రావణాదులకుఁ గదా యట్టి కార్య మిష్టపడును అని భావము.

తాత్పర్యము.

మిత్రుఁడా! నీ వీ చరిత్రము వినలేదా యేమి? ఇది ప్రసిద్ధమైనదే. ఒక పావురము తన భార్యను బోయవాఁ డొకఁడు చంపి తన ప్రాణంబు లాఁకలిచేఁ దపించుచు రక్షణము గోరి తా నున్న చోటికి రాఁగా నా మగపక్షి తన మాంసమును వాని కాహారముగా నిచ్చి రక్షించెను. అడవి దిమ్మరి! పక్షియే యట్లు రక్షింపఁగా శరణు అని వచ్చిన వానిని వదలిపెట్టుట నా యట్టి వానికి ధర్మమా?

క. మును కణ్వసుతుఁడు కండుం, డను పరమతపోధనాఢ్యుఁ ♦ డాడిన గాథల్
విను మతిధర్మిష్ఠంబులు, నినతనయా! సత్యవాక్సు♦హితమును వినుతున్. ౩౧

అర్థములు. పక్షిజాతి శాస్త్రోక్త మైన ధర్మానుష్ఠానమునకు అధికారి గాదు. అట్లుండ నట్టి పక్షి యనుష్ఠానము మన కె ట్లుపాదేయ మగును. మఱియు విధి శాస్త్రమునందుఁ జెప్పఁబడినదే ధర్మ మని మీమాంసకులు చెప్పుదురు. పైఁ జెప్పిన కార్యము ఏ విధిశాస్త్రమందుఁ జెప్పియుండుటం బట్టి మనము ధర్మ మని తెలిసికొనవలయును? ఆ విధి శాస్త్రమేది? యని యాక్షేపించుకొని కండు మహర్షి గాథ లందు విధి యుండుటచేత మన కిది ధర్మమై యనుష్ఠేయ మైనది యనుచున్నాఁడు. కణ్వసుతుం డనుటచేత మహావంశోత్పత్తియు, పరమ తపోధనాఢ్యుఁ డనుటచేత సమస్తాంశములను గూర్చియు యథార్థదర్శనమును, ఇతని గాథకుఁ జెప్పన సత్యవిశేషణము చేత సత్యవాదితయు నీ కండుమహర్షికిఁ జెప్పి నట్లాయెను. ఈ గుణములచేత నితఁడు పరమాప్తుఁ డని యిందు స్పష్ట మైనది. కాఁబట్టి యితని గాథ వేదవాక్కు వంటిదని సూచితము. మును ఆడిన గాథల్ - ముందున్న వేదవాక్యమునే యితఁడు గాథగాఁ జెప్పెనని భావము. గాథల్=అనేకార్థములు గల్గి అభ్యసించుటకు సులభముగాఁ గొలఁది పదంబులఁ గూర్చి యేర్పఱిచిన పద్యములు- అతి ధర్మిష్ఠంబులు = వేదమునఁ జెప్పఁబడిన ధర్మములవంటి ధర్మమును జెప్పునవి. అనఁగా స్మృతిరూపంబులు-సత్యవాక్కులును + సుహితములును=నిజమైన సంగతిని దెలుపునవియు, మేలైనవియు నగు గాథల్ వినుతును విను మని యన్వయము. ఇంతకు ముందుండి యన్ని మాటలను వినుచున్న సుగ్రీవుని గూర్చి యీ మాటల నట్టి నడుమ విను మని మరలఁ జెప్పినందుల కేమి కారణ మనఁగా - ఇంతకు ముందు రాముఁడు చెప్పిన మాటలను వినియు సుగ్రీవుఁడు వాని యభిప్రాయమును జక్కఁగఁ దెలిసికొనక పోవుటచేత నా ప్రకారము నడచుకొనక, తప్పు టాక్షేపణలు చేయుచున్నాఁడు. ఇఁక నైనను నట్లు చేయక వాఁడు

జాగ్రత్తగా విని మనస్సునందలి సందేహముల నన్నిటిని దీర్చుకొనవలె నని రాముఁ డిచ్చట శ్రద్ధతో విను మని చెప్పెను.

తా త్ప ర్య ము .

పూర్వము కణ్వమహర్షి కుమారుఁడైన కండుమహర్షి గొప్ప తపస్సంపద గలవాఁడు చెప్పిన పద్యములు గలవు. అవి మిగుల ధర్మస్థాపనము చేయునవి, యథార్థములైనవి- మేలిచ్చునవి - వానిని జెప్పెదను. చెవి మనస్సు నిచ్చి వినుము. (౨౮-౨ - ౨౮-౩ - ౨౮-౪ - ౨౮-౫ పద్యము లీ విషయమును దెలుపును.)

తే. కరములను మోడ్చి దైన్యంబు ♦ కడలుకొనఁగఁ
జేరితిని నీదు మఱువు ర♦క్షింపు మనుచుఁ
బ్రార్థనము సేయువాఁ డరి♦యైనఁ జంప
రాదు కరుణాగుణావనా♦ర్థంబు గాఁగ. ౨౮-౨

కండుమహర్షి చెప్పిన గాథలు నాలుగు- వానిలో మొదటిగాథయందు- పరిపూర్ణ మైన శరణాగతిచేయుటకు నొకనికి వీలులేక పోయినది. వాఁడు తన రక్షకుని గూర్చి శరణాగతి యంగములలోఁ జేరిన యంజలి బంధమో, మఱేదైన నొక యంగమున మాత్రమో చేసెను. ఆ చేసిన కార్యములయందే వాఁడు తన రక్షణ భార మంతయుఁ దన రక్షకుని యందే యుంచినట్లు సూచన యున్నది గదా. కాఁబట్టి వాఁడు పరిపూర్ణశరణాగతి చేయ లేదని వానిని వదలిపెట్టరాదు. వాస్తవముగ దయను బాటించు రక్షకుఁడైనచో నట్టి వానిని దప్పక రక్షించు ననుచున్నాఁడు. కరములను మోడ్చి = అయ్యా నిన్ను నేను శరణుఁ జొచ్చినాన ని చెప్పుకొనుటకు వాగింద్రియము స్వాధీనత తప్పియున్నను అంజలి మాత్రము చేసినను జాలును. "అంజలిః పరమా ముద్రా క్షిప్రం దేవప్రసాదినీ" యున్నట్లు స్వతంత్రుఁడై యున్న భగవంతునికిని వేసిరము దయ పుట్టించునదిగదా యీ యంజలిముద్ర. దైన్యంబు కడలుకొనఁగఁ = అంజలి చేయుటకు హస్తములు స్వాధీనత తప్పియున్నను దన దీనస్థితి చూపునట్లు వాఁడు వెలవెలఁ బోవుచుండినను జాలును. చేరితి నిత్యాది-నీదు మఱువు= నీ యాశ్రయమునందు, అంజలి చేయుటకు వీలులేక పోయినను దైన్యము చూపలేకపోయినను మనస్సునం దాతనిని దనకు రక్షకునిఁగాఁ బ్రార్థించినను జాలును. అరియైనను = తనకు సాక్షాచ్ఛత్రువైనను, ఇట్లు అంజల్యాదులు చేయుచున్నను మెుందున్న శత్రుత్వము ప్రకృతి సంబంధమును బట్టి మరల ననువర్తించినను జంపరాదు. ఇట్టివానిని జంపరాదని యీ శాస్త్రము చెప్పుట యిహలోక సౌఖ్యార్థమా, లేక పరలోక సౌఖ్యార్థమా, కానిచో బాపప నోదనార్థమా యని యాశంకించుకొని యివి యేవియుఁ గావు; తనకున్న దయాగుణ సంరక్షణార్థ మని ప్రత్యుత్తరము చెప్పుచున్నాఁడు. కరుణాగుణావనార్థంబుగాఁగ = "ఆనృశంస్యం పరో ధర్మః" యని గదా సీతావాక్యము.

తాత్పర్యము.

రెండుచేతులు జోడించుకొని, దీనత్వ మతిశయింపఁగా నీ మఱుఁగు చేరితిని, నన్ను రక్షింపు మని కోరువాఁడు తనకు శత్రువైనను మఱి యే కారణముచేతఁ గాని, కరుణాగుణమును రక్షించు నిమిత్తమై వానిని జంపరాదు, కాపాడవలయును.

తే. పరులకును శరణాగతుఁ ♦ డరియుమైన, నార్తుఁడైనను మఱి దృప్తుఁ ♦ డైనఁ గాని
యాత్మనాశంబునకు నోర్చి ♦ యైనఁ గావ, వలయు శాస్త్రనువిశ్వాస♦ భావులకును.

అర్థములు. ఒకఁడు తానై సాక్షాత్తుగా శరణాగతుని హింసింపఁ బోఁగా వాఁడట్టి కార్యమును జేయ రాదని పూర్వపద్యమునందు నిషేధించినాఁడు. పరుఁడు హింసించుచున్నను శరణాగతునిఁ దనప్రాణముల నాశింపక రక్షింపవలెను. అప్పు డా శరణాగతుఁ డార్తుఁడా, దృప్తుఁడా యని విచారము పుట్టుకొనరాదని యీ పద్యము నందుఁ జెప్పుచున్నాఁడు. శరణాగతుఁ డరియైనను = ద్వేషము మనస్సునఁ బెట్టుకొని పైకిమాత్రము శరణాగతి శబ్దము చెప్పుచున్న వాఁడైనను, అట్లు గాక ఆర్తుఁడైనను = (1) తా నే ఫలము నుద్దేశించి శరణాగతి చేసెనో యా ఫలమునకై త్వరపడు వాఁడైనను (2) తాఁ జేసిన తప్పులను దలఁచుకొని తలఁచుకొని భయపడు వాఁడైనను, దృప్తుఁడైనను = (1) మన శరణాగతి ఫలము నేఁడుగాని, చిరకాలము నకుఁగాని యెప్పుడైనను రాసీ యని త్వరలేనివాఁడైనను, (2) తన తప్పులకై భీతిల్లక తనకు వినయము లేదనియు జంకక యున్న వాఁడైనను, మోక్షార్థియై శరణాగతుని విషయమున నీ పదములకు ననుస్వయ మెట్లనఁగా, ఆర్తుఁడు = (1) సంసార మసహ్యముగాఁ దోఁచి దేహ మెప్పుడు వదలునా యని త్వరపడుచుండు వాఁడు (2)తన కొక గుణమును లేదనియు మోక్షార్థమై దా నొక యుపాయమును ననుష్ఠింప లేదనియుఁ దలఁచి తన యాకించన్యానన్యగతికత్వములను దెల్పుచు భయభక్తులతో శరణాగతుఁడు-దృప్తుఁడైనను = శరీర మున్నవఱ కుండనీ, ఆపై మోక్షము రాసీ యని యుండు వాఁడైనను (2) ఎగతాళి పరిహాసమునకై శరణాగతుఁడైనట్లు తలంచు చుండువాఁడైనను, శాస్త్రనువిశ్వాస భావులకును=ధర్మ శాస్త్రములను నమ్మిన మనస్సుకలవారికి, ఆత్మనాశం బోర్చియైనఁ గావవలయును. అందఱకును దన ప్రాణము తియ్యనిది. అట్టి ప్రాణమునకు లోపము వచ్చినను రాసి యని యుండవలెను శరణాగత రక్షణ సమయమునందు. అదేల యనఁగా ప్రాణములు నశ్వరములు, శరణాగత రక్షణ ధర్మము స్థిరముగదా యని భావము. శాస్త్రనువిశ్వాసభావుల కని చెప్పుటచేతఁ బండితులు తప్పు చేసిరేని శిక్ష యధిక మని భావము. "సర్వథై వాత్మానం గోపాయే"త్తని శాస్త్రమునం దాత్మరక్షణము ప్రధానముగాఁ జెప్పియున్నను నిది సామాన్యశాస్త్రము కాఁబట్టి యిది విశేషమైన శరణాగతి శాస్త్రమును బాధింపక శరణాగతి రక్షణమునందుఁ దప్పఁ దక్కిన కాలములందు నాత్మరక్షణము ప్రధాన మని నిర్వహించుకొనునది.

తాత్పర్యము.

శాస్త్రమునందు నమ్మకము గల మనస్సు గలవారు తమకు శరణాగతుఁడైన వాఁడు శత్రువైనను; ఆర్తుఁడైనను, దృప్తుఁడైనను, దన ప్రాణము పోవుట సహించి యైన వానిని రక్షింపవలయును.

తే. భయముచే నొండె మోహాంబు♦వలన నొండెఁ
ప్రతిఫలాసక్తి నొండె స్వ♦బలముకొలఁది
ప్రాపుకోరినవారిఁ గా♦పాడఁ డేని
వాఁడు పొలియు నిహంబునఁ ♦ బరమునందు. ౩౮౪

అర్థములు. శరణాగతరక్షణమును గూర్చి శాస్త్రమున విధి యున్నదని యింతకుముందు పద్యములందుఁ జెప్పెను. అట్లు శరణాగతరక్షణము చేయనియెడలఁ బాపము తప్పక కలుగు నని యీ పద్యమునఁ జెప్పుచున్నాఁడు. భయముచే నొండెన్ = (1) వ్యాఘ్రకిరాత న్యాయప్రకారము ఈ శరణాగతుని రక్షించితిమేని వీని శత్రువు మనల నేమిచేయునో యని భయముచేతఁగాని, (2) మనము వీనిని శరణాగతుఁడని రక్షించినచోఁ దిరుగ వీఁడే మనలను దిరుగఁబడి కొట్టునేమోయని భయము వలనఁగాని, మోహాంబువలన నొండెన్ = చక్కని శాస్త్రజ్ఞానము లేకపోవుటచేత గాని, ప్రతిఫలాసక్తి నొండెన్ = శరణాగతుని శత్రువునొద్దనుండి లంచము పుచ్చుకొని శరణాగతుని వదలెనేని - స్వబలముకొలఁది = తన శక్తికొలఁది, తానైతోడ్పడుటయో, ద్రవ్యమూలమునఁ దోడ్పడుటయో, ప్రాణమునే యిచ్చి తోడ్పడుటయో, యేదైన నొకరీతిగా - ప్రాపుఁ గోరిన వారిన్=శరణాగతుని - కాపాడఁడేని అట్లు కాపాడనివాఁడు - వాఁడిత్యాది = ఈ లోకమున నపకీర్తిపాలై పరలోకమున నరక మనుభవించు నని భావము.

తాత్పర్యము.

శరణాగతుని రక్షించితినేని వీని శత్రువు మనలఁ జంపునో, లేక వీఁడే యక్కఱ తీఱినవెనుక తిరుగఁబడిచంపునో యను భయముచేఁగాని, శాస్త్రజ్ఞానము లేకపోవుటచేఁ గాని నీవు నాకు లంచ మిచ్చిననో మఱియేదైన మేలుచేసిననో కాపాడెదను, లేకున్నఁ గాపాడ నని చెప్పిగాని, తన సహాయము గోరినవానిఁ దనశక్తికొలఁది రక్షింపనివాఁడు ఈ లోకమందుఁ బరలోకమందుఁ గూడ నాశ మగును. దీనివలన శరణాగతుని రక్షింపనిచోఁ బ్రత్యవాయము గల దనియుఁ గావున నిది నిత్యవిధి యనియు నేర్పడెను.

తే. తాను జూచుచునుండఁగఁ ♦ దన్ను శరణుఁ, జొచ్చినాతఁడు పరునిచేఁ ♦ జచ్చెనేని
యా యనాథుఁడు రక్షసేఁ♦యనినృశంసు, నెల్లసుకృతంబుఁ గైకొని ♦ యేగువాఁడు.

తాత్పర్యము.

తనకు శరణాగతుఁడైనవాఁడు తాను రక్షింపమిచే వాని శత్రువుచేఁ జంపఁబడె నేని రక్షింపఁబడనివాఁడు వానిని గాపాడని నిర్దయుని సుకృత మంతయుఁగొనిపోవును.

విరుద్ధము కాక యుండవలెను. పూర్వాపరములు చక్కఁగా విచారించి చేయఁబడు సిద్ధాంతము సమ్యక్సంకల్పజకామ మని యాజ్ఞవల్క్యులు. సమ్యక్సంకల్పజకామ మను చోట కామ మనఁగా శాస్త్రవిరుద్ధముకాని వ్రతమని యర్థము. దీనినే శీల మని మనువు చెప్పెను. ఇట్టివ్రతము తనకుఁ గల దని రామచంద్రమూర్తి చెప్పుచున్నాఁడు.

మైత్రి భావించి యను పద్యమునఁ దన ప్రకృతిని రాముఁడు చెప్పెను. ఈ పద్యమునందు - ఆ ప్రకృతి ననుసరించియుండు తన వ్రతమును (ప్రతిజ్ఞను) జెప్పుచున్నాఁడు.

నీ వాఁడు-"కొన్ని యెడల మధ్యమోత్తమ పురుషంబులకుఁ బ్రథమ పురుష మగు" సు. వ్యా. కారక. ౮౦ సూ. ప్రకారము ఉత్తమపురుషమునకుఁ బ్రథమ వచ్చెను. "పాండు భూవరునకుఁ గోడలైతి" నన్నట్లు నీ వాఁడను అని యర్థము. ఇది శేషషష్ఠి కావున సంబంధమును దెలుపును. నాకు, నీకు సంబంధము గల దని భావము. ఏమి సంబంధ మనిన రక్ష్యరక్షక సంబంధము. రక్షింపఁబడవలసిన వాఁడను నేను. రక్షింపవలసిన వాఁడవు నీవు. స్వామివి నీవు. భృత్యుఁడను నేను - అను నట్టి సంబంధము. (౨) నీవాఁడు=వీఁడు నీ వాఁడు అని నీనీతిని ప్రథమగా గ్రహింప వచ్చును. అప్పు డిది కార్పణ్యమును సూచించును. 'ఒకపరియే' యనుటలో ననకారి మిచ్చుట ననుసంధింపవలయును. నీ వాఁడే యని యేర్పడును. అప్పుడు నేను నీ వాఁడనే కాని నా వాఁడను గాను, రావణుని వాఁడను గాను, మఱియెవ్వరి వాఁడను గాను- అని యర్థ మిచ్చుచున్నది. దీనివలన నుమ్మతేయము, అనన్యార్హశేషత్వము, స్వాతంత్ర్యము దొలఁగుచున్నవి. వీరశాగతుఁడు వేద నెన్న చెప్పినను, కినిసినను, బెదిరించినను, వంచిన మనినను, స్థిరచిత్తుఁడై తొలఁగక యనన్యగతికుఁడై యుండవలె నని 'ఏ' కారము తెలుపుచున్నది.

మీరు "దురాత్ముల్ర వధింపఁగ నాస్తి యిమ్ము" "నేలఁబడి చెల్లి చూడుము." "వీని నిప్పుడే పొనఁగుపడంగఁ జేతడగు" అని యిట్లు మీరు దూషించినను, చంపెద మని బెదరించినను లక్ష్యము సేయక యిటునటు కదలక, బెదరక యింత సేపు నిలువవేసినను విడిచి మరలిపోక యున్నాఁడు గదా. ఇది గదా యనన్యగతి కుని లక్షణము. ఇదియే పారతంత్ర్యము.

ఒక్కపరియే = ఒక్కసారి మాత్రమే. పలుమారులు నాకుఁ జెప్పవలసిన పని లేదు. స్మృతిబలములేని మఱపుగొట్టునకు చెప్పు విన్నపము శ్రుతిపలుకవలెను. (౨) అనేక కోట్లజన్మములలో నొక జన్మమందు మాత్రమే. అయినను, బ్రవృత్తి ననుష్ఠించినది మొదలు నీ వాఁడను అన్నది మొదలు ఆయుష్య ముండువఱకుఁ దాను జెప్పినది తాను మఱచిపోక యుండినచో నది యొకసారియే యగును. ఇట్లు చెప్పు టచే "బహూనాం జన్మనా మన్తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే" అనేక పుణ్య జన్మముల కావల జ్ఞానము గలవాఁడు ప్రపత్తి చేయును అనియు, "ప్రియత్వా ద్యత

మానస్తు యోగీ సంశుద్ధ కిల్బిషః । అనేకజన్మ సంసిద్ధ స్తతో యాతి పరాంగతిమ్" దృఢప్రయత్నము గల యోగి యనేక జన్మములు కాని శుద్ధుఁడై పరమగతికిఁ బోవును. ఇట్లులే భక్తికిని జన్మాంతరములు చెప్పఁబడెను. ప్రపత్తి నే జన్మమందు గలుగునో యా జన్మమందే ముక్తి కలదు. కావునఁ దక్కిన వానికంటె నిది విలక్షణ మైనది. కడసారి జన్మమందుఁ గాని, ప్రపత్తిచేయ బుద్ధి పుట్టదు.

ఒకసారి యథావిధి చెప్పిన పిమ్మట మరల దాని స్మరించుట దానియందలి రుచినిబట్టియే. కర్మజ్ఞాన, భక్తిజ్ఞానములు మొదలైన యుపాయములలో రెండు మూఁడుసార్లు ఆవృత్తి గలదుగాని, ప్రపత్తివిషయమున మరల నావృత్తి లేదనియే శాస్త్రార్థము. "సకృదేవ హి శాస్త్రార్థః కృతోయం తారయే న్నరమ్" అని ప్రపత్తి శాస్త్రప్రమాణము.

ఏవాఁడేని=ఏ జాతివాఁడైనను, ఏ నీతివాఁడైనను, ఏ వయస్సువాఁడైనను, ఎంతటి పాపియైనను, పశువులు, పక్షులు నైనను, స్త్రీయైనను, పురుషుఁడైనను. తక్కిన యోగములకు జన్మము, వృత్తి, వృత్తములోనగు నియమములు గలవు. శరణాగతికి నధికారి నియమము లేదు. ప్రపత్తి కెవ్వఁడైన నధికారియే. రుచియుండినఁ జాలును. శరణు = రక్షణము, ఏ విషయమందైనను సరియే, ఐహికమునకై కాని, ఆముష్మికమునకై గాని, మోక్షమునకై కాని, వేఁడెనేని = కోరినంతమాత్రమున, నీ వాఁడు అని యనుటచే వాగ్రూపమైన శరణాగతి చెప్పఁబడెను. కోరెనేని యనుటచే మానసికము చెప్పఁబడెను, రెంటిలో నేదైనఁ జేయవచ్చును. నీవాఁడని వేఁడునేని, ఒకపరియే శరణు వేఁడునేని యని రెండు వాక్యములుగా నన్వయింపవచ్చును. అందు మొదటివాక్యము రెండవ వాక్యమునఁ జెప్పఁగల శరణాగతికి శేషత్వానుకూలమైన ఫలప్రార్థనము చెప్పును. ఆ ఫలసాధనమైన శరణాగతిని రెండవ వాక్యము చెప్పును. వేఁడునేని- ఇది తద్ధర్మార్థకము కావున మూఁడుకాలములందు నన్వయించును. వేఁడుచుండునేని, వేఁడగలఁడేని, వేఁడెనేని యనుటచే తైలధారవలె నవిచ్ఛిన్నమైన భావనాసంతతి రూపము గల భక్తి చెప్పఁబడెనని కొందఱందురు గాని యిందట్టిది లేదు. వేఁడినఁ- అనినఁజాలదా? ఏని శబ్ద మేల? వేఁడినపక్షమునందే యని- వేఁడుట యందుఁ బ్రాధాన్యము తెలుపుటకే. వేఁడనివారిని రక్షింపనని భావము. కోరని వారిని రక్షింపఁబూనితినేని లంకలోని యందఱను రక్షింపవలసివచ్చును. అప్పుడు దుష్టులకు, శిష్టులకు, మిత్రులకు, శత్రులకు భేదము లేకపోవును. శిష్టత్వము నశించును, దుష్టత్వము ప్రబలును. కావునఁ గోరినవారిని మాత్రమే రక్షింతును. అట్లైన పశువులను, పక్షులను రక్షింతునంటివే? అవి వచ్చి మేము నీవారమని నీతోఁ జెప్పుకొనఁగలవా? చెప్పుటకు శక్తిగలవారిని జెప్పుమంటినిగాని, శక్తిలేనివారిని జెప్పుమంటినా? అవి నన్నుఁజూచి నేనున్నచోటనుండి నాయందనురాగముగల వగునేని జాలును. కావున నే యయోధ్యయందుండు పశువులకుఁ, బక్షులకుఁ, బురుగులకుఁగూడ

మోక్షమిచ్చెదను నీవే చూడఁగలవు. "ధరిని నగోచరంబు లగు భూతములున్ రఘు వంశవర్ధనున్, సరసతఁగన్న ప్రాణులును స్థావరముల్ రఘురాము వెన్కనే, బుర మున నెట్టి శ్వాసమును బుచ్చెడి దొక్కటి యైనలేక" ఉత్తర ౧౨.౪౯. సకల భూతా వళికిన్ = సమస్త జంతుకోటికిన్, మనుష్యులకు మాత్రమే కాదు, పశువులకుఁ, పక్షులకు క్రిమికీటాదులకుఁ గూడ (౪) పంచమ్యర్థమున షష్ఠి- సకల భూతావళివలన నని యర్థము. నాకు శరణాగతుఁడైనవాని కెవరు భయము కలిగింతురో వారి యుండఁ జలనను, అభయము = భయము లేకుండుట, భయము = మృత్యువు, "కం. జీవికి మరణభయముగా, కాన లభయ మే గలుగ నిన విశ్రమించున్, జీవికి మృత్యువుతో నది, యేనా నైనియు లేదు" ఉత్తర ౨౦౮ ప. కావున నభయ మనఁగా మోక్షము. "అథ సోఽభయంగతో భవతి" బ్రహ్మణ్యని యభయమును బోధించును. "ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చన" బ్రహ్మవిద్వలన ఫలము అభయ మని శ్రుతి చెప్పుటచే అభయమునకు మోక్ష మనియే యర్థము. వారి యభయము - ఉత్కృ ష్టము. వారికి యభయ మనుటచే పరిపూర్ణ బ్రహ్మానుభవాత్మకమైన సాయుజ్యము. ఇది నీవాఁడను అని రక్షణము కోరినవారి విషయము. ఇక ఐశ్వర్య కాములకు ననలక్షణముగా నెట్లుండునదగు. "శక్రాద్యారోగ్య మైశ్వర్యం, భోగాంశ్చైవానుషంగికాన్। దదాతి ధ్యాయినాం నిత్య మపవర్గప్రదో హరిః॥" "అయాచితోఽపి యత్స్వర్గం ... నిదధా మ్యహం" మ్మన్నట్లు మోక్షమునే యియ్యఁగల భగవంతుడు ఐశ్వర్యకామ ములు విచ్చుట యేమి వింత?

అభయము - నఞ్ తత్పురుషము. ఇచ్చట నకారము అన్యార్థము - తదభా వార్థము- తద్విరోధార్థము- అను మూఁడర్థములను తెలుపుచున్నది. అభయము = అనఁగా భయమునకంటె నన్యమైన దని యర్థము. భయమునకంటె వేరైనది క్షేమము. కావున నభయమనఁగా క్షేమ మని యర్థము. 'ప్రాప్తస్య రక్షణం క్షేమ'మని యుండు టచే ప్రపన్నునకు లభించియుండు భోగ్యభోగోపకరణాదులు సురక్షితములుగాఁ జేయుదు నని యర్థము.

తదభావ మను నర్థమున యభయ మనఁగా భయములేమి-దానిని కలిగించెద నని యర్థము. భయము కలుగు కారణమే లేకుండఁ జేయుదును

తద్విరోధము = అభయ మనఁగా భయమునకు విరుద్ధమైనది. శత్రువులు కీడు చేయుదురేమో యను మనోవ్యాపారము. దీనికి విరుద్ధమైనది శత్రువుల వలన కీడు లేదని నిబ్బరముగా నుండుట. ఇతఁడు ప్రపన్నుఁడు, పూజ్యాత్ముఁడు, వీనికి మనము కీడుచేయ రాదని పగవారుకూడ చేతనైన మేలుచేయుదురు.

అతీతము శోకము - వర్తమానము వ్యథ - రాఁబోవునది భయ మనఁబడును. కావున భయము భవిష్యత్కాలమున రాకుండఁ జేయుదు నని భావము.

ఇది నాకు వ్రతము = వ్రతము పూనినవాఁడు దానిని నడుమ విడిచెనేని

యపకీర్తి యగును. కావున నే వ్రతమైనను బూని విడువ రాదు. శరణాగత రక్షణము నా కట్టివ్రతము. నేను విడువ సాధ్యపడదు. శ్రుతిస్మృతిశిష్టాచారసమ్మతమై, యాత్మ ప్రియమైన వ్రతమును నేను విడిచితినేని నా కంటె దుశ్శీలుఁ డెవఁడు? నా నడవడిచే లోకమునకు ధర్మ ముపదేశింపవలయు నని నా యుద్దేశము. నా నడవడి వక్రమైనచో లోకమంతయు వక్రపు నడవడి కలది యగును. అది సహ్యమా? సర్వ భూతముల కనుటచే నన్నాశ్రయించినవారికే గాక నన్నాశ్రయించినవారి నాశ్రయించిన వారిని గూడ రక్షించెదను- అని భావము. కావుననేకదా శరణాగతి విభీషణుఁడు మాత్రమే చేసినను ఆ యనతో వచ్చిన నలువురకు రామచంద్రమూర్తి యభయ మిచ్చెను. "పశు ర్మనుష్యః పక్షీ వా, యేచ వైష్ణవసంశ్రయాః। తేనైవ తే ప్రయాస్యంతి తద్విష్ణోః పరమం పదమ్" అని ప్రమాణము. పశువులుగాని, మనుష్యులు గాని, పక్షులుగాని వైష్ణవుని నాశ్రయించున వన్నియు నాయన వెంట విష్ణుమూర్తి యొక్క పరమపదమునకుఁ బోవును- అని యర్థము.

—♦ శ్రీరామ సుగ్రీవ సంవాదము ♦—

సుగ్రీ.— రామచంద్రా! శరణాగతుఁడగు ప్రపన్నుని రక్షింపవలసినది విధి యని శ్రుతి స్మృతి శిష్టాచార ప్రమాణములను, స్వప్రియమును, దాని కారణములను జెప్పితివి. అంగీకరించితిని. శాస్త్రవిరుద్ధముగ, శిష్టాచారవిరుద్ధముగఁ బొమ్మని నేను జెప్పను గాని,

"సీతాఁ దని యొసఁగియో, యేవాఁడేఁ శరణు వేఁడు నేని సకల భూ
తావళి కభయంబును నే, నావీడ నొసఁగెదను నిదియ వ్రతము మాకున్"

అని చెప్పితివే- ఆ విషయమున నాకుఁ గొన్ని సందేహములు గలవు. అడుగుదునా?

రామ— నీవు విరోధియని నీయుపదేశమువలన నెఱుఁగనట్లు నాకు నేనేల చెప్పకుందును? అవశ్య మడుగుము.

సుగ్రీ.— నీవాఁడని విభీషణుని నంటివే. ఆయన నీకుఁ దండ్రిగాఁడు, తోడఁబుట్టినవాఁడు గాఁడు, తుదకు సజాతీయుఁడు కూడ గాఁడే! వాఁ డా మాట యను టెట్లు? నీవు దాని నంగీకరించు టెట్లు?

రామ— నా వస్త్రమని నీ వనెదవే, అది నీకుఁ దల్లియా? తండ్రియా? తోడఁబుట్టువా? నీ సజాతీయమా?

సుగ్రీ.— నేను ధరించువాఁడను, అది ధరింపఁబడునది. ఆ సంబంధముచే నా వస్త్ర మందును.

రామ— మఱియొకరి వస్త్రమును నీ వొకసారి ధరించి విడుతువేని దానిని నా వస్త్ర మందువా?

సుగ్రీ—అనను. అది నియతముగ నా సొత్తు గాదు. దానియందు నాకు నిత్య స్వామిత్వము లేదు.

రామ—అట్టులే నీవాఁ డనన్నప్పుడును, నీవు స్వామి వని - నీ సొమ్ము నేనని - నీవు రక్షించువాఁడ వని - నేను రక్షింపఁబడవలసినవాఁడ నని - ఈ సంబంధము మనయందు నిత్య మని యర్థము. ఇట్టి సంబంధము గల చోటనే నీ వాఁడు, నా వాఁడు అను శబ్దములు ప్రయోగింపఁబడును. విభీషణుఁ డిట్టి భావము గలవాఁడు కావున నీవాఁడ ననెను.

సుగ్రీ—రామచంద్రా! నీవు చెప్పినది తృప్తికరముగా లేదు. విభీషణుఁడు ఇక్కడ నీవాఁడను అనినది సరే. మీఁదట నేను రావణుని తమ్ముఁడ ననలేదా? నా భార్యను బిడ్డలను అనలేదా? అవి యనాదినుండు సంబంధములే కదా. దీనికి దాని కేమి భేద మున్నది?

రామ—నీవు చెప్పినది సత్యమే. విభీషణుఁడు లంక విడుచువఱకు రావణుఁడు రక్షకుఁడు, తాను రక్ష్యుఁడు- అను భావ ముండినది. ఆ భావమే యిప్పుడున్న నిచ్చటి కేల వచ్చును? వానిని విడిచికదా నా యొద్దకు వచ్చినాఁడు. తన్నుఁ దాను రక్షించుకొనఁ గల నని కాని, భార్యలు బిడ్డలు రక్షింతు రని కాని ధైర్య ముండినచో వారినందఱ విడిచి నా యొద్దకు వచ్చునా? రావణునందు స్వామిభృత్యన్యాయము, స్వస్వామిన్యాయము, రక్ష్యరక్షక భావము, పూర్వ ముండినది, యిప్పుడు లేదు. తన్నుఁ దాను రక్షించుకొనఁగల నని స్వాతంత్ర్యముగాని, ఇతరులు తన్ను రక్షింతు రని పరపారతంత్ర్యము గాని యున్న యెడల వానిని నేనుఁ జేకొనకయుందును.

సుగ్రీ—ఒకపరియే యంటివే, పలుమాఱు చెప్పుకొన్న దోషమా?

రామ—'దొఱసితి నీదు చెల్మి మన దుఃఖసుఖంబులు పొందె నైక్యమున్' అని నీవు నాతోఁ దొలుత నొకనాఁడు చెప్పితివి కదా. దినదినము మా మాట నీవు చెప్పుచున్నావా? ఏల చెప్పవు!

సుగ్రీ—నేను నీ స్నేహితుఁడ నని నీవు దృఢముగ విశ్వసించితివి. నీవు నా మిత్రుఁడ వని నేను నమ్మితిని. తెలిసినవిషయము మరల మరలఁ బ్రస్తావింప నేల? నీవు మఱచినఁగదా నేను బ్రస్తావింపవలె.

రామ—ఆ కారణముచేతనే ప్రపత్తి పలుమాఱు చేయరాదు. ప్రపత్తి యనఁగాఁ బ్రకృష్టజ్ఞానము. నేను సుహృత్తు, శేషి, రక్షకుఁడు, స్వామి యనియుఁ దాను భృత్యుఁడు, రక్ష్యుఁడు సొమ్ము అను జ్ఞానము. విభీషణుఁడు తాను నావాఁడ నని నమ్మెను. విభీషణుఁడు నా వాఁ డని నేను గ్రహించితిని. నేను మఱచి పోయినఁగదా ఆయన పలుమాఱు హెచ్చరింపవలె. నాయందు శక్తిబలము గల దని మీరే చెప్పితిరిగదా. (చూ ౩౮_౨) సీతాదేవియు.

రామ—అవశ్యము రక్షింతును. వాఁడు పరమపాపి యని నీ వంటివే కాని వాఁడు పూర్వజన్మమందు నా విషయమై యేదియో పుణ్యకార్యము చేసియుండి యది ఫలించుకాలము వచ్చుటచేతనే వానికి నేను జ్ఞప్తికి వచ్చుటేగాక నీ వాఁడను అన నోరు వచ్చినది. వాని పాపములు హరించిపోయి బాగుపడు కాలము రాకుండిన వానినోట నామాట రానేరాదు. పాపము లన్ని హరించి బాగుపడు కాలము వచ్చుటచేతనే వాఁడు ప్రపన్నుఁడై నేను నీ వాఁడ ననఁ గలిగెను. వానికా బుద్ధి తేరకు నిష్కారణముగా వచ్చెనా? పూర్వ సుకృత ఫలముగా వచ్చెను. లంకలో నందఱు రాక్షసు లున్న వారుకదా! విభీషణుఁడు తప్ప మఱి యెవ్వఁడైన వచ్చెనా? విభీషణునకైనను తల్లిదండ్రులయొద్దకో కుబేరుని యొద్దకో పోద మని బుద్ధిపుట్టక యిక్కడికి రావలయు నని యేల బుద్ధి పుట్టెను? కావునఁ బాపము లన్నియు హరించుకాలము వచ్చినవాఁడే ప్రపత్తి చేయును. తక్కినవారికి నీవు చెవులలో శంఖములు పెట్టి ప్రపత్తి ప్రపత్తి యని యూఁదినను వినరాదు. విభీషణుని మాట లేల రావణుని చెవి కెక్కలేదు? అవి విషప్రాయములుగా వానికి దోఁచలేదా? కావున శరణాగతుఁడైన వానిని బాపాత్ముఁడ వందువేని నీవే పాపాత్ముఁడ వగుదువు. ఎట్లన:—'తస్యానుబంధాః పాప్మానః సర్వే నశ్యంతి తత్క్షణాత్' భగవంతునకుఁ బ్రపన్నుఁడైన క్షణమందే వానికంటియుండిన ఆగామి సంచిత పాపములు, వాఁ డంగీకరింపని ప్రారబ్ధములు నశించును. కావున వాఁడు పాపాత్ముఁ డెట్లగును? పాపుఁడు కాని వానిని బాపుఁ డనుటయే మహాపాపము.

సుగ్రీ—అట్లైన దీనికి జాతి, నీతి యక్కఱలేదా?

రామ—ఏ జాతివాఁడైనను, ఏ నీతివాఁడైనను, పురుషులైనను, స్త్రీలైనను, బాలురైనను, వృద్ధులైనను, శరణాగతులు కావచ్చును. ఈ యూరు మాది, యా యూరు మీది యని మన మనుష్యులము చెప్పుదుము. చక్రవర్తికో? ఇది శనివారము, అది మంగళవార మందుము. సూర్యునకో? వారిలో వారికి భేదబుద్ధి యుండినను తల్లిదండ్రులకు పిల్లలందఱు సమానులే కదా.

సుగ్రీ—వాఁడు నేని యంటివే. ఒకఁడు నీ యొద్దకు రాలేక తానున్నచోటనే యుండి శరణుచేయును. మఱియొకఁడు మనస్సులోనే తలఁచును. వానినిఁ గూడ రక్షించెదవా!

రామ—నీ వాఁడను అని వాక్కుతో ననవచ్చును. దానికి శక్తి లేకపోయిన మనస్సులో ననుకొనవచ్చును. అట్టివానిని నేను బోయి రక్షింపవలసిన కార్యమైన నేనే పోదును. సంకల్పముచేఁ జేయఁదగినదైన నట్టులే చేయుదును. విభీషణుఁ డిక్కడికి రాక లంక యందుండి శరణు అని యుండిన నేనే యక్కడికిఁ బోయి

రక్షించియుందును. వాఁడే యిక్కడికి వచ్చి నాకెంతో సాహాయ్యము చేసెను. అట్టి వానిని నే నెట్లు విడుతును?

సుగ్రీ—రామచంద్రా! నీకు నల్లని వన్ని నీళ్ళు, తెల్లని వన్ని పాలు-నీవలెనే యితరు లనుకొనుచున్నావు. చేతులు జోడించినదే చూచి ప్రపన్నుఁ డనుకొంటివి గాని చంకదుడ్డు శరణార్థి యనుమాట నిజముగా- వానిచంకలో నే మున్నదో చూడుము. ప్రపన్నునకు గద యేల ?

రామ—కామిలారోగికి పాలు, శంఖము కూడ పసుపుగానే కానవచ్చును. నీవు దోష బుద్ధిఁ జూచుచుండుటచే నీకు గుణము దోషముగాఁ గానవచ్చుచున్నది. నీ యొద్దఁ గొలువుచేయ నొక వడ్రంగి వచ్చె ననుకో - వాఁడు బాడిసె, ఉలి, గూటము దెచ్చిన నవి నిన్నుఁ జంపుటకా ? అట్లులే యితఁడు క్షత్రియుఁడు, క్షత్రియవృత్తి నుండువాఁడు, యుద్ధకాలమున మనసేవ చేయవచ్చినాఁడు. ఇట్టివాఁ డుత్తచేతుల వచ్చె నేని యెట్లు సేవ సేయఁ గలఁడు? కావున దానికిఁ గావలసిన కొలిముట్లు తెచ్చుకొన్నాఁడు. అది దోషమా? నాకుఁ బాలు తెల్లఁగా గానవచ్చుచున్నవి. నీకు నల్లగాఁ గానవచ్చుచున్నవి.

సుగ్రీ—సకల భూతావళికంటెనే-ఒకఁడు ప్రపత్తిచేసిన లోకములో నందఱ రక్షింతువా?

రామ—ప్రపత్తిచేసిన వానినేకాక వానికి సంబంధించి, వాని ననుసరించి, వాని యందుఁ బ్రేమ కలిగి వానిప్రేమకుఁ బాత్రులైన యందఱను వాని పశువులను, పక్షులను, మృగములను, మనుష్యులను నందఱను రక్షింతును. విభీషణుఁడు మాత్రమే కదా శరణనెను. వానితోడ వచ్చినవారినిగూడ రక్షింతును. వారు ప్రత్యేకించి చెప్పుకొనవలసిన పని లేదు. వానితోడ నుండినఁ జాలును. సుగ్రీవా ! నీ మంత్రులు నీ యొద్దఁ గొలువుచేయు చున్నారు. కాని వారి భార్యలు బిడ్డలు సేవకులు నీ యొద్దకు వచ్చి సేవచేయుట లేదు. నీ ముఖమైన వా రెఱుఁగుదురో, యెఱుఁగరో - అట్లుండియు నీవు మంత్రుల రక్షణమునకై యిచ్చునవన్నియు వా రనుభవించుచున్నారు గదా. వారిని నీవు రక్షించిన వాఁడ వగుచున్నావు గదా. కాఁపులయింట దున్ని, విత్తి, పైరుపెట్టి, కాచి, కోసి ధాన్యము తెచ్చువాఁ డొకఁడే. ఆ ఫలము నందఱు అనుభవింతురు గదా. అట్లులే నా విషయమునఁ బ్రపత్తి చేసినవాఁ డొకఁడే యైనను వాఁడు భరింపవలసిన వారి నందఱ నేనే భరింపవలయును. భరింతును. భరన్యాస మనఁగా నేమి? వారి భారము లన్నియు నామీఁద వేయుటే కదా.

[ శ్రీమద్రామాయణము - "వేదోపబృంహణార్థాయ తా వగ్రాహయత ప్రభుః" అని వేదోపబృంహణార్థము వాల్మీకి బాలుర గ్రహించె నని రామాయణమందే చెప్పఁబడెను. "వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా" యనియుఁ గలదు. వేదోపబృంహణమనఁగా వేదార్థమును

విశదీకరించుట యని యర్థము. అటయినచో రామాయణమే వేదవాక్యముల యర్థమును విశదీకరించుచున్నది- అను ప్రశ్న రాఁగా "తగ్ంహ దేవ మాత్మ బుద్ధి ప్రసాదమ్, ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే" ముముక్షు వగు నేను బుద్ధిప్రసాదమును గలిగించు భగవంతుని శరణు చొచ్చెదను. "ప్రయత పాణిః శరణ మహం ప్రపద్యే" పరిశుద్ధహస్తుఁడనై నేను శరణు చొచ్చెదను. "స్వస్తి సంబాధే ష్వభయన్నో అస్తు" సంకటము లందు మనకు అభయము కలుగును గాక అను ప్రపత్తిని విధించు వేదవాక్యములను రామాయణము విస్తరించి చెప్పుచున్నది. పరిశుద్ధ హస్తములతో శరణుచేసెద నన్నప్పుడు అభివాదనరూపక (నమస్కార) ప్రపత్తి చెప్పఁబడెను. 'చరణౌ శరణ మహం ప్రపద్యే'యని ద్వయమందుఁ గలదుగదా. లక్ష్మణుఁడు రామచంద్రమూర్తి పాదములు పట్టుకొనికదా శరణాగతుఁ డయ్యెను. పరిశుద్ధహస్తుఁ డనఁగా నీళ్ళతోఁ జేతులు కడుగుకొని యని మాత్రమే యర్థముకాదు. 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ' మోక్షసాధనముల నన్నిటిని వదలి నన్నొకనినే శరణుచొరుము- అనియు "పితరం మాతరం దారాన్ పుత్రాన్ బంధూన్ సఖీన్ గురూన్, రత్నాని ధనధాన్యాని క్షేత్రాణిచ గృహాణిచ, సర్వధర్మాంశ్చ సంత్యజ్య సర్వకామాంశ్చ సాక్షరాన్, లోకవిక్రాంతచరణౌ శరణం తే వ్రజం విభో" యితరయుపాయములను వానికి సహకారులైన తండ్రి, తల్లి, భార్య, బిడ్డలు, బంధువులు, మిత్రులు, వేదుపాయములనుపదేశించు గురువులు, రత్నములు, ధనధాన్యములు, గృహక్షేత్రములు, సాంగములైన, కర్మయోగ జ్ఞానయోగ అష్టాంగయోగా ద్యుపాయములు, ఐహికసుఖములు, స్వర్గభోగములు ఆత్మానుభవరూపమైన కైవల్యము వీని నన్నిటిని వదలి (వీరియందు రక్షకభావము, భోగ్యభావము, మమకారము వదలి యని భావము.) నీ పాదములు శరణు చొచ్చితి నన్నట్లు కర్మ జ్ఞాన భక్త్యాదులందు నుపాయ బుద్ధిని, ఐహిక సుఖములయు, స్వర్గకైవల్య సుఖములయుఁ గాంక్షను పూర్ణముగ వదలి నిర్మల మనస్సుగలవాఁడై యనియు నర్థము. 'శరణం ప్రపద్యే' శరణు చొచ్చుచున్నా ననునది. శరణంబుఁ జొచ్చితిన్, నన్ను శరణంబుఁ జొరుము, ప్రార్థించు మనస్సే శరణాగతి- యను పదములచేఁ దెలుపఁబడెను. ఈ శ్రుతి వాక్యమునకు నుపబృంహణ మెట్లనః—ఒక పరియే యను పదము 'ఆ వృత్తి రసకృదుపదేశాత్.' బ్ర. సూ. న చెప్పినట్లు పలుమారు ఆవృత్తి నపేక్షించు భక్తి విషయమై యన్వయింపక సర్వ ధర్మత్యాగ పూర్వకమైన ప్రయత పాణి యను పదము నర్థమును వివరించుచున్నది. ప్రయత మనఁగాఁ బరిశుద్ధము. "పవిత్రః ప్రయతః పూతః" అమరము. "ప్రకర్షేణ యచ్ఛతి=స్వవిషయేభ్యః ఉపరమతి ఇతి ప్రయతః"అని ప్రయతశబ్దమునకు వ్యుత్పత్త్యర్థము.

స్వరూపవిరుద్ధవిషయములనుండి యింద్రియములను బూర్ణముగ మరలించుట ప్రియత మనఁబడును. ఉపాయాంతరములు కర్మజ్ఞానాదులు భగవదేక పారతంత్ర్యమునకు విరోధులు, స్వరూపనాశకములు గావున భగవదుపాసన వఱకుఁ గల యుపాయము లన్నియు స్వరూపవిరుద్ధములే. కావున వానిని వాసనతోఁడ విడిచినవాఁడే ప్రియతపాణి యనఁబడును. పాణి యను శబ్దము భగవన్నామ సంకీర్తనమున కుదేశింపఁబడి యుపయోగపడు వాగింద్రియ మును, భగవద్దివ్యమందిర ప్రదక్షిణమున కుపయోగపడు పాదములకు నుపలక్షణము. ఒకపరియే శరణాగతి చేయవలయు ననుటచే తైలధారవలె నిరంతర ధ్యానరూప మైన జ్ఞానము- భక్తి దీనినుండి దూరముగ ద్రోయఁబడి నది. అట్లే శరణు వేఁడెనేని యనుపదముచే 'శరణం ప్రపద్యే' యను పదమును, నీ వాఁడని వేఁడుసను పదముచే 'స్వస్త్యస్తు' అను పదమును,అభ యంబు ఘటింతు ననుటచే 'అభయ మస్తు'అను పదముల యర్థమును విశదీక రించు చున్నది. ఈ విధముగ నీ పద్యము శరణాగతి విషయ మైన వేద సూక్తుల యర్థమును॰వివరించెను.

మఱియు నీ వేదసూక్తులందు 'శరణం ప్రపద్యే'శరణు చొచ్చుచున్నాను- అని యేకవచనముతోఁ బ్రారంభించి 'అభయం నః అస్తు' మా కభయము కలుగునుగాక యను బహువచనముతో ముగిసెను. ఇట్టివే 'వైష్ణవో నః కులే జాతః' మా వంశమందుఁ బుట్టిన వైష్ణవుఁడు మమ్మందఱ నుద్ధరించును. 'తే సర్వే ముక్తి మాయాంతి' ఆ వంశమునఁ బుట్టిన వైష్ణవునివలన వా రందఱు ముక్తి పొందుదురు. అని చెప్పఁబడెను. అట్టులే 'యేచ వైష్ణవ సంశ్రయాః । తేనైవ తే ప్రయాస్యంతి । తద్విష్ణోః పరమంపదమ్' వైష్ణవుని నాశ్రయించినవా రందఱు విష్ణువు పరమపదమునకుఁ బోదురు - అని చెప్పఁ బడెను.

సుగ్రీ—ప్రపన్నులకు మాత్రమే నీ వభయహస్త మిచ్చెదవా? భక్తాదులకు నిచ్చెదవా?

రామ—రామచంద్రమూర్తి నన్ను రక్షించు నను విశ్వాసము గలవారి నందఱను రక్షించెదను. ఎట్లనిన దండకారణ్యమునులు మే మెల్లరమును నీ విషయము నందు నీచే నెపుడుం గావంబడ నర్హుల మనిరి. (అరణ్య ౧౭) వారిని రక్షించి తిని. (ఈ కాలమున విష్వ్వాలయ మే గ్రామమునం దున్నదో యా గ్రామ మందుండి భగవంతుఁడు రక్షకుఁ డను నిశ్చయజ్ఞానము కలిగినను జాలును) అనుకూలుఁడై వచ్చిన విభీషణు రక్షించితిని. కేవల ప్రతికూలుఁడైన రావణుఁడు వచ్చినను రక్షించెద నంటిని. (యుద్ధ ౩౮) నాదు గురువులఁ గనుటకుఁ జన నానతిమ్మని యుదాసీన మైన శబరిని రక్షించితిని. 'పరమగతి

కారణం బర్యోఁ బ్రథనమున' నని చెప్పఁబడిన మృగ మగు వాలిని, (కిష్కింధ ౪౨౨). అనుత్తమగతి కరుగుము మదాజ్ఞనని పక్షియగు జటాయువునకు, (అరణ్య ౧౧౯౬) ఘోరపాపము చేసి శాపదష్టయై పడియుండిన యహల్యను, (బాల-౯-౯౬) పలుగాకి కాకి యగు కాకాసురుని, వీరినెల్లఁ గాచితినిగదా. ఇది యేమి? అయోధ్యలో నుండు కంటికిఁ గానరాని భూతములు, నన్నుఁజూచిన ప్రాణులు, చెట్లు, చేమలు, స్థావరములు నన్నియు నేనీ లోకమును విడిచి పోవు నపుడు నావెంట రాఁగలవు. నీవే చూడగలవు (ఉత్తర.౧౬౪౯). ఈలోకమునం దుండు వారే గాదు; దేవలోకములో నుండు బ్రహ్మేంద్రాదులు, దిక్పాలురు, నారూప మర్చించుచు, నానామము జపించుచు, నామూర్తిని దమలోకముల నుంచుకొని పూజించుచున్నారు. వారి నందఱ రక్షించెదను. 'ద్వాపరార్ధావసానే మాం ప్రాప్త మర్త్యాసి పద్మజ' యని బ్రహ్మకును నే నభయహస్త మిచ్చి యున్నాను. వీరు వారన నేల? నాయెడ నాభిముఖ్యము గలవారి నందఱ రక్షించెదను. పరాఙ్ముఖులు వారిగతి కోలఁది వారధోలోకములకుఁ బోదురు.

సుగ్రీ—ఆభిముఖ్యము గలిగినంత మాత్రమున నీ వందఱ రక్షించెదవేని వారికిఁ, బ్రపన్నులకు నేమి భేదము?

రామ—భక్తాదు లందఱకు నీ జన్మమందే ముక్తినిచ్చెద నని నేను జెప్పలేదు. వారికిఁ కాలాంతర జన్మాంతరములందు ముక్తి నిచ్చెదను. 'వాసుదేవ స్సర్వ'మ్మను భావము గల పరమభక్తునకుఁ బ్రపన్ననకు మాత్ర మీ జన్మాంతమందే తప్పక ముక్తి నిచ్చెద నని నేను బ్రమాణము చేసి యున్నాను. మార్గములు భేదములుగాని, యిరువుర భావ మొకటియే. పరమభక్తుఁడు పెక్కుజన్మముల భక్తిని సాధించినాఁడు. ప్రపన్నుఁ డీ జన్మమునందే సాధించినాఁడు. ప్రపన్నుఁడు తన భారమును నామీఁదవైచి తల్లిదండ్రులయొద్ద చంటిబిడ్డవలె నుండు వాఁడు. పరమభక్తుఁడు తల్లిదండ్రులు దైవతము లను జ్ఞానము గలవాఁడై పితృసేవ భక్తితోఁ జేయునట్టివాఁడు. తల్లిదండ్రు లిరువుర నాదరింతురు గదా.

సుగ్రీ—అట్లైన భక్తికి, బ్రపత్తికి నేమి భేదము?

రామ—ఫలము సమానమే - మార్గములు వేఱు వేఱు. మీ యూరికిఁ బోవలయు ననిన నెన్ని త్రోవ లున్నవి? అట్లులే రెంటికి భేదము చెప్పెద వినుము.

(౧) భక్తి- స్వధర్మజ్ఞాన వైరాగ్య సాధ్య భక్త్యేక గోచరుఁడు నారాయణుఁ డని చెప్పఁబడుటచే స్వధర్మ నిష్ఠచేఁ గలిగిన జ్ఞానమువలన లభించిన వైరాగ్యముచే జనించిన భక్తి యనుటచే భక్తి యుపాయ మనియు, నది చేతనుని వ్యాపార ముపై నాధారపడి యున్న దనియు నేర్పడెను. కావున నది సాధ్యో పాయము. ప్రపత్తి యుపాయ మనుట యుపచారమాత్రము. ఉపాయము

ఉపేయము రెండును భగవంతుఁడే. భగవంతుఁడు సిద్ధోపాయము. 'సిద్ధరూపం పరబ్రహ్మ' యనికదా శ్రుతి చెప్పుచున్నది. కావున ప్రపత్తి సిద్ధోపాయము.

(౨) 'ధ్రువా స్మృతి' యన్నట్లు భక్తి తైలధారవలె నవిచ్ఛిన్న మైన స్మృతి సంతాన రూపము. కావున నచేతనము.

ప్రపత్తి-'య స్సర్వజ్ఞ స్స సర్వవిత్' 'సత్యం జ్ఞానం' అను శ్రుతిసూక్తుల వలన సర్వజ్ఞము, జ్ఞానస్వరూపమునై యున్నది.

(3) భక్తి-'ఆవృత్తి రసకృ దుపదేశా' త్తనునట్లు అనేక జన్మపుణ్యఫల మగుచు చిర కాల సాధ్యము.

ప్రపత్తి-'తద్ద్వయం సకృదుచ్చారో భవతి' అనునట్లు లొకసారి యనుష్ఠించిన జాలును.

(౪) 'తస్య తావ దేవ చిర' మ్మనునట్లు (ఛాందో) ప్రారబ్ధదేహావసానపర్యంతము కాలవిలంబనము గలది. ఈ లోపలదాని ఫలము జూపఁజాలదు.

ప్రపత్తి-'ఉపాయో యంచతుర్థ స్తే' యన్నట్లు ప్రపన్నుఁడుకోరినచో వెంటనే ఫలము చూపఁగలదు. ఇది యార్తప్రపన్నుని విషయము. తానై దేహము నిలుపఁగోరిన దృప్తునకు నా దేహావసానమున ఫల మిచ్చును. ఆర్తి భేదముచే గాలభేదము.

(౫) భక్తినిష్ఠునకుఁ బ్రారబ్ధకర్మ శేషమువలన దేహాంతర పరిగ్రహము కలిగెఁ నేని ఫలప్రాప్తికిఁ గాలవిలంబ మధిక మగును. ఈ విషయము బ్ర॥ సూ॥ ౪-౧-౧౮ 'భోగేన త్వితరే క్షపయిత్వాథ సంపత్స్యతే' యను సూత్రమున భాష్యమునఁ జర్చింపఁ బడినది. "బ్రహ్మవేత్తయొక్క పుణ్యపాపము లనేక శరీరభోగ్యఫలము లైనచో అనేక జన్మముల నెత్తి యా కర్మఫలముల నన్నింటి ననుభవించి యనంతరము బ్రహ్మమును బొందుచున్నాఁడు." ప్రపన్నునకు దేహాంతరప్రాప్తి లేదు. ప్రపత్తిచేసిన దేహముందు వఱకే కాల విలంబము.

(౬) భక్తి రూపాపన్న జ్ఞానము పుట్టుటకు విరోధులుగా నుండు పాపములు నశిం చుటకు యజ్ఞదాన తపస్సు లావశ్యకములై యుండును.

ప్రపత్తియందు అంగము, అంగి-ఉపాయము, ఉపేయము-నేనే యగుటచే నితర సాధన సాహాయ్యముతోఁ బనిలేదు.

(౭) భక్తివిరోధు లగు పాపముల జయించుటకై చేయు యజ్ఞదానతపస్సులు కష్ట సాధ్యములు.

ప్రపత్తి యనుష్ఠానదశనుండి సుఖరూపమే.

(౮) ఆ యజ్ఞాది సాధనములు అపాయ కరములు. 'మిథ్యాప్రయుక్తో యజమానం

హినస్తి' యజ్ఞాదు లనుష్ఠించు నపుడు అలక్ష్యముతోఁ గాని, వ్యర్థమైన వేదుకతోఁగాని శాస్త్రోక్త క్రమము వదలిగాని యనుష్ఠించిన యెడల నవియే యజమానుని జంపు నని యర్థము. 'జ్ఞానదోష పరిభ్రష్టశ్చాండాలీం యోని మాస్థితః' దేశకాల పాత్రముల నెఱుఁగకయు, జ్ఞానము లేకయు ననుష్ఠించిన పక్షమందు చండాలత్వమును బొందును-అని యర్థము. కర్మ జ్ఞాన భక్తులందీ యపాయము గలదు.

ప్రపత్తి చేయుటయందుఁ గర్మము రెండుచేతులు జోడించుట, నీ వాఁడను కాపాడు మనుట. కావున నిరపాయము.

(౯) యజ్ఞాదులకు గావలసిన పదార్థములు నశించు స్వభావము గలవి. ప్రయాసపడి సాధింపఁ దగినవి. పరసాహాయ్య మపేక్షించునవి.

ప్రపత్తికిఁ గావలసినది యంజలి కావున నశించునది కాదు. ఇతరుల సాహాయ్య మపేక్షింపదు. సుకరము.

అవి పుణ్యఫలముల నిచ్చినపిమ్మటఁ దత్పూర్వము మంత్రలోప, క్రియాలోప, భక్తిలోపములచే నశించునవి.

అంజలిఫలము కలకాల ముండునది.

సకాములకు స్వర్గఫలము, నిష్కాములకు మోక్షము నిచ్చును. అట్లైన నానుకూల్య సంకల్పము, ప్రాతికూల్య వర్జనము కూడ ననావశ్యకములే గదా! యనిన నవి సర్వముక్తిప్రసంగము రాకుండుటకై విధింపఁ బడినవి. ఉపాయ స్వీకారమం దిదియే యుద్దేశము. సర్వముక్తిప్రసంగము రాకుండుట యనఁగా శాస్త్రవిహితమర్యాదలు, స్వధర్మము, సదాచారములు తప్పి వర్తించు వారికిని - దురాచారులకు సైతము మోక్షము రాకుండుటకై శమదమాదులగు నాత్మగుణములు గల యానుకూల్యసంకల్పము విధింపఁబడెను. దీనివలన నా యందుఁ బక్షపాతము, దయాహీనత యను దోషములు దొలఁగినవి.

(౧౦) భక్తికి నంతిమస్మరణము (మరణకాలమున నన్ను స్మరించుట) నియతము.

ప్రపత్తికి నంతిమస్మరణ మనావశ్యకము. అంత్యకాలమునఁ బ్రపన్నుఁ డేదశయం దున్నను నేనే స్మరించి వానికి ముక్తి నిచ్చెదను.

(౧౧) ఉపాయాంతరములు స్వయత్నసాధ్యములు గావున నిరపాయముగ ననుష్ఠించుటయందు సమస్తభారము చేతనునందుఁ గలదు.

ప్రపత్తియందు సకలభారము నాయందుఁ గలదు. కావునఁ బ్రపన్నులకు భారము లేఁపదు. వారు ప్రమాదమునఁ గార్యములు తాఱు మాఱుగఁ జేసినను నేను దానిని లెక్కకుఁ దీసికొనను. వారికిఁ బ్రమాదబుద్ధి యిచ్చిన వాఁడను నేనేకదా. నా ప్రపన్నుఁడు తెలిసి యకార్యములు చేయఁడు. ప్రపన్నుఁడు తన స్వరూప మగు పారతంత్ర్యమునకు హానిరాకుండఁ గనిపెట్ట

వలసిన భార మొక్కటియే యతనియందుఁ గలదు. తక్కిన విషయములం దతని కే భారము లేదు.

సుగ్రీ—ప్రపన్నుని దేనినుండి రక్షింతువు ?

రామ—వానికి భయము గలిగించిన దేదో దానివలని బాధ లేకుండ, మఱి యెప్పటికి లేకుండఁ జేయుదును.

సుగ్రీ—అట్లైన నీవు మోక్షము మాత్రి మిచ్చెదవా ? ధర్మార్థకామము లిచ్చెదవా ?

రామ—ఎవ రేదికోరిన నది యిచ్చెదను. ఎక్కువది కోరినఁ దక్కువదికూడ నిచ్చెదను. అనఁగా ధర్మము కోరెనా అర్థము. కామముకూడ నిచ్చెదను. మోక్షముగోరెనా ధర్మార్థకామములను గూడ నిచ్చెదను. అర్థము కోరిన నర్థము, కామము నిచ్చెదను. కామముకోరిన నంతకెక్కువ యేదియు రాదు. కామము మాత్రము గోరువాఁడు పశువుతో సమానుఁడు. వాని సుఖము మాత్రము వాఁడు చూచుకొనును. అర్థముకోరిన వాఁడు తాను సుఖపడ వచ్చును. తన యాశ్రితులను, లోకులను సుఖపెట్టవచ్చును. ధర్మమునం దుండువాఁడు లోకము నంతయు సంతోషింపఁ జేయును. కావున నే యుద్దేశముతోఁ బ్రపత్తిచేసినను జేయవచ్చును. నిన్నుఁ గిష్కింధాప్రభువుఁ జేసినపుడు దానికి లోఁబడిన పల్లెలు, గ్రామములు, అడవులు, కొండలు అన్నియు నీ వనుభవింపఁ దగినవేకదా. వానియం దుండు వారికి నీపై నధికారము లేదు. కాని నీ కందఱపై నధికారము కలదుకదా.

సుగ్రీ—సకలభూతములవలన నంటివే. పుట్టినవానివలననా? పుట్టబోవువాని వలననా?

రామ—మోక్షము గోరువాఁ డన్నిభూతములను దాఁటిపోవువాఁడు. కావున వాని కే భూతములవలనను, నేకాలమునందును, నే దేశమందును భయము లేదు. తక్కినవారా? వారివారి కోరికలవలనఁ గలుగు ఫల మనుభవింపవలసి యుండును. నీవు వానరరాజ్యము గోరితివి. ఇచ్చితిని. దానివలనఁ గలుగు సుఖదుఃఖములు నీ వనుభవించుచున్నావు, అనుభవింపఁగలవు గదా! యట్టులే యన్నియును.

సుగ్రీ—అభయము ఘటయింతు నంటివి. విభీషణుఁడు రావణునకు భయపడి వచ్చెను. రావణు భయము లేకుండఁ జేయుదు నంతియేకదా?

రామ—విభీషణుఁడు కోరిన దామాత్రమే యైన నంతియే చేయుదును. రాజ్యము గోరిన రాజ్య మిచ్చెదను. ఏమి కోరఁ డాయెనా రాజ్యమేకాదు, మోక్షము కూడ నిచ్చెదను. ప్రపన్నులు తమకోరిక లను తాళ్ళచే నన్నుఁగట్టి నిర్బంధించి నీవింతే యియ్యవలయు నన్నప్పుడు వారి నిర్బంధములకు లోఁపడి యంతే యిత్తును. అట్టి నిర్బంధము లేనప్పుడు నే నెంత యియ్యఁ గలనో యంతయు

నిచ్చెదను. నాతో సమానునిగనే చేసెదను. భయకారణములు పెక్కులు గలవు. పతివ్రతలకు వైధవ్యభయము, రాజులకు శత్రుభయము, ధనికులకు దారిద్ర్యభయము, ఆరోగ్యవంతులకు రోగభయము, ముముక్షువులకు సంసారభయము, సర్వభూతములకు మరణభయము. ఎవరే భయమునుండి రక్షింపఁ గోరుదురో వారి నాభయము నుండి రక్షింతును. వీనిలో వాఁడి యభయము = ఉత్కృష్టమైన యభయము - నా సాయుజ్యమే.

సుగ్రీ—నీవు వీనికి నిచ్చు నభయము త్యాగమా? ఔదార్యమా? ఉపకారమా? దానమా?

రామ—కీర్తి రావలయు నని కోరి యిచ్చునది త్యాగ మనఁబడును. నా కట్టి కోరిక లేదు. ఔదార్య మనఁగాఁ జనుఁబాలు చేఁపునట్లు విషయమైన మమ్యమును జూడక తన పేరుగా నిచ్చుట. అట్టి ప్రతిష్ఠయందు నాకుఁ గాంక్ష లేదు. ఉప కార మనఁగా బదులుమేలు కోరి యొకరి కిచ్చుట. ఇతని వలన నేనే మేలు గోర లేదు. దాన మనఁగా దీనివలన నాకీ ఫలము కాలాంతరమందో, జన్మాంతరమందో కలుగఁ గోరి మంత్రవంతముగ నిచ్చుట. వీనిలో నేను జేయునది యేదియుఁ గాదు. ఘటియింతు ననఁగాఁ గలిగింతు ననియే యర్థము. ఇది త్యాగము గాదు. ఔదార్యాదులుగావు. చలిచే వణఁకువాఁడు వేఁడిమి చలికి విరోధి యని తెలిసికొని యెండలోనికిఁ బోయెను. వానికిఁ జలి దొలఁగెను. ఆరోగ్యము కలిగెను. ఇందు సూర్యుఁడు చేసినది త్యాగమా, ఉప కారమా, దానమా? ఏది? నేను జేయునది యంతే యనుకొమ్ము. వాఁడు చేసిన శరణాగతియే వానిని రక్షించును. నేను నిమిత్తమాత్రమే. "నిమిత్త మాత్రమే వాసౌ సృజ్యానాం సర్గకర్మణి, ప్రధానకారణీ భూతా యతోవై సృజ్యశక్తయః। నిమిత్తమాత్రం ముక్త్వైవ నాన్య త్కించి దపేక్షతే, నీయతే తపతాంశ్రేష్ఠ స్వశక్త్యా వస్తువస్తుతాం। కర్మభిర్భావితాః పూర్వైః కుశలాః కుశలైః ప్రజాః" సృజింపఁబడునట్టి వస్తువులు తమ సృష్టి విషయమున నిమిత్త మాత్రము నపేక్షించునవి. వానియందుఁ గల శక్తులే వాని సృష్టికి ముఖ్యకారణములు. అవి నిమిత్తమాత్రమును దప్ప వే ఱొక్క దాని నపేక్షింపవు. స్వశక్తిచేతనే వస్తువు లా రయా శరీరంబులఁ బొందుచున్నవి. అట్టి శక్తులు వారు వా రొనర్చు నట్టి పుణ్యాపాపములే. చింతగింజయందుఁ జింతచెట్టగు శక్తియున్నది. కాని తనంతటఁ దానే చెట్టుకాఁజాలదు. మనుష్యుఁ డొకఁడు దానిని భూమిలో నుంచి నీళ్లు పోయవలయును. చింత విత్తనము నుండి మామిడిచెట్టు వచ్చునట్లు వాఁడు చేయ లేఁడు. అట్టులే శరణాగతియందు ఆ జన్మమందే ఫల మిచ్చుశక్తి గలదు. ఆ ఫలము వానికిఁ గలుగునట్లు చేయుటే నా కార్యము.

సుగ్రీ—అట్టైన మైత్రి నటించినను నేను జేతిని విడువ నంటివే. నీవు వానిమోస ఫలమేకదా వాని కీయవలెను.

రామ—మనోవాక్కాయము లను మూటిలో రెంట వాఁడు చేసిన దానికి ఫల మీయవలయునుగదా. అది నేనెట్లు తప్పింపఁగలను? ఆ రెండే వాని మన స్సును తమ తోవకుఁ గ్రమముగఁ దీసికొనివచ్చును. ఆ విషయమున నేను దోడుపడుదునుగాని వాఁడు నన్ను మోసముచేసినాఁడని కోపింపను. వానివి వాఁడు మోసము చేసికొనెనుగాని నాకు వాఁడు చేసిన కీడేమి గలదు?

సుగ్రీ—నీ సాయుజ్య మనఁగా నేమి ?

రామ—నీవు నాయొద్దఁ జేరకముం దెట్టి సంబంధముండినది?మనకు నిప్పు డెట్టి సంబంధ మున్నది? లక్ష్మణు సంతతివాఁడవు నీవై తివికదా. 'మా నలువురిలో నీ వైదవ సోదరుఁడవు నిర్మల చరితా' యని భరతుఁడు ననఁగలఁడు. నీవు విభీషణునిఁ జంపవలె, నఱకవలె, నిప్పులలో వేసి కాల్పవలె నంటివే. నే నభయ మిచ్చిన పిమ్మట నీవే "మా సమానుఁడగు కాత్రిలుత మమ్ములగూడి యుద్ధ మేధావి విభీషణుండు సఖత్వం గసి" యని నీవే యంటివా, లేదా ? ఇప్పుడు మనమంద రము సోదరులమేకదా. కావున సమానులమేకదా. మీరు నన్నుఁ బెద్దగా గౌరవించి పెత్తనము నా యందుంచితిరే కాని తక్కిన విషయం బుల మీకు నాకు భేదము గలదా? సీత తప్ప నా సర్వస్వము మీదికాదా? నా ప్రాణములు కూడ మీ చేతియందున్నవికదా ? ఇట్టి సామ్యమునకే సాయుజ్య మని పేరు. హనుమంతున కిచ్చినట్లు నన్నే మీ స్వాధీనపరచితిని. అంతకెక్కువ నేనేమి యియ్యఁగలను. దీనినే వానికియభయ మంటిని. తక్కిన వన్నియు దీనికి లోకువే.

సుగ్రీ—ఇదియ వ్రత మగు నంటివే, యేల?

రామ—తక్కిన యన్నికార్యములు నేను నా సంకల్పానుసారము చేయుచుందును గాని యొక నిర్బంధమువలన విధిగాఁ జేయువాఁడను గాను శరణన్నవానిని రక్షించుట యనునది నాకు వ్రతము. నా కిష్ట ముండినను, లేకుండినను నేను జేయక తప్పదు. ఆ విషయమందు నాకు స్వాతంత్ర్యము లేదు. అన్ని విష యముల నేను సర్వశక్తుఁడనేకాని, యీ విషయమందు నే నశక్తుఁడనే. ఎట్టి సంకటములనైనఁ దప్పించుకొను నుపాయము నే నెఱుఁగుదును గావున నేను సర్వజ్ఞుఁడనేకాని శరణు అన్నమాట చెవినిఁబడఁగానే అభయమ్మునక తప్పించు కొను టెట్లో నే నెఱుఁగను గావున నీ విషయమున నే నజ్ఞుఁడనే. వ్రతముగా నను ష్ఠించునది యిది యొక్కటియే కావున నిదియ యంటిని.

సుగ్రీ—వ్రత మనఁగా నేమి ?

రామ—యావజ్జీవము జరపెద నని పట్టిన నియమము. కాలక్షేపము పెట్టుకొన్నను బెట్టుకొనవచ్చును. హనుమంతునకు బ్రహ్మచర్యము వ్రతము. దానియందు స్ఖలనము వచ్చినా యతఁడు భ్రష్టుఁడు. అనర్హుఁ డగును. అట్లయితే నాకు శరణాగతరక్షణమునుండి స్ఖలనము వచ్చినా నేను భ్రష్టుఁడనే. అనర్హుఁడనే.

సుగ్రీ—ఇది నా వ్రత మనినఁ జాలునే. వ్రత మను నంటివే. ఏల ?

రామ—విధి యనియుఁ, దప్పించుకొన సాధ్యపడ దనియుఁ దెలుపుటకే.

సుగ్రీ—నాకర్ అంటివే. ఈ వ్రతము గల వా రితరులు లేరా ?

రామ—తక్కిన బ్రహ్మరుద్రాదులు ఇష్టము వచ్చినవారిని రక్షింతురు. రానివారిని విడుతురు. మొదటఁ జేరఁదీసినను తరువాత చేయి విడుతురు. ఇతరులు సందర్భానుసారముగ వర్తింతురు. తొలుత వరము లిచ్చిన బ్రహ్మ రావణుని తరువాత శపించెఁగదా. తొలుత రావణునకు వరము లిచ్చి రుద్రుఁ డిప్పుడు రక్షింప రాఁడాయెఁ గదా. రక్షణ కార్యభారము వారియందు లేదు. అది వారికిఁ బదిలోఁ బదునొకండవది. నా కట్లు కాదు. సృష్టించు బ్రహ్మయు, సంహరించు రుద్రుఁడు రక్షణమందు స్వతంత్రులు కారు. నా కట్లు గాదు, నిత్యనిధి. కావున నా కిది వ్రతము. 'నహి పాలనసామర్థ్యం ఋతే సర్వేశ్వరాద్ధరేః' యనియు "రక్షార్థం సర్వలోకానాం విష్ణుత్వ ముపజగ్మివాన్" అనియు ప్రమాణములు. మోక్షమిచ్చు నధికారము నా యందు మాత్రమే కలదు. తక్కిన యెవ్వరియందును లేదు. తక్కినవారు మోక్షము తప్పఁ దమ యధికారానుసారముగ నేదైన నీయఁగలరు.

సుగ్రీ—నాకర్=నాకు అనినఁ జాలును గదా! నాకును అంటివే ఏల?

రామ—ఈ వ్రతము నా కెట్టులో నా భార్య సీతాదేవికి నట్టులే. తన్ను విశేషముగ బాధించు రాక్షసస్త్రీలకు నా లోకనమస్కారము చేసినంత మాత్రముననే యభయ మిచ్చెనని హనుమంతుఁడు చెప్పలేదా? రాక్షసస్త్రీలు సీతను బాధించినట్లు విభీషణుఁడు నన్ను బాధించెనా? ఆమె చేసినంత మాత్రమైన నేను జేయవలదా? ఆమె సహధర్మచారిణి కావున మే మిద్దరము ఒక్క ధర్మము నందుండు వారమే. ఆమె సొమ్ములు నీ యొద్ద నుంచుటచే నామె నిన్ననుగ్రహించె ననికదా నేను నిన్నుఁ జేరదీసితిని. ఆమె విభీషణు ననుగ్రహించెనని కదా హనుమంతుఁ డాయన గృహము దహింపక తక్కినదంతయుఁ గాల్చివైచెను. ఆమె యనుగ్రహించిన విభీషణు నే నెట్లు విడువఁగలను? ఆమె యనుగ్రహించుటచేతనే కాకాసురుని నే ననుగ్రహించితిని. ఆమె యనుగ్రహించుటచేతనే జటాయువునకు మోక్షమిచ్చితిని. మాలో మా కా భేదము లేదు. సముద్రస్నానము చేసితి ననిన నలల నంటక చేసితి నని యర్థమా? అలలలో మునిఁగినాఁ డనిన సముద్రస్నానఫలము లేదా?

సముద్రమును అలలను, సూర్యుని నెండను వేఱు వేఱు పదార్థములని యెంచు వాఁడే మా యిరువురియందు భేద మెంచువాఁడు. తండ్రికిఁ గుమారుఁ డగు వాఁడు తల్లికిఁ గుమారుఁడు కాఁడా? ఆశ్రితరక్షణమునందు నా కున్నంత యధికార మామెకును గలదు. భేద మేమనిన నేను దుష్టుల దండింతును. ఆమె దండింపదు.

"యా మాలంబ్య సుఖేనేదం దుస్తరం త్రిగుణోదధిమ్ ।
నిస్తరం త్యచిరే ణైవ, వ్యక్తం ధ్యానపరాయణాః॥"

ఏమెను ధ్యానించి మహాయోగులు సత్త్వరజస్తమోమయమై వ్యక్తంబును, దుస్తరంబు నగు సంసారమును శీఘ్రముగ దాఁటుచున్నారో- "సర్వేషా మేవ లోకానా, మీశ్వరీ మమవల్లభా । అస్యా మమచ శేషం హి విభూతి రుభయాత్మికా" అన్ని లోకములకు అన్ని జీవకోట్లకు నా ప్రియురాలు ఈశ్వరి. ఉభయవిభూతులు ఆమెకు నాకు శేషభూతములు. "యజ్ఞా విద్యా మహావిద్యా గుహ్యావిద్యా చ శోభనే । ఆత్మవిద్యాచ దేవి త్వం విముక్తి ప్రదాయినీ॥" దేవి! యజ్ఞావిద్యాదులు, మోక్షమీయఁ గల బ్రహ్మవిద్య, యివన్నియు నీవే యను శ్లోకముల ననుసంధించునది. "సర్వ కామ ప్రదాం రమ్యాం, సంసారార్ణవతారిణీమ్ । క్షిప్రప్రసాదినీం లక్ష్మీం శరణ్యా మనుచింతయేత్" అన్నివిధములగు కోరికల నిచ్చునదియు, మనస్సునకు నాహ్లాదము గలిగించునదియు, సంసారముఁ దరింపఁజేయునదియు, శీఘ్రముగ ఫల మిచ్చునదియు, శరణ్యయు నగు నామెను చింతింపవలెను. కావున నీ వాఁడ నన్నప్పుడు మీ వాఁడ ననుభావమే యుండవలెను. నాకును అసఁగా నాకే కాదు మీకును నిది వ్రతముగా నుండవలెను. ప్రపన్నులను జూచినప్పుడు మీరు వారిని సగౌరవముగ నాదరించి వారి కార్యములు దీర్చుచుండవలయును గాని యిప్పుడు మీరు చెప్పినట్లు చంపుదుము, కాలుతుము అని మాటలాడ రాదు. సాధువు లగు నా భక్తులందఱిట్లె వర్తింపవలయును. నా సదవదిక్కి, నా యభిప్రాయమునకు విరోధముగ వర్తించువారు నా భక్తు లెట్లగుదురు? ఈ పద్యమున మొదటి యక్షరము కడపటి యక్షరము కలిపి చదివిన నీకుఁ అని యేర్పడును.

సుగ్రీ—రామచంద్రా! నీవు విభీషణుఁడు ప్రపన్నుఁడని చెప్పి పొరపాటు పడుచున్నావు. వాఁడు ప్రపన్నుడు కాఁడు. "సకృ దుచ్చారో భవతి సకృదేవ హి శాస్త్రార్థః" అని ప్రపన్నుఁ డొకసారియె కదా శరణాగతి చేయవలె నంటివి. విభీషణుఁడో "రామచంద్రునికి శరణముఁ జొచ్చినాఁడ" (యుద్ధ 3_౨౮) ననియు, సత్వరుఁడై శరణార్థియై వచ్చె (యుద్ధ ౩౯_౨) అనియు, నిను శరణంబు జొచ్చితిని (యుద్ధ ౩౯-3) అనియు మూఁడుమార్లు శరణా

గతుఁ డయ్యెను. ఇట్లు చేయుటచే ప్రపత్తి లక్షణమునకు హాని కలిగించుటయే గాక ప్రపత్త్యుఁడైన తనకు, ప్రపత్తవ్యుఁడవైన నీకు స్వరూపహానిగలిగించెను. కావున వీఁడు భక్తి ప్రపత్తుల రెంటను జెడినాఁడు. ఇట్టి వానినా నీవు రక్షించుట? ప్రపత్తి యధికారి యగు విభీషణునకు స్వరూపహాని యెట్లు కలిగె నందువా? అత్యంత పరతంత్రుఁడు కదా ప్రపత్తి కధికారి. వాఁ డొక్కసారి చేసిన ప్రపత్తినిగూడ నుపాయ మని తలఁపరాదుగదా. వీఁడు అచేతనము కాదుగదా. ప్రపత్తి చేసితి నను జ్ఞానముగల చేతనుఁడుకదా. నేను రక్ష్యుఁడ నగుటకు భగవత్సంకల్పమే కారణము, ఆయన రక్షకుఁ డగుటకు నదియే కారణ మని తలఁపవలసినవాడు ముమ్మాఱు ప్రపత్తి సేయుటవలన స్వరూపహాని కలిగెను.

నీవు ప్రపత్తవ్యుఁడవు. శరణాగతునిచే నాశ్రయింపఁ బడు వాఁడవు. నీ ధర్మ మొక్కసారి శరణు అనఁగానే రక్షింపవలసినది, నీకు వ్రతము. అట్లుండ వీఁడు ముమ్మా ఱనువాక కుపేక్షించితివి. కావున నీకు స్వరూపహానియే కలిగెను.

ఇట్లు ప్రపత్తి లక్షణమునకు అధికారికిఁగూడ స్వరూపహాని వచ్చుటచే ప్రపన్నుని రక్షింప కుండిన మహాదోషము వచ్చు నన్న నీ వాక్య మిచట నన్వయింపదు.

రామ——సుగ్రీవా! విభీషణుఁ డొకసారియే ప్రపత్తిచేసెను గాని నీవు తలఁచినట్లు ముమ్మాఱు చేయలేదు. ఎట్లందువా? అతఁడు రాఁగానే మి మ్మతఁడు చంపవచ్చె నని తలఁచి యతనినిఁ జంప నాలోచించితిరి. అప్పుడు మిమ్ముఁ జూచి "పరుషము లాడి నన్ను నొక బంటు విధాన నవజ్ఞ చేసినట్, దురునున నాలు బిడ్డలను దొఱపిడి యిచ్చోడ రామచంద్రునిట్ శరణముఁ జొచ్చినాఁడ'నని మీరు తలఁచునట్లు నేను విరోధిగా రాలేదు, సోదర భ్రాత నగుటచే హిత ముపదేశించిన నన్ను రావణుఁ డతిసీచముగా నవమానించి పొమ్మనుటవలన నీసతని సంబంధమును విడువవలసిన తక్కినవానిని నవాసనముగ వదలి, ఆశ్రయింపఁ దగినవాఁ డగుటనే నిచ్చటికి వచ్చి రామచంద్రు శరణము చొచ్చితి నని చెప్పెను. ప్రపత్తిలక్షణ మైన శరణాగతి యిది యొక్కటియే. ఇందు కందుఁడు చెప్పిన నాలుగు ప్రపత్తివిశేషములు గలవు. వీనిని జేరఁదీయుటకు నిది నాకుఁ జాలును.

నే నభయ మిచ్చిన పిమ్మట మీరు పిలుచుకొని రాఁగా శరణార్థినైపడితి ననుటయందు జరిగిన వృత్తాంతము చెప్పఁబడెనేకాని, యివి యతని మాటలు గావు.

నిన్ను శరణంబుఁ జొచ్చితినని మూఁడవసారి చెప్పఁ గారణ మేమందువా? మీరందఱు తన విషయమై విరోధముగాఁ జెప్పఁగా నాకు ముఖ్యులైన మీ మాటలచే నా మనస్సు కలవరపడియుండు నని సందేహించి యా సందేహము దీఱ మీరు చెప్పినదోషము నా యందు లేదు, నీ రక్షణము కోరియే వచ్చితి నని చెప్పెను. కావున ప్రపత్తికి హాని లేదు. ప్రపన్నునకు హానిలేదు. నాకు హానిలేదు.

రామచంద్రునిన్ శరణము చొచ్చితి నను వాక్యమునందు విడువవలసినవి విడువుట చెప్పఁబడెను. ఇందు పరుషము లను పదమునందలి యుపసర్గము 'పరిత్యజ్య' యను చరమశ్లోకము నందలి పరి యను నుపసర్గార్థమును బోధించుచున్నది. వానరులతోఁ జెప్పుకొనుటచే పురుషకార పూర్వకముగఁ బ్రపత్తి చేసెననియుఁజెప్పఁబడెను. కావున నిదియే ప్రధాన ప్రపత్తి. సకృత్ప్రపత్తివలనఁ బ్రపన్నుఁడైన వానికిఁ దరువాతఁ జేయు వాచిక కాయిక ప్రపత్తులు పునః ప్రపత్తిలోఁ జేరవు. కాఁబట్టి యొకపరి యనియే రామచంద్రమూర్తి చెప్పెను. మూఁడవసారి సమక్షమునఁ జెప్పఁబడినదే ప్రపత్తి వాక్య మఁను మేసి ప్రపన్నుఁడు కాకముందే రక్షించె నను నాక్షేపము వచ్చుటేకాక పురుషకారము లేదను నాక్షేపము వచ్చును. తల్లిని బిడ్డ యమ్మా! యన్న మనును. ఆమె తెచ్చులోపల మీఁదమీఁద పదిమార్లు అమ్మా యన్నమనును. అన్నము తెచ్చుటకు మొదటిసారి పిలిచినదే చాలునుగదా. తక్కినవి రుచివిశేషమును దెలుపును.

కావున నొకసారి ప్రపత్తి చేసెనుగాని పలుమాఱు చేయలేదు. అంతే కాదు. మన మతని యింతసేపు నిరాధారముగ నాకాశమున నిలువఁబెట్టి రక్షింతమా, వలదా? దుష్టుఁడా, శిష్టుఁడా యని యీ విధముగ నింతకాలముగ నాలోచించుచున్నాము గాని యతఁడో రావణుఁడు ఛీ పొమ్మనఁగానే యక్కడ లేచిన వాఁ డిచ్చట వచ్చి ముహూర్తములో నిలచెనే కాని వీఁడు పొమ్మనెనే, ఇంటికి భార్యయొద్దకుఁ బోయి చెప్పిపోదునా, తల్లిదండ్రుల యొద్దకుఁ బోదునా, అన్న కుబేరుని యొద్దకుఁ బోదునా, దేశాంతరము బోదునా, రామునియొద్దకుఁ బోదునా, నేను మాత్రము పోయిన నా పెండ్లాము బిడ్డల గతి యేమి? వారిని రక్షించువా రెవ్వరు? రావణుని కాళ్ళమీఁదనే పడుదునా, రామునియొద్దకుఁ బోయిన నాయన నన్ను నమ్మునో నమ్మఁడో-అనుగ్రహించునో- నిగ్రహించునో- చెఱయం దుంచునో తఱుమఁగొట్టునో, రాము డనుగ్రహించినను వానరు లే మందురో, వారును నిగ్రహించిరేని తరువాత నెక్కడికిఁ బోదును అని యిట్టు లాలోచించెనా? మనయం దెంతో నమ్మకము లేకుండిన నిట్లు సాహసించి రాఁ గలఁడా? సుగ్రీవా! నీవు

నాతో స్నేహము చేయునపుడే నా యన్నను జంపు మని నాచేతఁ బ్రమాణము చేయించుకొంటివే. ఇతని నోట నట్టిమాట వచ్చెనా? నీవు కోరినట్టు రాజ్యము నా కిమ్మని కోరునేమో పరీక్షింపుము.

సుగ్రీ—రామచంద్రా! విభీషణుఁడు భక్తుఁడే కాని ప్రపన్నుడు కాఁడు. ఏల యందువా? 'శ్రీరాముని కప్పగింపు సీతాదేవిన్' అని మంచిమాట చెప్పుట నీ యందలి ప్రేమచేఁ గదా. అట్టులే దూతను జంపవల దనుట భార్యచేత, బిడ్డలచేత నీ భార్యకు క్షేమ సమాచారములు చెప్పిపంపుట ఇట్టివి పురశ్చరణ వంటివి కావా? కావున వీఁడు ప్రపన్నుఁడు కాఁడు.

రామ—దూతను జంపవలదని చెప్పుట యన్నకుఁ బాపము, అపకీర్తి వచ్చునే యని యతని గౌరవము కోరి చెప్పెను గాని నాయందు, హనుమంతునియందుఁ బ్రేమ గలిగి గాదు. సీత నిమ్మని చెప్పుటకును వాఁడు వంశనాశమై పోవునే యను తలంపుతోఁ గాని నా యందుఁ బ్రేమచేఁగాదు. ఆలకుయిలు, ఆఁడుకుయిలు నెవరైన నాలకించి యాదరింపవలసినదే ధర్మము. అతఁడు జన్మ ప్రభృతి ధర్మనిష్ఠుఁడు. "కం. పరమాపత్కాలమునను, దొరసిన యేనియు మనంబు దొలఁగక యెప్పుడున్, బరఁగుత ధర్మమునందే"యనియు"కం. ఏయేయాశ్రమ మందును, నెయే మతి సంభవించు నీశ్వర నిరతం, బాయాయది ధర్మమునం, దే యనువర్తించుగాక" యనియు (ఉత్తర-౨౧౧-౨౧౨) బ్రహ్మను గోరివరము పొందినవాఁడు. రాక్షస చేష్టలు లేవని శూర్పణఖయే చెప్పెను. దుష్టునకు దుష్టకార్యములు చేయుట యెట్లు స్వభావమో, ధర్మాత్మునకు ధర్మము స్వభావ సిద్ధము. తన్ను రావణుఁడు వెడలఁగొట్టును, ఇచ్చటికి రావలసి యుండును అని ముందుగాఁ దెలిసి యీ యీ కార్యములు చేసెను. ప్రపన్నుఁడు ధర్మకార్యములు చేయరాదా? మంచిమాట లాడరాదా? హితమెవరికైన బోధింపరాదా? కావున విభీషణుఁడు ప్రపన్నుఁడే. నేను ప్రపన్నుఁడ నని సోమరియై మొద్దువలెఁ గూర్చుండువాఁడు వాస్తవ ప్రపన్నుఁడుగాఁడు. లోక హితార్థము ఫలకాంక్షలేక యథాశక్తి ధర్మకార్యము చేయువాఁడే వాస్తవ ప్రపన్నుఁడు. వీఁడే నా కనుకూల సంకల్పుఁడు.

వీఁడు భక్తుఁడై యుండెనేని వీఁ డిట్లు వచ్చిన సహించియుండను. స్నానము చేసి నిత్య కర్మానుష్ఠానములు దీర్చుకొని శుచియై వచ్చియుండవలెను. వీఁ డెచ్చట స్నానముచేసి యే పట్టువస్త్రము గట్టుకొని వచ్చెను. భక్తి యోగమునందు నధికారనియతి, ఆచారనియతి, కలదుగదా. "యదహరేవ విరజేత్, తదహరేవ ప్రవ్రజేత్" ఏనాఁడు విరక్తి గలిగెనో, యానాఁడే యిల్లు విడిచి పోవలెను- అన్నట్లు రావణువిషయమున నే నిమిషమున మనస్సు రోసెనో, యా నిమిషముననేకదా బయలుదేరి వచ్చెను. సంసారకాంక్ష

యున్న యెడఁ బెండ్లాలకు, బిడ్డలకుఁ జెప్పియైన వచ్చి యుండఁడా ? దిన వార నక్షత్రయోగకరణములు మంచివగునా, కావా యని పంచాంగము చూచి వచ్చెనా? "నాస్తి నాక్షత్ర సంబంధో ననిమిత్తపరీక్షణమ్, శ్రద్ధైవ కారణం నిత్యమష్టాక్షర పరిగ్రహే" అష్టాక్షర స్వీకారమందు నక్షత్రము మంచి దగునా కాదా, శకునము మంచిదగునా కాదా యని పరీక్షింపవలసిన పనిలేదు. శ్రద్ధయే, రుచియే దానికిఁ గావలసిన యధికార మని ప్రపత్తి విషయమునఁ గదా చెప్పఁబడెను. కావున వీఁడు ప్రపన్నుఁడే కాని, భక్తుఁడుగాఁడు.

ఇచ్చట నొక్క విషయము చెప్పవలసియున్నది. శరణాగతికి దేశకాలాది నియమములు లేవనియుఁ, బాహ్యశుద్ధ్యము లేదనియుఁ జెప్పుటచే నెవ్వఁడైన నే స్థితియందైనఁ బ్రపత్తి చేయవచ్చు ననియు, దానికి నియతి లేదనియు నీ మొదలయిన దురభిప్రాయములు గలవారు కారాదు. న్యాసము, సన్న్యాసము ఈ రెంటికి జ్ఞానము ప్రధానము. అమాత్రమున స్వవర్ణాశ్రమాచార ధర్మములు త్యాజ్యములు కావు. ఆతుర సన్న్యాస మెట్టిదో యీ శరణాగతియు నట్టిదే. "యదా హ్యాతురస్స్యా న్మనసా వాచా సన్న్యసేత్" అని శ్రుతి. అనఁగా ఆతురుఁడైనయెడల మనస్సుతోఁగాని వాక్కుతోఁగాని సన్న్యసింపవచ్చును. ప్రపత్తికి నిదియే లక్షణము. ఇదియే విధి.

ఆతురుఁ డనఁగా— "ఉత్పన్నే సంకటే ఘోరే చోరవ్యాఘ్రాదిగోచరే, భయభీతస్య సన్న్యాసమఙ్గిరా మునిరబ్రవీత్" ఘోరకష్టసమయ ప్రాప్తించినను దొంగలచే, పులులు మొదలగు వానిచే భయము గలిగినపుడు, ఇఁక బ్రతుకననితోఁచెనేని మీఁదఁజెప్పినట్లు వాక్కుతోనో, మనస్సుతోనో సన్న్యసింపవచ్చును.

ఆపత్కాలేతు సన్న్యాసః కర్తవ్య ఇతి శిష్యతే
జరయాభిపరీతేన శత్రుభి ర్వ్యాధితేన చ
ఆతురాణాం చ సన్న్యాసే నవిధి ర్నైవ చ క్రియా
ప్రేషమాత్రం సముచ్చార్య సన్న్యాసం తత్ర పూరయేత్
సన్న్యస్తోహ మితి బ్రూయాత్ సవనేషు పరిక్రమాత్
ఆతురాణాం విశేషోస్తి న విధి ర్నైవచ క్రియా
ప్రేషమాత్రస్తు సన్న్యాస మాతురాణాం విధీయతే.

ఆపత్కాలమందు సన్న్యాసము కర్తవ్యము. ముసలితనముచేతనో, శత్రుబాధచేతనో బాధపడువాఁడు ఆతురసన్న్యాసి కావచ్చును. ఆర్తి కలవాఁడై సన్న్యసించితి నని చెప్పుట చాలును. దీనికి విధి లేదు. హోమాది కర్మములు లేవు. ఆర్తిమాత్ర ముండవలెను. ఆర్తుఁడై సన్న్యాసి నైతి నని చెప్పిన

వెంటనే చచ్చినా వానికి దహనాది క్రియలు లేవు. సన్న్యాసులను బూడ్చునట్లు పూడ్చవలయును. బ్రదికినా మరల యథావిధిగా హోమాదులతోడ సన్న్యాస కల్పప్రకారము కర్మకాండము జరుపవలయును.

"ఆతురస్య ప్రైష మాత్రేణ సన్న్యాసస్య పూర్తి శ్రవణాత్ తదుత్తర కాలమేవ మృతస్య ఉపదేశవికలస్యాపి ఖననసంస్కారమేవ కుర్యాత్. జీవితశ్చే చ్ఛిఖాయజ్ఞోపవీతంచ నికృత్య దండకాషాయవస్త్రాదీని చాదాయ సద్గురు మన్విష్య తదుపదేశం గృహీత్వా యతిధర్మా ననుతిష్ఠేత్" ఆతురునకు నార్తితో సన్న్యసిస్తినని యనుటచేతనే సన్న్యాసపూర్తి కలదు. కావున వాఁ డుత్తరక్షణమందుఁ జచ్చినేని ఉపదేశము లేక పోయినను ఖననసంస్కారమే చేయవలయును. ఆవల జీవించెనా శిఖాయజ్ఞోపవీతములు వదలి దండము కాషాయవస్త్రాదులు తీసికొని సద్గురు నొద్దకుఁబోయి యాయనచే మంత్రోపదేశము గొని యతిధర్మమం దుండవలెను.

ఇట్టులే యార్తప్రపన్నున కే విధియు నక్కఱలేదు. కాని యావల వాఁడు జీవించెనా యథావిధిగా దేవతాసన్నిధానమందు సదాచార్యునిచే మంత్రోపదేశము గొని స్వవర్ణాశ్రమధర్మములను దప్పక జరుపవలెను. విభీషణుఁడు, ద్రౌపది, అర్జునుఁ డిట్టి కష్టదశయందు విధిరహితముగఁ బ్రపత్తిచేసి యావల నియమములు జరపినవారే. కావునఁ బ్రపన్నుఁడు వర్ణాశ్రమాచార రహితుఁడై యానజ్జవము నాస్తికుఁడై చరింపవచ్చునని ప్రపత్తిశాస్త్రములు చెప్పవు. ఆర్తికలిగి ప్రపత్తిచేయువానికి విశ్వాసము, పారతంత్ర్యము ముఖ్యములు. దృప్తుఁడైన ప్రపన్నునకు నన్ని యనుష్ఠేయములే. నాకు దాసుల మనువారు నా యాజ్ఞ నుల్లంఘింపవచ్చునా? శ్రుతులు,స్మృతులు నా యాజ్ఞా వచనములు. వాని నతిక్రమించి స్వేచ్ఛగా వర్తించువాఁడు నా భక్తుఁ డెట్లగును? ప్రపన్నుఁ డెట్లగును? నీయందు నాకుఁ బ్రేమ గలదు, గాని నీవు చెప్పినమాట వినను అనిన నేమి యర్థము- అని రామచంద్రమూర్తి యభిప్రాయము.

'యోజనలు సేయు తెఱఁగుల వ్యూహములను నుపమలందేని నప్రమత్తుండవై యుండవలయు'నని కర్మమం దెక్కువ నిష్ఠగల నీ కంటెను, "జాంబవాం స్త్వథ సంప్రేక్ష్య శాస్త్రబుద్ధ్యా విచక్షణః" అని జ్ఞాన యోగ నిష్ఠ గల జాంబవంతుని కంటెను, 'భక్తిశ్చ నియతా వీర'నియమముతోఁ గూడిన భక్తి యని చెప్పి భక్తిమార్గ నిష్ఠుఁడైన హనుమంతుని కంటెను, 'రామచంద్రునిఁ శరణము చొచ్చితి'ననిన విభీషణుఁడే నాకు విశేషముగఁ బరిగ్రహింపఁదగినవాఁడు. హనుమంతుఁ డంత శ్రమము పడినఁగదా యతనికి నన్ను సమర్పించుకొంటిని. విభీషణుని 'శరణం గతః' శరణు చొచ్చితి నన్న

రెండు మాటలలోనే గ్రహింపఁదలఁచితిని. కావున కర్మయోగులు, ఆత్మజ్ఞాన యోగులు, భక్తులు నాకుఁ బ్రియులే యైనను ప్రపన్నులు వారికంటె నాకిష్టులు. కావున నెప్పుడు శర ణను మాట నా చెవిని బడెనో యభయ మని యప్పుడే యంటిని. వీరు చంటిబిడ్డలవంటి వారు.

సుగ్రీ—నేను రాజ్యకాంక్ష నిన్నాశ్రయించితి నంటివి. సత్యమే. నేను గాదనను గాని విభీషణుఁడు "తానును రాజ్యము వేఁడుపొంటె నీయెడకుఁ దారసిలెఁ మతి పూర్వకంబుగ' (3౬-౨ ప) అని మీ హనుమంతుఁడే కదా చెప్పెను.

రామ—అది చెప్పినవాఁడు హనుమంతుఁడే కాని, విభీషణుఁడు గాఁడు. విభీషణుఁడు నా యభిప్రాయ మిది యని హనుమంతునకుఁ జెప్ప లేదు. విభీషణు రాకకుఁ బ్రయోజనముఁ గల్పింపఁగోరి తన యూహచేఁ దనకు విభీషణుఁ డుపకారము చేసియుండుటచేఁ బ్రత్యుపకారబుద్ధిఁ జెప్పెను. సుగ్రీవా! నేను నిన్నాక్షేపించు చున్నానని తలఁపకుము. ప్రపత్తిలక్షణము విభీషణుఁడు ప్రపన్నుఁడను విష యము నీకుఁ దెలిపి నీ సందేహమును బోఁగొట్టఁ జెప్పుచున్నాను. ఇప్పుడు నీవు నాకింతటి మిత్రుఁడవుగదా. ఎన్నివిధముల నన్ను నీవు పరీక్షించి నాయందు నీవు విశ్వాసముగల వాఁడవైతివి. రెండవసారి యుద్ధమునందు వాలిని నేను జంపువఱకు నీ సందేహము తీరలేదు కదా! విభీషణుఁడో నా యం దెంతటి దృఢవిశ్వాసము లేకుండినఁ జంకు గొంకు లేక నేను దండింతునో, నిరాకరింతునో యను భయము లేక చివాలున లేచి తన పూర్వపరిచితు లగు నాప్తుల యొద్దకువచ్చినట్లు వచ్చెనే! అది నీ వాలోచింపవలదా? నీది గుణకృత దాస్యము. నా గుణములఁ బరీక్షించి దాసుఁడ వైతివి. అతనికో స్వరూప ప్రయుక్త దాస్యము. గుణకృత దాస్యమున కంటె స్వరూప ప్రయుక్త దాస్యమే కదా శ్రేష్ఠము. ఈ కారణముచే నూతనముగఁ బుట్టిన దూడయం దలి ప్రీతిచే దానికి ముందుపుట్టిన దూడను ఆవు పొడిచి తన్నినట్లు నేను నీ పక్షము నిరాకరించి యతని పక్షమునే మాటలాడుచున్నాను. సుగ్రీవా! నాకు శరణా గతుఁడైనవాఁడు వెంటనే నా యొద్దకు రాకుండ నీ వడ్డుపడుటచే నింతకాల ముగ నయ్యో! నిరాధారముగ నాకాశమున నిలఁబడియున్నాఁడు గదా యని నా మన స్సెంత పరితపించు చున్నదో నీ వెఱుఁగవు కదా.

సుగ్రీ—నాకుఁ జేసిన శరణాగతి వ్యర్థము పోరాదంటివి గదా. నేను నీయొద్దకు విభీషణుకంటె సమీపముగ వచ్చితిని, చేతులు జోడించితిని. నా యభిప్రాయము చెప్పితిని. విభీషణువలన నాకుఁ జావులేకుండఁ గాపాడు మంటిని. ఇంత దూరము నేను వినయముతో మనవిచేసినను నా శరణాగతి వ్యర్థము చేయు చున్నావేల?

రామ—విభీషణు శరణాగతికంటె నీది వెనుకటిది, దానికి విరుద్ధమైనది. అతనికి నా ప్రాప్తి లేకుండఁ జేయువలయు నని నీ సంకల్పము. అయినవలన నీకు భయము లేదు. నే నెఱుఁగుదును. నీది యస్థానభయము. దానికి నీ యూహా తప్ప దగిన కారణము లేదు. ఒక భాగవతుఁడు చేసిన శరణాగతికి విరుద్ధముగ మఱియొకఁడు చేయు శరణాగతి ఫలింపదు. నీ మేలు నీవు కోరవచ్చును. ఇతరులకుఁ గీడు గోరరాదు. ఒకఁడు చెడవలె, నేను బాగుపడవలె నను తలంపు సరిగాదు.

సుగ్రీ—రామచంద్రా! ప్రపత్తి యుపాయమా? యుపేయమా? ఉపాయమంటివా కర్మజ్ఞాన భక్తులకు దానికి నేమి భేదము? దాని ప్రాశస్త్య మెట్లు?

రామ—ఒకసాధనముచే మఱియొకవస్తువును సాధించునెడల నా సాధనము నుపాయ మనఁబడును. ఒకఁడు పండును కత్తితో ముక్కలుగాఁ గోసి తినును. కత్తి సాధనము, పండు సాధ్యము. కత్తి యుపాయము, పండు ఉపేయము. కర్మజ్ఞాన భక్తులు భగవత్ప్రాప్తి యను ఫలమునందు నీ కత్తివంటివి. మఱియొకఁడు పండునే యెత్తి నోటఁగఱచుకొని భుజించెను. వానికిఁ గలిగిన ఫలమే వీనికి గలిగెఁగదా. వీనికి సాధన మేది? సాధ్య మేది? సాధనమే లేదంటివా, పండు పండుగా నుండవలసినదే, వీఁడు వీఁడుగా నుండవలసినదే. కావున సాధనమునకు సాధ్యమునకు భేదము లేదు. అట్లాలే ప్రపత్తికి, నాకు భేదము లేదు. కావునఁ బ్రపత్తియే నేను, నేనే ప్రపత్తి. నన్నాశ్రయించుట ప్రపత్తి నాశ్రయించుట. నన్ను సాధించుటకు నాకు వేఱుపాయము-సాధనము లేదు. నేనే యుపాయము-సాధనము నన్ను ప్రార్థించను జ్ఞానమే రూపముగాఁ గలది ప్రపత్తి. గత్యర్థకము లన్నియు జ్ఞానార్థకములు గదా.

సుగ్రీ—అట్లైన నచేతన మగు జ్ఞానము చేతనుఁడ నగు నన్నెట్లు గాచును?

రామ—వానికిఁ దీపను జ్ఞానము లేదు, వెలుఁగను జ్ఞానము లేదందువు గదా. నీవు తెలుపు జ్ఞాన మెట్లగు నని నీ వనెదవు? జ్ఞానమునకు వన్నె రుచి కలవా? అట్లులే నాకును, ప్రపత్తికి నభేదము చెప్పఁబడును. ప్రపత్తికి నేను విషయమును. నేనే యుపాయము. కావున నన్ను సాధించుటకు నేనే యుపాయ మగుదునుగావున నభేదము.

సుగ్రీ—రామచంద్రా! నీవు ప్రపన్నున కభయము పుట్టించెద నంటివి. అంతకు ముందు లేనిదానినిఁగదా నీవు క్రొత్తగాఁ గల్పించితివి. "ఉత్పన్నస్య వినాశయోగాత్" ఏది యుత్పన్న మగునో యది నాశ మగును- అను న్యాయముఁ బట్టి నీ యిచ్చు ముక్తికి నాశము కలదుగదా.

రామ— సుగ్రీవా! జీవులు నిత్యులు. "అపహతపాప్మా విజరో విమృత్యు ర్విశోకో విజిఘత్సో౽పిపాస" యన్నట్లు జరామరణాదులు లేనివారు చేతనులు. ఇవి జీవుల స్వరూప స్వభావములు. ఇట్టి జీవులు ప్రకృతికి వశపడి దాని బలముచేఁ

దమ గుణములను మఱచి తమ్ముఁ జచ్చువారిగాఁ, బుట్టువారిగాఁ దలఁచు చున్నారు. ఈ ప్రకృతి బాధ తొలఁగిపోయెనేని మఱల యథాపూర్వము స్వప్రకాశముతోఁ బ్రకాశింతురు. అద్దము ప్రకాశించునదే, అది మురికి వలనఁ బ్రకాశము మఱుఁగుపడి యున్నది. ఈ మురికి దాని ప్రకాశము వెలికి గానరాకుండఁ జేసినదే కాని, దాని ప్రకాశమును రూపు మాయఁజేయ లేదు. కుండలో దీప ముంచితిమేని దీపకాంతి వెలికి రాకుండఁ గుండ జేయగలదుగాని దీపమునకు గాంతి లేకుండఁ జేయఁజాలదు. అట్లే ప్రకృతియు జీవునికి స్వరూప స్వభావనాశము గలిగింపఁ జాలదు, మఱుఁగు పఱుపఁగలదు. మఱుఁగు తొలఁగి పోయిన మునుపటివలె నుండును. క్రొత్తగా వచ్చినది లేదు, ప్రపత్తి యీ ప్రకృతిని దొలఁగించును. అది చేయు కార్య మంతియే. ప్రకృతి తొలఁగిపోవుటచేఁ బ్రపన్నుఁడైన జీవుఁడు తన స్వస్వరూపముతోఁ బ్రకాశించును. కావున నే నభయము ఘటియింతు ననఁగా భయకారణము తొలఁగింతు ననియే యర్థముగాని, యభయ మను క్రొత్తదాని నెక్కడ నుండియో తెచ్చి యిచ్చెద నని యర్థము కాదు. నీవు యువరాజవై యుంటివి. వాలి యను ప్రతిబంధము నీ కా సుఖము లేకుండఁ జేసెను. నే నా ప్రతిబంధము దొలఁగించితిని. నీ పూర్వస్థితికి నీవు వచ్చితివి. నీకు నేను గ్రొత్తగా వానరరాజ్యమును, రుమను దెచ్చి యిచ్చితినా ?

ఈ విషయమున "స్వేన రూ పేణాభినిష్పద్యతే- ఆవిర్భూత స్వరూపస్తు - అనబోధాద యో గుణాః" అనియు "ప్రకాశ్యంతే న జన్యంతే నిత్యా ఏ వాత్మ నోహి తే" యనునవి ప్రమాణములు. ఆత్మలు నిత్యములు కావున వాని కా స్థితియు నిత్యమే, కావున ముక్తియు నిత్యమే-

సుగ్రీ—ఈ ముక్తుఁడు మఱలసంసారములోఁ బడిన నీవేమి చేయఁగలవు ? ముక్తికి హాని రాలేదా ?

రామ—ఏటి ప్రవాహమునం దొకఁడు కొట్టుకొని పోవుచుండ లాగి యొడ్డున వేసి తిని. మరల వానిని నీళ్లలోఁ ద్రోయుదునా ?

సుగ్రీ—వాఁడే పడిన నీవేమి చేయఁగలవు ?

రామ—నా సంకల్పము లేక గడ్డిపోఁచయుఁ గదలదు. ప్రపన్నుఁడు ముక్తుఁడు కావలయు నని సంకల్పించి ముక్తుని జేసితిని. నా సంకల్పమునకు విరోధముగ మరల సంకల్పించుటకు నేను వెఱ్ఱినా ? చపలచిత్తుఁడనా ? అట్లెప్పటికి జరగదు.

న పునరావృత్తి శబ్దాత్ న పునరావృత్తి శబ్దాత్ - బ్ర. సూ.

యద్ గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ. భ. గీ. ౮-౨౧.

సుగ్రీ—తక్కిన యుపాయములకంటెఁ బ్రపత్తి శీఘ్రఫలద మంటివే. అది యెట్లు ?

రామ—నీవు మామిడిపండు తినవలయు నని కోరిక గలిగి పం డెత్తుకొని నోరఁబెట్టుకొంటివి. మఱి యొకఁడు అట్టిపండే తినవలయు నని కత్తిని సంపాదించుకొని దానిని జక్కఁబఱచుకొని చేతిని గోసికొందునో యని మెల్లగా పండును ముక్కలుగాఁ జేసి ముందుంచుకొని యొక్కొక్క ముక్కయే తిన నారంభించెను. ఫలము రుచి శీఘ్రముగ ననుభవించిన వారెవరు ? నీవే కదా. అట్టులే ప్రపత్తి యనఁగా నా ప్రాప్తియే, నన్ననుభవించుటయే. కావునఁ బ్రపత్తిచేసిన నిమిషము మొదలు వానిని నేను రక్షించువాఁడనే. తక్కిన వట్లు గాదు గదా !.

సుగ్రీ—రామచంద్రా! ధనధాన్యాదులఁ గోరువారు నిన్ను నిర్బంధించు చున్నా రంటివి. వారు చేయునది యాచనయే. భిక్షుకుఁడు శరణువేఁడెను, ఇది యాచనయే. అది నిర్బంధ మైనప్పుడు, ఇదియేల నిర్బంధము కాదు?

రామ—అతిథి యెవఁడైన వచ్చునా యని యన్నదాత నగు నీ వెదురు చూచుచుంటి వనుకో, నీ భోజన సమయమునకు సత్పురుషుఁడు వచ్చెననుకో, వానికన్నము పెట్టుట నీకు నిర్బంధముగాఁ దోఁచునా? మఱియొకఁడు త్రాగుఁబోతు నాకుఁ బదిరూపాయ లిమ్మని వాకిట ధారణ పండుకొనె ననుకో! ఇచ్చుటకు నీ కిష్టము లేదు. ఇది నిర్బంధ పఱుచుట కాదా? ఈ యిరువురను నీవు సమానముగాఁ జూతువా? అట్టులే నేనును రక్షించుట యనునది నాకు స్వభావ ధర్మము. కావున నెవఁడైన రక్షింపు మని కోరునా యని నే నెదురు చూచుచుందును. ఇట్టిచోట నొకఁడు నన్ను రక్షింపుమని తన యభిప్రాయముఁ దాను దెలిపిన నాకుఁ గష్టముగాఁ దోఁచునా? ధనము, ధాన్యము కోరువారి విషయ మట్టిది కాదు. ధన ధాన్యాదులఁ గోరువారు వానివలనఁ గలుగు కీడు వారెఱుఁగరు, నే నెఱుగుదును. వానివలన వారు ముక్తికి దవ్వైపోదురు. కావున వారి కది యిచ్చుట నా కభిమతము గాదు. కావున నది నిర్బంధ మంటిని. వేఁడుట యనఁగాఁ దన యభిప్రాయము తెలియఁజేయుట. ప్రపన్నుఁడు తెలియఁజేయవలసిన దింతయే; ఒకఁడు నీ యొద్దకు వచ్చి 'యయ్యా నీవు నాకు జీతము బత్తె మియ్యవలసిన పనిలేదు. నీ కొలువు చేయుచుండెద' ననును. ఇది నిర్బంధించుట యగునా?

విభీషణునియందుఁ బ్రపత్తి లక్షణపూర్తి గలదా?

ఆనుకూల్య సంకల్పము, ప్రాతికూల్యవర్జనము, రక్షించు నను విశ్వాసము, గోప్తృత్వవరణము, ఆత్మనిక్షేపము, కార్పణ్యము- ఈ యాఱును ప్రపత్తి కంగములు. ఇవి విభీషణునియందుఁ గలవు. సర్వభూతహితము ఆనుకూల్య సంకల్పము. సర్వము భగవంతునకు శరీరము కావున నెవనిని హింసింపకుండుట

ఆనుకూల్య సంకల్ప మగును. ఇది విభీషణునియందుఁ గలదనుటకు, "ఉ. అన్నవు నీ వటంచు హిత మారఁ వచించిన యట్టి నానుడుల్, మున్నన సేయవైతి వీఁక లంకను రాక్షససంఘ యుక్తముగ, నిన్నును లెస్స కాచుకొని నెమ్మది నుండుము స్వామి నీ కగుఁగ, నన్నెడఁబాసి సౌఖ్యము ఘనంబుగ నందుము పోయివచ్చెదన్ (3౧౬ ప.) అను దానిని లక్ష్యముగాఁ బూర్వాచార్యు లుదాహరించి యిట్లు సమర్థించిరి.

నన్నెడఁబాసి సౌఖ్యమందు మనుపది యెత్తిపొడుపు మాటయే కాని నిండుమనస్సుతోఁ జెప్పినమాట గాదు. నీవు చచ్చుట సిద్ధ మనియే వాస్తవార్థము. ఇట్టిది యానుకూల్య సంకల్ప మగునా యని శంక.

శత్రుఁడైనను, మిత్రుఁడైనను, నుదాసీనుఁడైనను సర్వము భగవచ్ఛరీర మను తత్త్వజ్ఞానము గలిగి హింసింప మానెనేని యానుకూల్య సంకల్ప మగును గాని, అన్నవుగాన నీకు హితము చెప్పితిని అని చెప్పుటచేఁ దన కర్తవ్యము తాను నిర్వహించినవాఁ డయ్యెఁగాని, తత్త్వజ్ఞానమునకు నెడము లేదు. అయినను రావణుఁడు దుష్టుఁ డగుటచే నతనియందు నన్న యను గౌరవము విభీషణునకు లేదు. తండ్రియైనను జారుఁడయ్యెనేని వానియందుఁ దండ్రి యను గౌరవ ముంపరాదనికదా శాస్త్రము చెప్పుచున్నది. అట్లుండఁ బరమ దుర్మార్గుఁడయి బుధుఁడు తనతల్లి యగు రోహిణిని బట్టినట్లు జగన్మాత యగు సీతనుగూడఁ జెఱుపఁదలఁచిన వానియందు సోదరప్రీతి యెట్లుండఁ గలదు. ఆ కారణముచే కండ గర్వముననో, యజ్ఞానముననో యకార్యములు చేయు గురువునైనను శాసింపవలసిన దనియే శాస్త్రము చెప్పుచున్నది. కావున రావణుఁడు దండ్యుఁడే కాని, వంద్యుఁడు కాఁడు. కావున శత్రుకోటిలోఁ జేరిన వాఁడే (౧2రవ పద్యంబున నీవు చేసినది ఆయువు,సంపద,కీర్తి సర్వము నాశము చేయునని యని రోసి పలికెను. అదియునుగాక యింద్రజిత్తుతో విభీషణుఁడు (౨౦౧౪ - ౨౦౧౫ - ౨౦౧౬ - ౨౦౧౭ - ౨౦౧౮ పద్యములందు) రావణు దుశ్చేష్టలును, రావణుని దాను విడిచిన కారణము స్పష్టముగఁ జెప్పెను. అది యనుగాక రావణ వధానంతరము ( ౨౫౮౫ పద్యమునందు) భ్రాతృస్నేహము గొన్న పరమవైరి యని యిట్టిమాటలు చెప్పెను. ఈ కారణముచే సీతాహరణము మొదలు రావణునందు విభీషణునకు భ్రాతృభక్తి లేదని స్పష్ట పడుచున్నది. ఇట్లు లుండియు వానికి హిత ముపదేశించుట యానుకూల్య సంకల్పము చేతనే యనియు, భ్రాతృభక్తిచేఁ గాదనియు నిర్ణయించిరి.

ప్రాతికూల్య వర్జన మనఁగా హింసింప శక్తియుండియు హింసింపకుండుట 'శీతో భవ' అగ్నిహోత్రుఁడా చల్లగాఁ గమ్మని చెప్ప శక్తిగల సీతాదేవి రావణుని 'హతోభవ' చావుము అని చెప్ప శక్తిగలిగియు స్వరూపహాని యను

భావముతో వానిని హింసింపక సహించి యూరకుండెను. అట్లయితే విభీషణుఁడును బ్రహ్మచేఁ జావులేకుండ వరమును, బ్రహ్మాస్త్రమును బొందినవాఁడు కావున రావణుని వలె పగులఁగొట్టి యుండవచ్చును. రాక్షసులచే వానికిఁ జావులేదు గదా. యనిన చావులేని కబంధుని నిగ్రహము చేసినట్లు చేసియుండవచ్చును. అయినను నట్లు చేసినవాఁడు కాఁడు. కావున నాయందుఁ బ్రాతికూల్య వర్జనము కలదు. ఇది సరిగాదు. విశేష సహాయ సంపత్తిగల రావణునకు భయపడినాఁడని లోకుల తలఁచెదరని యుపేక్షించుటరాఁగా హింసాస్వపాయ విరతి యను లక్షణమందు అపాయ శబ్దమునకుఁ బ్రాపకాంతర మని యర్థము కావున తన్నవమానించిన రావణు నిగ్రహింప యత్నించుటయుఁ బ్రాపకాంతర మగును. కావున నట్టిది చేయు తలంపు లేకుండుటే ప్రాతికూల్య వర్జన మని గ్రహింపనగు. పరతంత్రస్వరూప నాశక మగు స్వయత్నమును మానుటకంటెఁ బ్రాతికూల్య వర్జనము వేఱొక్కటి లేదు. కావున నిచ్చటఁ జెప్పఁబడిన ప్రాతికూల్య వర్జన మిదియే.

మఱియును హింసమానుట, అపాయము మానుట, ప్రాతికూల్య వర్జన మన్నప్పుడు ఆత్మకు బంధకారణము లగుటచే కామ్యకర్మములే హింసా శబ్దమునకర్థ మనియు ప్రపత్తిని దప్ప నితరోపాయములందు సంబంధము గల్పించుకొనుట అపాయ మనియుఁ జెప్పఁబడెను. కావున కామ్యకర్మములు మాని ప్రపత్తి నిష్ఠుఁడగు వాఁడు ప్రాతికూల్యమును వర్జించినవాఁడగును. ఇట్లు సూచించిన స్వయత్న త్యాగము ఫలితార్థ మగును. కావున ముందు చెప్పినది దీనితోఁ బొసఁగుచున్నది.

శరణాగతుని రామచంద్రమూర్తి వాత్సల్యంబున రక్షించు నని సీతాదేవి చెప్పి యుండుటను, వాలిని జంపి సుగ్రీవునకు రాజ్య మిచ్చె నని విని యుండుటను, శరణాగతుఁడైనచోఁ దన్నుమాత్రి మేల రక్షింపఁ డను నమ్మకముతో ముందు వెనుకఁ జూడక యితరాలోచనలు లేక వచ్చుట మహావిశ్వాసమును దెలుపును.

ఇట్టి విశ్వాసము కలుగుటకు నాలుగు కారణములు చెప్పఁబడెను.

"శక్తేస్సూపసదత్వాచ్చ, కృపాయోగాచ్చ శాశ్వతాత్,
ఈశేశితవ్యసంబంధా దనిదం ప్రథమా దపి॥

శక్తి, సూపసదనము, కృపాయోగము, రక్షకరక్ష్యసంబంధము - ఇవి భగవంతునియందు గల వనుజ్ఞానము విశ్వాసకారణ మగును.

శక్తియనఁగాఁ దన యాశ్రితుల కార్యములను జక్కఁజేయుటయందు అఘటిత ఘటనాసామర్థ్య మనుశక్తి. తన యాశ్రితుల కొఱకు ఇతరుల కసాధ్యమైన వానిని గూడఁ జేయుట. లోకముల నన్నిటినిజయించిన రావణుని జయించిన వాలిని నొక్క బాణముతోఁ జంపుట యెవ్వరికిని సాధ్య మగు కార్యము గాదు. అట్టి దానిని రామచంద్రమూర్తి చేసెను.

సూపసదనము, అనగా సౌశీల్యము. ఎట్టివారైనను దగ్గఱఁ జేయుటకు సులభుఁడై యుండుట. తాను గొప్పవంశమునఁ బుట్టిన మహారాజయ్యును కోఁతులను గ్రద్దలను, బోయలను దగ్గఱఁదీసి వారితో మైత్రిచేయుట సౌలభ్యమును దెలుపును. యక్షరక్షః పిశాచ దానవుల నందఱను కొనవ్రేలితో మీటఁ గలవాఁడు సహాయార్థియై వాలివధము చేసి సుగ్రీవుని బట్టాభిషిక్తునిఁ జేసినాఁడనుట యసంగతము కావున నిది కృపచేఁ జేసినాఁడని పూర్వులు నిర్వహించిరి.

రక్ష్యులైన యాశ్రితులకు రామచంద్రమూర్తి రక్షకుఁ డనుటను సుగ్రీవరక్షణమే తెలుపుచున్నది.

ఇవన్నియు విభీషణుఁడు తెలుఁగును గావున రామచంద్రమూర్తియందు విశ్వాసము కుదిరెనని యెఱుంగనగు.

గోప్తృత్వ వరణ మనఁగా నీవు నాకు రక్షకుఁడవని తనయభిప్రాయము దెలుపుట. 'జగచ్ఛరణ్యోతే నా స్థితిః పల్పరే' యనుటచేఁ దనయభిప్రాయము దెలిపినవాఁడయ్యెను.

'మనుజవరా భవద్గతము మత్సుఖజీవిత రాజ్యభోగముల్' ప. ౩౯-౪. అనుటచే ఆత్మనిక్షేపము చెప్పఁబడెను.

కార్పణ్య మనఁగా దైన్యము. 'దైన్యం కార్పణ్యముచ్యతే' ఇల్లు వాకిలి సర్వము విడిచి వచ్చినను నన్ను నిచ్చట వానరులు చంపెద మనుచున్నారే యని భయపడి దీనుఁడై యుండుట కార్పణ్యమును దెలుపును. భయముచే దిక్కు దెలియక పోవుటయే దైన్యము.

శ్రీమద్రామాయణమందలి యీ శ్లోకమునకుఁ జరమశ్లోక మని పేరు. భగవద్గీతయందు శ్రీకృష్ణభగవానులు మోక్షమార్గములు పెక్కు లుపదేశించి కడపట "సర్వధర్మాన్ పరిత్యజ్య" యను శ్లోకము నుపదేశించిరి. వారి యుపదేశమంతయు కడపటిది. దీనికిఁ దరువాత నేమియుఁ జెప్పవలసినది లేదు. కావున నిది చరమశ్లోక మనఁబడెను. అట్లులే రామచంద్రమూర్తియు 'సకృదేవ ప్రపన్నాయ' నీవాఁడనని యొకసారియే' యని చెప్పి శరణాగతి నొక్కి యుపదేశ మొకరికిని జేసినది లేదు. అదియును గాక యీ రెండు చరమశ్లోకములందు సమాన విషయములు గలవు. ఎట్లన— కృష్ణమూర్తి ముందు కర్మ, జ్ఞాన, భక్తి మోక్షసాధనము లుపదేశించి పిమ్మటఁ బ్రపత్తి నుపదేశించెను. ఇందు శ్రీరామచంద్రమూర్తి సుగ్రీవుని కర్మవాదము, జాంబవంతుని జ్ఞానమార్గము, తక్కిన వానరుల రాజనీతి ఖండించెను. హనుమంతుని భక్తిమార్గము కొంత యామోదించి యంతకు మేలయినదని తన ప్రపత్తి మార్గము బోధించెను.

అచ్చట దాయాదులవలన రాజ్యము సంపాదింపఁ గోరిన వాని కుపదేశింపఁబడెను. ఇందు నట్టిదే. అచ్చట యుద్ధము నుపక్రమించు సందర్భమునఁ జెప్పఁబడెను. ఇచ్చట నట్టిదే.

అచ్చట శోకనివృత్తికై చెప్పఁబడెను. ఇచ్చటను శోకనివృత్తికై చెప్పఁబడెను. అచ్చట చెప్పినవాఁడు రాజవంశమందుఁ జేరినవాఁడు, ఇచ్చటను రాజవంశజుఁడు.

అచ్చట నాకేది శ్రేయస్కరమో దానిని జెప్పుమని యర్జునుఁడడిగెను. ఇందును నా శ్రేయస్సును గోరు మీరు తెలిసికొన వలసిన దానిని జెప్పెదను. "శ్రోతుమిచ్ఛామి తత్సర్వం భవద్భిః శ్రేయసి స్థితైః" అని చెప్పెను.

అచ్చట స్వధర్మము మేలా, పరధర్మము మేలా యను ధర్మవిచారము చేయఁబడెను. ఇచ్చటను జేతనునకు స్వధర్మమైన ప్రపత్తి మేలా? పరధర్మమైన రాజనీతి మేలా- యని చర్చింపఁ బడెను. ఇది సామ్యము.

ఇఁక రెంటికిని భేద మే మనిన:—

భగవద్గీత చరమశ్లోకము తేరిమీఁద నుండువానికిఁ దేరిమీఁద నుండువాఁ డుపదేశించెను. ఇది రాజసమును సూచించును. ఇందు నేలమీఁద నుండువాఁడు నేలమీఁద నుండువానికి నుపదేశించెను. ఇది సత్త్వమును సూచించును.

అందు 'మామేకం శరణం వ్రజ' 'నన్ను శరణు పొందు'మనునది యాజ్ఞగాఁ గానవచ్చుచున్నది. ఇందు 'తాను సంప్రాప్తుఁడైన' యనుటచే చేతనుఁడు తానై సమ్మతించి చేయునట్లుగాఁ జెప్పబడినది. అందు 'సర్వధర్మాన్ పరిత్యజ్య' యని ప్రపత్తికి విరోధులగు సర్వమును వదలి పెట్టుమని బోధింపఁబడెను. ఇందును భార్యను బిడ్డలను, లంకను, సిరిని సర్వము వదలి వచ్చిన వాని గుఱించి చెప్పఁబడెను. కావుననే యచ్చట నుపదేశము గొన్న యర్జునుఁ డుపదిష్టార్థము మఱచెను. ఇచ్చట విభీషణుఁడు చక్కఁగాఁ గాపాడుకొనెను. అది పదునాఱువేల భార్యలు గల వానిమాట, 'షోడశస్త్రీ సహస్రాణి'. ఇచ్చట నేకపత్నీవ్రతస్థుని మాట. తాను నియమముందు నిలచి యితరులకు నియమము బోధించెను. ఇచ్చట బోధము, ఆచరణము, రెండును గలవు.

అందు ముందు మాట చెప్పి పిదప నేదో యుపాయముచేఁ దప్పించుకొను నమ్మరాని వానిమాట. కృష్ణవాక్యము అని పేరు తెచ్చుకొన్న వానిమాట. ఇచ్చట రాముం డిరుమాట లాడఁడని పేరు తెచ్చుకొన్న వానిమాట. ఒక్కమాట ఒకబాణము వాఁడుగదా రామచంద్రమూర్తి. అది ములుకోల పట్టుకొని గుఱ్ఱములఁ దోలినట్లు భీమార్జునాదులచేఁ దన కార్యము చేయించుకొన్న వాని మాట.

ఇచ్చట చేత విల్లు ధరించి స్వయముగాఁ గార్యము నిర్వహించిన వాని మాట.

అందు శరణాగతుని యధ్యవసాయము చెప్పఁబడెను. ఇందు శరణ్యుని యధ్యవసాయము చెప్పఁబడెను.

అందు శరణాగతుని 'మోక్షయిష్యామి' వదలిపెట్టెద ననెను. అట్టులే కృష్ణుఁడు తన నిర్యాణానంతర మర్జునుని గవ్వకుఁ గొఱగాని వానిని జేసెను. రామచంద్రమూర్తి చిరకాలము ప్రభువై యుండ ననుగ్రహించెను.

అది భీష్మ ద్రోణ భగదత్త సైంధవ వధాములందు రాజనీతి ననుసరించిన వానిమాట. ఇది తన ప్రాణాపదయందును - శత్రువు చేచిక్కినప్పుడు ధర్మమందే నిలచిన వానిమాట.

అది నరకాసురునింటఁ జెఱఁబడిన కన్యకలఁ బరీక్షింపకయే గ్రహించిన వాని మాట. ఇది పరీక్షించి సర్వదేవతల సమ్మతి గ్రహించిన వానిమాట.

ఇందు శరణాగతుని చేపీడువాఁడగాను అని, వదలను అని చెప్పెను. అట్టులే స్థిరముగ నిలిచెను.

అందు పాపము లన్నిపోవునట్లు చేసెద ననినేకాని, ప్రపన్నుని స్వీకరించెద ననలేదు. ఇందు దోషము లున్నను స్వీకరించెద ననెను.

అందుఁ గాలాంతరమున నదృష్టఫలము చెప్పఁబడెను. ఇందు సద్యఃఫలమైన దృష్టఫలము ప్రత్యక్షముగఁ జూపెను.

అచ్చట నర్జును విషయమును ప్రతిబంధకులు లేకుండఁ జూచి రక్షించెద నని చెప్పఁబడెను. ఇచ్చటఁ బ్రతిబంధకు లుండినను వారి నిరాకరించి రక్షింపఁ బడిన విధము చెప్పఁబడెను.

అది ప్రజాక్షయము చేయఁబూనిన వానిచేఁ జెప్పఁ బడినది. ఇది ప్రజాభి వృద్ధి చేయఁబూనిన వానిచేఁ జెప్పఁబడినది.

ఈ కారణములచేఁ గరుణాకాకుత్స్థుఁ డని పేరొందిన శ్రీరామచంద్రమూర్తి వాక్యమునందే యెక్కువ మెఱుఁగు కానవచ్చుచున్నది.

ఈ విధముగ శరణాగతిని గుఱించి విశేషముగా బోధించుటచే శ్రీమద్రా మాయణమునకు దీర్ఘశరణాగతి యని పేరు వచ్చెను. అనఁగా నాది నుండి యం త్యము వఱకు శరణాగతియే పలుతావులఁ జెప్పఁబడెను. ఈ విషయము బాలకాండ మందు వ్రాయఁబడెను.

ఉ. పొమ్మిఁక తెమ్ము కంజహితపుత్రక! వాఁడు విభీషణుండ యౌఁ
గాక రావణుండ యయిన న్విను మే నభయం బొసంగితిం
దెమ్మట వాని నన్న రఘుధీరదయాగుణచోదితాత్ముఁ డై
నమ్మిన మారు దాశరథిస త్తముతోఁ గపినేత యిట్లనున్. ౩౮౮

అర్థములు. కంజహితపుత్రక = సూర్యనందనా! ఒసంగితిఁ = ఇదివఱకే యిచ్చితిని. చోదితాత్ముఁడు = ప్రేరింపఁ బడినవాఁడు, కపినేత = వానరరాజు.

రామచంద్రమూర్తి తన వ్రత మిది యని చెప్పఁగా సుగ్రీవుఁడు మరల నేమియుఁ జెప్పకుండుటయే గాక కలఁక దేఱిన ప్రసన్నముఖము గల వాఁడగుట చూచి యితని సందేహము దొలఁగిన దని రామచంద్రమూర్తి తలఁచెను. విభీషణుం డయౌఁ గాక = వాఁడు వాస్తవ విభీషణుఁడే యాయెనా సంతోషమే, అటు గాక రావణుఁడే యాయెనా యెక్కువ సంతోషము. ఏలన:—విభీషణుని రక్షించి

తినా విభీషణుఁడు ధర్మాత్ముఁడు గావున రాముఁడు రక్షించెను, అందేమి విశేషము గలదని లోకులందురు. రావణునే రక్షించితినా, అంతటి పరమ ద్రోహిని గూడ శరణనఁగానే రాముఁడు రక్షించెఁగదా యని లోకులు మెత్తురు. విభీషణుని రక్షించితినా, ఏవురను మాత్రమే రక్షించినవాఁడ నగుదును. రావణుని రక్షించితినా లంక సంతతయు నాబాలగోపాలము రక్షించిన వాఁడ నగుదును. అప్పుడు కరుణాత్ముఁడు రాముఁడను పేరు సార్థక మగును.

రావణుండయినన్ = ఏ రావణుని దుర్వర్తనము తలఁచి వాని తమ్ముఁడను కారణముతో విభీషణుని గూడ నీవు సందేహించు చున్నావో యట్టి రావణుఁడే వచ్చి యుండినను మిగుల సమ్మతము.

అర్థములు. అభయం భూసంగిరిన్ = నీ వీయవల దని చెప్పుచున్నావు. నీరు పోయిన తరువాత సేతువు కట్టుచున్నావు. ఆ కార్య మప్పుడే ముగిసినది. దానిని నిర్వహింపవలసిన భారము మీయందున్నది. వేన్ = నేను, రక్షించుట నాకు విధి. విధికృత్యము చేయక యూరక పోమరన్న యెనఁడైన శరణు అనునా రక్షింతునా యనియే కోరుచున్న నేను.

తమ్ము = నాస్తితి రామచంద్రునితోఁ బలుకుచు యని తమ్ముఁ బ్రార్థించెను. ఆ ప్రార్థన చక్కఁగాఁ జెల్లింపవలసిన భారము మీయందున్నది. నే నభయ మిచ్చితి నంటిని. అది నెరవేర్పవలసిన భారము మీయందున్నది. నీవు పలుచుకొని రాకపోయిన నేనే పోవలసి వచ్చును. మీ పురుషకారము వ్యర్థము మీ రా ఫల మును బోఁగొట్టుకొన్న వారగుదురు. ధీరిస యీ గుణచోదితాత్ముఁడు = శరణాగతుని దగ్గఱ చేర్చుకొనెద ననుచున్నాఁడే ఏమి యీయన దయ, ధైర్యము! మే మెక్కడ! తా మెక్కడ! మమ్ము సమాధాన పఱుచు నింతదూరము శ్రమించు టెక్కడ! ఏమి యీయన దయ యని యాశ్చర్యపడి యింతటి దయాశాలి సమీపమున నా యట్టి కఠినుఁడు నిలుచుటకుఁ గూడఁ దగుదునా యని తలఁచినవాఁడై; కపినేత = వానర ప్రభువు, ఇట్లనుటచే వానరు లందఱు రాముపక్షమునే యంగీకరించి రని సూచన.

సుగ్రీవాదులు భగవత్ప్రాప్తికిఁ బ్రారబ్ధమువలె నడ్డపడుటచే విభీషణుఁడు దూరమున నిలిచెను. వారిని సమాధానపఱచి లోలఁగఁ దీయుటకై సుగ్రీవునే పొమ్మనెను.

విభీషణుఁడు వానరుల పురుషకారభూతులఁ జేసెను. పురుషకారము ఫలించ ననుటకై సుగ్రీవునే పొమ్మనెను.

సుగ్రీవ విభీషణులు సమానదశయం దుండువారు. కావున విభీషణుని సుగ్రీవుఁడు పిలుచుకొని వచ్చుటే మర్యాద కావున నాయననే పొమ్మనెను.

సుగ్రీవునకు విభీషణునిపట్ల నింకను సందేహమున్నను పూర్ణముగఁ దొలఁగి నదా పరీక్షించుటకై సుగ్రీవునే పొమ్మనెను.

సుగ్రీవునిఁదప్ప మఱియొకరిని బంపిన నే నాక్షేపించితి నని నా యందు సందేహము గలవాఁడై కదా మఱియొకరిని బంపె నని సుగ్రీవుఁడు తలఁచునేమో యని యా సందేహము దీర సుగ్రీవునే పంపెను.

తాత్పర్యము.

సుగ్రీవా! నీవే విభీషణునొద్దకుఁబొమ్ము. నీవు నమ్మని సైఁగచేయవలదు. పోయి పిలుచుకొని రమ్ము. ఇఁక లెమ్ము. హాయిగాఁ గూర్చుండి ముచ్చటలచేఁ గాలము గడపవలదు. ఇప్పటికే చాల నాలస్యమైనది. ఆతని మన స్సెంత తపించుచున్నదో నిష్కారణముగ నేల యాతనికి నట్టి సంకటము గలిగింపవలెను. చేయఁదగిన పనియైన యెడల వెంటనే చేయవలయును. రావణుని తమ్ముఁడే యని నీవు సందేహించితివి. వీఁడు రావణుని తమ్ముఁడైనను సంతోషమే. రావణుఁడే యీ వేషముతో వచ్చి యుండినను సంతోషమే. నే నిదివఱకే వాఁడు శరణ మన్నప్పుడే నేనభయమిచ్చితిని. మీ చిత్తవృత్తులు దెలిసికొని మీ సందేహము దీర్ప నింతసేపు ముచ్చట లాడు చుండితిని. ఇఁక నీవు వానిని దోడితెచ్చుటే చేయవలసిన కార్యము. అని చెప్పఁగా విని సుగ్రీవుఁ డాయన దయాగుణముచేఁ బ్రేరింపఁ బడినవాఁడై సంతోషించి రామచంద్రునితో సుగ్రీవుఁ డిట్లనియె.

ఉ. ఏమి విచిత్ర మిద్ది జగదీశ్వర! ధర్మవిధిజ్ఞ! లోకసౌ
 ఖ్యామితసక్తచిత్త! యిటు లార్యనుతోక్తులఁ బల్కుటల్, సదా
 ధీమతసత్యమార్గనిరతిం దృఢసత్త్వయుతప్రభావముం
 భామహితత్వముం గలుగు ప్రాజ్ఞవరిష్ఠునకు న్రఘూద్వహా. ౩౮

అర్థములు. ఇది = శరణాగతరక్షణకార్యము, ఏమి విచిత్రము = ఆశ్చర్యకరమైనది కాదు. జగదీశ్వర = ప్రపంచమునంతయుఁ దాఱుమాఱు గాకుండ సక్రమముగా నంచు ప్రభువు. ధర్మవిధిజ్ఞ = ధర్మశాస్త్రము నెఱిఁగినవాఁడా, ఏధర్మము నవ ర్తించిన లోకము సరియగు స్థితియందుండునో దానిని దెలిసినవాఁడవు. శరణాగతుల భృత్యులను సంరక్షింప నెట్లు నడచుకొనవలయునో యా విధానము చక్కఁగాఁ దెలిసినవాఁడవు, లోకసౌఖ్యామితసక్తచిత్త = జనుల సౌఖ్యమందు మిగుల నాసక్తిగల మనస్సుగలవాఁడా! జనుల సౌఖ్యపఱుచుటయందుండు నాసక్తి నీ సౌఖ్యము నాలోచించుటయందును లేదని భావము. ఇటులు = విభీషణునకైన సరే, రావణునకైన సరే - అభయమిచ్చితి నని చెప్పుటలు, ఆర్యనుతోక్తులు = పెద్దలచేత స్తోత్రము చేయఁబడుమాటలు, పామరుల స్తోత్రము గొప్పగాదు. ఒప్పు తప్పు దెలిసినవారు మెచ్చుకొనుట గొప్ప, సర్వదా = సర్వకాల సర్వావస్థలందు, ధీమత = నీ మనస్సునకు సమ్మతమైన, సత్యమార్గ నిరతి = యథార్థమైన మార్గమందు నడచు నాసక్తియును, దృఢసత్త్వ యుతప్రభావమున్=దృఢమైన యధ్యవసాయము గలిగియున్నాఁడన్న కీర్తిని,"ద్రవ్యాసు వ్యవసాయేషు సత్త్వమస్త్రీతు జంతుషు" అను

రము. ధామహితత్వమ్ = పరాక్రమముచేఁ గలిగిన పూజ్యతను, ప్రాజ్ఞవరిష్ఠునకు = బుద్ధిమంతులలో శ్రేష్ఠునకు, రఘూద్వహః = రఘువంశము నుద్ధరించువాఁడా, రఘు రాక్షస సంవాదమందుఁ జెప్పఁబడిన ప్రకారము శరణాగతుఁడైన రాక్షసుని రక్షించి ప్రసిద్ధిగన్న రఘువంశమునఁ బుట్టిన వారిలో శ్రేష్ఠుఁడా! కీర్తికర మైన వంశమునకు నెక్కువ కీర్తి కలిగించువాఁడవు.

## తాత్పర్యము.

సుగ్రీవుఁడు రామచంద్రమూర్తియొక్క స్వాభావిక కల్యాణగుణములఁ జూచి యాశ్చర్యపడి తా నాశ్చర్యపడిన విషయముఁ జెప్పఁబోయి మరల నాలోచించి యీ కార్యము రామచంద్రమూర్తికి సహజమైనది కావున నిం దేమి యాశ్చర్య మున్నదను చున్నాఁడు. చరాచర ప్రపంచము నంతయుఁ గ్రమముదప్పి నడవకుండ శాసించువాఁడవు. ఎట్లు ప్రవర్తించిన నది యట్లు చక్కని స్థితిలో నుండునో దాని నెఱింగినవాఁడవు. లోకమునకు నమితసుఖ మెట్లు కలుగునా యని యాలోచించుచు నీ సౌఖ్యము గూడ నీవు లక్ష్యము చేయని వాఁడవు. నీ వాప్తసమస్తకాముఁడవై, యొకరి వలన నీకుఁ గావలసినది యేదియు లేకుండినను వారికి మేలుచేయుటయే ప్రధాన కార్యముగ నుంచుకొని యుండువాఁడవు. రాక్షసుఁడు శరణాగతుఁడు కాఁగా రక్షించిన రఘువు వంశమునకు నెక్కువ కీర్తి గలిగించి, దాని నుద్ధరింపఁ బుట్టినవాఁడవు. ఈ లోకమున సన్మార్గమును స్థాపింపఁగోరి యవతరించిన వాఁడవు. దృఢమైన యధ్యవసాయము కలవాఁ డని కీర్తి గలవాఁడవు. పరాక్రమ వంతుఁ డని పూజ్యత సంపాదించిన వాఁడవు. బుద్ధిమంతు లనిపించుకొన్న వారిలో శ్రేష్ఠుఁడవు, ఇట్టి నీకు గొప్ప గుణములచేఁ బెద్దలనిపించుకొన్న వారలు మెచ్చునట్టి మాటలు, శరణాగతుఁ డెట్టివాఁడైనను వానిని రక్షింతు నని చెప్పినమాటలు నీవు చెప్పుటయందాశ్చర్య మేమికలదు? అల్పు లిటు చెప్పిన మెచ్చఁదగినదే కాని, యింతకు మించినవి ఎన్నైన చేయఁగల నీకు నిది తృణప్రాయము. జగదీశ్వరత్వము లోనగు నొక్కొక్కగుణమే యింతటి కార్యము చేయ సమర్థమగును. ఇన్నియుఁ గల నీవు చేయుట చిత్రముకాదు.

విభీషణుఁడు శత్రుసోదరుఁడు. ఆయనను స్వీకరించుటచేఁ గీడు కలిగినా తానే కాక తనకు సహాయులై వచ్చిన వారందఱు నాశమగుదురా! ఇట్టి ధర్మసందేహమందు భారము తన యందేల యుంచుకొన వలయు నని రామచంద్రమూర్తి వానర ప్రముఖులతో నాలోచించెను. ఇది ధర్మమే కాని, వారందఱు నొకరు తప్ప నేక వాక్యముగా విభీషణు స్వీకరింపరాదని చెప్పినపుడు తనకిష్టముండనీ, లేకుండనీ భూయిష్ఠాభిప్రాయప్రకారము (Opinion of the majority) నడువవలయునా, తన యిష్టప్రకారము నడువవలయునా? ఇది రాజనీతియా? ధర్మరీతియా? దురభిమానమా? యని సందేహము,

సమాధానము

రాజధర్మ మంతయు నామూలాగ్రము వివరించినఁగాని తగిన సమాధానము కుదురదు. ఇప్పటి ప్రజాప్రభుత్వమునకు పూర్వరాజప్రభుత్వమునకు భేదము గలదు. కావున నుత్తరపీఠిక యం దిది విశదీకరింపఁబడును.

ఉ. నాకును నంతరాత్మ రఘునాయక! యీతఁడు శుద్ధుఁ డంచు నే
 ప్రాకటరీతిఁ దెల్పెడిని ♦ భావము చందము నారయం,ద్వద
 స్తోకనయుక్తిసూక్తులను ♦ గోరముగాఁ బరికించినాఁడ, లే
 దే కలుషంబు వీనియెడ ♦ నెంతయుఁ బూతుఁడు లోన వెల్పలన్. ౯౯౦

అర్థములు. నన్నుఁ బొగడిన మాత్రమున నేమి లాభము? అది క్రియారూపముగఁ బరిణమించి నీ సమ్మతిని విభీషణుని తోడి తెచ్చుటచేఁ జూపినఁగదా యందువేమో యని యాశంకించుకొని సమాధానము చెప్పుచున్నాఁడు. నాకును = వీఁడు మోసగాఁడు, చారుఁడు, వీనిని గూరముగఁ జంపవలసిన దని చెప్పిన నాకుఁ గూడ, అంతరాత్మ = అంతఃకరణము, అంతరాత్మయును నని సముచ్చయ మావర్తింపఁ చుకొనవలయును, నాకును, నంతరాత్మయును అని యన్వయము. భావముచందము= వీని స్వభావ లక్షణము, అనఁగా ముఖనయనాదు లందలి చిహ్నములు, ఆరయన్= పరీక్షింపఁగా, (౨) ఈతని దీనధ్వనిచే స్పష్టమైన యీతని మృదు స్వభావము, త్వత్ = నీయొక్క, అస్తోక = గొప్పదగు, నయుక్తి సూక్తులను = యుక్తితోఁ గూడిన మంచిమాటలను, ఘోరముగాన్ = విశేషముగ, పరికించినాఁడన్ = పరీక్షించితిని, ఏ కలుషంబు = ఏవిధమైన దోషము, ఎంతయున్=మిక్కిలి, పూతుఁడు= పవిత్రుఁడు, నిర్మలుఁడు, లోన = మనస్సునందు, వెల్పలన్ = బాహ్యచేష్టలందు.

తాత్పర్యము.

రామచంద్రా, వీఁడు ద్రోహిగాఁడు, నిర్మలచిత్తము గలవాఁడని నా యంతరాత్మ చెప్పుటయే గాక, వీని దీనస్వరము నాటకములందలి పాత్రములకువలె సమయోచితకల్పితమా, స్వతస్సిద్ధమా యని పరీక్షించితిని. ఆ స్వరమునకుఁ దగిన వికారములు ముఖనయనములందుఁ గానవచ్చెను. నీవు యుక్తియుక్తముగాఁ బలికిన మాటలను బరికించినాఁడను. వాస్తవ శరణాగతుని లక్షణము లేవి యని నీవు చెప్పితివో యవి యన్నియు వీని యందున్నవి. నీవు పరిశుద్ధుఁడని చెప్పిన కారణములు సరిగానున్నవి. వీని నన్నిటిని నాలోచించి చూడఁగా వీఁడు మనస్సునందు, బాహ్యమునందుఁగూడ శుద్ధుఁడే. వీనియందు వంచన లేదని నిశ్చయించుకొంటిని. కావున నా సందేహము తీఱినది.

ఉ. కావున మా సమానుఁ డయి ♦ క్రాలుత మమ్ములఁ గూడి యిష్ట మే
 ధావి విభీషణుండు సఖితం గని యం చన హార్దయుక్తి సు

గ్రీవుని వాక్యము ల్విని సుకీర్తి గ్రహించె దశాస్యభ్రాత వే
యా వినతాతనూజసఖతా ప్తి నెసంగిన యిందుశ్రీకైవడిన్. ౩౯ ౧

**అర్థములు.** మేధావి = బుద్ధిబలము గలవాఁడు, చక్కని యాలోచన గలవాఁడు, కనుకనేకదా తన సోపాధిక బంధువుల నెల్ల విడిచి నిరుపాధికబంధు వగు శ్రీరామచంద్రమూర్తి నాశ్రయించెను. బుద్ధిలేనివాఁ డిట్లు చేయునా ? మనుష్యులఁ గూడి యనుటచే నతఁడు మాతో సముద్రతీరమున నాకేకాదు, వానరుల కందఱకు సమ్మతమే యని భావము. ఇష్ట = ఈ క్షణమందే, ఇదివఱకు దృఢమైన యధ్యవసాయము లేమిచే సత్యాసత్యములు తెలుసుకొను శక్తి లేమిచే నాలసించితిని. ఇఁక నట్లు చేయను. సఖిత్వ = సఖి యనగా స్నేహితుఁడు. సహాయుఁడు, సమానగుణములు గలవాఁడని చెప్పఁబడువాఁడు సఖుఁడని వ్యుత్పత్త్యర్థము. అట్టివాని భావము సఖిత. అనఁగా .వీనిని మేము చేయు కార్యములందు మర్మము విడిచి స్నేహభావమునఁ గలిపికొందు మని భావము. వార్షయుక్తిః = శరణాగతుని రక్షించుటయందు మీ రిట్లు లక్ష్యపడెనే, కాలవిలంబన మగుచున్నదే, నన్ను నమ్మి వచ్చినవాఁడు కంటికిఁ జెడిన రేవణునివలె నశుమ నాకాశమునఁ బక్షివలె నుండవలసి వచ్చెనే యని విచారగ్రస్తుఁడై యుండె నని సూచితము. ఇప్పుడు సంతోషించెను. సుగ్రీవుని వాక్యముల్ విని హర్షింపవలయును. హర్షమునకు సుగ్రీవుని వాక్యములు కారణములుగా నుండవలెను. అటుగాక యతని ముఖవికాసము చేతనే హర్షించి తదనుగుణములైన యతని మాటలు వినె నని భావము. సుకీర్తి = (౧) శరణాగతుని పగవాని తమ్మునైనను సంశయింపక చేపట్టుకొనె నని రామచంద్రమూర్తి కన్వయింపవచ్చును. (౨) ద్వితీయగా గ్రహించి సుకీర్తియగు దశాస్యభ్రాత నని యన్వయించినను నన్వయింపవచ్చును. విభీషణుఁడు రామచంద్రమూర్తి కాశ్రితుఁ డయ్యెను. ఎంతటి బుద్ధిమంతుఁడు ఎంతటి యాలోచనము గలవాఁడను కీర్తి సంపాదించె నని యర్థము. సుకీర్తియగు రామచంద్రమూర్తి దశాస్యభ్రాతను వే గ్రహించె నని యన్వయము. దీనివలన సుగ్రీవుఁడు పోయి విభీషణుని బిలిచికొని వచ్చె నని సూచితము. అట్లు వచ్చుచుండువానిని రామచంద్రమూర్తి గ్రహించెను. గ్రహించుట యనఁగా మనస్సుచే నంగీకరించుట యను నర్థము గలదు. అది యతఁడు శరణన్నప్పుడే జరిగెను. కావున నిచ్చటఁ జేతులచేఁ బట్టుకొనుట యనియే యర్థము చెప్పవలసి యున్నది. పట్టుకొనుట యనునది పట్టుకొనువాఁడు చేయు కార్యమే కాని పట్టుకొనఁబడువాఁడు చేయు కార్యము గాదు. కావున రామచంద్రమూర్తియే తన హస్తములతో విభీషణుని బట్టుకొనె నని గ్రహింపవలెను. చేతులతోఁ బట్టుకొనె నని చెప్పక రామచంద్రమూర్తి గ్రహించె ననుటచే రామచంద్రుఁడే నిండారు మనస్సుతో నెదురుగాఁ బోయి, చేయిపట్టుకొని పిలుచుకొని వచ్చెనని భావము, ఇంతవఱకు జరిగిన కాలవిలంబనమునే సహింపకుండినవాఁడు కావున

నాయన తనయొద్దకు వచ్చు నాలస్యమును సహింపలేక తానే యెదురుగాఁ బోయె నని గ్రహింపనగు. ఇట్టి యభిప్రాయము వాల్మీకికి లేదేని విభీషణుఁడు రాముని యొద్దకు వచ్చె నని చెప్పియుండవలెను. వే = త్వరగా, ఇది కాలవిలంబమును సహింపలేమిని దెలుపుచున్నది. (౨) సుగ్రీవుఁడు కపి, చంచలచిత్తుఁడు. హనుమంతుఁడు కూడ నీ కపిత్వము పోలేదని చెప్పినవాఁడు. అట్టివానికి మరల నే దుర్బుద్ధి పుట్టునో యని యట్టిదాని కెడ మీయకుండుటకై వేగముగఁ దానే పోయి గ్రహించెను. ఎట్టులన:— వినతాతనూజసఖితాప్తిః = గరుత్మంతునితో స్నేహము లభించుటచే, ఇంద్రకైవడిః = ఇంద్రునివలె, గరుత్మంతునకు విభీషణునకు, ఇంద్రునకు రామునకు నుపమానోపమేయములు. ఇంద్రుఁ డెట్లు గరుత్మంతుని సఖ్యము గోరెనో యట్లు రామచంద్రమూర్తి విభీషణు సఖ్యము గోరె నని భావము. గరుత్మంతుని సఖ్యము గోరినవాఁడు ఇంద్రుఁడే - ఇది భారతములోని "సఖ్యం చానంత మిచ్ఛామి త్వయా సహ ఖగోత్తమ" అంతములేని నీ స్నేహము పక్షిరాజా! గోరుచున్నా నని యింద్రుఁడు చెప్పె నను వాక్యము దృఢపఱచుచున్నది. భార. ఆది. ౩౩ అధ్యా - ౨౩ వ శ్లోకము. ఈ సాంగత్యమువలన మేలు పడినవాఁడు రామచంద్రమూర్తియే యని వ్యావహారికార్థమువలనను బ్రహ్మార్థకార్థమువలనను నేర్పడుచున్నది. వ్యవహారమున బలవంతుఁడు, రావణు మర్మ మెఱింగినవాఁడు, రేపు లంకకు రాజుగాఁ దగినవాఁడు, తన పక్షమునఁ జేరిన లాభకర మని యెంచ నగు. యక్షరక్షః పిశాచ దానవుల నెల్లఁ గొనవేలఁ బెట్టినవాఁడు కీడు గోరఁ గాదు. కావునఁ బరమార్థమున దాతకు సత్పాత్రమువలె రక్ష్యప్రాప్తి రక్షకునకే విశేషశ్రేయస్కరము. రక్షాభారము దనయందుంచుకొనినవానికి రక్షింపఁదగినవాఁడు దొరకఁ జేసి రక్షకుఁ డను నామము నతి చిరకాయవంటిదే కదా యగును. ఆ కారణముచే భగవంతుఁడు రక్ష్యుఁడు దొరకునా యని యెదురు చూచుచుండు నని "సర్వజ్ఞోపి హి సర్వేశ స్సదా కారుణికోపి సన్। సంసారతంత్రవాహిత్వాత్ రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే" భగవంతుఁడు సర్వజ్ఞుఁడు, సర్వేశ్వరుఁడు, నిత్యకారుణ్యపూర్ణుఁడు అయినను సంసారమందుఁ గల భోగమోక్షములను రెంటిని సాధనములగు నుపాయములకు నిర్వాహకుఁ డగుటచేత రక్షింపఁ బడఁదగినవారి యపేక్షను దెలిసికొన నెదురు చూచుచుండును. అనఁగా భోగవిరోధులఁ బోఁగొట్టి భోగములనే పూర్ణముగ నియ్యమనెదరా, మోక్ష విరోధుల నణఁచి పునరావృత్తి రహితమైన తన ప్రాప్తినిచ్చి రక్షింపుమనెదరా? యని యెదురు చూచుచుండును. ఇట్టి యిరుదెగలవారిలో నిష్కాములైన తన యాశ్రితులను రక్షించుటకై తానే వారియొద్దకుఁ బోవుచుండును. దీనికిఁ బ్రమాణవాక్యములు— సకాములఁ దనయొద్దకు రమ్మనును. "స్థితే మనసి సుస్వస్థే శరీరే సతి యో నరః, ధాతుసామ్యే స్థితే స్మర్తా విశ్వరూపంచ మా మజమ్। తత స్తం మ్రియమాణస్తు కాష్ఠపాషాణ సన్నిభమ్। అహం స్మరామి మద్భక్తం నయామి

పరమాంగతిం॥" శరీరము, మనస్సు, స్వస్థముగా నుండఁగా, వాతపైత్య శ్లేష్మనాడులు సమముగా నుండఁగా నెవఁడు విశ్వరూపుఁడను, పుట్టువు లేనివాఁడను నగు నన్ను స్మరించునో వాఁడు మరణకాలమందు కఫాదులచే మైమఱచి కట్టెవలె, ఱాతివలెఁ బడియుండినను అట్టి భక్తుని నేను స్మరించి పరమగతికిఁ దీసికొనిపోదును. ఇది శ్రీవరాహ చరమశ్లోకము.

"సత్యం బ్రవీమి మనుజాః స్వయమూర్ధ్వ బాహుః, యోమామ ముకుంద నరసింహ జనార్దనేతి జీవ, జపంత్యనుదినం మరణే ఋణీవ, పాషాణకాష్ఠసదృశాయ దదామి ముక్తిమ్" మనుష్యులారా! చేతులెత్తి ప్రమాణముచేసి సత్యము చెప్పుచున్నాను. ఎవఁడు తాను జీవించియుండిన కాలమందే ముకుంద! నరసింహ! జనార్దన! ఇత్యాది నామములచే నన్ను స్మరించునో వాఁడు మరణకాలమున దేహము తెలియక ఱాతివలెఁ, గట్టెవలెఁ బడియుండినను నేను స్మరించి వానికి ముక్తినిచ్చెదను. ఇది నృసింహ చరమ శ్లోకము.

భగవంతుఁడే తానే గరుడవాహనారూఢుఁడై సీతాదేవిని శ్రీరామచంద్రమూర్తి విమానమున నుంచి తీసికొని పోయినట్లు ప్రపన్నుని దీసికొని పోవును. ఇది ౨౮౦వ పద్య వ్యాఖ్యయందు వివరింపఁ బడును. ఈ ప్రమాణములచే అగతికుఁడై, అకించనుఁడై మరణదశయందు ప్రాణము వచ్చునో, పోవునో యను దశయందున్న వానివలె రామచంద్రమూర్తి యనుగ్రహించునో, నిగ్రహించునో యని సందిగ్ధ దశయందు కదలక మెదలక నోటిమాటలేక నిరాధారముగ నాకాశముననుండు విభీషణు నుద్దేశించి రామచంద్రమూర్తియే పోయెనని గ్రహింప వలెను. ఆర్తరక్షణమందు రామచంద్రమూర్తికిఁగల త్వరాతిశయమును నిది సూచించును.

తా త్ప ర్య ము .

ఈకారణములచే విభీషణుఁ డీ క్షణమందే మాతో స్నేహితుఁడై మాలోఁ గలసి మెలసి, మాతో సమానుఁడై యుండునుగాక. ఇది నాకే కాక వానరులందఱకు సమ్మతమైన కార్యము అని చెప్పిపోయి విభీషణా! నీకు శ్రీరామచంద్రమూర్తి యభయమిచ్చెను, రారమ్ము, అనిపిలువఁగా సుకీర్తియగు రామచంద్రమూర్తి సంతోషించి యతఁడు చెప్పిన మాటలు విని సుకీర్తియగు విభీషణుని కెదురుగాఁ బోయి యింద్రుఁడు గరుత్మంతునితో స్నేహము చేసినట్లు లతనికై చేతులు చాచి స్నేహము చేసెను. ఒక రాకాశమున నొకరు నేల నుండుటచే కరస్పర్శ చెప్పసాధ్యపడదు గానఁ జేతులు చాఁచె నని చెప్పఁబడెను.

— ♦ ౧౯-వ సర్గము. విభీషణుఁడు శ్రీరాముపదంబులమీఁదఁ బడి తన్ను నివేదించుకొనుట. ♦ —

ఉ. అంతట రామభద్రుఁ డభయం బొసఁగం గని రావణానుజుం
డెంతయుఁ బ్రీతుఁ డౌటను మహీస్థలిఁ జూచుచు సన్నతుండు నై

స్వాంతము పొంగ నల్వురు నిజాప్తులతోడుత మింటనుండి స
త్స్వాంతుఁడు రాముపాదముల • సత్వరుఁడై శరణార్థియై పడెన్. ౩౯-౨

అర్థములు. ఇంతవఱకు రక్షకునకు శరణాగతలాభము చెప్పఁబడెను. ఇఁక శరణాగతునకు స్వామి సేవాలాభము చెప్పఁబడును. శరణాగతుని పురుషార్థమిదియేకదా. అంతటన్=రామచంద్రమూర్తి సుగ్రీవుని సమ్మతింపఁ జేసిన పిమ్మట, అభయుంబు=సర్వభూతముల వలన భయములేమి, రావణానుజుండు = రావణునికిఁ దమ్ముఁడైనను వానివలె మతిహీనుఁడు గాక, ఎంతయుఁ బ్రాజ్ఞుఁడౌటన్ = మిగుల బుద్ధిమంతుఁడు గావున, రావణుఁడు పాజ్ఞుఁడు - ప్ర+అజ్ఞుఁడు, = బాగుగ బుద్ధిలేనివాఁడు. ఇది మంచి, యిదిచెడ్డ యని తెలిసికొనుబుద్ధికూడ లేనివాఁడు, కుంభకర్ణుఁడు= పెద్దచెవులవాఁడు కావునఁ దాఁకు తప్పులు తెలిసికొను నంతమాత్రము వినికిడి, తెలివి గలవాఁడేకాని, కార్యశూరుఁడు కాఁడు. విభీషణుఁడు ఎంతయుఁ బ్రాజ్ఞుఁడు = మంచి చెడ్డలు, మేలుగీళ్ళు తెలిసికొను శక్తిగలవాఁ డగుటయే కాక తెలిసిన దానిననుష్ఠానమందుంచు శక్తిగలవాఁడు. మహాస్థలిన్ జూచుచు = రామచంద్రుని నాయన యత్యంతాప్తులు చుట్టుకొని యున్నారు. వారిలోఁ దన కుచితస్థాన మేది, ఏచోటికిఁ బోయిన మనము రామచంద్రమూర్తి పాదములపైఁ బడఁగలము అని యా స్థలమును వెదకుచు, స్వాంతము పొంగన్ =రామచంద్రుని యత్యంతాప్తులలో నేనును గలిసి యుండు నంత భాగ్యము గలిగెఁ గదా యని సంతోషముచే నుప్పొంగుచు, నమ్రతుండునై = మిగుల వినయము గలవాఁడై, ఆకాశము చూచుచు నడచుట గర్విష్ఠుల లక్షణము. నేలచూచి నడచుట వినయ విధేయతలు గలవారి లక్షణము. "దృష్టిపూతం న్యసేత్పాద"మని కదా ధర్మశాస్త్రము చెప్పుచున్నది. కావున వినయముతో నేలఁ జూచి వచ్చెను. నిజాప్తులు = తనకు నాప్తులగు నలుగురిలు, తోడుత వచ్చితిన్ - నా స్థితివేగఁ దెల్పరే యని విభీషణుఁ డాశ్రయించిన వారిని చెంచిన నుగ్రాజునకు కొపించిన వానికి లభించుభగవత్ప్రాప్తి శరణాగతి చేయకుండినను వాని కాప్తులగువారి కందఱకు లభించును గావునఁ దక్కిన నల్వురును రామచంద్రమూర్తిచే ననుగ్రహింపఁబడిరి. ఈ విషయము ముందే వివరింపఁబడెను. ఆప్తులని చెప్పుటచే మొఱమెచ్చులకు ముఖప్రీతికి దాక్షిణ్యమునకు కడుపు కూటికి స్వప్రయోజనార్థము వెంటనుండువారికి లభింప దని భావము. సత్స్వాంతుఁడు = మంచి మనస్సు గలవాఁడు, ఇట్లనుటచేఁ గామాది పీడితుఁడు గాఁడనియు రామచంద్రసేవయే కోరి వచ్చినాఁ డనియు గ్రాహ్యము. సత్వరుఁడై = త్వరతోఁ గూడినవాఁడై, సుగ్రీవుని మాట వినినంత మాత్రముననే శరణార్థియై = శరణము ప్రయోజనముగాఁ గలవాఁడై, "అర్థఃప్రకారే విషయే వ్యవహారే ప్రయోజనే"॥ నానా॥ అతఁడు కోరిన ప్రయోజనము శరణమే కాని రాజ్యాది కాంక్ష గాదని సూచన. పడెన్ = ముందు కూర్చుండి తరువాత మోకాళ్ళు వంచి తరువాత నడుము వంచి తరువాతఁ జేతు

లూని యావల తలవంచి వ్రాలలేదనియుఁ గట్టె పడినట్లు సాష్టాంగముగఁ బడెననియు భావము. రాముపాదములను=రామచంద్రమూర్తి పాదముల నుద్దేశించి, ఇది యుద్దేశార్థంబున ద్వితీయ. అనఁగా భగవంతుని ఆచార్యుని నెచ్చటఁ జూచునో యచ్చట నుండియే నమస్కరింపవలెను గాని సమీపమునకుఁ బోయి నమస్కరింతమని యుండరాదు. ఇది స్వామిని దర్శించునపుడు దూరమునుండి చేయు ప్రథమ నమస్కారము.

తాత్పర్యము.

సుగ్రీవుఁడు సమాధాన పడిన పిమ్మట రామచంద్రమూర్తి సర్వభూతాభయము ననుగ్రహింపఁగా రావణాసురుని తమ్ముఁడైనను మిగుల బుద్ధిమంతుఁడగు విభీషణుఁడు రామచంద్రమూర్తి సన్నిధానమందు నాయన నేత్రాంతములకుఁ బడ నిలుచు భాగ్యము కలిగెఁగదా యని మనస్సు సంతోషముచే నుప్పొంగుచుండ సవినయముగ నేలఁ జూచుచు తన యాప్తులగు నలువురు మంత్రులతో మంచి మనస్సు గలవాఁడు శీఘ్రముగ నాకాశము నుండి దిగి రామచంద్రమూర్తి పాదముల నుద్దేశించి శరణమే ప్రయోజనముగాఁ గలవాఁడై సాష్టాంగ నమస్కారము చేసెను.

క. సరగ నిటు ధర్మబుద్ధియు, శరణాన్వేషియు సరాక్షసచతుష్కుఁడునై
చరణముల వ్రాలి ధర్మాకర ముచితైతత్స్వాహః శరణసూక్తి ననున్. ౩౯-౩

అర్థములు. సరగన్ = శీఘ్రముగ - శీఘ్ర శబ్దభవము సరగు - ధర్మబుద్ధియు = శరణాగతి ధర్మమునందు నిశ్చయమైన మనస్సుగలవాఁడు, వీనిని "గోరంబుగఁ జంపుటయే కృత్య" మన్నప్పుడును, "కావున నమ్మకుఁడీ విభీషణున్" అన్నప్పుడును, "ఎటులైనఁ జేవీడు వాఁడఁగా"నన్నప్పుడును, "మా సమానుఁడై కాలు నన్నప్పుడును," నిట్టి సర్వావస్థల యందు బుద్ధిని జెదరనీక స్థిరమైన మనస్సుతో నుండువాఁడు - ఇది మహా విశ్వాసమును సూచించుచున్నది. శరణాన్వేషి= రక్షకుని వెదకుకొనిపోవువాఁడును - సరాక్షసచతుష్కుఁడు=నలువురు రాక్షసులతోఁ గూడినవాఁడు. తన రెండు కాళ్ళు రెండు చేతులవలెఁ దనకుఁ బరతంత్రులై యుందురు. ఈ విధముగ వీరి నలువురయందు భాగవత పారతంత్ర్యము చెప్పఁబడెను. గావుననే వీరు రక్షింపఁబడిరి. విభీషణు రక్షించె ననిన నాయన కాలు చేతులను రక్షించినట్లే కదా.

చరణములన్ = పాదములందు - చంటిబిడ్డ తల్లిదగ్గరకుఁ బోవునపుడు - మాతృస్తనములందు మనస్సు దృష్టి యుండును గాని తక్కిన దేహముతో దానికిఁ బనిలేదు. భక్తునికి స్వామి పాదము లట్టివే. కావున విభీషణుఁడు తనకు భోగ్యములైనవి స్వామివారి శ్రీ పాదములే కదా యని వానిపై మనస్సు, దృష్టి యుంచి వాని నాశ్రయించె నని భావము. వ్రాలి = వంగి - పూర్వము పడినట్లు దబాలున పాదములు నలుగునట్లు పడలేదు. మెల్లగాఁ బడె నని భావము.

అయ్యో! విభీషణుఁ డిట్లు పడిపోయెనే యని పరువున వచ్చి యతని యవ యవములను జక్కఁగఁ బట్టుకొని గూర్చుండఁ బెట్టునట్లు పడి - ఇది స్వామిసన్నిధాన మునఁజేయఁబడు కాయిక శరణాగతి - శరణార్థి యని పూర్వము మానసికము చెప్పఁ బడెను. దీనిచే నాత్మనిక్షేపము సూచితము. ఇట్లు మానసిక, కాయిక, శరణాగతులు చెప్పి యిఁక వాచిక శరణాగతి చెప్పుచున్నాఁడు.

ధర్మాత్మకరము = ధర్మమునకు స్థానమైనది, ధర్మముతోఁ గూడినది. ఇచ్చట శరణాగతి ధర్మ మైన యానుకూల్య సంకల్పాదులు గలది. ఉచిత = సమయమునకుఁ దగినది.సమర్థుఁడై కరుణాళు వగు రక్షకునియెదుట నెట్లు చెప్పఁబడవలయునో యట్లు ప్రత్యర్థి=ఇప్పుడు'ప్రత్యర్థి సంప్రతీదానీ'మని యమరము, హర్షకర=సంతోషముగలిగించు 'రామచంద్రునిఁ శరణము జొచ్చినాఁడ'నని తొలుత నన్నప్పుడు సుగ్రీవాదులకుఁ గర్ణకఠోరముగ నుండినవి.ఆ మాటలే యిప్పుడు రామచంద్రమూర్తి యనుగ్రహించిన కారణమున సంతోషకరములుగా నున్నవని భావము. సూక్తిః = రామచంద్రునిఁ శరణము చొచ్చినాఁడ నని వానరులతోఁ జెప్పిన యీ మంచి మాటయే యిప్పుడు రామచంద్రమూర్తితోఁ బ్రత్యక్షముగ ననును. రామానుగ్రహము రానప్పుడు వానరులకు దురుక్తిగాఁ దోచిన యీ మంచిమాటలే యిప్పుడు సూక్తులుగాఁ దోఁచెను. దీనికిఁ గారణము వానరుల భావ వికాసము. దీనివలన భగవదనుగ్రహము నకుఁ బాత్రుఁడు గానివాఁడు ఎంత శిష్టుఁడైనను అసూయాపరులకు దుష్టుఁడుగానే కానవచ్చును. "కూర్మిరుం జెన్ని సుధీగుణంబు దరితారూఢంబు సేయుంగదా" 'భర్తృ శరణాన్వేషి పాదములు గ్రాలె' ననుటచే భక్తులకుఁ బ్రపన్నులకు సేవ్యములు తారకములు స్వామివారి పాదములే యని యేర్పడుచున్నది.

ఇది ప్రధానశరణాగతి కాదని పూర్వమే చెప్పఁబడెను. ఇది ప్రధాన ప్రపత్తి యనినయెడలఁ బ్రపత్తిచేయుటకుఁ బూర్వమే స్వీకరించిన ట్లేర్పడును. అది సరిగాదు.

తాత్పర్యము.

ఈ ప్రకారము జాగులేక శరణాగత ధర్మమునందు నిశ్చయ బుద్ధిగలవాఁడును, రక్షకుని వెదకువాఁడును నగు విభీషణుఁడు తనకుఁ గాలుసేతులవంటి నలుగురు రాక్షసులతోడ శ్రీరామచంద్రమూర్తి పాదములపై వ్రాలి శరణాగతధర్మలక్షణ యుక్తము, యోగ్యము,పూర్వము వానరులకుఁ గటువుగా నుండినను ఇప్పుడు సంతోష కరము నైన మంచిమాట లిట్లు చెప్పెను.

చ. అనుజుఁడ రావణాసురున • కాతఁడు సన్నవమాన పెట్టఁ బెం
పునఁ జను దెంచి నే సకల•భూతశరణ్యుని నిన్నుఁ జేరితిఁ
నిను శరణంబుఁ జొచ్చితిని • నెయ్యుర లంక సిరిం ద్యజించితిఁ
మనుజవరా! భవద్గతము • మత్సుఖజీవిత రాజ్యభోగముల్. ౩-౫

పూర్వము సుగ్రీవాదులతోఁ జెప్పినమాటలే యిప్పుడు రామచంద్రమూర్తితోఁ జెప్పుచున్నాఁడు.

అర్థములు. అనుజఃఽహమ్ = తమ్ముఁడను, దీనిని ౩౨వ పద్యముతోఁ బోల్చునది. రావణునకుఁ దమ్ముఁడ ననుటచేఁ దన దోషము చెప్పినవాఁ డయ్యెను. తేంపునన్ = సాహసముచే; రామచంద్రుని పాదములపైఁ బడుటము, ఆయన రక్షించెనా రక్షింపనీ, శిక్షించెనా శిక్షింపనీ, ఆయన దయ యని సాహసించి, సకలభూతశరణ్యాన్ = సమస్త భూతములకు రక్షకుఁడవు, అనుకూలుఁడయి వచ్చిన రావణునే రక్షించువాఁడవు, నన్ను రక్షింపకుందువా యను విశ్వాసముచే, చేరితిన్ = సమీపించితిని, నీకు నెవ్వరు లేరా నాయొద్దకు రానేల యందువా? నాకు నీవు తప్ప వేఱు(ప్రాపు) లేదనుచున్నాఁడు, నెయ్యురన్ = మిత్రులను, సిరిన్ = వారిమూలమున లభించిన సంపదను, త్యజించితిన్=నేనే వదలిపెట్టితిని, భవద్గతము=నీ స్వాధీనము, నీ యిచ్ఛ వినియోగమునకు లోఁబడినది, మత్=నాయొక్క, సుఖజీవిత=సుఖమైన బ్రతుకు, ఇది ధారక పోషక భోగ్యముల కన్నింటికి నుపలక్షణము. రాజ్య=ఇదినమస్తోపకరణములకు నుపలక్షణము. లంకారాజ్యము రావణుని స్వార్జితము. ఆ విషయమున విభీషణుఁడు తోడుపడినవాఁడును గాఁడు. కావున రాజుగాఁడు. యువరాజును గాఁడు. ఇట్టివానికిఁ బాలింప దేశమెందుండివచ్చెను. కావున రాజ్యమనఁగాఁ బాలింపఁబడు దేశమనియర్థము సేయరాదు. కావున రాజునకు రాజ్య మెట్లు పాలనార్హమో యట్లు పాలనార్హమైన పదార్థము లనియే చెప్పవలెను. నష్టరాజ్య మనోరథుఁడ నన్నచోట నీ యర్థమే గ్రాహ్యము. భోగముల్ = ఐహికాముష్మికరూపము లైన సర్వసుఖములు, ప్రిన్నులు=ప్రతిదినము చెప్పెడు "మమత్వేన అభిమతంచ వస్తు సర్వస్వామినే నారాయణాయ తుభ్యమేవ న మమ" అను వాక్యార్థము గలది. 'ఆత్మాత్మీయ నిక్షేప మాత్మనిక్షేప ముచ్యతే' తన్నుఁ దనది యను నేదిగలదో చేతనాచేతనాత్మకమైన సర్వము భగవంతునకై సమర్పించుట యాత్మనిక్షేప మనఁబడును. నీ సేవమాత్రము నా కను గ్రహించి యివి యన్నియు నీ యిష్టమువచ్చినట్లు వినియోగించుకొమ్ము. వీనియందు నాకిఁక స్వామిత్వము లేదని భావము. ఇది భవద్గతము. ఇది భరన్యాసమును తెలుపును.

## తాత్పర్యము.

రామచంద్రా! నేను రావణాసురుని తమ్ముఁడను. అతఁడు నన్నవమానించిన కారణముచే సాహసించి సర్వప్రాణి రక్షకుఁడవైన నీ యొద్దకు వచ్చితిని. నీ శరణము చొచ్చితిని. నీ కెవ్వరు రక్షకులు, సహాయులు లేరా, యిచ్చటికేల వచ్చితి వందువా? స్నేహితులను, చిరకాలముగ వసించు లంకను, దానియందు నాకుఁగల సంపత్తును, సర్వము వదలిపెట్టితిని. కావున నా కెవ్వరు రక్షకులు లేరు. నేను, నా సుఖజీవనము

నా పాలనకు లోపడిన సమస్తోపకరణములు భోగములు సన్నియు నీ స్వాధీనము చేసితిని. ఇఁక నా యోగక్షేమములకు నీవే దిక్కు.

౬. అను తద్వచనంబుల విని,చనవునఁ దా నాదరించి ♦ సాంత్వఫణితులన్
జనకసుతాపతి రాక్షస,వినిచయము బలాబలములు ♦ వినిపింపు మనన్. ౯౫

అర్థములు. తత్ + వచనంబులు = దారపుత్రాదులను, ఇల్లు వాకిండ్లను, గొడ్డు గోదలను తోఁపులు దొడ్లను సర్వము న్నైన వదలి శ్రీరామునందే భరన్యాసము గావించిన విభీషణునియొక్క, తత్ + వచనంబులన్ = రామసేవయే తనకు భోగ్యమని శరణార్థియై చెప్పిన యా మాటలను, సాంత్వఫణితులన్ = ఊరార్పు మాటలచే, నీవు నన్ను శరణన్నప్పుడే రక్షింపవలసిన వాఁడనే, ఆలస్యము చేసి నీకు మనస్సునకు సంకటము గలిగించితిని; క్షమింపుము- అను మంచిమాటలచే ఆదరించి= నీకు భయములేదు. లెమ్మను మాటలచే మనస్సుతాపము చల్లార్చి, విభీషణుఁడు రామచంద్రుని నీ కైంకర్యము నా కనుగ్రహింపు మని కోరెను గదా; దానిని రామచంద్రమూర్తి యంగీకరించి త్రివిధ కైంకర్యములలో వాచిక కైంకర్యము తొలుత గావింపు మనుచున్నాఁడు. వినిచయము = సమూహము, మీవారి బలాబలములు చెప్పుమని యడుగక రాక్షసుల బలాబలము లని యడుగుటచేత విభీషణుఁడు శరణాగతుఁడైన వెంటనే భ్రమరకీటముగా రాక్షసజాతిపోయి యిక్ష్వాకు వంశములోని వాఁడయ్యె నని రాముని యభిప్రాయ మని సూచితము. సన్న్యాస మెట్లు జన్మాంతర మని చెప్పఁబడునో యట్లులే శరణాగతునకు జన్మాంతర ప్రాప్తి యా జన్మమందే లభించు ననియు నది భగవదాశ్రయణము కావున నాశ్రయణ మాహాత్మ్యము చేత ముక్తయోగ్యత గలద్దై, ముక్తి సామ్యత నొందు ననియు గ్రాహ్యము.

తాత్పర్యము

విభీషణుఁడు చెప్పినమాటలు విని మచ్చికచే నూరార్పుమాటల సమాధానపఱచి రామచంద్రమూర్తి విభీషణా! రాక్షసుల బలాబలములు చెప్పు మని యడిగెను.

అడవి చుట్టు నిప్పంటుకొనినందున తప్పించుకొని బయటకుఁ బోవుటకు వీలులేక నడుమఁ జిక్కుపడిన మృగాదులవలెనే తాపత్రయాత్మక మగు సంసారానుభవభీతు లైనట్టి ముముక్షువులకు ఆచార్యుండు ముందుగఁ బ్రపత్త్యనుష్ఠానము నుపదేశించును.

శ్రీ విభీషణులవారు రావణునితో 'సీతాదేవిని శ్రీరామచంద్రునకు సొప్పగింపు' మని హితోపదేశముఁ జేసినట్లు లాచార్యుండును ముముక్షు వగు నీతనికి నీ యాత్మను సర్వేశ్వరునకు సమర్పింపు మని యుపదేశించును.

పెరుమాళ్ళ శ్రీపాదముల నాశ్రయింపు మని శ్రీ విభీషణులవారి యుపదేశములు "మనుష్య మాత్రుఁడు రక్షకుఁ డెట్లు కాఁగలఁడు" అను నిత్యాది ప్రహ

స్తాది వాక్యదోష దూషిత మగు రావణుని మనస్సున కెక్కనట్లు, ఆచార్యుం డుపదే శించునట్టి యుపదేశములును ప్రకృతి వాసనాదూషిత మగు ఈ ముముక్షువుయొక్క మనస్సున కెక్కవు.

శ్రీ విభీషణులవారు పెరుమాళ్ళను శరణు చొచ్చునప్పుడు లంకను, మిత్రు లను ధనములను విడిచితిని అన్నట్లు ముముక్షు వగు నీ చేతనుండును భగవద్విషయము యొక్క ప్రచారము లేని ప్రదేశమును విడనాడునది.

శ్రీ విభీషణులవారు పెరుమాళ్ళను శరణు చొచ్చునప్పుడు ఆకాశమునం దుండె నన్నట్లు నిరాధారుఁడై నిలబడినట్లు, ముముక్షువు సర్వేశ్వరుని శ్రీ పాదములఁ బొందు విషయమున నుపాయాంతర శూన్యుఁడై యుండునది.

శ్రీ విభీషణులవారు పెరుమాళ్ళను శరణు చొచ్చునప్పుడు, ఉపాదేయములు కాని, పుత్రులను భార్యను వదలి రామచంద్రుని శరణు పొందె నన్నట్లు ముముక్షు వును సర్వేశ్వరుని శ్రీ పాదములను బొందుటకు నిర్బంధము లగు విరోధులను విడ నాడునది.

శ్రీ విభీషణులవారు పెరుమాళ్ళను శరణుజొచ్చునప్పుడు లక్ష్మణస్వామి వారితో నుండిన శ్రీరామచంద్రమూర్తి సన్నిధికి వచ్చినట్లు ఈ ముముక్షువును పెరుమాళ్ళు ప్రేమించి వేంచేసి యున్నట్టి దివ్యదేశమునే తనకు రక్షక మైనట్టిదానిగా నాశ్రయించునది.

శ్రీ విభీషణులవారు పెరుమాళ్ళను శరణుచొచ్చుటకై వచ్చినప్పుడు "నేను శరణు జొచ్చుటకై వచ్చియున్నానని శ్రీరామచంద్రుని సన్నిధి విన్నవింపుఁడు," అనియు "ఓ సుగ్రీవుఁడా! ఈతని గొనిరమ్ము" అనియు చెప్పఁబడెను. ఈ తావుల శ్రీ విభీషణుల వారొక్కరే విన్నవించినను ఫలమన్ననో వీరితోపాటు కూడ వచ్చిన వారికిని లభించినట్లు ముముక్షువులకుఁగాను సర్వేశ్వరుని సన్నిధిని నాచార్యుం డొనర్చినట్టి ప్రపత్తియే చాలును.

శ్రీ విభీషణులవారు పెరుమాళ్ళను శరణు చొచ్చునప్పుడు శ్రీరామచంద్రుఁడు సుగ్రీవుని మూలముగ విభీషణులవారు శరణు చొచ్చుటకై వచ్చిన సంగతిని విని యింద్రుండు గరుత్మంతుని వలెనే వారిని గలిసికొనెను, అన్నట్లు పెరుమాళ్లు సుగ్రీ వుని పురుషకారము ద్వారమున విభీషణులవారి సంగీకరించినటు లీ ముముక్షువును ఆచార్యుని పురుషకారముద్వారా అంగీకరించును.

ఇట్లు లంగీకరింపఁబడిన ప్రపన్నుండు సంసారములో నుండునట్టి స్థితిని పిరాట్టి రావణుని గృహమునం దుండు నశోకమున నుండి చూపించినది. అ దెట్లనిన:— పిరా ట్టికి రావణసంబంధ మెట్లో ఈతనికి దేహ సంబంధము నట్టిదే. పిరాట్టికి యేకాక్షి, యేకకర్ణి మొదలగు రాక్షసస్త్రీలు యెట్లో, ఈతని అహంకార మమకారములు నట్లే. పిరాట్టికి తనను పెరుమాళ్ళయొద్దనుండి కొనిపోఁదలచిన మారీచుఁడు ఎట్లో, ఈత

నికి విషయ పారవశ్యము నట్టిది. తర్జన భర్త్సనాదుల నొనర్చిన రాక్షస స్త్రీసంబంధము పిరాట్టి కెట్టిదో, ఈతనికి కళత్రపుత్ర సంబంధము నట్టిదే. పిరాట్టికి ఆంజనేయుల వారి దర్శన మెట్టిదో ఈతనికి నాచార్యుని దర్శనము నట్టిదే. పిరాట్టికి శ్రీయాంజనేయులవా రొనర్చిన రామగుణకీర్తన మెట్టిదో ఈతని కాచార్యుఁడు సాయించిన గురు పరంపరయును అట్టిదే. పిరాట్టికి ఆంజనేయులవా రిచ్చిన యుంగర మెట్టిదో, ఈతని కాచార్యుఁ డుపదేశించిన తిరుమంత్ర మట్టిది. పిరాట్టి రామచంద్రుని యుంగరమును జూచి దానిమూలముగ సుందరమగు వ్రేలిని, దానిమూలముగ బాహువులను, దాని మూలముగ దివ్యమంగళ విగ్రహమును అనుసంధించుకొని ప్రాణములను ధరించి యున్నట్లు శ్రీ వైష్ణవుఁడును, ఆచార్యుఁడు కృపచేసిన తిరుమంత్రముయొక్క యర్థమును అనుసంధించుకొని ధరించియుండును. పిరాట్టి లక్ష్మణస్వామితో పరుషముగ మాట్లాడిన మాట ఈమెను పెరుమాళ్ళను విడిచి దూరముగా నుండునట్లు చేసిన చందమున, ఈతం డొనర్చినట్టి భాగవతాపచారము, ఈతనిని "క్షిపామి, న క్షమామి" అను భగవన్నిగ్రహమునకు విషయముగాఁ జేసి పెరుమాళ్ళనుండి దూరముగా నుండునట్లు చేసినది. పిరాట్టికి విరోధు లగు రావణాదులను వధించి పెరుమాళ్లు ఆమెను గొనిపోవుట యెట్లో, అట్లే యీతనికి విరోధి యగు ప్రకృతి సంబంధమును బోఁగొట్టి సర్వేశ్వరుఁడు ఈతనిని పరమపదమునకుఁ గొనిపోయి నిత్యముక్తులతో పాటు నిత్య కైంకర్యమున నుపయోగ పడుచుకొనును. ఈ పది వార్తలను అనుష్ఠాన పర్యంతము గలిగి యున్నట్టి శ్రీ వైష్ణవుఁ డుండునట్టి తావే పరమపదము.

—♦ విభీషణుఁడు శ్రీరామునకు రాక్షసబలంబుఁ దెల్పుట. ♦—

చ. ప్రవిమలసచ్చరిత్రునకు ♦ రామున కిట్లను దేవ! యా స్వయం
భువువలన వ్వరంబులను ♦ బొందుటచే దశకంఠుఁ డాజిలో
దివిజపలాశిసంతతికిఁ ♦ దిక్కన భూతసమూహకోటికిం
దవిలి వధింపరాదు వసుధాధిపనందన భక్తినందనా. ౩౯ ౬

అర్థములు. ప్రవిమల = మిగుల నిర్మలమైన - సచ్చరిత్రునకున్ = మంచి నడవడి గల వానికి - స్వయంభువువలనన్ = బ్రహ్మవలన - ఆజిలో = యుద్ధమునందు - దివిజపలాశి సంతతికిన్ = దేవతల రాక్షసుల సమూహమునకు - దిక్కన= తక్కన - భూతసమూహకోటికిన్ = నరులు వానరులు తప్పఁ దక్కిన యొక్కొక్క జాతిసమూహముల గుంపులకు - వసుధాధిపనందనా=రాజకుమారా - నీవు మనుష్యుఁడవు కావున రావణుఁడు నీచేఁ జచ్చునని భావము. భక్తనందనా = భక్తులసంతోషపెట్టువాఁడా - అనుటచే అట్లు నీవు రావణుని జంపిన భక్తు లందఱు సంతోషింతురు. దానివలన సాధు పరిత్రాణము చేసినవాఁడ వగుదువు. అదియే కదా నీ యవతారముఖ్యోద్దేశము.

### తాత్పర్యము.

మిగుల నిర్మలమైన నడవడిగల రామచంద్రునకు విభీషణుఁ డిట్లనియె. దేవా! బ్రహ్మచే రావణుఁడు యుద్ధమందు దేవరాక్షసులచే నరవానరులు తప్పఁ దక్కిన భూతకోటిచేఁ జావులేకుండ వరము పొందినాఁడు. నీవు రాజకుమారుఁడవు. కావున నీచే వాఁడు చచ్చును. అట్లు నీవు చేసితివేని భక్తులందఱు సంతోషింతురు.

సీ. రావణుతమ్ముండు ♦ రణవీర్యవంతుండు, కుంభకర్ణుండు ని♦ష్కుంఠితేజుఁ
డన్న నా కతఁడు బ♦లారికి నెదురుద్ది, యని దళవాయి ప్ర♦హస్తుఁ డతని
వినియుందు వేమొ యో♦వీరుండు కైలాస,మున మాణిభద్రుని♦ ముక్కపణిచెఁ
గలన నభేద్య♦కవచుండు బద్ధగో, ధాంగుళిత్రుండు శ♦రాస మూని
తే. యింద్రజి యదృశ్యుఁడగుచును♦ నేప్రమీఁఅు,విగ్రహంబున హుతవహు♦ వేల్చితత్ప్ర
సాదమునమాయమగుచును♦జంపునరుల, రావణునియీడువాఁడు ప♦రాక్రమమున.

అర్థములు. రణవీర్యవంతుండు = రణమునందు వీర్యముగలవాఁడు, సప్త మీతత్పురుషము. నిష్కుంఠితేజుఁడు = మొక్కవోని పరాక్రమము గలవాఁడు, బలారికిన్ = ఇంద్రునికి, ఎదురుద్ది = సమానశత్రువు, దళవాయి = సేనానాయకుఁడు, మాణిభద్రుఁడు = కుబేరుని సేనాపతి, కలనన్ = యుద్ధమందు, అనిర్భేద్యకవచుఁడు = భేదింపరాని కవచముగలవాఁడు, బద్ధగోధాంగుళిత్రుండు=ఉడుము చర్మముతోఁ జేయఁబడిన వ్రేళ్ళకవచము తొడుగుకొనువాఁడు, శరాసము = విల్లు, ఇంద్రజి = ఇంద్రజిత్తు, అదృశ్యుఁడు = కానరానివాఁడు, విగ్రహంబునన్ = యుద్ధమందు, హుతవహున్ = అగ్నిహోత్రుని, వేల్చి = హోమముచేసి, తత్+ప్రసాదమునన్ = అయన యనుగ్రహముచేత, అరులన్ = శత్రువులను, ఈడువాఁడు = సమానుఁడు.

### తాత్పర్యము.

కుంభకర్ణుఁడు రావణునకుఁ దమ్ముఁడు. యుద్ధమునందు మిగుల శౌర్యము గలవాఁడు, మొక్కవోని పరాక్రమము గలవాఁడు, ఇంద్రునికి సమాన శత్రువు. వాఁడు నా కన్న కావలయును. ప్రహస్తుఁ డనువాఁడు సేనానాయకుఁడు. వీని విషయము నీవు హనుమంతుని వలన వినియుందువు. అతఁడు కైలాసమున యక్షులకు రాక్షసులకు జరిగిన యుద్ధమందుఁ గుబేరుసేనాపతి యగు మాణిభద్రుని బరాభవించెను. ఇంద్రజిత్తు రావణుకొడుకు, భేదింపరాని కవచము గలవాఁడు. ఉడుము తోలుతోఁ జేయఁబడిన వ్రేళ్ళ కవచము (Glove) గలవాఁడు. యుద్ధమందు విల్లు ధరించి శత్రువులకుఁ గానరాకుండ వారిని జంపును. అగ్నిహోత్రుని హోమము చేసి యాయన యనుగ్రహమున విల్లు, తేరు గలవాఁడై వానితో నితరులకుఁ గానరాక శత్రువులఁ జంపును. బలపరాక్రమములందు రావణుతో సమానుఁడు.

తే. లోకపాలసమాను లనీకపతులు, మఱి మహాపార్శ్వుఁడును నకంపనుఁడునాఁగ
నధికబలుఁడు మహోదరుండనఁగఁ గలరు, వీర్యవిక్రమనిర్జితవిబుధవరులు. ౩౯-౭

అర్థములు. లోకపాల సమానులు=దిక్పాలురతో సములు, అనీకపతులు= సేనానాయకులు, వీర్యవిక్రమ నిర్జిత విబుధవరులు = శౌర్యముచేతను, పరాక్రమము చేతను జయింపఁబడిన దేవశ్రేష్ఠులు.

తాత్పర్యము.

మఱియు సేనానాయకులు దిక్పాలురతో సము లగువారు మహోదర మహాపార్శ్వులు, అకంపనుఁడు ననువారు గలరు. వీరు దేవశ్రేష్ఠులను శౌర్యపరాక్రమములచే జయించినవారు.

ఆ. కామరూపధరులు కల రాక్షసులు పదివేల, కోట్లు లంకయందుఁ గ్రూరబలులు
పలలభోజు లల్లవారల బాసట, భంగపఱిచె సురలఁ బంక్తిముఖుఁడు. ౩౯

అర్థములు. పలలభోజులు = మాంసభక్షకులు - రాక్షసులు - బాసటన్= సాహాయ్యముచే.

తాత్పర్యము.

కోరిన రూపము ధరింపఁగల రాక్షసులు పదివేల కోట్లున్నారు. వారిసాహాయ్యముచే రావణుఁడు దేవతల నోడించెను.

చ. విపులపరాక్రముండు రఘువీరుఁడు రాక్షసవంశదీపు నా
లపితము నాలకించి సకలంబు మదిం దలపోసి పల్కె నీ
విపుడు దురాత్ము రావణునివృత్తము సర్వము నో విభీషణా
నిపుణముగాఁగఁ దెల్పుటను నిశ్చలచిత్తమునన్ గ్రహించితిన్. ౪౦౦

అర్థములు. ఆలపితము = మాట - విపులముగ = సవిస్తరముగ - రాక్షస వంశదీపు = రాక్షస కుల మను వెదురుకు దీపమువంటి వాఁడు - రాక్షసకుల నాశకుఁడు.

తాత్పర్యము.

విస్తార పరాక్రమము గల రామచంద్రమూర్తి విభీషణుఁడు చెప్పిన మాటలు విని కార్యము లెట్లెట్లు చేయవలయునో యాలోచించి యిట్లనియె. విభీషణా! నీవిపుడు సవిస్తరముగఁ జెప్పిన దుష్టుఁ డగు రావణుని నడవడి సర్వము నేకాగ్రచిత్తముతో గ్రహించితిని.

మ. వినుమా రావణుఁ బుత్రమిత్రసచివాన్వీతు న్మహాస్కందనం
బున మ్రందింతు, రసాతలంబును నధోభూమిం జొరబాఱినన్
వనజాతాసను దాపు చేరినను బ్రాణాన న్విడం జుమ్మి, ని
న్ననఘా కట్టెదఁ బట్టమయ్యసురరాజ్యశ్రీకి సత్యంబుగన్. ౪౦౧

అర్థములు. సచివ + అన్వీతున్ = మంత్రులతోఁ గూడినవానిని, మహా

స్కందనంబునన్ = గొప్ప యుద్ధమందు, ప్రమందింతున్ = చంపుదును, రసాతలమున్ = గొప్ప పల్లములందు, అధోభూమిన్ = పాతాళమందు, వనజాతాసను = బ్రహ్మయొక్క, అసురరాజశ్రీకి = రాక్షస రాజ్యలక్ష్మికి.

తా త్ప ర్య ము.

విభీషణా ! నేను జెప్పెడుమాట వినుము. రావణుని కొడుకులతో మిత్రులతో మంత్రులతో యుద్ధమందు వధింతును. వాఁడు క్రిందిలోకములందు, పాతాళలోకములో నడుగుభాగమున గుంతలలో దాఁగినను పైలోకములందు సత్యలోకమునకుఁ బోయి బ్రహ్మయొద్ద నుండినను ప్రాణముతో వదలిపెట్టను. అంతమాత్రమేకాదు రాక్షసరాజ్యలక్ష్మికి నిన్నుఁ బట్టము గట్టెదను.

ఇచ్చట నీ శ్లోకము లనుసంధింపఁదగును.

అన్నం పానం ధనం వస్త్ర మాయు రారోగ్య మాస్పదమ్
ఆపద్యపి న యాచేత పూజకః పురుషోత్తమమ్
నా ప్రపన్నే దదామ్యేత ద్యాచితోపి దినేదినే
అయాచితోపి తత్సర్వం ప్రపన్నే విదధా మ్యహమ్.

అన్నము, పానము, ధనము, వస్త్రము, ఆయువు, ఆరోగ్యము, ఇల్లు, భూములు, జీవనోపాయము ప్రపన్నుఁడు భగవంతుని యాచింపరాదు. దినదినము వీనిని యాచించినను భగవంతుఁడు వీనిని వాని కీయఁడు. వాడు పూర్వజన్మ కృతానుసారముగ నవి లభింపవలసినవే. యాచింపని ప్రపన్నునకు నేను సర్వము నిచ్చెదను. వాని పూర్వ కర్మ విచారముతో నాకుఁ బనిలేదు.

కర్మముపై నాధారపడిన వానికిఁ గర్మమెంత యియ్యవలయునో యంతయే యిచ్చును. నా మీఁద నాధారపడిన వానికి నే నీయఁగల దంతయు నిచ్చెదను. నేను యాచింపకుండిన నన్ని యిచ్చుననెనే యని మనస్సులో నింకను నీయలేదే యనుకొనుచుండరాదు. ప్రపన్నున కా విచారమే నిషిద్ధము.

ఈ కారణముచే విభీషణుఁ డడుగకుండినను రాజ్యమును శ్రీరామచంద్రమూర్తి యనుగ్రహించెను. విభీషణున కీ యనుభవ మిప్పుడే కాదు. బాల్యమున బ్రహ్మను గూర్చి తపస్సు చేసినపుడు బ్రహ్మదేవుఁడు అమరత్వమును అడిగిన రావణున కీయక యడుగని విభీషణున కిచ్చెను. దీనివలన మనము నిష్కామ ప్రవర్తనము భక్తిగలిగి సర్వభారము భగవంతునిపై వైచితిమేని మన యోగక్షేమము లాయనయే విచారించుకొను నని యేర్పడుచున్నది.

అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥ భ. గీ.

రాజ్యకాంక్షచే విభీషణుఁడు వచ్చినాఁ డనుట యితరుల యభిప్రాయమే కాని యతని యభిప్రాయము గాదు.

క. ఒట్టిడుకొందును నా తోఁ, బుట్టులపై రావణుని స♦పుత్రహితబలున్
మట్టిడక నే నయోధ్యా, పట్టనముం జొరఁగఁ బోను ♦ బరమచరిత్రా! ౪౦౨

అర్థములు. ఒట్టిడుకొందును = ప్రమాణము చేసి చెప్పెదను, మట్టిడక = చంపక.

తాత్పర్యము.

గొప్పనడవడి గల విభీషణా! రావణుని కొడుకులతో, మిత్రులతో, సేనలతోఁ జంపక యయోధ్యను బ్రవేశింప నని ప్రమాణము చేసి చెప్పెదను.

తరలము. అనుచు భక్తి విభీషణుండును ♦ నంజలిన్ ఘటియించి యో
యనఘశీల! మదీయదేహము♦నందుఁ బ్రాణము లుండునం
దనుకఁ జొచ్చెద శత్రుసేన ని♦తాంతసాహ్య మొనర్తు లం
కను వినాశ మొనర్ప రాక్షస♦కాండముం బరిమార్పఁగన్. ౪౦౩

తాత్పర్యము.

ఈ ప్రకారము రామచంద్రమూర్తి చెప్పఁగా విభీషణుఁడు రెండు చేతులు జోడించి పుణ్యచరిత్రా! నా దేహమునందుఁ బ్రాణము లుండు వఱకు శత్రుసేనయందుఁ దూఱి లంకను రాక్షసులను చంపుటయందు మిగుల సాహాయ్యము చేసెదను.

ఇది కాయిక కైంకర్యము. ఇంతవఱకు విభీషణుఁడు రాజ్యమును దాను వేఁడను లేదు. రాక్షసవధయందు సాహాయ్యము చేసెద నని చెప్పనులేదు. రామచంద్రమూర్తి రాక్షసుల వధించెద నని చెప్పిన కారణముచే నేది స్వామికార్యమో యది భృత్యుని కార్యమే. తన కది యిష్టమైనను అనిష్టమైనను కైంకర్య బుద్ధి నెఱవేర్పవలసినదే కావున నీ విషయమున నాకుఁ గృత్యమైన కైంకర్యము నేను జేసెద ననెను. దీనివలన స్వామి యొక్క కార్యము చేయుఁబూని నప్పుడు భృత్యుఁడు తటస్థుఁడై యూరక చూచుచుండరాదు. అది తన కార్యముగ నెంచి దానిని జక్కఁజేయవలయు నని సూచన. కామ్యకాంక్ష యీ మాట చెప్పె ననరాదు. అనుకూల సంకల్పము.

—♦ శ్రీరాముఁడు విభీషణునకుఁ బట్టాభిషేక మొనరించుట ♦—

సీ. అను విభీషణునిఁ దా♦నంకపాళిని గ్రుచ్చి, సౌమిత్రితో రఘుచంద్రుఁ డనియెఁ
దెమ్ము మానద! సాగ♦రమ్ముజలమ్ముల, నా ప్రసాదమ్మున ♦ క్షిప్రముగను
నభిషిక్తుఁజేయుమా♦ యసురరాజ్యశ్రీకి, నివ్విభీషణు నన ♦ నింపుమీఱ
మర్కటవాహినీ♦మధ్యంబునను నతఁ, డట్లు గావించె రా♦జాజ్ఞ కలిమి
తే. శ్రీరఘూత్తము కరుణావి♦శేషమునకు, మేలుమేలని కపు లెల్ల♦ మెచ్చుకొనుచుఁ
గేక లెసఁగించి రంత సుగ్రీవపవన,సంభవులు పల్కి రిటు విభీ♦షణునితోడ. ౪౦౪

అర్థములు. అంకపాళిని = కౌఁగిట, "ఆలింగన ముపగూహన మాశ్లేషః పరిరంభణం పరిష్వంగం ఆశ్లేష మంకపాళిం క్రోడీకరణంచ తుల్యార్థమ్-రత్నమాల. గ్రుచ్చి = ఒత్తి, మానద = ఆశ్రితుల గౌరవము రక్షించువాఁడా, నే ననుగ్ర

హించినను ఫలమీయవలసిన వాఁడవు నీవేయని భావము.(సముఁబ్రసాదించిన యనఘ చరితుఁ = ఆనుషంగికఫలముగా నే నిచ్చెద ననిన రాజ్యమును నిరాకరింపక యంగీకరించి నా మనస్సు సంతోషింపఁ జేసిన వానిని,) దీనివలన విభీషణుఁడు రాజ్యము గోరలేదనియు, రాజాజ్ఞ కావున నంగీకరించె ననియు గ్రాహ్యము. మర్కట వాహినీ మధ్యంబునం దనుటచేఁ బదుగురిలోఁ జెప్పినది యనుల్లంఘనీయ మని భావము, క్షిప్రముగను = త్వరగా.

తా త్ప ర్య ము.

రామచంద్రా! నేను నీ సేవఁగోరి వచ్చితినిగాని రాజ్య మాశించి వచ్చినవాఁడఁగాను. నేను బరతంత్రుఁడను, కావున నీ వనుగ్రహించు రాజ్యము నా కక్కఱ లేదనుటయుఁ బారతంత్ర్యమునకు హాని కలిగించును గావున నీ యాజ్ఞాబద్ధుఁడనై యంగీకరించెదను. (భరతుఁడు పరతంత్రుఁడై కదా లక్ష్మణుఁడు నిరాకరించిన యావరాజ్య మంగీకరించెను.) అని చెప్పఁగా సతని మాటలకు మెచ్చి రామచంద్రమూర్తి యతనిని కౌఁగిట నొత్తి వశపఱచుకొని లక్ష్మణునితో నిట్లనియె. లక్ష్మణా! వేగముగ సముద్రజలము దెచ్చి (నాయం దనుగ్రహించిన) యీయనను రాక్షస రాజ్యమునకు రాజుగాఁ బట్టాభిషేకము చేయుము అని చెప్పఁగా లక్ష్మణుఁడు వానర సేనామధ్యమందు రాజాజ్ఞ ప్రకారము గావించెను. వానరు లందఱు ఔరా రామచంద్రమూర్తి యెంతటి దయాశాలి యని మెచ్చి కేకలు వేసిరి. అనల నవ్విభీషణునితో సుగ్రీవ హనుమంతు లిట్లనిరి,

ఉ. ఈ వరుణాలయంబుఁ దరి◆యింపఁగ నెట్లు లగుఁ వనాటసే
నావళితోడఁ, జెప్పుము యు◆పాయ మొకం, డన నవ్విభీషణుం
డో వనజాక్షనందన! మ◆హోదధి సాగరఖానితంబు ము
న్గావున రాఘవుండు శరణం బనఁ బ్రాజ్ఞుఁ డొనస్చుఁ గార్యముఁ. ౭౦౫

అర్థములు. వరుణాలయంబు = సముద్రము - వనాటసేనావళితోడఁ = వానరసేనతో - సాగరఖానితంబు = సగర కుమారులచేఁ ద్రవ్వఁబడినది, ప్రాజ్ఞుఁడు= కృతజ్ఞతాబుద్ధిగలవాఁడు.

తా త్ప ర్య ము .

వానరసేనతోడ నీ సముద్రము దాఁటు నుపాయము చెప్పు మనిన విభీషణుఁ డిట్లనియె. ఈ సముద్రమును రామచంద్రమూర్తి పూర్వ వంశజులైన సగర కుమారులు త్రవ్విరి. వారివలన నితనికి రూపము నామ మేర్పడెను. ఇతఁడు కృతజ్ఞుడు కావున రామచంద్రమూర్తి ప్రార్థించెనేని తగిన కార్య మితఁడు చేయును.ఇది ఫాల్గున శుద్ధ ద్వితీయనాఁటి చరిత్రము.

సీ. అనవుడు సుగ్రీవుఁ◆డరిగి సీతేశున కవ్వార్త దెలుపఁగ ◆ నాతఁ డలరి
కార్యదక్షుండ డయ్యుఁ◆గడఁక సమ్మాననార్థంబు తమ్మునిఁ గపి◆రాజుఁ బలుకు

మత్సమ్మతం బది ♦ మర్కటపతికి నీ, కవ్విభీషణు వాక్య♦మాదరింపఁ
దగు నని తోఁచిన ♦ దలపోసి చెప్పెఁడు, మర్కటేంద్రుఁడు సూరి♦మంత్రివిదుఁడ
తే. నీవు యోజింపుఁ డన రాఘు♦వేంద్రునకును
వార లని రయ్య! కాలార్హ♦వాక్య మతఁడు
చెప్ప మా కేల యది యరు♦చించు? లంక
సేతువును గట్ట కే భంగిఁ ♦ జేరఁ గలము? ౪౦౬

అర్థములు. అలరి = సంతోషించి - కార్యదక్షుఁడు = పని నెరవేర్చుట యందు సమర్థుఁడు - దీనిచే సముద్రుని యాచింపకయే దాని దాఁట సామర్థ్యము గలవాఁడని సూచితము. సమ్మాననార్థంబు = వారిని గౌరవించుకొఱకు, అరిగి యనుటచే విభీషణుఁడు వానరులతో స్థలాంతరమున నుండె నని యేర్పడుచున్నది.

తా త్ప ర్య ము .

ఈ ప్రకారము విభీషణుఁడు చెప్పఁగా సుగ్రీవుఁడు రామచంద్రమూర్తియుండు చోటికిఁ బోయి విభీషణుఁ డిట్లు చెప్పుచున్నాఁడని యతని యభిప్రాయము దెలిపెను. దానికి రామచంద్రమూర్తి సంతోషించి వారి యాలోచనలేకయే కార్యము నెఱ వేర్ప సమర్థుఁడయ్యు పరత్వ ప్రకటనము లేకయే కార్య మగునెడల పరత్వ ప్రకటన మేల చేయవలయు నని తలఁచి వారిని గౌరవింపఁగోరి విభీషణు విషయమై లక్ష్మణ సుగ్రీవు లేకాభిప్రాయము గలవారు కావున లక్ష్మణుతో నిట్లనుచున్నాఁడు. సుగ్రీవుఁడు పండితుఁడు, నీ వాలోచనపరుఁడవు. (ఇది యెత్తిపొడుపు మాట యని తోఁచు చున్నది) కావున మీ రిరువురు నాలోచించి విభీషణు మాట గౌరవింపఁదగునని మీకుఁ దోఁచెనేని చెప్పుఁడు. మీరు చెప్పినదియే నాకు సమ్మతము, అట్లులే చేసెదను. కావున మీరాలోచించి చెప్పవలసినదని చెప్పఁగా వారు సమయోచితముగ విభీష ణుఁడు చెప్పెను కావున నది మా కేల సమ్మతము గాకపోవును. సేతువు కట్టక లంకఁ జేరలేముగదా.

క. ఆల మిఁ కేలా సేనా,జాలముతో దాఁట నుపమ ♦ నల్పుఁ డనక నీ
తాలోలుఁడు వేదిపయిన్, జ్వాలవలెన్ వేగ దర్భ♦శయమునఁ బండెన్. ౪౦౭

అర్థములు. ఆలము = ఉపేక్ష, ఉపమ = ఉపాయము, దర్భశయము = దర్భలపడుక, పడుకవలెఁ బఱచిన దర్భలమీఁద, జ్వాలవలె రామచంద్రమూర్తి యుండె నని చెప్పుటచే; వీరు చెప్పుచున్నా రని వీరిమాట ద్రోచివేయలేక చేయ వలసిన కార్యమే, ఈ సముద్ర తరణము పరాక్రమముచేఁ గాని సాధ్యపడదని యాలోచించి దైన్యము మాని తేజోవంతుఁడై యుండెనని సూచించుచున్నది. పండె ననఁగా పండుకొనుటకు యత్నించె నని భావము.

తా త్ప ర్య ము .

ఇంక నేల నిష్కారణముగ నాలస్యము చేయవలె. సేనలతో సముద్రము

దాఁటు నాలోచన సేయుఁ డనఁగా రామచంద్రమూర్తి వేదియందలి యగ్నిహోత్రమువలె దర్భశయనంబునఁ బండుటకు యత్నించెను. పండుకొనుట ౪౩౬ వ పద్యంబునఁ జెప్పఁబడెను.

—♦ ౨౦-వ సర్గము. శార్దూలుఁడు రావణునితో శ్రీరాముఁడు కపులతో సముద్రము నొడ్డున దిగియుండువార్తఁ జెప్పుట. ♦—

సీ. అక్కడ శార్దూలుఁ ♦ డను రావణాసురు, చారుండు సుగ్రీవ♦సైన్యవిధము
నంతయుఁ బరికించి ♦ యతిరయంబున నేగి, రావణుఁ గనుఁగొని ♦ రాక్షసేంద్ర!
యిదిగొ శాఖామృగ♦ఋక్షవాహిని మన,పురముపై బడ వేగ ♦ పార్లి వచ్చె
నప్రమేయం బయి♦యధికగంభీర మై, మాఱట జలధి యై ♦ మహిమ నెసఁగెఁ
తే. బంక్తిరథపుత్రులిరువురు♦భ్రాతలుత్త,మాయుధులురామలక్ష్మణా♦హ్వయులు సీతఁ
జేరఁ జనుదెంచి నిలిచిరి ♦ సింధుతటిని, బ్రబలదశయోజనావృత♦బలముతోడ.

అర్థములు. చారుఁడు=వేగులవాఁడు, అప్రమేయము=ప్రమాణము చెప్పరానిది, గంభీరము = దురవగాహము (సేన) లోతు (సముద్రము) మాఱట జలధి=రెండవ సముద్రము, ప్రబల = బలిష్ఠమైన, దశయోజనావృత = పదియోజనముల నేల యావరించినంత, బలముతో = సేనతో, . ఇది వేంకటగిరిరాజ కుమారుల లెక్కవంటిది, రూపాయకు డబ్బు లెన్నియనిన రెండుచేతులు జోడించి యిన్నియని చూపుదురు.

తా త్ప ర్య ము.

రావణుచే నియమించిన శార్దూలుఁడను వేగులవాఁడు సుగ్రీవుని సేన యున్న విధము నంతయుఁ జూచి మిగుల వేగముగఁ బోయి రావణునిఁజూచి రాక్షసరాజా! వానరులయు, ఎలుఁగులయు సేన మన పట్టణముమీఁదఁ బడుటకు నిదిగోఁ బార్రి వచ్చెను. ఆసేన పరిమాణ మింత యని చెప్పలేను. మిగుల గంభీరమై రెండవ సముద్రమువలె నున్నది. పదియోజనముల నేల యాక్రమించి యున్నది. దశరథకుమారులిరువురు నన్నదమ్ములు రామలక్ష్మణు లనువారు శ్రేష్ఠములైన యాయుధములు ధరించి సీతాదేవియొద్దకు వచ్చుటకై సమీపమందే సముద్రతీరమున నున్నవారు.

ఉ. వైళమ దేవరా! తగిన♦వారిని దూతల నందు సర్వముం
బోలఁగ మూలముట్టెఱుఁగఁ ♦ బుచ్చుము వేగము, నాకుఁ జూడ నీ
వేళను సామదానములొ♦భేదమొ యర్థవిధం బటన్న శా
ర్దూలునివాక్యముల్ విని ని♦రూపితకార్యవిదుండు వ్యగ్రుఁడై. ౪౧౯

అర్థములు. వైళమ=వేగమే, దేవరా = ప్రభూ, దేవశబ్దభవము, నిరూపితకార్యవిదుండు = చేయవలసిన కార్యమును చక్కఁగ నిరూపింపఁ దెలిసినవాఁడు, వ్యగ్రుఁడు = హెచ్చరిక గలవాఁడు.

తాత్పర్యము.

ప్రభూ ! వారి సమాచారము సర్వము తెలిసికొనుటకై త్వరగా వారు వచ్చి యూరిపై పడకముందే దూతలను బంపుము. నా యభిప్రాయము మీా సమయమున సామమో దానమో భేదమో తగియున్నది.(దండోపాయము వ్యర్థమని భావము)అని చెప్పఁగా శార్దూలుని మాటలు విని యీా తరువాత నెట్లు కార్యము చేయవలసినది తెలిసిన రావణుఁడు హెచ్చరికగలవాఁడై.

వానరులు సముద్రతీరము చేరిన వెంటనే యీా శార్దూలుఁడు పోయి రావణునకుఁ దెలిపెను. ఈ కారణముచేతనే మఱుసటినాఁటి యుదయమున రావణుఁడు సభచేసి విభీషణు వెడలఁ గొట్టెను.

—♦ రావణుఁడు శుకుని సుగ్రీవునొద్దకు రాయబార మంపుట ♦—

క. శుకనామకు నర్థవిధు, న్నికటమునకుఁ బిలిచి యనియె ♦ నీ వరిగి వెసన్
వికలుఁడవుగాక మద్వా,చికముగ సుగ్రీవుతో వ♦చింపుము సూక్తిన్. ౨౧౦

అర్థములు. శుకనామకున్ = శుకుఁడను పేరుగలవానిని - అర్థవిదున్ = చేయవలసిన పని తెలిసినవానిని - నికటమునకు = సమీాపమునకు - రహస్యముగఁ జెప్పుటకై - వికలుఁడవు = భయముచే గుండె చెదరినవాఁడవు - మద్వాచికముగన్ నేను జెప్పినట్లు నామాటగ-మారీచుఁడు జింకవలె నగునట్లు వీఁడు చిలుక వలె రూపము ధరింప నేర్చినవాఁడు.

తాత్పర్యము.

చేయవలసిన కార్యము విధానము తెలిసినవాఁడు నగు శుకుఁ డను పేరు గల వానిని రహస్యముగఁ జెప్పుటకై దగ్గఱకుఁ బిలిచి నీవు త్వరగాఁ బోయి సుగ్రీవాదుల జూచి భయపడక నేను జెప్పినా నని సుగ్రీవుతో నీ మాట చెప్పుము.

ఉ. ఈవు మహాబలాఢ్యుఁడవు ♦ ఋక్షరజస్తనయుండవున్ మహా
త్మ్యావరవంశజాతుఁడవు ♦ కాఁగల లాభ మదేద్ది నీకు నీ
తావిభుతోడి చెల్మిఁ? గల♦దా యొకనష్టము పీడిపోవ? సు
గ్రీవ! మదీయభ్రాతవు స్మ♦రింపుము పూర్వపునెయ్య మియ్యెడన్. ౨౧౧

అర్థములు. ఈవు = నీవు అనుటకు మొదటి రూపము. మహాత్మ్యావర = గొప్పరాజుల, వంశజాతుఁడవు = వంశమునఁ బుట్టినవాఁడవు. నీవు సూర్యపుత్రుఁడ వగుట గొప్ప వంశము వాఁడవు.

తాత్పర్యము.

సుగ్రీవా ! నీవు మహాబల సంపత్తి గలవాఁడవు కావున నల్పబలుఁడగు రాముని వలన నీకుఁ గావలసిన కార్యములేదు. ఋక్షరజస్సుకుమారుఁడవు. కావున గొప్ప రాజవంశమునఁ బుట్టినవాఁడవు. కావున నిష్కారణ కలహము నీకు ధర్మము

కాదు. అదియును గాక నీవు బ్రహ్మ మనుమఁడవు, నేను బ్రహ్మ మనుమఁడను, కావున మనకు బంధుత్వమును గలదని భావము. కావున నల్పుఁడైన రామునితో నీకేమి పని? రామునితో స్నేహము చేయుటచే నీకు రాఁగల లాభము లేదు. వదలి పోయిన నీకుఁ గలుగు నష్టియు లేదు. ఇఁక మన విషయ మాలోచించిన నీవు నాకు సోదరుఁడవు. పూర్వపు మన స్నేహము తలఁపుము (వాలిని బట్టి యీ సంబంధము.)

క. రాముఁ డను రాజపుత్రుని, భామిని నే నపహరింపఁ ♦ బ్రాజ్ఞవరా! నీ
కేమగు నష్టము? సుగ్రీవా! మరలుము నీదు పురికిఁ ♦ బగ మన కేలా? ౪౧౨

అర్థములు. ప్రాజ్ఞవరా = బుద్ధిమంతులలో శ్రేష్ఠుఁడా.

తా త్ప ర్య ము.

రాముఁ డను రాచవాని భార్యను నే నపహరించిన నీకుఁ గలిగిన నష్టమేమి. రాముఁడు నీ జాతివాఁడును గాఁడుగదా, వానికి నీకు నెట్టి సంబంధము లేదుగదా? బుద్ధిమంతుఁడవు, దీని నాలోచించి నీ యూరికి నీవు పొమ్ము, మిత్రులుగను భ్రాతల వలె నింతవఱ కున్న మనకు నిష్కారణ విరోధమేల?

క. వానరవరు లెమ్మెయినే, నీ నగరముఁ జేరలేరు ♦ దృఢ మిది గంధ
ర్వానీకము నేరద నర, వానరులా వచ్చువారు ♦ వనచరనాథా! ౪౧౩

తా త్ప ర్య ము.

నీవు పోకపోయితివిపో, ఏ విధముగ యత్నించినను వానరులు సముద్రము దాటి యిచ్చటికిరాఁజాలరు. ఇది నిశ్చయము. ఆకాశమున నెగిరివచ్చు గంధర్వులే రాఁజాల నప్పుడు క్రోఁతు లెట్లు రాఁగలవు. ఇదియు నీ వాలోచింపుము.

చ. అను విభు నానతిం గొని వి♦హంగమ మై శుకుఁ డంబరంబునన్
జని చని ఖస్థితుం డగుచు ♦ సారసబాంధవసూనుతోడ న
ద్దనుజకులేంద్రువాక్కులు య♦థాక్రమ మంతయుఁ జెప్పఁ, గిన్కఁ జి
వ్వున వినువీధికి న్నెగసి♦పోయి కపుల్ శుకు నేలఁ దాఁచుచున్. ౪౧౪

అర్థములు. ఆనతి = ఆజ్ఞ, విహంగమమై = పక్షివలెనై, అంబరంబునన్ = ఆకాశమార్గమున, ఖస్థితుండు = ఆకాశమందున్నవాఁడు, సారసబాంధవసూను తోడన్ = సూర్యపుత్రుఁడగు సుగ్రీవునితో, యథాక్రమము = క్రమముదప్పక, రావణుఁడు చెప్పిన వరుసన, కిన్కన్ = కోపముతో, వినువీధికిన్ = ఆకాశ మార్గ మునకు, తాఁచుచున్ = కొట్టుచు.

తా త్ప ర్య ము.

ఈ ప్రకారము చెప్పు రాజు నాజ్ఞ గ్రహించి యీ రాక్షసుఁడు చిలుకవలెనై యాకాశ మార్గమునఁ బోయి నేల దిగక యందే యుండి సుగ్రీవునితో రావణుఁడు చెప్పిన మాటలు క్రమము దప్పక చెప్పఁగా నా మాటలు విని వానరులు కోపించి చివాలున నాకాశమున కెగసిపోయి వానిని బట్టుకొని విసరి నేలపైఁ గొట్టి,

-♦ వానరులు శుకుని మర్దించుట ♦-

క. పిడికిళ్ళ నొకరి నొక్కరు, కడవంగ మర్దించుటయును ♦ కలవరపడుచుం
మడియింప రాదు దూతలఁ, గడువడి వారింపు కపులఁ ♦ గాకుత్థ్సవరా! ౨౧౫

అర్థములు. కడవంగన్ = అతిక్రమించి, ఒకరిని మించి మఱియొకరు, కడువడిన్ = మిగుల వేగముగ.

తాత్పర్యము.

నేలఁ బడవైచి యొక క్రోతిని మించి మఱియొక క్రోతి పిడికిళ్ళతోఁ జక్కఁగ మర్దింపఁగా వాఁడు కలవరపడి దిక్కు తెలియక యేమి చేయుటకుఁ బోక రామచంద్రా నేను దూతను, దూతల జంపరాదు, వీరు నన్నుఁ జంపుటకు ముందే వీరిని నివారింపుము.

చం. పతి విధియించు మార్గమునఁ ♦ బల్కక యాత్మమతంబుఁ జాటుచుం
బతినుడులన్ వచింపని కు♦మార్గపుదూతలు వధ్యు లండ్రు, నేఁ
బతి విధియించినట్ట విధిఁ ♦ బల్కితి, దోసమె రామ! యన్న నా
నృతి నలదూత చేయు పరి♦దేవనముల్ విని రామభద్రుఁడున్. ౨౧౬

అర్థములు. ఆత్మమతంబు = తన యభిప్రాయము, చాటుచున్ = ప్రకటించుచు, పతినుడులన్ = ప్రభువు చెప్పిన మాటలను, కుమార్గపుదూతలు = వక్రమార్గమునఁ బోవు దూతలు, వధ్యులు = చంపఁబడఁదగినవారు, ఆదృతిన్ = ఆదరముతో, పరిదేవనము = మొఱ్ఱ మొఱ.

తాత్పర్యము.

ప్రభువు చెప్పినట్లు చెప్పక తన యిష్టప్రకారము చెప్పుచు పతనిమాటలు చెప్పని దుష్టదూతలు కదా చంపఁబడ నర్హులు. నేను నా ప్రభువు చెప్పిన మాటలఁ జెప్పితిని. ఇది దోషమా యనఁగా రామచంద్రమూర్తి యా దూత మొఱ విని యాదరముతో.

కం. వానిని జంపఁగ వల దన, వానరు లవ్వాని గఱులు♦పాచి విడిచినన్
దీనత మింటికిఁ జని యా,వానరవిభుతోడ ననిమె ♦ వదలని భీతిన్. ౨౧౭

గఱులు పాచి = ఱెక్కలు పెఱికి.

తాత్పర్యము.

వానిని జంపవల దని చెప్పఁగా వాని ఱెక్కలూడఁ బెఱికి వదలిపెట్టఁగా వాఁ డాకాశమునకుఁబోయి భయపడుచు సుగ్రీవుతోడ నిట్లనియె.

కం. శ్రీమతి బలసంపన్నా!, భీమపరాక్రమ! కపీంద్ర! ♦ వీటికిఁ జని నే
నే మని వచింతు నయ్యా, నీ మాటగ స్వామి! యామి♦నీచరపతితోన్. ౨౧౮

అర్థములు. శ్రీమతి బలసంపన్నా = ఐశ్వర్యము బుద్ధి బలముగలవాఁడా!

భీమపరాక్రమ = భయంకరమైన శౌర్యముగలవాఁడా! వీటికిన్ = లంకాపురమునకు, యామినీచరపతితోన్ = రాక్షసరాజుతో.

తాత్పర్యము.

ఐశ్వర్యము బుద్ధిబలము విశేషముగఁ గలవాఁడా - భయంకరమైన పరాక్రమముగలవాఁడా! వానరరాజా! నేను లంకకుఁబోఁగానే రాక్షసరాజు సుగ్రీవుఁడేమి చెప్పెనని యడుగునే? నీమాటగనే నేమి చెప్పుదును?

—♦ సుగ్రీవుఁడు రావణునకుఁ బ్రత్యుత్తర మంపుట ♦—

ఉ. నావుడు దూతఁ జూచి కపి♦నాయకుఁ డిట్లను నోరి చారుఁడా
యీ విధిఁ బల్కు రావణున ♦ కీ వెటుచూచిన నాకు మిత్రుఁడున్
గావు, ప్రియుండ వేనియును ♦ గా, వుపకర్తవు గావు, గావునన్
నీవు పలాశినాథ! దయ♦నీయుఁడ వైనను గావు నమ్ముమీ. ౩౯

అర్థములు. దూతన్ = దూత నని చెప్పుకొనుచున్నవానిని, చారుఁడా = వేగులవాఁడా, ఇట్లు చెప్పుటచే వీఁడు దూతనని చెప్పుకొన్నను వీఁడు దూతగా వచ్చినవాఁడుకాఁడు, దూత ననుపేరితో మర్మము తెలిసికొనిపోవుటకై వచ్చిన వేఁగువాఁడని భావము. వాస్తవదూత యగునేని దూరమునందుండి సేన నంతయు దొంగచూపులఁ జూడఁబని లేదు. చక్కఁగా సుగ్రీవు నొద్దకు వచ్చి నేను దూతను వచ్చితి నని చెప్పి ప్రత్యుత్తరము తీసికొనిపోయి యుండవలెను. వీఁ డట్లు చేయకపోవుటచే వేగులవాఁడని తలఁపఁబడెను. ఈ విధిన్ = ఈ ప్రకారము, ఎటుచూచినన్ = ఏ విధముగ నాలోచించినను, ఉపకర్తవు = ఉపకారము చేసినవాఁడవు, పలాశినాథ = రాక్షసరాజా, దయనీయుఁడవు = దయదలఁపవలసిన వాఁడవు.

తాత్పర్యము.

అని వాఁడు చెప్పఁగా సుగ్రీవుఁ డా దూతను జూచి యిట్లనియె. ఓరీ! నీవు చారుఁడవేకాని దూతవుగావు. అయినను నీవు దూతనని ప్రత్యుత్తర మిమ్మని కోరుచున్నావు. కావున రావణునితో నిట్లు చెప్పుము. నే నెన్నివిధముల నాలోచించినను నీవు నాకు మిత్రుఁడవుగావు. ఏలన నిదివఱకు నా యందు నీకుఁగాని నీయందు నాకుఁగాని స్నేహభావము లేదు. ఉపకారముచేసిన వాఁడుకదా మిత్రుఁడు. నీవు నాకుఁజేసిన యుపకార మేదియు లేదు,ప్రియుండవు కావు, ఉపకారముచేసిన వాఁడవు కావు, ఈ కారణములచే రాక్షసనాథా! నీవు దయతలఁపబడవలసిన వాఁడవుకావు.

రామచంద్రమూర్తి నాయందు స్నేహభావము గలవాఁడు, అగ్నిసాక్షికముగా మైత్రిచేసినవాఁడు, నా మేలుకోరువాఁడు, వాలిని జంపి నా కుపకారముచేసిన వాఁడు, కావున ఆయనయందు నేను దయ తలఁపవలయునుగాని యెట్టి సంబంధము లేని నీ విషయమున నెట్లు దయ తలఁపఁగలను.

కం. రామునకు నీవు వైరివి, రామునకును నేను హితుఁడ ♦ రాక్షసరాజా!
రామునిచే నీవును సం,గ్రామంబున వాలిఁ బోలఁ♦గల వో వధ్యా. ౨౪
అర్థములు. వధ్యా = వధకర్హుఁడైనవాఁడా.

తాత్పర్యము.

రామచంద్రమూర్తికి నీవు పగవాఁడవు, రామచంద్రమూర్తికి నేను మేలు గోరువాఁడను కావున నీవు నాకును బగవాఁడవే. వాలివరుసనుబట్టి నీవు నాకు భ్రాత నంటివి. వాలి నాకుఁ బగవాఁడు కావునఁ జంపించితిని. నిన్ను నట్లే చంపించెదను.

చం. వదలక నిన్ను జ్ఞాతిహిత♦బాంధవపుత్రసమూహయుక్తుఁగాఁ
గదనములో వధించెద, ని♦కారము గా దిది, లంక సర్వముం
బద డొనరించెదన్ నిమిష♦మాత్రమునన్ హరిసేనఁ బంచి, నీ
యుదు టిలఁ జెల్ల దింకఁ, జెడు ♦ గొప్పనె యెందు నిశాచరేశ్వరా! ౨౫
అర్థములు. కదనములో = యుద్ధమందు, నికారము = మోసము, పదడు = శ్మశానము, ఉదుటు = గర్వము.

తాత్పర్యము.

నిన్ను నీ జ్ఞాతులతోఁ హితులతోఁ జుట్టములతోఁ గొడుకులతో నొకనినైన వదలక యందఱితో యుద్ధమునఁ జంపెదను. ఇది మోసపుమాటగాదు సత్యము. వానరసేనను బంపి నిమిషములో నీ లంక శ్మశానము చేసెదను, నీ గర్వ మింకఁ బనికి రాదు. దుష్టత్వము కలకాలము చెల్లునా? నీవు రాక్షసులకు రాజగుటచే నీ దోషమున నీవే కాక వారందఱు చావఁగలరు. వానరులు లంకకు రాలేరనుట కిది సమాధానము.

శా. పాతాళంబున డాఁగినన్ సురపతిం ♦ బ్రార్థించి తోడ్తెచ్చినన్
ద్యోతస్ఫీతు పథంబులో మఱిఁగినన్ ♦ దుర్మార్గశీలా! యథా
జాతా! రావణ! నిన్నుఁ బ్రాణములతో ♦ సంగ్రామరంగంబునన్
సీతానేత విడంపు, నేలకు బలిన్ ♦ నీ కంఠముల్ ద్రుంచెడిన్. ౨౬
అర్థములు. ద్యోతస్ఫీతు = సూర్యునియొక్క, 'ప్రకాశోద్యోత ఆతప'యని యమరము - ఎండచే నతిశయించినవాఁడు, సూర్యుడు - అయనపథము ఆకాశము, మఱిఁగినన్ = దాఁగుకొన్నను, యథాజాతా = మూఢుఁడా, సీతానేత = రామచంద్రమూర్తి, రాముని భార్యను నేఁదెచ్చిన నీకేమి నష్టియుంటివి. ఆ రాముఁడే నా సాహాయ్యమున్నను లేకున్నను నిన్నుఁ జంపఁగలఁడని భావము.

తాత్పర్యము.

నేను లంకలోనుండినఁగదా మీరు లంకపై వచ్చెదరు. నేను దేశాంతరము పోయిన నన్నేమి చేయఁగలరందువేమో? దుష్టుఁడా! నీవు పాతాళములో దాఁగుకొన్నను ఆకాశములో దాఁగుకొన్నను ఇంద్రుని బ్రార్థించి తోడి తెచ్చినను నీవేమి

చేసినను మూఢుఁడా! రావణా! సీతాపతి యుద్ధమందు నీ తలలను నేలకు బలిపెట్టక మానఁడు.

కం. సీతాపతి కినిసిన యా, పాతకి రక్షించువాని ♦ బ్రహ్మాండములో
 పైఁ దేయపిశాచామర, జాతంబుల నే నెఱుంగ ♦ క్షణదాటవరా. ౭౨౭

అర్థములు. క్షణదాటవరా = రాక్షసశ్రేష్ఠుఁడా - కినిసినన్ = కోపించిన, పాతకి = పాపి; జాతంబులన్ = సమూహములందు.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి యెవనిపైఁ గోపించునో యట్టి పాపాత్ముని రక్షింపఁ గలవాఁడు బ్రహ్మాండములోపల రాక్షస పిశాచ దేవతల సమూహములందు రాక్షసుఁడా! నే నెఱిఁగినవాఁడు లేఁడు, కావున నీ చావు సిద్ధము.

కం. బడుగును ముదుకని దుర్బలుఁ, బొడిచితివి జటాయు నంతఁ ♦ బోటు మిగిలెనే
 చెడుతనమె కాక నీయెడఁ, బొడగానఁగఁ గలదె వీర♦మును బలలాశీ. ౭౨౮

అర్థములు. బడుగున్ = అశక్తుని, ముదుకని = ముసలివానిని, దుర్బలున్ = ఆ కారణమున బలములేనివానిని, పొడిచితివి = చంపితివి, పోటు మిగిలెనే = శూరుఁడవైతివా, వీరము = వీర్యము, పలలాశీ = మాంసభక్షకుఁడా.

తాత్పర్యము.

రామచంద్రమూర్తికి సహాయుఁడుగా వచ్చిన జటాయువు గతియే నీకు వచ్చునంటువా? అశక్తుఁడు ముసలివాఁడు బలహీనుఁడు నోటరివాఁడు నగు జటాయువును జంపినంత మాత్రముననే నీవు శూరుఁడవైతివా? నీ యందు దుర్మార్గము కాన వచ్చుచున్నదిగాని వీర్యమేదీ. లేదుగదా.

చం. అవనివిభుండు చూచునెడ♦నా మఱి లక్ష్మణు మ్రోల నైననా
 యవనిజ నీ హరించుట? క♦టా తలపోయఁగ లేవ యట్టి నీ
 యవగడపుం జనిం గలుగు♦హాని, మహాత్ము మహాబలున్ శచీ
 ధవముఖదుర్జయున్ రఘువ♦తంసము నేమిగ నెంచినాఁడవో. ౭౨౯

అర్థములు. అవగడపుంబనిన్ = చెడుకార్యము - శచీధవ ము. ఖదుర్జయున్ = ఇంద్రాదులకును జయింపరానివానిని - రఘువతంసము = రఘువంశమునఁ బుట్టినవారిలో శ్రేష్ఠుని.

తాత్పర్యము.

తనభార్యను హరించినపుడు నన్నేమి చేయలేని రాముఁడు నేఁడేమి చేయఁ గలఁడందువా? నీవు బలపౌరుషములు గలుగువాఁడవైతివేని నీవు సీతను దెచ్చిన దెపుడు? రామచంద్రమూర్తి చూచుచుండఁగాఁ దెచ్చితివా? ఆయనగాకున్న నాయనతమ్ముఁడు లక్ష్మణుఁడైన నెదుట నుండఁగాఁ దెచ్చితివా? వారు చూచినఁ జంపుదురని భయపడి దొంగతనముగాఁ గదా తెచ్చితివి. ఇట్టి యకార్యము చేతఁగలుగు

హాని యెట్టిదో యాలోచించితివా? గొప్ప ధైర్యము గొప్పబలము గలవాఁడును నింద్రాదులకు జయింపరాని వాఁడును, రఘువంశపు రాజులలో శ్రేష్ఠుఁడును నగు రామచంద్రమూర్తి సామాన్యుఁడని తలఁచితివా? రెండవపాదంబునఁ బ్లుతయతి.

కం. నీ పాలిటి కాలునిఁగా, క్ష్మాపాలకుఁ దలఁపు మనిన ♦ సత్వరుఁడై తా
రాపుత్రుఁడు కపిపతిపైఁ, జూపుంచి వచించె శుకునిఁ♦ జూపుచు మింటన్. ౪౬

అర్థములు. కాలునిఁగా = యమునిఁగా - క్ష్మాపాలకుఁ = రామచంద్ర భూపాలుని - సత్వరుఁడై = త్వరతోఁ గూడినవాఁడై.

తాత్పర్యము

రామచంద్రమూర్తి నీ పాలిటి మృత్యువుగాఁ దలఁపు మని చెప్పుచుండ నా మాటలు విని వాఁడు మరలిపోవునేమో యని యంగదుఁడు త్వరపడి సుగ్రీవునిఁ జూచి యాకాశంబున నున్న శుకుని జూపించి యిట్లనెను.

కం. చారుండు గాని ప్లవగము, హారాజా! రాయబారి ♦ యనరా దితనిఁ
జోరవిలోకనముల నిం, మారయు చున్నాఁడు తూఁచి♦నటు లుండి యటన్.

తాత్పర్యము.

వానరరాజేంద్రా! వీఁడు రాజకార్యముమీఁద దూతయై వచ్చినవాఁడు కాఁడు. నీతోఁ బనియుండి వచ్చినవాఁడు నిన్నుఁ జూచి మాటలాడవలెను. అట్లుచేయక వీఁడు సేనయంతయు గానవచ్చుచోట నాకాశమున నరిగా నుండి దొంగ చూపులచే సేనయంతయు లెక్కించుచున్నాఁడు. కావున వీఁడు వేగులవాఁడే కాని దూత గాఁడు. దూతను జంపరాదు గాని వేగుల వానిని జంపవచ్చునుగదా.

కం. పోనీయరాదు లంకకు, వీని ననఁ రాజునాజ్ఞ ♦ నృత్యకోటులు న
వ్వానిని గట్టియుఁ గొట్టి ము,హాస్వరవృత్తిఁ బఱప ♦ ననదయుఁ బోలెన్. ౪౮

తాత్పర్యము.

వీనిని మరల లంకకుఁ బోనీయరాదని యంగదుఁడు చెప్పఁగానే సుగ్రీవునాజ్ఞ ప్రకారము వానరులు వానిని బట్టుకొని కట్టి దయలేక కొట్టి బాధపెట్టఁగా దిక్కులేని వానివలె.

కం. దేవుళ్ళఁ బడుచు వికటా,రావంబున మొఱలు వెట్టె ♦ రామా! రామా!
నీవే గతి, చంపి రయా, యీ వానరవరులు కావ♦వే నన్నుఁ గరుణన్. ౪౯

అర్థములు. దేవుళ్ళఁబడుచు = దీనత్వము పడుచు, ఇది దేవుడు శబ్దబహు వచనము, 'ఈవఱదను గనుఁగోఁతల దేవుళ్ళంబడితి. పం. తం. వేం. వికటారావంబునన్ = పెద్దధ్వనితో, రామునకు వినవచ్చునట్లు, నాలుగవపాదంబునఁ బ్లుతయతి.

తాత్పర్యము.

దీనుఁడై పెద్దగొంతుతో రామా! రామా! నీవేగతి. రామా! వీరు నన్నుఁ దేరకుఁ జంపుచున్నారయాం! దయయుంచి కావుము అని మొఱపెట్టెను.

చం. పెటికిరి కంటిగుడ్లు పృథి♦వీవరసత్తమ! నాదుతెక్కలన్
నఱికిరి, యీ మహార్తి నిధ♦నంబును గంటినటంచు చెప్పెదన్
దఱచుగ నాదుపుట్టువు మొ♦దల్కొని రేపగ లింతదాఁక నేఁ
గఱకునఁ జేసినట్టి కొఱ♦గాములపాపము నిన్ను ముట్టెడిన్. ౪౩౦

అర్థములు. వానరులు చేసినపనులు చెప్పుచున్నాఁడు. నిధనంబును = మరణమును, రేపగలు = రే+పగలు-సమాహార ద్వంద్వము కావున, ఏకవచనము, కఱకున = కఠిన బుద్ధిచే, కొఱఁగాముల = పాపకార్యముల.

తా త్ప ర్య ము.

అయ్యో! రామచంద్రా! నా కంటిగుడ్లు పెటికిరయ్యా! నా తెక్కలు నరకిరి. ఈ బాధచే నేను జచ్చితినా, ఫలము చెప్పెదను విను. నేను బుట్టినది మొదలు కఠినచిత్తుఁడనై యెన్నియో చేయరాని పనులు రాత్రి యని లేక పగలని లేక యెల్ల వేళ చేసినవాఁడను. ఆ పాప మంతయు నిన్నంటును.

ఉత్సాహము. ఆ విలాప మాలకించి ♦ యంబుజాక్షుఁ డాతనిన్
గావుఁ డతఁడు దూతగాన ♦ ఘాత మర్హ మానె! నా
నా వనాటు లతనిఁ జంప ♦ రైరి; యంత భూమిక
న్యావిభుండు జలధివేల♦యందు దర్భశయనుఁ డై. ౪౩౧

అర్థములు. విలాపము = ఏడుపు, ఘాతము = చంపుట, వనాటులు= వానరులు, దర్భశయనుఁడై=దర్భలయందుఁ బండుకొనఁదలఁచి కూర్చుండినవాఁడై. ఇంత వఱకుఁ బండుకొనలేదు. పండుకొని యుండిన మాసనవ్రతమునకు హాని, కావున మాటలాడి యుండఁడు. చూ. ప. ౪౩౯.

తా త్ప ర్య ము.

రామచంద్రమూర్తి యీ యేడుపు విని వాఁడు దూతగావున వానిని జంపరాదు రక్షింపుఁ డని చెప్పగా వానరు లతనిఁ జంపరైరిగాని పట్టికట్టి చెఱయందుంచిరి గాని విడిచినవారుగారు. సేతువు కట్టి వానరులు దాఁటి యావలియొడ్డు చేరిన పిమ్మట వదలిరి. (చూ. ప ౫౦౯) అంత రామచంద్రమూర్తి సముద్రపు టొడ్డున దర్భశయనమందున్నవాఁడై.

ఈ శుకుని చరిత్రము విభీషణుఁడు రామునొద్దఁ జేరిన పిమ్మట జరిగినదనియే తోఁచుచున్నది.

—♦ ౨౧-వ సర్గము. శ్రీరాముఁడు దర్భశయనంబునఁ బరుండుట. ♦—

సీ. మును హారంగు లెసంగ ♦ ననురంగుజాళువా, బంగారుతొడగుల♦వఱలుదానిఁ
గాంచనకేయూర♦కమ్రముక్తావర, భూషణాంచిత మయి ♦ పొలుచుదానిఁ
బరమనారీజన♦కరములచేఁ బెక్కు,బఱులను సల్గిడఁ♦బడినదానిఁ
జందనాగరుపూత♦సౌరభోపేతమై, రక్తచందనమునఁ ♦ గ్రాలుదాని

**తే.** శయనతలమున జానకీ♦చంద్రవదన, యుత్తమాంగంబుచే శోభ ♦ నొందుదాని
గాంగజలములఁ దక్షకు♦కాయమునకుఁ,దుల్య మగుదాని దీనార్తిఁ♦దోలఁచుదాని.

అర్థములు. మును=(౧)అయోధ్యలో నున్నప్పుడు, (౨) రామావతార పూర్వమున వైకుంఠమున నున్నప్పుడు, హారాంగులు=సింగారములు, నునురంగు= నునుపైన రంగుకల, జాళువా = అపరంజి,తొడగులు=సొమ్ములు, ఇది మొదలు మూఁడు పద్యములు రామభుజవర్ణనము, కాన నిందలి ద్వితీయాంతము లన్నియు రామభుజ విశేషణములు, కేయూరము = బాహుపురి, పరమనారీజనకరములచేత =గొప్పవంశమున జనించిన స్త్రీల చేతులచేత, పెక్కుబడులు = పెక్కుతడవలు, ఇచ్చట నలుగుపెట్టి యలంకరించినట్లు చెప్పియున్న వీరలు రాముని సైరంధ్రీ పరిచారికలు, సైరంధ్రులు= వీరుత్తమజాతిస్త్రీలు, కం. అరయ నెందును గౌరవ, భారం బెడలంగనీక పాతివ్రత్యా, చారము మై వర్తింతురు, సైరంధ్రీజాతివారు, సౌజన్యమునన్.కం. కావున నుచితము లగు నా, కా వెంటన్ గొలిచి తిరుగునప్పుడు మిత్రభా,షావిరచనమును వ్రతసం, భావనమును గౌరవంబు పాపభయంబున్, భార. విరా. ౧. ౧౧౧-౧౧౨. ఇవి ద్రౌపదీ వాక్యములు. ఈ జాతివారు ఎంగిళ్లు దినరు. కుచ్ఛితపుఁబనులు సేయరు. ఇట్టివారు పరమనారు లని చెప్పఁబడిరి. పరమనారీశబ్దము భార్యార్థమున యోగముగాదు, రూఢిగాదు, యోగరూఢిగాదు. పతివియోగకాలంబున దమయంతియు నిట్టి వ్రతమువలంబించి యుండెను. పూర్వము రాజులకు స్త్రీలే యలంకారాదులను జేయువారుక - కాఁబట్టియే యయోధ్యాకాండము నందును "హాయి నలంది గంధము మహోర్వులు చేడెలు వీచుచుండ" నని స్త్రీ పరిచారిక లున్నట్లు చెప్పఁబడెను. కాదంబరియందును జంద్రాపీడునికి నొక యంతరంగ పరిచారిక యున్నట్లు చెప్పఁబడినది. కొందఱు - ఇట్టి సందర్భములను బట్టి రాముని కనేక భార్యలుండి రని చెప్పుదురు. వీరికి సాధకము లైనవి యీ రామాయణము ననే కలవనియుఁ జెప్పుదురు. ఈపద్యములు వీరి యభిప్రాయము నెంతమాత్రము సాధింపనేరవు. కాన వీరి యభిప్రాయ మెంతయుఁ దప్పు. అదెట్లనఁగా సంక్షేప రామాయణమందు 'రామస్య దయితా భార్యా - రాముని యిల్లాలు. —నాథునకు సతము ప్రాణతుల్యా' యని చెప్పఁబడెను. ఇందు రాముని భార్యకు ప్రాణతుల్య యని విశేషముండుట చేతఁ బ్రాణతుల్యలు కాని కొందఱు భార్యలును రాముని కుందురనియు వారందఱికంటెను నీమెయే ప్రియురాలనియుఁ దెలియవచ్చుచున్నది. ఇంతియకాక యీ ప్రకరణముననే పైపద్యమునందు 'శశి రోహిణిరీతి న్వెన్నంటి చనె' నని చెప్పఁబడెను. చంద్రునకుఁగల నక్షత్రరూపలైన యనేక భార్యలలో నొక్కతయై చంద్రున కత్యంత ప్రియురాలైన రోహిణిని సీతకు దృష్టాంతముగాఁ జెప్పియుంటచేతను, చంద్రునికి వలె రామునికిఁ బెక్కండ్రు భార్యలు కలరనియు వారిలో సీత ప్రియయుఁ దక్కినవా రప్రియ లనియుఁ దోఁచుచున్న

దని పూర్వపక్షుల యభిప్రాయము. ఇది సరికాదు. ఈ పద్యమునందే "అన్నకుఁ బ్రీతిపాత్రుండు...లక్ష్మణుఁడు" అని యున్నది. దీనినిబట్టి రాముని కొక్క లక్ష్మణునియందే ప్రీతి, తక్కినవారియందు సంతప్రీతిలేదు, కాన రామునికిఁ బ్రీతిపాత్రులైన తమ్ములు కొందఱును ప్రీతిపాత్రులుకాని తమ్ములు కొందఱును గలరని చెప్పవచ్చునా? ఇట్లు చెప్పుట సాహసముకదా, "రాఘవ వంశనాథు తత్తనయు చరిత్రి చెప్పుము ముదంబగు (అయోధ్య ౨౭౫ ప) అనియు 'భ్రాతలందఱు భరతునిపాటిగారు' అను రామాయణవాక్యములు ఇప్పుడు విరోధింపవా? కాఁబట్టి యీ పదములకుఁ దాత్పర్యము పైని చెప్పినట్లుకాదు. మిక్కిలి గాఢముగా పెరుఁగుటచేతను సౌకుమార్యమునుబట్టి రాజమందిరములలోనే యుండఁదగిన యీ సీతాలక్ష్మణులును గూడ రాముని వెంబడి యరణ్యమునకుఁ బోయిరికదా యని కవి తాత్పర్యము. సీతకు దృష్టాంతముగాఁ జెప్పిన రోహిణి చంద్రునికిఁ బ్రియభార్యగాఁ బ్రసిద్ధురాలై నక్షత్రరూపమైయున్న రోహిణికాదు. ఈమె విడువక సదా చంద్రు ననుసరించుటలేదు. భర్తను విడనాడక సదా వెంబడించు సీతకు నిట్టి రోహిణీ దృష్టాంతము సరిపడదు. కాన సదా భర్త ననుసరించెడి మఱొక రోహిణియే యిట వివక్షిత. ఈమె దక్షుని కూఁతురుగాదు. మునిసర్గములోఁ జేరినది. (హరి. వి. పు. ౧౮-౮) కాఁబట్టి యీ దృష్టాంతమునుబట్టి రామునికి కొందఱు భార్య లప్రియలుగా నున్నా రనుట యెట్లు యుక్తము? "హృష్టాః ఖలు భవిష్యంతి రామస్య పరమాః స్త్రియః అప్రహృష్టా భవిష్యంతి స్నుషాస్తే భరతక్షయే" సంతసమున రామ స్త్రీసంతతి త్రుళ్ళంగ భరతుక్షయమున మదిలో సంతాపింతురు నీస్నుష లెంతో చింతింపు దీని కెయ్యది తెరువో" అని అయోధ్యాకాండమునందు మంథర కైకేయితోఁ జెప్పినట్లున్నది. ఇందు నీస్నుష లనుటచేత భరతున కనేక భార్యలు గలరనియు దీని సాహచర్యమును బట్టి రామ స్త్రీసంతతి యనఁగా రామ భార్యలని యర్థము కాన రామునికి ననేక భార్యలు గలరనియు స్పష్టముగా నేర్పడుచున్నదని మఱొక పూర్వపక్షము చేయుదురు. ఇదియు సరికాదు. కులగురువు వసిష్ఠులనిన నెందఱు వసిష్ఠులుగలరు? రఘూణా మన్వయం వక్ష్యే యన్నప్పు డెందఱు రఘువులుగలరు? యదూనాంపతయే నమ"యన్నప్పు డెందఱు యదువులుగలరు? రాణులు వచ్చుచున్నారనిన నొంటరిగా వచ్చుచున్నారని యర్థమా? బాలకాండమున సీతాకల్యాణ ఘట్టమునందుఁ దప్ప వేఱొకచోట రామాదులకు వివాహమయినట్లు రామాయణమందుఁ జెప్పలేదు కాన వీరికిఁ బెక్కురు భార్యలెట్లు సంభవింతురు? మఱొక గ్రంథమునఁ జెప్పియున్నను నది వీరి విషయ మని చెప్పరాదు. రామాదుల చరిత్రమును వాస్తవముగాఁ జెప్పునది యొక వాల్మీకిరామాయణమే తప్ప మఱొక గ్రంథముకాదు. ప్రధానమైన రామాయణమున విరుద్ధములుగా నున్న గ్రంథముల కర్థాంతరమే చెప్పవలెను. ఇంతియకాక, భరతునికి మిథిలలో వివాహమైన వెంటనే వాని మేనమామ తన పట్టనమునకు వానిని

బిలుచుకొనిపోయెను గదా! ఇఁక వివాహము కావలసియున్నను మేనమామ యింటనే గదా కావలెను. అది తండ్రికిఁ దెలియుసలదా! రామాదులు తమ తండ్రికిఁ దెలుపక సీతావివాహమునే చేసికొనలేదు గదా! అట్లుండ భరతుఁడు మాత్రము తండ్రికి దెలుపక యెట్లు పెండ్లి చేసికొనియుండును. అట్లయి యున్నను దశరథునికిఁ దెలియక మంథరకు మాత్ర మెట్లు తెలిసినది? ఇంతేకాక రాముఁడు సీతయొక్కతె యందు దప్ప నింకెవ్వరియందును మనస్సుంచలేదనుట రామాయణమున స్పష్టపడుచున్నది. 'శ్రీరఘురామచంద్రుఁడును సీతనుగూడి యనేకముల్ ఋతుల్, హరివిహార లీలలఁ బ్రియంబుగఁ బుచ్చెను నిచ్చలు న్మనం, బా రమణీలలామయు నాయని కూరిమి నిల్పి యామెయుం, గూరిమి పేరిమిం జెలఁగఁ గూర్చె మనంబు సదా హృదీశుపై" నను బాలకాండాంత పద్యమునుబట్టి రాముఁడు సీతయొక్కతెతోనే సదా సుఖించుచుండె నని స్పష్టమగుచున్నది. 'సర్వకామ సమృద్ధ జనసుఖముల పదియురెండేఁడు లిక్ష్వాకుల యింటను గడపితి నేదియుఁ గడమలేక"యని యారణ్యకాండ పద్యమునందు అత్యంత సంయోగార్థకమైన పదియు రెండేఁడులను బట్టిచూడ నన్ని సంవత్సరములును సీతకు రామునితో నిరంతర సౌఖ్యము స్పష్టమగుచున్నది. ఇతరభార్య లున్నచో నిది యెట్లు సాధ్యము. కాఁబట్టి రామునికి సీత యొక్కతే భార్య యనుటయే సరి. అట్లయినచో పూర్వపక్షు లుదహరించిన పద్యమున కర్థ మేమనఁగా రామ స్త్రీ సంతతి= రామునికిఁ జేరిన యాఁడువారు. తల్లి భార్య మున్నగువారు. (2) రాముని పరిచారికలు అని రెండువిధములుగా నర్థము చెప్పవచ్చును. రాజుల కుత్తమజాతి స్త్రీలే పరిచారికలుగా నుండుట కాదంబర్యాదులందు స్పష్టము. నీ స్నుషలు = నీ కోడండ్రు, భరత శత్రుఘ్ను లొక్క యుద్దిగాన భరతుఁడు కష్టపడునప్పుడు వాని తమ్ముఁడును గష్టపడును. అప్పుడు వా రిద్దఱి భార్యలును గష్టపడుదురు. వా రిద్దఱు నీ కోడండ్రని యేగదా మన మనుకొనుట యని భావము. లేదా యిచ్చటి బహువచనము పూజార్థక మని యైనను జెప్పవచ్చును. ఇట్లే పద్యమును సమరసపఱుచుట సాధ్యమగుచుండఁగా పూర్వపక్షాభిప్రాయ మెంతయు యుక్తముకాదు.

"పితుర్నిదేశం నియమేన కృత్వా వనాన్నివృత్తశ్చరితవ్రతశ్చ, స్త్రీభిస్తు మన్యే విపులేక్షణాభిస్త్వం రంస్యసే వీతభయః కృతార్థః" "జనకుని యాజ్ఞచొప్పునఁ బ్రశస్తగతి న్వనవాసదీక్ష దీర్చి, నగరమేగి ధాత్రి కభిషేకము గైకొనుచుం గృతార్థతం, జనవున వారిజాత దళచారు విశాల విలోచనాళితో, నెనయక భీతిలేక రమియించెద వంచుఁ దలంతు సువ్రితా"యని సుందరకాండమునందు సీత రాముఁడు తన్నుపేక్షించెనని దుఃఖించుచుఁ దా నిట్లే చావవలసినదే యనియు, రాముఁడు వనవాసమైన పిదపఁ బెక్కండ్రు స్త్రీలతో రమించుననియు దుఃఖించియున్నది. దీనిని జూడఁగా రామునికి ననేక భార్యలు కల రని స్పష్టమగు చున్నదని పూర్వపక్షము. ఇది యుక్తముకాదు. తన యనంతరము రాముఁడు వివాహము చేసికొనును అనెడి యభిప్రాయముచేత

జెప్పినదియే కాని యతని కింతకుముందే యనేక భార్య లున్నా రనియు వారితోడ రమించు ననియు నభిప్రాయముతోఁ జెప్పినదికాదు. అట్లయినచో సంతకుముందెచ్చటను నామె ప్రస్తావనయే చేయలేదేల? మహాపద్దశలో నున్న స్త్రీలు తమ యనంతరము తమ భర్తలు యితరస్త్రీలను బెండ్లియాడుదు రనియుఁ దమ భూషణాదులను వారి కిత్తురనియు ననుకొనుట లోక సహజము. అట్టి స్త్రీ స్వభావమునుబట్టి సీత యన్నదే కాని వేఱు కాదు. ఇట్లుకాక యింతకుముందే రాముని కనేక భార్య లున్నారని సీత యభిప్రాయమై యున్నచోఁ బట్టాభిషేకానంతరము తన్ను లక్ష్మణుఁడు రామాజ్ఞ ప్రకారము అరణ్యమునకుఁ బిలుచుకొనిపోయి గంగాతీరమున విడుచునపుడు "నా భర్త యిట్లు నన్నుఁ జేసినదానికి నేనిప్పుడే నా ప్రాణము విడువవలసినదే. అయినను బ్రీకృతము నా కడుపులో నున్న గర్భము నేను జచ్చినచోఁ జెడును. నా భర్త వంశము నాశన మగును. కాన నేనిప్పుడు ప్రాణము వదల" నని చెప్పి యుండుట యెట్లు యుక్తమగును? సీతాగర్భము నాశన మయ్యేనేని నితరభార్యలకుఁ బుత్రు లుండరాదా? దానిచే సంతతి చెడకుండరాదా? కాఁబట్టి యిప్పుడు భార్య లనేకులు శ్రీరాముని కున్నారని కాదు. ఏకపత్నీవ్రతస్థుఁడు రాముఁడు తన్ను విడిచి వేఱొక స్త్రీతోఁ గలియఁడని సీత యెఱుఁగును. ముందు పద్యములోని సీతాభిప్రాయము తన యనంతరము రాముఁడు పెండ్లియాడు ననియే యామె యభిప్రాయము. "నామగని రాజవంశము, భూమిపయిఁ జిన్నమగుచుఁ బోవదయేనిఁ, సౌమిత్రి జాహ్నవిలో, నా మేను ద్యజింపకుందునా యీ త్రుటిలో" నని యుత్తరకాండ పద్యము.

'పరమ నారీజనకరములచే' నను నీ పద్యమును బూర్వపక్షులు తమ పక్షమునకు సాధకముగాఁ జెప్పుకొందురు. ఇందుఁ జెప్పఁబడిన పరమ నారీజనులు పరిచారికలైన యుత్తమస్త్రీ లని పూర్వమే వివరింపఁబడెను. లేదా పరమనారీజనకరములచే నల్గిడఁబడిన దానిని-ఇంతకుముందు నల్గిడఁబడినదాని నని యర్థము కాదు. నల్గిడఁబడుటకుఁ దగిన దానిని-ఆశంసార్థక క్త ప్రత్యయాంతము. రాముని భుజసౌందర్యమును జూడఁగా సీతని కనేక భార్యలుండి వారలు ఈ భుజమునకు నలుగుపెట్టినచో బాగుగా నుండు నని తోఁచుచున్న దని భావము. లేదా, పరమనారులు శ్రీ భూనీళాదేవులు 'ఆత్మానం మానుషం మన్యే' యన్నట్లు శ్రీరాముఁడు తన్ను మనుష్యునిగాఁ దలఁచుకొని యున్నను వారి స్వరూపమును వర్ణించెడి యీ కవిమాత్రము వానిని శ్రీమన్నారాయణునిగానే యచ్చటచ్చట స్పష్టపఱుచుచున్నాఁడు. "విష్ణువు పుట్టె ధర నన్నరాకృతిఁ" అని యయోధ్యాకాండాది భాగమందలి పద్యము. ఇట్లే యనేక స్థలములం దున్నది. అట్లుగనే యిచ్చటను శ్రీ భూనీళలను స్పష్టపఱిచెను ఈ కవి యనుట తప్పుగాదు. కాఁబట్టి పూర్వపక్షుల యుక్తులే మాత్రమును సమంజసములు గావు.

రాముఁడు రాజ్యమేలునపుడు సీతను వదలిన పిమ్మట ననేక రాజసూయాశ్వమేధాదియాగంబులను జేసినట్లుత్తరకాండమునఁ జెప్పఁబడెను గదా. భార్య లేనపుడు

యజ్ఞములు చేయరాదు. కాన నపుడితర భార్యలను బెండ్లియాడియే రాముఁడా యజ్ఞములను జేసియుండవలెను. కాన నన్యథానుపపత్తిచేత రామునికనేక భార్య లుండినట్లేర్పడుచున్నదని పూర్వపక్షులు మఱొక యుక్తి చెప్పుదురు. ఇదియు సరి కాదు. యజ్ఞార్థమై వరింపఁబడినట్లు నీవు చెప్పెడి భార్యలు రామునకే మాత్రము భోగార్థ ముపయోగపడరాదు. ఇట్లుండ వీరినిబట్టి పూర్వ పద్యములను సమరస పఱుచుట 'అసిద్ధ మసిద్ధేన' యన్నట్లున్నది. ఇంతియకాక శ్రీరాముఁడు సీతాపరిత్యాగానంతరము సీతకుఁ బ్రతినిధిగా సీతాప్రతిమను బెట్టుకొని యజ్ఞములు చేసిన ట్లుత్తరకాండమునఁ జెప్పఁబడెను. దీనిని బట్టి చూడఁగా యజ్ఞార్థము శ్రీరాముఁడు వేఱే స్త్రీలను బెండ్లియాడియే యుండఁడని తోఁచుచున్నది. కుమారిలభట్టుఁడు కొదువఁబడినవాని కెల్లఁ బ్రతినిధులఁ జెప్పుచు భార్యకుమాత్రము ప్రతినిధిని చెప్పమిని భార్యకు ప్రతినిధి లేదని పూర్వమీమాంసాన్యాయమునుబట్టి యేర్పడుచుండఁగా నుత్తర రామాయణమున భార్యాప్రతినిధి నెట్లు చెప్పవచ్చునని కొందఱాక్షేపింతురు. అది సరి గాదు. "యది దుష్టభార్యో దూరభార్యో వా స్యాత్తదా దర్భపుంజీలం తత్స్థానే నిధాయాగ్నిమాధాయ కుర్యా' త్తని హేమాద్రి నిబంధనగ్రంథమునఁ బ్రత్యక్షవచన ముదహరింపఁబడి యుండఁగా దీనికి విరుద్ధముగ నున్న పూర్వమీమాంసాన్యాయ మంతగా గ్రాహ్యముకాదు. ఇంతియకాక ధర్మసంస్థాపనార్థమై యవతరించిన శ్రీరాముని యాచారముకన్నను నీ విషయంబున వేఱుప్రమాణము కావలయునా? వీరి యాచారమునకు విరుద్ధమై యెన్నియున్నను నవి యెల్ల నప్రమాణంబులే యని యెఱుంగ నగు. వేదంబులుకూడఁ బూర్వుల యాచారంబుల ననుసరించియే నిత్యనైమిత్తిక కర్మములను విధించినవి గాని వేఱుగాదు. కాఁబట్టి వేదములకన్నను బ్రథమ ప్రమాణంబు లాచారము లనియే చెప్పవలెను. ఈ యభిప్రాయమును బట్టియేకదా యాపస్తంబులును బ్రమాణములను జెప్పెడి సందర్భమున "ధర్మజ్ఞసమయః ప్రమాణం వేదాశ్చ" యని వేదముకన్నను నుత్కృష్టప్రమాణ మాచారమని సూచించుటకై యాచారమునే ప్రప్రథమమునఁ జెప్పియున్నారు. ఇందుచేతనేకదా స్మృతికారులును దమ స్మృతులందు 'శ్రుతి ర్విభిన్నా స్మృతయో విభిన్నాః నచాస్య మే ర్దర్శన మస్తి కించిత్, ధర్మస్యతత్త్వం నిహితం గుహాయాం మహాజనో యేన గతస్సపంథా"యని యాచారమునే సకల ప్రమాణోత్కృష్ట ప్రమాణముగాఁ జెప్పియున్నారు. కాఁబట్టి 'చాతుర్వర్ణ్యంచ లోకేఽస్మిన్ స్వేస్వే ధర్మే నియోక్ష్యతి'' యన్నట్లు ధర్మసంస్థాపనార్థమై యవతరించిన శ్రీరాముని యాచారమే ప్రబలప్రమాణము. దీనికి విరుద్ధముగా నెన్ని యపన్యాయము లున్నను నవి మనకుఁ బ్రమాణములే కావు.

రాజు లశ్వమేధాదులు చేయునపుడు మహిషీవావాతాపరివృత్తి పాలాకలు లని నలుగురు భార్య లుండవలెను. దీనిప్రకారము శ్రీరామునికి సీత మహిషీస్థానమున నున్నను వావాతాదులకై యితర భార్యలుకూడ నుండిరని మఱి కొందఱాక్షేపిం

తురు. ఇదియు ననాలోచితము. ఏ యంగము లేకున్నను యజ్ఞము పూర్తియగునో యట్టి యంగములు లేనప్పుడు వానికై యేర్పడిన మంత్రములను మాత్ర మా యజ్ఞ కాలమునఁ బఠించినను జాలును. ఇందులకై యా వస్తువులను దప్పక సంపాదించియే తేవలె నని నిర్బంధ మక్కఱలేదు. కాన వావాతాదులు లేకున్నను బ్రధాన మహిషి మాత్రమునసే యజ్ఞపూర్తి కావచ్చునుగాన వారికై యేర్పడిన మంత్రమపుడు పఠించియుందురు.

కాఁబట్టియేగదా కుంటివారు యజ్ఞముచేయునపుడు విష్ణుపదక్రమణము సాధ్య పడమిని దానికై యేర్పడిన మంత్రమును మాత్రము పఠించుచున్నారు. ఇట్లే గ్రుడ్డి వాఁడు యజ్ఞము చేయునపుడు ఆజ్యావేక్షణము క్రియారూపముగ లేక మంత్రపఠ నముచేతనే యగుచున్నది. కాఁబట్టి యే శాస్త్రము విరోధించినను శ్రీరాముని యాచారమే ప్రబలప్రమాణము. దీని కవిరోధముగనే సమస్త శాస్త్రములను సమంజస పఱుచుకొనునది.

పూతసౌరభము = వస్త్వంతరవాసనామిశ్రము కాక కేవల చందనాగురు సువాసన, రక్తచందనమునఁ గ్రాలుదానిన్ = రక్తచందనము మేదించిన కుంకుమ పూవు, మొదట చందనాగురు గంధముఁబూసి ఆపై మేదించిన కుంకుమపూవును బూసి యున్న దని భావము. శయనతలమునన్ = హంసతూలికాతల్పమునందు, ఉత్త మాంగము = శిరము, గాంగజలములన్ = గంగానదిజలములందు, ఉన్నయని శేషము.

స్వతఃప్రమాణమైన వాల్మీకి రామాయణమందలి విషయములకు నితర ప్రమా ణము లాశించువాఁడు సూర్యునిజూచుటకు దీపములు దెమ్మనువాఁడే. ఈ విషయము పీఠికయందుఁ జర్చింపఁబడెను. ఉత్తరకాండమును జూచునది.

## తా త్ప ర్య ము.

వనములకు రాకముందు తమకు బంగారు సొమ్ములచేఁ బ్రకాశించుదానిని, బంగారు భుజపురులచేతను, మనోహరములైన ముత్యముల సొమ్ములచేతను, నలంక రింపఁబడినదానిని ఉత్తమస్త్రీలగు పరిచారికలచేత ననేకవిధములు నలుగు పెట్టబడిన దానిని, చందనము అగురు, వీనియొక్క పవిత్రమైన సువాసనలు గల్గిన యెఱ్ఱని చందనమున శోభించుదానిని, పానుపునందు చంద్రునివంటి ముఖముగల సీతాదేవి యొక్క శిరస్సుచేఁ బ్రకాశించు దానిని, గంగానదియందలి తక్షకుని శరీరమునకు సమాన మగు దానిని, దీనులబాధ తొలఁగించుదానిని,

తరలము. కలన శాత్రవశోకదంబు యుగప్రతీపము దీర్ఘముస్
సలలితాప్తముదాకరంబును ♦ సాగరాంత సమాశ్రయం
బలఘునవ్యశరప్రయోగస♦మర్థముస్ దృఢశింజినీ
కలిత మాటను జర్మ మూడుటఁ ♦ గాయ కాచినదానినిన్. ౪౩౩

అర్థములు. కలనన్ = యుద్ధమందు, శాత్రవశోకదంబు = శత్రువులకు శోకము గలిగించునది. యుగ ప్రతీపము = గడియమ్రానుకు నెదురుద్ది యగు దానిని, ఇచ్చటఁ బ్రతీపమనునది యుపమావాచకముగా గ్రహింప వలెను. "స్పర్ధతే జయతి ద్వేష్టి ద్రుహ్యతి ప్రతిగర్జతి ఆక్రోశ త్యవజానాతి కదర్థయతి నిందతి తస్యచానుకరోతీతి శబ్దాః సాదృశ్యవాచకాః ఉపమాయా మిమే ప్రోక్తాః కవినాం బుద్ధి సంపదాం" దండి. దీర్ఘముల్ = మోఁకాళ్ళ నంటునట్లు నిడివియైన దానిని, సలలిత = మంచి మనస్సుగల, ఆప్త = స్నేహితులకు, ముత్ + ఆకరంబును = సంతోష స్థానమైనదియు, సాగరాంత = సాగరము కడపటగాఁ గలది భూమి, ఆ భూమండల మునకు ఆశ్రయమైనది సాగరాంత సమాశ్రయము, భూరక్షా భారము వహించు నది. అలఘు = గొప్పదై, సవ్య = ఎడమప్రక్క నుండియు, శరప్రయోగసమర్థము= బాణముల ప్రయోగించు సామర్థ్యము గలది. దృఢశింజినీ కలితము = గట్టి యల్లె త్రాటి రాపు గలది.

తా త్ప ర్య ము.

కాఁడిమ్రాఁకుతో సమానమై యుద్ధమునందు పగవారికి శోకము గలిగించు దానిని, నిడివియైన దానిని, మంచి మనస్సుగల మిత్రుల సంతోషమునకు స్థానమైన దానిని, భూమండలమునకు నాశ్రయమైన దానిని, సవ్యాపసవ్యముగ బాణములు ప్రయోగింప సామర్థ్యము గలదానిని, గట్టియల్లె త్రాటిరాపిడిచేఁ జర్మము కాయ కాచినదానిని.

మత్తకోకిలము. వేలువేలుగ నాలమందల ♦ విశ్రుతంబుగ దానముం
బోలఁ జేసినదానిఁ, బన్నగ♦భోగసన్నిభ మై మహా
భీల మా పరిఘాతనం బనఁ ♦ బేర్మి మించినదాని, నా
వేల దక్షిణబాహువుం బర♦వీరకాలుఁడు దిండుగన్. ౪౩౪

అర్థములు. ఆలమందలన్ = ఆవుల గుంపులను, పన్నగభోగ సన్నిభమై = పాముయొక్క పడగతో సమానమై, మహాభీలమా = మిగుల భయంకరమైన, పరిఘాతనంబు = గడియమ్రాఁకు, వేలన్=సముద్రతీరము నందు, దక్షిణబాహువు= కుడిభుజమును, పరవీరకాలుఁడు = వీరులగు శత్రువులకు యముఁడైన వాఁడు.

తా త్ప ర్య ము.

వేలువేలావు మందలను సుప్రసిద్ధముగ దానము చేసిన దానిని, పాఁపపడగ వంటిదై మిగుల భయంకరమైన గడియ మ్రాఁకువలె గొప్పదగు దానిని కుడిభుజ మును దిండుగాఁజేసికొని సముద్ర తీరమున.

భుజముయొక్క వర్ణన నిష్ప్రయోజనము సేయుట యప్రస్తుతము గాదా? కాదు. ఎంతో సుకుమారమై యెన్నివిధములనో యుపచారము చేయించు కొనునదియై యు కాభరణములచే నలంకరింపఁ బడినదై శత్రువులకు భయంకరమై మిత్రులకు

నానందకరమై యనేక దానములు చేసిన హస్తము నేఁడిట్టు లోరుగాలిలో నిసుకదిబ్బ మీఁదఁ గఱకు దర్భలమీఁద బడియుండవలసి వచ్చెఁగదా యని తనవిషాదము తెలుపఁ గవి దీని వర్ణించెను.

క. తూరుపు మొగమై కైకొని, పారావారంబు తరణ♦భంగియొ మరణం
బో రెంట నొకటి నిజ మని, వీరుఁడు మది నిశ్చయించి ♦ విధిహితనియతిన్.

అర్థములు. పారావారంబు = సముద్రము యొక్క, తరణ భంగియో = దాఁటుటయో, పారావారము యొక్క మరణభంగియో, విధిహితనియతిన్ = శాస్త్రమందుఁ జెప్పబడిన నియమప్రకారము, ఇది కాయిక వాచక నియతి చెప్పను.

తాత్పర్యము.

తూరుపుముఖ మగునట్లు పండుకొని సముద్రమును నేను దాఁటనైన దాఁటవలెను. లేదా సముద్రుఁడు చావనైనఁ జావవలె, రెంటిలో నొకటి కాఁగలదని నిశ్చయించుకొని శాస్త్రమందుఁ జెప్పఁబడిన ప్రకారము, పారావారముయొక్క మరణభంగి యని యన్వయించిన సముద్రము నెండించి దాఁటెద నని యర్థము.

క. మౌని యై శయనించెను స,ప్తార్ణవనిధిఁ బ్రార్థించికొనుచుఁ ♦ బన్నుండ నిటుల్
చనె మూఁడు యామినులు ద,ర్శనమొసఁగఁడు మందుఁడగుట♦సరిదధిపతియున్.

అర్థములు. మౌనియై = మౌనవ్రతముఁ బూనినవాఁడై, ఇది మానసిక నియతి, పన్నుండన్ = పరుండఁగా, యామినులు = రాత్రులు, మందుఁడు = బుద్ధిమాంద్యముగలవాఁడు, సరిదధిపతియున్=సముద్రుఁడును, 'సీతాయాః పతయేనమ' యన్నట్లు లక్ష్మీపురుషకారము పూర్వకముగఁ గదా శరణాగతి. అట్లులే సీతాపూర్వకముగా రాముఁడు చేసెను.

తాత్పర్యము.

మౌనవ్రతముఁ బూని సముద్రమును బ్రార్థించుచు మూఁడురాత్రులు (పాడ్యమి విదియ తదియ) పండుకొనెనుగాని బుద్ధిమాలిన సముద్రుఁడు కానవచ్చినవాఁడు గాఁడు. సముద్రుఁ డనఁగా సముద్రాధిష్ఠాన దేవత యని యర్థము. రామచంద్రమూర్తి యడుగకున్నను దానై యాయనకార్యము చేయవలసినవాఁడు ఆయన ప్రార్థించినను దనకు నాయనకుఁగల వాసిగాని కృతజ్ఞతగాని యాలోచింపక పోవుటచే వానిని గవి మందుఁడనెను.

రామునంతటివాఁడు చేసిన శరణాగతి వ్యర్థము కానేల? శరణాగతి దీనులకు నకించనులకే కాని శక్తిమంతుల కుపయోగపడదు. రాముఁడు దీనుఁడు కాఁడు. అకించనుఁడుకాఁడు. కావున ఫలింపలేదు. కావున నధికు లల్పుల నుద్దేశించి శరణాగతి చేయరాదు. బ్రాహ్మణుఁ డశ్వమేధమున కధికారి కానట్టు రాముఁడు శరణాగతి కర్హుఁడుకాఁడు.

రామచంద్రమూర్తి తూర్పుముఖమై పండుకొనుట మౌనము వహించుట దర్భలపైఁ బరుండుట లోనగు నియమములఁ బాటించెఁగదా! ప్రపత్తి కివి నియతములా? ఆర్తప్రపన్నునకు నియమములు లేవు కాని దృప్తుఁడు నియమములఁ బాటింపవలయునని రామచర్య సూచించుచున్నది. రామచంద్రమూర్తి దృప్తుఁడే కాని యార్తుఁడు కాఁడు. ఆర్తుఁడై యుండినచో సముద్రము దాటుటలో మరణమొందునని పండుకొనినవాఁడు మరల లేచునా? రాముని బంటైన హనుమంతునకు సాహాయ్యము చేసిన సముద్రుఁడు ప్రత్యక్షముగా రామునకేల చేయలేదు?

రామనామ మందున్న బలము రామునందు లేదు. హనుమంతుఁడు రామముద్రిక ధరించి జయము జయంబు రామునకని కేకవేయఁగానే యందఱు గౌరవింతురు. రామదాసుఁడుగాక యూరక సముద్రముదాఁట నెంచియుండిన నా గౌరవమా యనకుఁ గలిగియుండదు. గోవిందా యను కేకగదా ద్రౌపదిని గాచినది. రావే వరదా యను కేకగదా గజేంద్రుని గాచినది. హానాథా యను సీతమాట గదా రామచంద్రుని విశేష పరితాపపడఁ జేసినది. సంసారమునుండి తరింపఁజేయునది రామనామమే కదా. రామనామ మాహాత్మ్యము తెలియక యా పార్వతీ పరమేశ్వరులు శ్రీరామనామము సర్వదా జపించుచున్నారు? అధికారుల భటుల మెడలోని బిళ్ళలకు బను లయినట్లు లధికారులు స్వయముగఁ బోయిన కావు. అనుభవవిదితము. కావుననే శ్రీరామ నామము స్వాధీనపడెనా తరువాత రామమూర్తి దర్శనమిచ్చినను ఈయకున్నను భక్తులు పరితాపపడరు.

—♦ శ్రీరాముఁడు సముద్రుపై నాగ్రహించుట. ♦—

ఉ. అంతట రాఘవుండు కనలార మహోదధినగ్గ్యమీఁద ర
క్తాంతవిలోచనుండయి నిజాంతికసీమున యున్నలక్ష్మణుణ్
గాంతసులక్ష్మణుం బలుకుఁ గంటివె దర్శన మీఁడు సాగరుం
డెంతటి గర్వియో? బరువు హీనత పో మలినాత్ముఁ డేమఁటల్.

అర్థములు. కనలారణ్ = కోప మతిశయింపఁగా, రక్తాంత విలోచనుండయి= ఎఱ్ఱని కొనలుగల కన్నులుగలవాఁడై, నిజాంతికసీమున=తన సమీప ప్రదేశమందే, దీనిచే లక్ష్మణుఁడు రామచంద్రుని ప్రక్కనే నిలచియుండె నని భావము, కాంత సులక్ష్మణుణ్=మనోహరమైన శుభచిహ్నములు గలవానిని, రాముని కోపము పరిశీలించి యిఁక భయములేదు. కార్యమైనదే యని వికాసము నొందిన ముఖముగలవానిని, మలినాత్ముఁడ్ = నిర్మలచిత్తుఁడు కానివానిని, నిర్మల దేహములేనివానిని-సముద్రము నిర్మలము కాదుగదా!

తా త్ప ర్య ము.

మూఁడు రాత్రులు దర్భశయనమందుండి సముద్రుఁడు ప్రసన్నుఁడై దర్శన మీయకుండుట చూచి సముద్రము మీఁదఁగన్నులెఱ్ఱజేసి తన సమీపమందే యుండు

ముఖవికాసాది శుభచిహ్నములు గల లక్ష్మణుఁజూచి యిట్లనియె. లక్ష్మణా! చూచి తివా సముద్రుఁ డెంత పొగరుబోతో కాన వచ్చిన వాఁడు కాఁడుగదా-మలినచిత్తులఁ బ్రార్థించుటవలన గౌరవహానియేకాని లాభములేదు.

క. ఓరుపు శమ మార్జవమును, జారుప్రియవాదితయు న♦సాధులయందున్
గారియము సేయ దా స,చ్చారిత్రు నశక్తుఁ డనుచు ♦ జడుఁ డెంచు మదిన్. ౪౩౭

అర్థములు. శమము = కోపము లేకుండుట, ఆర్జవము = చక్కని నడవడి, చారుప్రియవాదితయు - మనోహరముగ నింపుగ మాటలాడుట, అసాధులయందున్ = సాధువులు కానివారియందు, కారియము సేయదు = ప్రయోజనపడదు, ఆ సచ్చారిత్రున్ = అటువంటి శమదమాదులు గలవానిని, అశక్తుఁడు = సామర్థ్యములేని వాఁడు, జడుఁడు = యోగ్యత తెలిసికొనలేని మందబుద్ధి.

తాత్పర్యము :

పరులుచేసినదాని సహించుట కోపములేమి. చక్కని నడవడి మంచి మాట లాడుట యివి దుర్జనులందుఁ బనిసేయవు. అటువంటి నడవడిగలవానిని బుద్ధిలేని వాఁడు సామర్థ్యములేక యిట్లు చేయుచున్నాఁడని తలఁచును.

క. తనుఁ దాన పొగడుకొనువా,నిని సర్వోత్సృష్టదండు ♦ నిర్దయుఁ గుటిలా
త్మునిఁ విపరిధావకుం గని, జనములు తనియించుచుండు ♦ సత్కారములన్. ౪౩౮

అర్థములు. సర్వోత్సృష్టదండున్ = వీనిని దండింపవచ్చునా కూడదా యను విచారములేక యెవరినైనను దండించువానిని, నిర్దయున్ = దయలేనివానిని, కుటిలాత్ముని = కుత్సితబుద్ధిగలవానిని, విపరిధావకున్ = అందఱుఁ దఱుముఁగొట్టు వానిని, తనియించుచుండు = వాఁడు కోరిన విచ్చి తృప్తిపఱుచుచుందురు, సత్కారములన్ = బహుమానములచే.

తాత్పర్యము.

తన్నుఁ దాను బొగడుకొనువానిని విమర్శలేక దండించువానిని దయలేని క్రూరుని వక్రబుద్ధిని ఎవరిని దగ్గఱరానీయక తఱుముచుండువానిని జూచి లోకులు గౌరవించి వానికిఁ గావలసిన విచ్చి సంతోషపఱుచుచుందురు.

సాధువులను సాధువులు మాత్రమే పూజింతురు. దుష్టుల నందఱు పూజింతురు. 'దుష్టస్సర్వత్రపూజ్యతే' యని కలదుగదా.

క. సామమునఁ గీర్తి గలుగదు, సామంబున యశము లేదు ♦ సౌమిత్రీ! సం
గ్రామముఖంబున జయమేన్,సామమున లభింప దయ్య ♦ జగముల నెందున్.

అర్థములు. సామమునన్ = మంచితనముచేత, కీర్తి=బలమువలని ప్రఖ్యాతి, యశము = దానాదులవలన ఖ్యాతి.

తాత్పర్యము.

సామముచే యశము లేదు- కీర్తి లేదు- యుద్ధమందు జయము లేదు.

ఉ. ఏను క్షమాగుణంబు వహియించుట నీ జలరాశి నన్ను శా
లీనునిఁబోలెఁ జూచెడి, బలే క్షమ నూపఁగఁ గూడ దిట్టి దు
వానియెడన్, మదీయశరవారవిదారితసక్రికూర్మ సం
తాను నిరుద్ధతోయు గతదర్పు విలోలునిఁ జూడు లక్ష్మణా ! ౨౭౧

అర్థములు. క్షమాగుణంబు = ఓర్పు, ఆక్రుష్టోపి హతోవాపి, నాక్రోశే
న్నైవ తాడయేత్, అదుష్టో వాఙ్మనఃకాయై స్సా క్షమా పరికీర్తితా॥ ఈడ్వఁబడినను,
గొట్టఁబడినను దూషింపఁడు - కొట్టఁడు - మనో వాక్కాయముల దోషములేనివాఁడో
యట్టి సహనము క్షమ యనఁబడును. శాలీనునిబోలె = అసమర్థునివలె, నన్ను =
ఇతరులఁ బ్రార్థింపక యే కార్యమైనఁ జేయఁగల నన్ను, మదీయశరవార=నా బాణ
సమూహములచే, విదారిత = చీల్పఁబడిన, సక్రికూర్మ సంతానున్ = మొసళ్ళు
తాఁబేళ్ళు గలవానిని, నిరుద్ధతోయున్=అడ్డగింపఁబడిన నీళ్ళుగలవానిని, గతదర్పున్=
గర్వముడిగినవానిని, విలోలుని = అల్లకల్లోలమైనవానిని.

తాత్పర్యము.

నేను దోలుత నీ సముద్రము నెంచించి కాలహరణము లేక వానర సేన దాఁటింపఁ
దలఁచితిని. అయినను మీరు సౌమ్యమార్గము నుపదేశించుటచేత మీ మాట నేల
త్రోసి వేయవలయు నని కాలహరణమైనను సహించుటచేఁ దాను నీటికుప్పగదా యని
తన్నొక్క గొప్పగా నెంచుకొని నన్ను దేనికిఁ జేతగాని వానివలె వీఁడు తలఁచెను.
ఔరా ! యేమి వీని దుర్నయము ! ! ఇట్టివానియం దోర్పు పనికిరాదు. అటుయిన
నిప్పు డేమి చేయఁదలఁచితి నందువా నా బాణపరంపరలచే దీనిలోని మొసళ్ళను
దాఁబేళ్ళను జీల్చి తేలునట్లుచేసి నీరు కదలకుండ స్తంభించి వీని గర్వ మణఁచి యల్ల
కల్లోల మగునట్లు చేయుదును.

క. కరులకరంబులు దర్వీ,కరముల భోగములు మీలకాయంబులు సా
గరమున మచ్ఛిన్నంబులు, కరమం దేలాడఁ జూడఁగల వనుజాతా! ౨౭౨

అర్థములు. అనుజాతా = తమ్ముఁడా ! కరులకరంబులు = నీటియేనుఁగుల
వంటి చేపల తొండంబులు, దర్వీకరముల భోగములు = పాముల శరీరములు,
మీల = చేపలయొక్క, కాయంబులు = దేహములు, మత్ + ఛిన్నంబులు=నాచేఁ
జీల్పఁబడినవి, కరమున్ = మిక్కిలి.

తాత్పర్యము.

ఏనుఁగుల యాకారములు గల చేఁపల తొండములు - పాముల దేహములు -
చేఁపల శరీరములు - ఇవి నా బాణములచేఁ జీల్పఁబడినవై నీటిపైఁ దేలుచుండఁగా
నీవు చూచెదవు.

క. కరవాఁడిశరంబుల సా,గరమును సవిసారశుక్తి♦కాశంఖసము
త్కరముగ నింకించెద సం,గరమున; మెత్తందనానఁ ♦ గనఁబడఁ డితఁడున్. ౪౪౩

అర్థములు. కరవాఁడి = కరము + వాఁడి = మిగుల పదునైన, సవిసార = చేపలయు, శుక్తికా = ముత్తెపుఁ జిప్పలయు, శంఖ = శంఖములయు, ఉత్కర = సమూహములతోఁ గూడిన దానిఁగ, ఇంకించెదను = ఎండించెదను.

తాత్పర్యము.

మిగులఁ బదునైన బాణములచే సాగరమును చేపలతో ముత్తెపుఁ జిప్పలతో శంఖములతో నెండించెదను. మంచితనమున వీఁడు కానరాఁడు - చెఱుకా బెల్లము పెట్టవే యనినఁ బెట్టునా?

శా. సౌమిత్రీ! యిటు దెమ్ము చాపము మహా♦సర్పోపమానాశుగ
స్తోమంబుల్ వెస సాగరంబు నిదె సం♦శోషిల్లఁ గావించెదన్
భూమిధాత్రీటచయంబు కాలినడకం ♦ బోఁ జేసెదం గిన్క వే
లామర్యాద యణంగి పొంగి ధరఁ బొ♦ర్లన్ క్షుబ్ధముం జేసెదన్. ౪౪౪

ఈ సముద్రమును మాటలచేత బెదరించితి మేని భయపడి మనకుఁ గనఁబడ వచ్చునని యెంచి దయాళువైన శ్రీరాముఁడు ఇంతవఱకు మాటలచే బెదరించి చూచెను. అదియు వ్యర్థమగుటచే నిఁకఁ గార్యము మూలమున బెదరించి చూతమని దానికై ప్రయత్నించుచున్నాఁడు. సౌమిత్రి=లక్ష్మణుఁ డాదిశేషావతారముగదా! శేషునికి సముద్రము పఱుపు గదా! ఆ ప్రీత్యాసక్తిని బట్టి వీఁడు నేను సముద్రముపైఁ గోపగించి ధనుర్బాణములను దెమ్మన్నప్పుడు కొంత యాలస్యము చేయునేమో యట్లు చేయరాదనుటకై తగినట్లు లక్ష్మణుని రాముఁడు సంబోధించుచున్నాఁడు. సౌమిత్రి, (1) నీవు తల్లిమాటయే వినవలసినది, అన్న మాటను వినరాదని నియమము పెట్టుకొని యున్నావా? (2) రామే ప్రమాదం మా కార్షీః" యని నీ తల్లియాజ్ఞను మఱచితివా? ఆ సంబోధనము విని లక్ష్మణుఁడు ఏమి పని యాజ్ఞాపించెదరో యని రామునొద్దకు రాఁగా రాముఁ డనుచున్నాఁడు. చాపము నిటు తెమ్ము. (1) నిర్గుణుఁ డైన యీ సముద్రుని సగుణమైన వింటిచేతనే వశపఱుచుకొన వలెను గాన సగుణమైన ధనుస్సును దెమ్ము. (2) సముద్రము పుల్లునోటఁ గఱచుకొనునట్లు చేయ వలెను. అందులకై విల్లు తెమ్ము, ఈ మాట విని లక్ష్మణుఁడు భయపడి వింటిని మాత్రము తెచ్చియిచ్చెను. రాముఁడది చూచి 'ఇదేమి వింటిని మాత్రము తెచ్చితివి. బాణములు లేక దీనితో నేమి చేయవచ్చును? కాన బాణములను గూడఁ దెమ్మని చెప్పనెంచి మరలఁ గొంచె మాలోచించి ఈతఁడు చెప్పినంతే చేయుచున్నాఁడు, బాణములు తెమ్మన్నఁ గఱుకైన వానిని తేక యుపయోగములేని వానిని దెచ్చునేమో యని యెంచి కఱుకు బాణములను దెచ్చున ట్లాజ్ఞాపించుచున్నాఁడు. మహా సర్పోపమాశుగస్తోమంబుల్=సర్పమునకు మహత్త్వము విషముచేతనే గదా! అనఁగా

కఱువవలసినది లేక యే చూపుమాత్రముననే విషము గ్రక్కి మనుష్యులను జంపునట్టి వే యిచ్చట నుపమానములుగాఁ జెప్పఁబడినవి. అట్లే యీ బాణములును దేహమునఁ గుచ్చుకొన నక్కఱలేక యే దృష్టిగోచరములు కాఁగానే శత్రువులు చత్తురు. అట్టి బాణములను దెమ్మని భావము. సముద్రమును శోషిల్లఁ జేయుటకు నొక్కబాణమే చాలదా? అట్లుండ రాముఁడు అనేక బాణములను దెచ్చున ట్లాజ్ఞాపించుట యీ యొక్క సముద్రపు దోషమును బట్టి వీని సంబంధము గల సప్త సముద్రములను నెండఁ గొట్టవలె నని యుద్దేశముతో నని గాని, కోపాతిశయముచేఁ దన సామర్థ్యము తెలియకయే గాని చెప్పినాఁడని గాని యెఱుఁగునది. సముద్రము శోషిల్లఁ జేయుటకు బాణము లేల యని సందేహింపరాదు. భిన్నం భిన్నం శరై ర్దగ్ధ మ్మని గదా రామబాణ ప్రభావము. అపై లక్ష్మణుఁడు కొంచెము తామసించి యట్టి బాణములను మీరు తెమ్మనుటకుఁ గారణమేమని యడుగఁగా రాముఁడు చెప్పుచున్నాఁడు. సాగరంబు నిదె సంశోషిల్లఁ గావించెదన్ (1) త్రవ్వునప్పు డున్నంత శ్రమ మిప్పు డక్కఱలేదు. సులభముగా దీనిని శోషింపవచ్చును. (2) ఏక స్త్వ మసి లోకస్య స్రష్టా సంహారక స్తథా" అన్నట్లు సృష్టిసంహారములు రెండును నా యొక్కని పనియే కదా. (3) "అప ఏవ ససర్జాదౌ" యన్నట్లు సృష్టికాలమున ఈ జలము సమస్త సృష్టికిని మొదటిదైనట్లు ఇప్పుడు రావణాది సంహారకాలము కాన సందఱకును ముందుగ దీనినే సంహరింపవలెనని భావము. (4) మా వలన వృద్ధికి వచ్చిన యీ సముద్రము మాకే సహాయపడుటలేదు. ఇట్టి కృతఘ్నమైన దీని నడుగంటునట్లు చేసెద నని భావము. (5) ఈ సముద్రము మా యెడ జ్ఞాతికార్యమును జూపుచున్నది. అట్లైనచో మేముమాత్రము మూరక యుందుమా! (6) అఱువది నాలుగు వేలమంది చేరి త్రవ్విన దీనిని నే నొక్కఁడనే శోషిల్లఁ జేసెదను. "విషవృక్షోఽపి సంవర్ధ్య స్వయం ఛేత్తు మసాంప్రతమ్" మ్మన్నట్లు మేమె వృద్ధికిఁ దెచ్చిన యీ సముద్రమును మేమె మొదలంట చెడఁగొట్టుట యుక్తము కాదు. కాని నీరుమాత్రము వట్టిపోవునట్లు చేసెదను. ఇట్లు చేయుటవలనఁ బ్రయోజన మేమనఁగాఁ జెప్పుచున్నాఁడు. భూమీధ్రాటచయంబులు = వానర సమూహములు, భూమీధ్రములు = పర్వతములు - వీనియందుఁ దిరుగునవి భూమీధ్రాటములు, భూమీధ్రేత్యాది (1) సముద్రము దాఁటుటకై వానరులకు నీఁదవలసిన శ్రమముగాని, యోడల సంపాదింపవలసిన శ్రమముగాని లేకుండ సుఖముగాఁ గాలితోనే నడచి పోవుటకై యిందలి నీటి నింకించెదనని భావము. (2) నా యెడ నీ సముద్రము చేసిన యపరాధమునకు నీనిని గ్రోతుల కాలిక్రిందఁ ద్రొక్కించి కసి తీర్చుకొనెద నని భావము. పక్షాంతరమును జెప్పుచున్నాఁడు. వేలేత్యాది. వేలామర్యాద=గట్టును దాఁటరాదను వ్యవస్థ - అణఁగి = చెడి, పొంగి సముద్రముకర్త, క్షుబ్ధము జేసెదన్ = కలఁతపెట్టెదను.

తాత్పర్యము.

సౌమిత్రీ! వింటిని గొప్ప పాములను బోలు బాణముల సమూహమును దెచ్చి

యిమ్ము. ఏలందువా, ఈ సముద్రమును నెండించి దుమ్ము రేఁగఁజేసెదను. అంతపని యేల చేసెదవందువా వానరులు కాల్నడ సముద్రమునఁ బోవఁజేసెదను. ఇన్ని నీళ్లున్న వేళ్లయందువా చెలియలికట్ట దాఁటి రారాదను మర్యాదను బోఁగొట్టి పొంగి పొరలి క్షోభపడఁజేసెదను.

—♦ శ్రీరాముఁడు సముద్రునిపై బాణంబులు వైచి క్షోభిల్లఁ జేయుట. ♦—

ఉ. ఏగతిఁ బట్టునో కనుమ ♦ యీ వరుణాలయ మిప్పు డంచుఁ దా
జేగురుఁగన్నులన్ ధనువుఁ ♦ జేకొని కల్పకృశానుతుల్యు నా
లాగున మండుచుం గరత♦లంబునఁ జాపము బిగ్గఁబట్టి వే
లాగి శరోచ్చయంబుఁ బవు♦లన్ బలవైరియపోలె వైచినన్. ౨౨౫

వరుణాలయము = సముద్రము, జేగురుఁగన్నులన్ = ఎఱ్ఱని కన్నులతో, కల్ప=ప్రలయకాలమందలి, కృశానుతుల్యు నా లాగున = అగ్నిహోత్రునివలె, శరోచ్ఛయంబు = బాణసమూహము, పవులన్ = పిడుగులను, బలవైరియ=ఇంద్రుఁడే.

తా త్ప ర్య ము.

ఇప్పుడీ సముద్ర మేగతిఁ బట్టునో చూడుమని కన్నులెఱ్ఱచేసి విల్లందుకొని ప్రలయకాలాగ్నివలె మండుచు విల్లు గట్టిగఁబట్టుకొని నారి లాగి యింద్రుఁడు పిడుగులను వలె బాణసమూహము విడిచెను.

స్రగ్ధర. జ్వాలాభీలాశుగంబుల్ ♦ చర చర చనుచున్ ♦ సాగరం బుత్తలింపన్
వే లోనం జొచ్చినంతన్ ♦ విషధరచయముల్ ♦ బెగ్గిలెన్ దగ్గనన్ గ్రా
హాళీకుంభీరయుక్తం ♦ బగు సలిలము వాతాతి♦నిర్హ్రాదయుక్తన్
జాలన్ ఘోరత్వమందన్ ♦ సరఁగఁ బొగలతో ♦సంభ్రమన్నంగ వాళిన్. ౨౨౬

అర్థములు. జ్వాలాభీలాశుగంబుల్=అగ్నిశిఖలచే భయంకరములైన బాణములు, ఉత్తలింపన్ = కలవరపడఁగా, విషధరచయముల్ = సర్పములు, బెగ్గిలెన్ = భయపడెను, దగ్గనన్ = తొందరగాను, ఉన్నట్టుండి వచ్చిన యుపద్రవంబుచేత, గ్రాహాళీ = గ్రాహము లను చేపల వరుసలతోను, కుంభీర = మొసళ్లతోను, యుక్తంబు = కూడినది, సలిలము = నీరు, వాత = గాలివీచుటవలనఁ గలిగిన, అతినిర్హ్రాద = పెద్దధ్వనితో, యుక్తన్ = కూడికతో, సంభ్రమత్ = తిరుగుడుపడు చున్న, భంగపాళిన్ = అలల సమూహములచే.

స్రగ్ధర. నీనిలతుఁ ముప్పకపి చెప్పలేను. మ-ర-భ-న-య-య-య గణంబులు ఎనిమిదింట నెనిమిదింట యతులు.

తా త్ప ర్య ము.

అగ్నిశిఖలవంటి బాణములు చరచర పోయి సముద్రమును సల్లకల్లోల ముగు నట్లు లోలోపలఁ బ్రవేశింపఁగా నీ యున్నట్టుండి వచ్చిన యీ యుత్పాతమునకుఁ బాములు భయపడెను. గ్రాహములతోను మొసళ్లతోఁ గూడిన నీరు పెనుగాలి

శా. ఎన్నం డూనని యుగ్రవేగమున సీతేశుండు కోదండముఖ్
సన్నాహంబునఁ బట్టి దీర్ఘతరనిశ్వాసంబులం బుచ్చఁగా
నన్నా! మానుము మాను మంచు వెస డాయం బోయి సౌమిత్రి యా
పన్నార్తావనదక్షుచాపమును సంభ్రాంతాత్ముఁడై పట్టినన్. ౪౯౦

అర్థములు. ఎన్నం డూనని=ఏకాలమందైనను పొందని, సన్నాహంబునన్=పూనికతో, దీర్ఘతర నిశ్వాసంబులన్ = మిగుల నిడివి యగు నూర్పులను, రోషముచేనని భావము. ఆపన్న = ఆపదనొందిన కారణముచే, ఆర్త = దుఃఖించువారిని, అవన = రక్షించుటయందు, దక్షు = సమర్థుఁడైన వానియొక్క, చాపము = విల్లు, సంభ్రాంతాత్ముఁడై = వేగిముతోఁ గూడినవాఁడై, భయముతోఁగూడిన మనస్సుగలవాఁడై.

తాత్పర్యము.

ఏదశయందును - ఏకాలమందును లేని వేగాతిశయముచే శ్రీరామచంద్రమూర్తి వింటిని బూనికతోఁబట్టి రోషముచేత మిగుల నిట్టూర్పులు పుచ్చఁగా నెన్నఁడు నీయన యిట్లు కోపించినవాఁడు కాఁడు - ఇట్టి బాణము లింత వేగముగఁ బ్రయోగించినవాఁడును గాఁడు - నేఁ డిదేమి యని భయపడినవాఁడై లక్ష్మణుఁడు అన్నా! అన్నా! బాణములు ప్రయోగింపవలదు వలదని చెప్పుచుఁ బోయి బాధచే దుఃఖించువారిని రక్షించు సామర్థ్యముగలవాఁడై యానిమిత్తముగా బాణములు విడుచువాఁడే కాని నిష్కారణముగ నొకరిని బాధింప బాణములు విడువని యా రామచంద్రుని వింటిని బట్టుకొనెను.

ఇంత కోపమున కేమికారణము? కిష్కింధ విడిచినవాఁ డాలస్యములేక యొక నిముసపోయి రావణుఁడు హెచ్చరిక పడకముందే లంకఁ నెత్తిన పడవలయు నని యెంతో యాత్రముగలవాఁడై వచ్చెను. సముద్ర మడ్డము వచ్చెను. దాని నొక యస్త్రముతో నెండకట్టి దాఁటిపోవ నాలోచించెను. అట్టిదానికి మూఁడు దినములు సముద్రునివలన జాగయ్యెను. అది సహింపరాని దయ్యెను. మూఁడు దినములు శత్రువులకు సన్నద్ధపడ విరామ మిచ్చినట్లయ్యెను. సీతను జూచుటయందుఁ దడవాయెను. కావునఁ గోపించెను. సైంధవునివలె దాఁటి నడ్డగించువారు శత్రులేక దా-శత్రువు పురమునకు సగడ్డయై వానికి సాహాయ్యపడువాఁడై తనకాలము వ్యర్థపుచ్చెనుగదా.

—♦ ౨౨ వ సర్గము. శ్రీరాముఁడు సముద్రుపై బ్రహ్మాస్త్రంబు వేయఁ బూనుట. ♦—

చ. జనకసుతామనోహరుఁడు సాగరు నిట్లను దారుణోక్తి మ
ద్ఘనతరశాతతీవ్రశరకాండసుదగ్ధుఁ బ్రశుష్కుఁ జేసి నిక్
గనుము రసాతలంబు దనుకం దృటిలోపల దుమ్ము రేఁపెదన్
మనియెదె! నీదు రూపమును మాపెదఁ జూడుము రోరి సాగరా! ౪౯౧

**అర్థములు.** శ్రీరాముఁడు తనసేన సముద్రమును దాఁటుట యెట్లని యాలోచించి సాధుమార్గమున సముద్రు నుద్దేశించి శరణాగతి చేసెను. దాని కతఁడు వశుఁడు కాలేదు. ఆ పై నోటిమాటల బెదరించెను. దానికిని లోఁబడిన వాఁడుగాఁడు. ఆ పైఁ గొన్ని బాణములచేఁ గలఁతపడఁజేసెను. దానికిని గానవచ్చినవాఁడు కాఁడు. కావున బ్రహ్మాస్త్రముచే సముద్రు నెండఁగట్టఁ దలఁచి బ్రహ్మాస్త్రము సంధించి సముద్రునితో నిట్లు చెప్పుచున్నాఁడు.

జనకసుతా మనోహరుఁడు = సీతాదేవి మనస్సును హరించువాఁడు, సీతచే హరింపఁబడిన మనస్సుగలవాఁడు, మనస్సు పోయినంత వేగమున సీతయొద్దకుఁ బోవఁ దలఁచినవాఁడు, మత్ = నాయొక్క, ఘనతర = మిగుల గొప్పదగు, శాత = పదునైన, తీవ్ర = వేగముగల, శరకాండ = బాణసమూహములచే, సుదగ్ధుఁజేసి = నీరువట్టి పోవునట్లు చేసి, ప్రశుష్క = ఊటలుకూడ మరలఁబుట్టకుండునట్లు లెండించెదను, మనియెదె = బ్రదికెదవా.

తాత్పర్యము.

సీతాదేవిచే హరింపఁబడిన మనస్సుగల రామచంద్రమూర్తి భయంకరమైన మాటలతో సముద్రునితో నిట్లనియె. ఓరీ సముద్రుఁడా! నిన్ను పదునైన వేగముగల నా గొప్పబాణముల సమూహముచే నీరింకించి యంతతో విడువక మరల నూటలైనఁ బుట్టకుండునట్లుల పాతాళలోకమువఱకు నెండించి యల్పకాలములో నమ్మ్రోఁపెదను. నీ స్వరూపమే లేకుండఁ జేసెదను. చూడుము. నాకుఁ గోపము వచ్చునట్లు చేసి నీవు బ్రదికెదవా?

ఉ. మామకచాపముక్తశిత ♦ మార్గణవర్షముచేత సర్వశా
ఖామృగపాళి యీ క్షణను ♦ కాల్నడ నావలియొడ్డు చేరఁగా
నో మనుజాశనాలయుఁడ! ♦ యుక్తిఁ జూపెద నిప్డు చూడరా,
నీ మది నెట్లెఱింగెదవు ♦ నిస్తులమద్బలవిక్రమంబులన్. ౪౫ ౨

**అర్థములు.** నాలోని నీరంతయు శోషిల్లఁజేసితివేని యప్పుడు పాతాళము మాత్రమే మిగులును. అప్పుడు నీ సేన నడచిపోవలయు ననినఁ బాతాళమునకుఁ బోవునేకాని లంకకుఁ బోఁజాలదు. కావున నాకాశమార్గముననే నీ సేన పోవలసి యుండును. కావున నీవు నన్ను బాధపెట్టి యావల నాకాశమార్గమునఁ బోవుటకు మాఱుగ నిప్పుడే నన్ను బాధింపకయే యాకాశమునఁ బోవచ్చునుగదా యని సముద్రుఁడు చెప్పినఁ దలంచుకొని తన యభిప్రాయము చెప్పుచున్నాఁడు.

మామక = నాయొక్క, చాపముక్త = వింటినుండి విడువఁబడిన, శిత = పదునైన, బాణ = బాణముల, వర్షముచేత = వానచే, సర్వశాఖామృగపాళి = వానర సమూహమంతయు, ఓ మనుజాశనాలయుఁడ = రాక్షసులకు స్థానమైనవాఁడా? నీవు నన్ను ధిక్కరించుటకు నాకు విరోధులగు రాక్షసుల కునికిపట్టగుటచే వారిగుణమే కలవాఁడవై వారిపక్షమే వహించితివి కావున వారి నెట్లు చేయఁదలఁచితినో నిన్ను

నష్టము చేసెదను అని భావము. ఉద్ధతి = పరాక్రమము, నిస్తుల = అసమానమైన, మత్ = నాయొక్క, బలవిక్రమంబులన్ = బలపరాక్రమములను.

తా త్ప ర్య ము.

ఓరీ రాక్షసుల కునికిపట్టయినవాఁడా? నా పదునైన బాణముల వర్షముచేత సేతువుకట్టి వానరసేనను గాలినడకతో నీ క్షణమందె యావలియొడ్డు చేరఁజేసెదను జూడుము. అట్లు నా పరాక్రమముఁ జూపనైతినేని నీ వసమానమైన నా బలపరాక్రమముల నెట్లెఱుఁగఁగలవు?

లోకమునఁ గొందఱు సహజముగ బుద్ధిమంతులు, కొందఱు బోధముచే బుద్ధిమంతు లగుదురు. కొందఱు బాగుగఁ గొట్టినఁగాని బుద్ధిమంతులు కాఁజాలరు. నీవీ మూఁడవతరగతిలోఁ జేరినవాఁడవు.

శా. కాసీరా యని బ్రహ్మదండనిభ మౌ ♦ కాండంబు కోదండమం
దానీకేఁకలోచనుండు గొడి బ్ర♦హ్మాస్త్రంబు మంత్రించి, వే
గానన్ జ్వాలత రోషతీవ్రుఁ డయి యా♦కర్ణాంతముఁ లాగ, గ్రా
వానీకంబులు సంచలించె దిక్కు♦ల్లెల్లా చెఁ బెంజీఁకటిన్. ౮౫౩

అర్థములు. బ్రహ్మదండనిభము = బ్రహ్మదండముతో సమానమైనది, బ్రహ్మదండము = బ్రాహ్మణశాపము అప్రతిహతమైన దని భావము, కేతువిశేష మని మఱికొందఱు. 'సితామహాత్మజః క్రూరః త్రిపర్ణ శ్శిఖరాన్వితః, బ్రహ్మ దండాహ్వయః కేతుః సర్వభూతవినాశనః' యను నారద సంహితావచనము ప్రమాణము. కాండంబు = బాణము, గొడి = సాధించి, జ్వాలత = తీఁగవంటి యల్లె త్రాడు, ఆకర్ణాంతముగ = చెవికొనలకు, గ్రావానీకంబులు = పర్వతముల సమూహములు, పెంజీఁకటిన్ = గాఢాంధకారంబునందు.

తా త్ప ర్య ము.

కాసీరా యని బ్రహ్మదండముతో సమానమైన బాణము నొకదానిని వింట సంధించి రామచంద్రమూర్తి బ్రహ్మాస్త్రంబుచే దాని నభిమంత్రించి మిక్కిలి వేగముతో నల్లెత్రాటిని తన చెవికొనలకు లాఁగగా కొండలు గడగడ లాడెను దిక్కులు గాఢాంధకారమున మునిఁగి పడెను.

శా. వ్రక్కల్ వాఱెను రోదసీబిలము, మా♦ర్తాండ క్షపానాయకుల్
చుక్కల్ దోవలు తప్పె, నేళ్ళుఁ గొలఁకుల్ ♦ క్షోభించె, నుల్కాతతుల్
లెక్కల్ మీఱి మహారవంబునను వ్రా♦లెన్ మేదినిన్, మింట వా
ద్మ్మకుక్కల్ మారుతపంక్తులున్ బలిసెఁ బె♦న్మార్గంబుఁ గొనెన్ జంతువుల్. ౮౫౪

అర్థములు. రోదసీబిలము = బిలమువలె భూమికి నాకాశమునకు నడుమ నుండు ప్రదేశము, అనఁగా దానియందలి పదార్థములు, వ్రక్కల్ = బ్రద్దలు, మార్తాండ క్షపానాయకుల్ = సూర్యచంద్రబింబములు, త్రోవల్ దప్పెను = తమ

మార్గము విడిచి వేఱొకమార్గమునఁ బోయెను. కర్త లనేకంబు లున్నచోఁ గ్రియకు సమీపకర్తయొక్క లింగవచనంబు లగు ను. వ్యా. వాక్య. ౩౭ వ సూ. తప్పినను క్రియకు చుక్కల్ అనుపదము సమీపమున నుండుటచే దాని కనుగుణముగఁ గ్రియయుఁ బ్రయోగింపఁబడెను. ఉల్కాతతుల్ =కొఱవులవంటి నక్షత్రసమూహములు, ఉల్కాశిరసి విశాలా సితతీ వర్ధతేచ తనుపుచ్ఛా" యని వరాహమిహిరుఁడు. మహారవంబుసను=పెద్దధ్వనితో, మేదినిక్=భూమిమీఁద, వార్ముకుక్కల్, వాః+ముకుక్కల్=మేఘములు.

తాత్పర్యము.

భూమికి నాకాశమునకు నడిమిప్రదేశమునం గల గ్రహములు లోనైనవి బ్రద్దలయ్యెను. సూర్యచంద్ర నక్షత్రములు పెడత్రోవఁబోయెను. నదులు సరస్సులందలి నీళ్ళుడికెను. లెక్కలేని కొఱవులవంటి నక్షత్రములు పెద్దధ్వనితో నేలపైఁబడెను. ఆ కారణమున మేఘములు మహావాయువులు నధికము లయ్యెను. జంతువులు మూర్ఛపోయెను.

క. సంతమసనమావృతదిన,కాంతమయూఖములతోడ ♦ గగనతలం బు
 ద్భ్రాంతిం గూర్చుచుఁ గొఱవుల, సంతతి వెలుఁగొందునట్లు ♦ జ్వలితం బయ్యెన్.

అర్థములు. సంతమస = సర్వత్రవ్యాపించు చీకటి సంతమస మనఁబడును. "విష్వక్సంతమసమ్" మ్మని యమరము. సమావృత = బాగుగ నావరింపఁ బడిన - దినకాంత = సూర్యుని - మయూఖముల తోడ = కిరణములతో - ఉద్భ్రాంతిన్ = మిగుల భ్రాంతిని - ఎక్కువ కలఁతను - జ్వలితంబు = మండినది.

తాత్పర్యము

అన్నిచోటులఁ గ్రమ్ముకొను చీకటిచే నావరింపఁ బడిన సూర్యకిరణములతో నాకాశము చూచువారికిఁ గలఁత గలిగించుచు కొఱవులవలె మండుచుండెను.

క. అంజలి గుంజలిగా నెగ,యం జిమ్ముచు మేఘవితతి ♦ నవనీజములన్
 భంజించె నశైలశిఖర, పుంజముగఁ బ్రభంజనుండు ♦ పురుభీతిదుఁడై. ౮౫౭

అర్థములు. అంజలిగుంజలిగాన్ = గాసిపడునట్లు- చింపఱవందఱగా- నశైల శిఖరపుంజంబుగన్ = కొండలశిఖరముల సమూహములతోడ- ప్రభంజనుండు = సుడిగాలి- పురుభీతిదుఁడై = మిగుల భయము గలిగించువాఁడై.

తాత్పర్యము.

సుడిగాలి మిగుల భయంకరముగ మేఘముల చిందఱవందఱగా నెగురఁ జిమ్ముచుఁ గొండల శిఖరముల సమూహములతోడ వృక్షములను విఱిచెను.

క. భైరవరవపూరితములు, ఘోరంబులు నైన మేఘకోటులు గురిసెన్
 ధారిణిఁ జిచ్చుఱపిడుగుల,ధారలు బెక్కొట్టి భూతతతి దీనదశన్. ౮౫౮

అర్థములు. భైరవరవపూరితములు — భయంకర ధ్వనిచే నిండినవి, చిచ్చుఱ

పిడుగులధారలు = నిప్పులవంటి పిడుగుల సమూహములను, చిచ్చుఱ రూ. చిచ్చఱ. "చిచ్చుఱ పిడుగెట్టు లట్టుడరి శూరుల మొత్తము నగ్గలించెపెడరన్" అనియు, "చిచ్చుఱ పిడుగుల్ నడిందరిఁగు చాడ్పున" ననియు తిక్కన ప్రయోగములు, చిచ్చు + ఉఱ = అగ్నిని లక్ష్యము సేయుని- చిచ్చు + ఉఱ = చిచ్చుఱ, బెకొట్టెన్ = పెంగకొట్టు, బెకొట్టు = పడ్డైను.

తాత్పర్యము.

భయంకరధ్వనులు భయంకరాకారములు గల మేఘసమూహములు భూమి మీఁద నిప్పులుగ్రక్కు పిడుగులను వర్షించెను. భూతముల సమూహములు దుఃఖముచే నేడ్చెను.

క. ఎదపడి జంతులు ధరఁబడి, కదలక మెదలకయ యుండెఁ ♦ గడు నెసఁగించెన్
రొదల నదృశ్యపుభూతస,ముదయము కడలియు ససత్త్వ♦ముగ నెతఁజెందన్. ౧౫

అర్థములు. ఎదపడి = గుండెలు పగులునట్లు భయపడి, రొదలన్ = ధ్వనులను, అదృశ్యపు = కానరాని, కడలియు = సముద్రము, ససత్త్వముగ = తనలో నుండు జంతువులతో.

తాత్పర్యము.

జంతువులు భయపడి కదలక మెదలక యొక్కడనున్నవి యక్కడనున్నవి యట్లులే యుండెను. కానరాని భూతముల గుంపులు ధ్వనులు సేసెను. సముద్రము తనలో నున్న జంతువులతో బాధపడెను.

—♦ శ్రీరామునకు సముద్రుఁడు ప్రత్యక్ష మగుట. ♦—

చ. చలియలికట్ట వాసె యల♦సింధువు యోజన మేగ లోనికిన్,
లలితదయాబ్ధి రాముఁడు క♦లంబకముల్ విడఁ డయ్యె, నయ్యెడన్
జలముల నుండి మేరుగిరి ♦ సప్తతురంగుఁడువోలెఁ దోఁచె ను
జ్జ్వలితముఖాహిసంవృతుఁడు ♦ జాంబవభూషణభూషితాంగుఁడున్. ౧౬

అర్థములు. లలితదయాబ్ధి = జనమనోహరమైన దయారసమునకు సముద్రమైనవాఁడు, ఆ సముద్రుఁడు నీళ్ళచే నిండినవాఁడు. రామసముద్రుఁడు దయారసముచే నిండినవాఁడు. ఇంత కోపముగలవాఁడైనను దయవదలినవాఁడు కాఁడని భావము. కావుననే, కలంబకముల్ = బాణమును, విడువఁడయ్యెను — వదలినవాఁడు కాఁడు. సముద్రమును కానవచ్చి గోవర్ధనమ్మ పంపుమనా యని గదరించుటకై బాణము సంధించినవాఁడు విడఁడయ్యె. సప్తతురంగుఁడు = ఏడు గుఱ్ఱాలవాఁడు. సూర్యుఁడు, ఉజ్జ్వలిత = విషముచే మండుచున్న (౨) పడగలయందలి మణులచేఁ బ్రకాశించుచున్న, ముఖ = మొగములుగల, అహి = పాములచే, సంవృతుఁడు = చుట్టుకొనఁబడిన వాఁడు, జాంబవభూషణ = బంగారు సొమ్ములచే, భూషిత = అలంకరింపఁబడిన, అంగుఁడు = దేహముగలవాఁడు.

తాత్పర్యము.

సముద్రమున నొక యోజనము దూరము నీళ్ళు చెలియలికట్ట విడచి లోపలి కీడ్చుకొనిపోయెను. దయాసముద్రుఁడగు రామచంద్రమూర్తి భూత సంహారమం దిష్టము లేనివాఁడగుటచే బాణము వదలఁడయ్యెను. అప్పుడు మేరుగిరి విడిచి లోకము నకుఁ గానవచ్చు సూర్యునివలె మండుచున్న ముఖములు గల సర్పములతోఁ జుట్టఁబడినవాఁడును బంగారు సొమ్ములు ధరించినవాఁడును నగు సముద్రుఁడు నీళ్ళలో నుండి వెలుపలవచ్చెను.

ఆ. పాటలప్రభాంచితము, సాటిమీఱు నొంటి • పేటహారంబును, గౌస్తుభానుజము • నయి నిస్తుగు మణిపతకం బురంబునఁ దాల్చి • గ్రాలువాఁడు. ౪౬౦

అర్థములు. పాటల ప్రభా + అంచితము = ఎఱ్ఱని కాంతిచే నొప్పినది, కౌస్తుభము = సముద్రమున కౌస్తుభము పుట్టిన తరువాతఁ బుట్టినది. అసఁగా దానితో సమానమైనది. నిస్తు = అందము.

తాత్పర్యము.

అసమానమైన యొంటిపేట ముత్యాలసరము నడుమ నెఱ్ఱని కాంతిగలదై కౌస్తుభమువలెఁ బ్రకాశించు మణిపతకమును వక్షమున ధరించినవాఁడు.

సీ. స్నిగ్ధవైడూర్యస • న్నిభుఁడు లోహితమాల్య, వస్త్రధరుండును • వారిజాత
పత్రనేత్రుఁడు దివ్య • పౌష్పమాలాంచిత, మస్తుఁడాత్మజరత్న • మండితుండు
ప్రాలేయశైలంబు • లీల నానాధాతు, యుక్తుఁడాఘూర్ణ భం • గౌఘుఁ డతుల
కాలికానికర వా • తూలసంకులుఁడు న, దుద్వర్తితనక్రుఁడు • భ్రాంతిరాశి

తే. నావళీలేలిహానుండు • నైన వీర
వరుఁడు సాగరుఁ డా యస్త్ర • పాణిఁ జేరి
యంజలి ఘటించి రామచం • ద్ర! యటంచు
సాదరంబుగఁ బిలిచి యి • ట్లనియె నపుడు. ౪౬౧

అర్థములు, స్నిగ్ధ = నునుపైన, వైడూర్య సన్నిభుఁడు = వైడూర్యకాంతి గలవాఁడు, లోహితమాల్య వస్త్రధరుండును = ఎఱ్ఱని పూలహారములు వస్త్రములు ధరించినవాఁడు, వారిజాతపత్రనేత్రుఁడు = తామరరేకులవంటి కన్నులుగలవాఁడు. దివ్య = దేవతాసంబంధమైన, పౌష్పమాలా = పూలదండలచే, అంచిత = ప్రకాశించు, మస్తుఁడు = శిరస్సుగలవాఁడు, ఆత్మజ = తనయందుఁ బుట్టిన, రత్న = మణులచే, మండితుఁడు = అలంకరింపఁబడినవాఁడు, ప్రాలేయశైలంబులీల = మంచుఁగొండవలె, నానాధాతు యుక్తుఁడు = అనేకములైన ధాతువులతోఁ గూడినవాఁడు, ఆఘూర్ణుఁడు = తిరుగుచుపడుచున్న, భంగౌఘుఁడు = అలలసమూహములు గలవాఁడు, అతుల = అసమానమైన, కాలికానికర = మేఘపంక్తిచేత, వాతూల = గొప్పవాయువుచేత, సంకులుఁడు = కలఁతపడినవాఁడు, ఉద్వర్తిత నక్రుఁడు = తేల

క్రిందు లగుచున్న మొసళ్లుగలవాఁడు. భ్రాంత = దిగ్భ్రమఁగొనిన, రాక్షసావళీ = రాక్షససమూహములను, లేలిహానుండు = పాములను గలవాఁడు, అస్త్రపాణిః = అస్త్రమును చేత ధరించిన వానిని.

తా త్ప ర్య ము .

నునుపైన వైడూర్యమునంటి కాంతిగలవాఁడును, ఎఱ్ఱని పూలదండలు, ఎఱ్ఱని వస్త్రములు ధరించినవాఁడును, తామరరేకులవంటి కన్నులు గలవాఁడును, దేవతా పుష్పముల మాలికలచేఁ బ్రకాశించు శిరస్సుగలవాఁడును, తనయందుఁ బుట్టిన మణులచే నలంకరింపఁబడినవాఁడును, మంచుఁగొండవలె నానాధాతువులు గలవాఁడును, తిరుగుడుపడుచున్న యలల సమూహములు గలవాఁడును, మేఘములతోను, గాలితోను కలఁతపడినవాఁడును, తలక్రిందు లగుచున్న మొసళ్ళలోనగు జంతువులు గలవాఁడును, దిగ్భ్రమగొన్న తనయందలి రాక్షసులు పాములు గలవాఁడును నైన నీరవర్యుఁడు సముద్రుఁ డా యస్త్రపాణిని జేరి నమస్కరించి రామచంద్రా యని యాదరముతోఁ బిలిచి యిట్లనియె.

ప్రశ్న—ఇంత యాదరము భక్తిగలవాఁ డేల యంతకాల మాలసించెను!

సమాధానము—ప్రార్థించినంత మాత్రముననే ప్రసన్నుఁడై దర్శన మిచ్చి మార్గమిచ్చిన యెడల నందఱు నీ మార్గమునే యనుసరింతురు. నీవు త్రోవ యిచ్చెదవా చత్తువా యని ప్రాయోపవేశము చేయ నారంభింతురు. అట్టిదానికి త్రోవ చూపరాదు. ఇప్పుడో యంతటి రామచంద్రమూర్తికి సాధ్యముగానిది మనకగునా యని విరమింతురు. - ఈయనచేఁ దనకు శత్రువు లగు నాభీరులఁ జంపింపవలయును. అది రామచంద్రునకుఁ దప్పఁదక్కిన వారికి సాధ్యమగునది కాదు. ఊరక చంపుమనినఁ జంపఁడు = కావున స్వామికార్యము స్వకార్యము రెండును జక్కఁబడుటకై యింతవఱకాలసించెను. గాని రామచంద్రమూర్తి మహిమ యెఱుఁగక కాదు. రామచంద్రమూర్తి యెంత కోపించినను నమస్కరించె నేని క్షమించునని సముద్రుఁ డెఱుఁగును.

చ. అవనినభోనిలానలపయస్సులు శాశ్వత మైన మార్గముం
దవిలి స్వభావ మేమియును దప్పవు, యట్టుల నే నగాధ మా
ప్లవమును నోట నా సహజభావము, దీనిని దప్పరాదు, రా
ఘువవర! సౌమ్య! యియ్యది యకార్యము, నీకు నెఱుంగఁ దెల్పితిన్. ౪౬౨

అర్థములు. అవని - నభస్ - అనిల - అనల - పయస్సులు = భూమి - ఆకాశము - వాయువు - అగ్ని - జలము - అను పంచభూతములు, పయః ప్రభృతుల నకారంబునకు సగాగమద్విత్వంబులు నిత్యంబులు. సు-వ్యా-తత్స-సూ ౯౨. కావున పయస్సు అనియే రూపము; పయసు-పయము అపశబ్దంబులు, అట్టుల= అట్టులే - ఇది కళయే కాని ద్రుతాంతముకాదు. అట్టులు + అ = అట్టుల, అగాధము = లోఁతైనది, అప్లవము = దాఁటరానిది.

తాత్పర్యము.

పంచమహాభూతము లగు భూమి ఆకాశము అగ్ని జలము వాయువులు శాశ్వతమైన తమమార్గమును వదలి వానిస్వభావము విడువవు. ఆ విధముగానే జల రూప మగు నేను లోఁతు తెలియనీయను. కాలిసడక దాఁటనీయను. ఇది నా స్వభావము. దీనిని నేను దప్పరాదు. రామచంద్రా ! సౌమ్యుఁడా! నేను నా స్వభావమునకు విరుద్ధముగ వర్తించుట సరియైన కార్యముగాదు.

తే. కామమున నైన లోభాన • కారణముల, నైన భయమున నైన ధ • రాధినాథ!
గ్రాహనక్రాకులంబు బుద • కంబు నేను, స్తంభనముఁ జేయరాద యే • సమయమునను.

తాత్పర్యము.

కామముచే నైనను లోభములోనగు కారణములచే నైనను భయముచే నైనను మొసళ్లు లోనగు జలజంతువులు గల నా నీటిని నేను గట్టిపడఁ జేయరాదు. అట్లుచేసితినేని యీ జీవజంతువులు బాధపడును, చచ్చును - కావున నే నెప్పు డట్టి పనిచేయరాదు. నన్నాశ్రయించిన వాని నేనెట్లు బాధపఱుతును.

ఉ. ఐనను నీదు కీశబల • మంతయు దాఁటెడిదాఁక గ్రాహసం
తానము నేన కిట్టి బెడ • దల్ సమకూర్పక యుండఁ గాచెదన్
జే నయినంత, నీ కిఁకను • సేన దరింప స్థలంబొసంగెదన్
మానుము కోప మన్న రఘు • నందనుఁ డిట్లను సమ్మహోర్మికిన్. ౭౬౪

అర్థములు. కీశబలము = వానరసేన, బెడదల్ = అపాయములు.

తాత్పర్యము.

అయినప్పటికిని నీ వానరసేన యంతయు దాఁటునఱకు వారి కే యపాయము నా లోని మొసళ్ళు లోనైనవి కలిగింపకుండ నాచే నైనంత నఱకు రక్షించెదను. నీ సేన దాఁటుటకు మిట్టప్రదేశము నిచ్చెదను. కోపము విడువుమని చెప్పఁగా రామచంద్రమూర్తి యిట్లనెను.

— • శ్రీరాముఁడు బ్రహ్మాస్త్రమును ద్రుమకుల్యముపైఁ బ్రయోగించుట. • —

ఉ. ఇయ్యది యమోఘ మైన శర • మెచ్చట నైతు నటన్న సాగరుం
డయ్యతులాస్త్రముం గని ధ • రాధిపుతో ద్రుమకుల్యమంచు నో
యయ్య! భవద్విధంబున మ • హాఖ్యను గన్నతలంబు గల్గు నొం
డయ్యెడ నుగ్రదర్శులు మ • హాకలుషాత్ములు దస్యు లుద్ధతిన్. ౭౬౫

అర్థములు. అమోఘము = వ్యర్థముగానిది, మహాఖ్యను = పెద్దకీర్తిని, ఉగ్రదర్శులు = భయంకరములైన చూపులు గలవారు, దస్యులు=దస్యుజాతివారు, దొంగలు.

తాత్పర్యము.

ఈ బాణము వ్యర్థము పోరాదు - దీని నెచ్చట వేయుదు నని యన్న

గఁగా సముద్రుఁ డిట్లనియె. ఈ మహాస్త్రమును నీవలెఁ బవిత్రమై ప్రసిద్ధిగన్న ద్రుమకుల్య యను ప్రదేశంబు గలదు. అందు దస్యుజాతులవారు భయంకరములైన రూపులు గలవారు మహాపాపాత్ములు గలరు. ద్రుమకుల్య = చెట్లయొద్ద నీటికాలువలు గలది.

క. వాలాయము నా జలములఁ, గ్రోలుదు రాభీరు లట్టి కుటిలుల స్పర్శన్
దాళఁగఁ జాలను దన్ని, ర్మూలముఁ గావింపు నీ యమోఘశరమునన్. ౭౬౬

అర్థములు. ఆభీరులు = శూద్రజాతియందొక తెగవారు, ఈ యాభీర శబ్దమే వర్ణవ్యత్యయముచే అరాబియా యయ్యెను.

తాత్పర్యము.

ఆ పుణ్యప్రదేశమునందు ఆభీరులు చేరినారు. వారు కుటిలవృత్తి గలవారు. వారి స్పర్శ నేను సయింపఁజాలకున్నాను. వారు నిర్బంధముగ నా జలము పానము చేయుదురు. నీ యమోఘబాణముచే వారిని నాశనముచేయుము.

సీ. అనవుడు రాఘవుం డప్పుడు సముద్రునాయు, జ్వలదగ్నిశరమును వైచుటయును
శరపతనం బైన స్థలము గాంచెను మరుకాంతార మనఁ బేరు కాండకలిత
రంధ్రంబునుండి నీరంబు పైకెగసెను, పాతాలంబున నుండి సరభసముగఁ
గూపంబునకు వ్రణకూప మన బేరబ్బె, నందుండి యొక నుడి యంబురాశి
తే. కడలి కద్దిగఁ దోఁచుఁ దత్కాండవరము, భయదనినదసమేతంబు వసుధ వ్రచ్చు
కతన నచ్చటిగుంటలఁ గలజలంబు, శోషగిలె నంత రఘువంశభూషణుండు.

జ్వలత్ + అగ్ని + శరమును = మండుచున్న యగ్నివంటి బాణమును, శరపతనంబు = బాణము పడిన, మరుకాంతారము = చెట్టుచేమలులేని యెడారి, కాండకలితరంధ్రంబు = బాణముచేఁ జేయఁబడిన రంధ్రము, కూపంబునకు=బావికి, కడలికి = సముద్రమునకు, తత్కాండవరము = ఆ శ్రేష్ఠమైన బాణము, భయదనినదసమేతంబు = భయంకరమైన ధ్వనితోఁగూడినదై, వ్రచ్చుకతన = ఛేదించిన కారణమున, శోషగిలెన్ = ఎండెను.

తాత్పర్యము.

సముద్రుఁ డిట్లు చెప్పఁగా నాయన చూపించిన దిక్కుగా నిప్పువలె మండుచున్న యా బాణమును వేయఁగా నా బాణము పడినచోటు ఎడారి యను పేరు గాంచెను. ఆ బాణము భూమిలోఁ బ్రవేశించుటచేఁ గలిగిన రంధ్రమునుండి పాతాళ జలము పైకెగసెను. ఆ కూపమునకు వ్రణకూప మనిపేరు. అందుండి వచ్చు నీరు సముద్రమువలెఁ దోచెను. ఆ బాణము భూమిని ఛేదించుటచే నా వేఁడిమికి నచ్చట వారు త్రాగుచుండిన గుంటలలోఁగల జలముకూడ నెండిపోయెను.

కం. ఆ మరుకాంతారమునకుఁ, బ్రేమంబున వర మొసంగెఁ బ్రియమువసము పై
తానాయమునన్ ఫలమూలర సామలమున్ సురభితోయధాన్యతముగాన్. ౭౬౭

అర్థములు. ప్రియయవసము = ఇంపైన పచ్చిక, వితామయము=రోగము లేనిది, ఫలమూల రసాపమలముగ = ఫలములచేతను, గడ్డలచేతను, జలములచేతను నిర్మలమైనది. సురభిత = పరిమళించు, ఔషధ = మూలికల సమూహముచే, అన్వితము = కూడినది, కాగ = అగునట్లుగా.

తాత్పర్యము.

ఆ జలములేని యడవికి నింపైన పచ్చిక గలదిగాను ఆరోగ్యకరముగ నుండు నదిగను కందమూల ఫలాదులు గలదై యుండునట్లును సువాసన గల మూలికలు గలదిగా నగునట్లు ప్రేమముతో వరమిచ్చెను.

క. ఆ వరము బలము పెంపున, నా వసుధ శుభప్రదేశ ♦ మయ్యెను; నీటు సా
 రావారము దనకుక్షి ధ,రావల్లభు తీవ్రతరశ♦రంబునఁ గాగన్. ౪౬

అర్థములు. వసుధ = భూమి, కాగఁగగ = తపింపఁగా.

తాత్పర్యము.

ఆ వరము బలముచే నా భూమి శుభస్థల మయ్యెను. ఈ ప్రకారము సముద్రము తలలోని భాగము రామచంద్రమూర్తి తీక్ష్ణమైన బాణముచేఁ గాలిపోఁగా, సేతువు కట్టుటకుఁ దనలో స్థలము చూపించెద నని మాత్రము తోలుత సముద్రుఁడు చెప్పెను. ఇప్పుడు చేసిన సాహాయ్యము వలన మఱియొక వాక్యరూపక సాహాయ్యము చేయుచున్నాఁడు. అది యేమన,

చ. సకలకళావిశారదుని ♦ త్వష్టృభవు నండియుఁ బల్కు విశ్వ
 కర్మకుఁ దనయుండు, శిల్పి స♦మానుఁడు, తద్వరశక్తి విద్యలన్
 బ్రకటితదర్పుఁడై నలుఁడు ♦ రాఘవ! సేతువుఁ గట్టఁగా సము
 త్సుకుఁ డగుఁగాక, తద్భరముఁ ♦ దోయజలోచన! యేను దాల్చెదన్. ౪౭

అర్థములు. సకలకళావిశారదుని = సమస్తవిద్యలయందుఁ బండితుని - దీని వలన రామచంద్రమూర్తికి శిల్పవిద్యయుఁ దెలియు నని భావము. త్వష్టృభవుగ = రాస్త యుండియు నిట్టి యన్నియు నేర్చిన వానిని, సముత్సుకుఁడగుఁగాక = సంతుమున స్సుతోఁ బ్రయత్నించువాఁడగునుగాక, తద్భరము = ఆ భారము.

తాత్పర్యము.

భూమియంతయుఁ బ్రభావయ్యు సకలవిద్యలయందుఁ బాండిత్యముగల రామచంద్ర మూర్తిని జూచి సముద్రుఁడు మఱియు నిట్లనియె. మీ యొద్దనుండు నీ నలుఁడు విశ్వకర్మకుమారుఁడు, శిల్ప విద్యయందుఁ దండ్రితో సమానుఁడు, తండ్రిచేసిన దాని విద్యలందుఁ బ్రసిద్ధ శక్తిగలవాఁడు. వీఁడు సేతువు నిర్మించుటయందుఁ బ్రయత్నించు వాఁ డగునుగాక - ఆ సేతువు భారమును నేను వహించెదను. కొండలు చెట్లు మన్ను నీళ్ళలో వేసినపుడు మునిఁగిపోయినఁ బోవును. అలల దెబ్బకు నీవలావలఁ దొలఁగి పోయినఁ బోవును. అట్లుగాకుండ నేను రక్షించెదను. ఇది నీళ్ళమీఁద తెప్పలు తేలునట్లు

చేసెద నని సూచన- ఇట్టి పరశక్తి నలునకుఁ గలదని యన్యత్రి చెప్పఁబడెను. అట్లు నలుఁడు వేసిన రాలు నీళ్ళమీఁదఁ దేలునపుడు అలలవేగమునకు నవి నిలుకడలేక చెదరిపోవుట సిద్ధము. కావున నట్లు పోకుండ రక్షించెదనని భావము.

—♦ నలుఁడు సేతువు నిర్మించుట ♦—

సీ. అని తిరోహితుఁడైన ♦ ననునలుం డవనీశ! వారిధి సత్యంబుగ ♦ బలికె దేవ!
యీ మహోదధియందు ♦ నేను సేతువుఁ గట్టు, వాఁడ మజ్జనకుని ♦ వరము పేర్మి
దండ మొక్కటియె యు♦త్తమము లోకంబున, గురుషున కంచు నే♦ బుద్ధిదలఁతు
నకృతజ్ఞు లగువారి♦యందు శమం బేని, దాన మేనియు సాంత్వ♦మైనఁ గాని
ఆ. నిష్ప్రయోజనంబు ♦ నీరజలోచన !, దండభీతిఁ గాక ♦ తనదులోఁతు
చూపఁ గలిగె జలధి ♦ చూడఁగఁ గోరి నా, సేతుబంధనంబు ♦ భీతిదంబు. ౪౯

అర్థములు. తిరోహితుఁడు = కానరాకపోయినవాఁడు, దండము = శిక్ష, అకృతజ్ఞులు = చేసినమేలు మఱచువారు, భీతిదంబు — భయంకరమైనది.

తాత్పర్యము.

ఇట్లు చెప్పి సముద్రుఁడు కానరాకపోఁగా సప్పుడు నలుఁ డిట్లనియె. రామచంద్ర దేవా! సముద్రుఁడు నిజము చెప్పెను. నా తండ్రి వరము బలమున నేను సముద్రమునందు సేతువు కట్టెదను. లోకమున చేసినమేలు తెలుపనివారియందు శాంతి మంచిమాట దానము పనికిరాదు. దండించుట యొక్కటియే పనికి వచ్చును. సాగరుఁడు నీ యెడఁ గృతజ్ఞుఁడు కాని కారణముననే గదా నీవు మంచితనమునఁ బ్రార్థించినపుడు బెట్టు చేసుకొని పలుకక యుండెను. తన్నిమిత్తకారణముచే వచ్చి నా సేతుబంధనంబు చూడఁగోరి తనలోఁతు మనకు సాధ్యమగునట్లు చేసెనని నేను.

చం. మును వల విశ్వకర్మ వర♦ముం దయచేసెను మందరాద్రి యా
జ్ఞననికి, విశ్వకర్మకును ♦ సంభవ మందితి నౌరసాత్మజుం
డను నయి, శిల్పపుంబనుల♦నైపుణిఁ దండ్రికి నీడు వత్తు, నీ
వననిధిమాటలన్ స్మృతికి ♦ వచ్చెను మద్వరశక్తి రాఘవా! ౫౦

అర్థములు, ఔరసాత్మజుఁడను = సొంతకొడుకను, నైపుణిన్ = నేర్పునందు.

తాత్పర్యము.

నేను విశ్వకర్మకు నౌరసపుత్రుఁడను, పూర్వము నా తల్లికి విశ్వకర్మ నీ కుమారునకు సమస్త శిల్పవిద్యలు వచ్చునని వరమిచ్చెను. ఆ వరము బలమున నేను శిల్పవిద్యయందుఁ దండ్రితో సమానుఁడను. ఈ సముద్రుఁడు చెప్పుటచే నా వరశక్తి జ్ఞప్తికి వచ్చెను.

క. ఈసాగరుండు దీనిన్, మీ సన్నిధిఁ జెప్ప కిన్ని ♦ మిన్నక యుండున్
నా సామర్థ్యము నేనే, వాసి చెలఁగఁ జెప్పఁజూలఁగ ♦ శక్యము గామిన్. ౫౧

తా త్ప ర్య ము.

నీయం దిట్టి శక్తిగలవాఁడవు సేతు వెట్లు కట్టవలెను? సముద్ర మెట్లు దాఁటవలెను? అని మే మాలోచించుచుండ వినియు నీవేల యూరకుంటివి అనెద రేమో నా సామర్థ్యము నేను జెప్పుకోరాదు. ఇంత గొప్పకార్యము నేనే పూనితి నేని యెట్లుండి యెట్లు వచ్చునో నా మాట నమ్మువా రెవ్వరు? ఇప్పుడు సముద్రుఁడు చెప్పుటచే నా మాట నందఱు నమ్మెదరు.

దీనివలనఁ దన పాండిత్యము సామర్థ్యము తాను జెప్పుకోరాదని సూచన - గంభీరమైనను దనసత్వమును దాను జెప్పుకొనినను సుఖము లేదని చాటు చెప్పిగలదు.

ఉ. కట్టుదు నేను సేతువును ♦ గంధిజలంబులం వానరావళుల్
పట్టుగఁ దోడ్పడన్ వలయుఁ ♦ బార్థివవర్య! యటన్న భూమిపా
లేట్టుని యాజ్ఞమై నగచ♦రేశ్వరు లెల్లరు నేగి కాననన్
జెట్టులు పెళ్ళగించికొని ♦ తెచ్చిరఁ వచ్చిరి వార్ధివేలకున్. ౪౭౪

అర్థములు. కంధిజలంబులన్ = సముద్రము నీళ్ళయందు, భూమిపాలేట్టు = రాజశ్రేష్ఠుఁడు, వార్ధివేలకున్ = సముద్రతీరమునకు.

తా త్ప ర్య ము.

రామచంద్ర దేవా! నేను సేతువు కట్టెదను. దానికిఁ గావలసిన పదార్థములు తెచ్చుటయందు వానరులు నాకు సహాయపడవలయును. నేనే వస్తువులు తెచ్చుకొని కట్టవలయు ననిన ఆ పని కానేరదు. అని చెప్పఁగా రామచంద్రమూర్తి వానరుల కందఱకు చెట్లుగుట్టలు తెచ్చి నలు నొద్ద నిండని యాజ్ఞాపింపఁగా వారట్టులే యడవులకుఁ బోయి చెట్లు పెళ్ళగించుకొని సముద్రతీరమునకు వచ్చిరి.

సీ. సాలాశ్వకర్ణముల్ ♦ సప్తపర్ణంబులు, ధవవంశకుటజముల్ ♦ తాలములును
దిలకార్జునంబులు ♦ తినిశబిల్వంబులు, సుమయుతకర్ణికా♦రము లశోక
వారముల్ మామిళ్ళు ♦ వకుళముల్ చంద్రలు, తాలదాడిమగుల్మ♦జాలములును
వేములు టెంకాయ♦వృక్షముల్ హరులు స,మూలముల్ గాను వి♦మూలములుగఁ

ఆ. దెచ్చి రిందుధ్వజముఁ ♦ దెచ్చెడి భంగిని, నందుఁ గపులు కొంద ♦ ఱలవుమీఱి
కొండగములఁ బెఱికి ♦ దండియంత్రంబుల, నునిచి తెచ్చి రప్పు ♦ డుదధి కడకు.

అర్థములు. సాలముల్ = మద్దులు, అశ్వకర్ణముల్ = ఇనుమద్దులు, సప్తపర్ణంబులు = ఏడాకుల యరఁటులు, ధవ = చండ్రలు, వంశ = వెదుళ్లు, కుటజ = కొండమల్లె, తాలముల్ = తాటిచెట్లు, తిలక = బొట్టుగు చెట్లు, అర్జునములు = ఏఱుమద్దులు; తినిశ = నెమ్మిచెట్లు, బిల్వములు = మారేడులు, కర్ణికారము = కొండగోఁగు, వకుళముల్ = పొగడలు, టెంకాయలు = టెంకాయచెట్లు, దీని కరపమున తేంగాయ యందురు. దానికి దక్షిణదేశమున లంకనుండి వచ్చిన దందురు. పై పెచ్చు భరతఖండమున లేదందురు. ఆర్యావర్తమందు అంతకు ఉత్తరమున

నున్నట్లు రామాయణమునఁ గలదు. టెంకాయ తెంకాయ యని రూపాంతరము గలదు. టెంక, తెంక శబ్దములకుఁ గొబ్బెరమీఁది చిప్పయని యర్థము. అది కల కాయ టెంకాయ తెంకాయ. తెంకాయయే ద్రావిడభాషయందు తేంగాయయయ్యెను. కావున వారు చెప్పెడి యుత్పత్తి సరికాదు. సమూలముల్ = వేళ్ళతోడను, విమూలముల్ = వేళ్ళులేకయు, అలవు = బలము, ఇందు కొండలను యంత్రములపైఁ దెచ్చిరని చెప్పఁబడెను. కావున సుగ్రీవుఁడు వచ్చునప్పుడే సేతువు కట్టుటకుఁ గావలసిన పరికరములు తెచ్చెనని భావము. ఇట్టి యంత్రములు వానరుల యొద్దనే యున్నప్పుడు ఆ నాఁటి నాగరకత యెట్టిదో యూహింపనగు. సముద్రములోఁ బాఁజవైచుటకే చెట్లెననేమి! అడవిచెట్లు లన్నియుఁ బెఱికి తెచ్చిరని చెప్పినఁ జాలునే యీ వివరణమేల? ఉద్భిజ్జ జాతులలోఁ బుట్టినను ఈ యాజాతి వృక్షములు రాము కార్యమునకుఁ దోడుపడి తమ జన్మములు సార్థకము చేసికొని నసియు నక్కినవి వ్యర్థజన్మము లయ్యెననియుఁ దెలుపుటకే.

దీని వలన రామసేవకై వినియోగపడని జీవి వ్యర్థజీవి యని వాల్మీకి మహర్షి యభిప్రాయము.

పంచామరము. గుభీల్ గుభీ ల్మనంగఁ ♦ గొండ లెల్ల దండిగా
దభాలునం బడంగ వైవఁ ♦ దల్లడిల్లె సత్త్వముల్
గభీ ల్మనంగ గుండియల్ దిగా ల్పడంగ, బిందువుల్
నభంబునం జివాలునన్ ఘనంబుగన్ నటింపఁగన్. ౪౭౬

అర్థములు- సత్త్వముల్ = సముద్రమునందుండు జంతువులు, దిగాల్పడంగన్ = దిగులుపడఁగా.

తాత్పర్యము.

స్పష్టము.

సీ. ఆమడల్ నూఱు వ్యా♦యత మైనసూత్రముల్, పట్టిరి కొండలు♦ప్లవగవరులు
దండంబులను గేల ♦ ధరియింత్రు కొందఱు, సమముగ నెఱపిరి ♦ శైలములను
తృణకాష్ఠపర్వత♦గణముల నిగియింత్రు, సందులు శ్రీరామ♦చంద్రునాజ్ఞఁ
బరుగిడువారును ♦ బర్వతంబులఁ బట్టి, పెకలించువారును ♦ భీమముగను
ఆ. మోసితెచ్చువారు ♦ మున్ను నే నే మున్న,టంచు వచ్చువారు ♦ నబ్ధిలోన
వైచువారు నైరి ♦ వానరు లమ్మహా, రవము తుముల మయ్యెఁ ♦ బ్రకటభంగి.

అర్థములు. వ్యాయతములు = దీర్ఘములు, సూత్రముల్ = పగ్గములు, తృణకాష్ఠ పర్వతగణముల = గడ్డి, కట్టెలు, కొండలు వీని సమూహములు, తుములము = సంకులము.

తాత్పర్యము.

సేతువు వంకరలు పోకుండుటకై నూఱామడ పగ్గముల నీ కొననుండి యా

కొనవఱకు నీ ప్రక్క నా ప్రక్క కొందఱు స్తంభములు నాటి వచ్చిన వైరులు వీఁకి వైతు రని పట్టుకొనిరి. కొందరు చేతులందు మట్టపు పలకలను దీవరపఱచుటకును దండములఁ బట్టుకొనిరి. కొందఱు కపు లక్షము దిడ్డముగా వైచిన పర్వతములను చదరముగా నెఱపిరి. కొందఱు సందులందు గడ్డి, కట్టెలు, కొండలు వేసి బిగించిరి. కొందఱు పర్వతాదులఁ దెచ్చుటకై పరువెత్తిరి. పోయినవారు కొందఱు పెల్లగించు చుండిరి. పెకలించినవానిని గొందఱు మోచి తెచ్చిరి. ఆ తెచ్చువారిలో నేను ముందు పోదు ననస నేను ముందని వచ్చిరి. తెచ్చిన వానిని గొంద అందుకొని సముద్రములో వైచిరి. ఈ శబ్దము విస్తారమై సంకుల మయ్యెను.

క. రామాజ్ఞఁ దోడుపడ శా,ఖామృగములు సేతు వానరఁ♦గట్ట స్నలుఁడుగ్
ధీమంతుఁడు తొలిదినమున, నామడ లోకపదియునాలు ♦ గంబుధిలోసన్. ౪౭౦

తా త్ప ర్య ము .

ఎట్లెట్లు చేయవలసినది రామచంద్రమూర్తి చెప్పుచుండఁగా వానరులు సహాయపడుచుండ నలుఁడు మొదటిదినమున సముద్రములోఁ బదునాలు గామడ పొడవున సేతువు గట్టెను.

ఉ. పుట్టిన సంతసంబున ను ♦ భూరిరవంబునఁ జేసి కోతి పెట్
టెట్టని లిర్వదామడ ద్వి♦తీయ దినంబునఁ గట్టి పీఁకమై
నట్టె తృతీయఘుస్రమున ♦ నామడ లిర్వది యొండు నబ్రమా
నట్టులు నా చతుర్థదిన♦మునం బొక యిర్వది రెండు పిమ్మటన్. ౪౭౯

అర్థములు. తెట్టువలు = సమూహములు, ఘుస్రము = దినము.

తా త్ప ర్య ము .

ఉత్సాహ మతిశయించుటచే వానరులు రెండవ దినమందు నిరువది యామడ, మూఁడవ దినంబున నిరువది రెండు, నాలుగవ దినంబున నిరువది రెండామడలు మిగుల వేగముగఁ గట్టిరి.

క. పంచమదివసంబున బం,ధించెను నిరువదియు మూఁడు ♦ నెఱయామడలక్
బ్రాంచితగతి సామర్థ్యర,మాంచితుఁ డగు నలుఁడు జనకు♦నటు లనకట్టన్. ౪౭౦

అర్థములు. సామర్థ్యరమాంచితుఁడు = సామర్థ్య సంపత్తి చేఁ బ్రకాశించు వాఁడు, అనకట్ట = సేతువు.

తా త్ప ర్య ము .

సామర్థ్య సంపత్తిగల నలుఁడైదవ దినమందు నిరువదిమూఁడామడ దూరము సేతువుకట్టెను. ౧౪ + ౨౦ + ౨౨ + ౨౨ + ౨౩ = ౧౦౧ నూటయొక్క యామడ యగుచున్నది. నీటి వెడలుపు నూరును ఈ ప్రక్క సగమామడ ఆ ప్రక్క సగమా మడ నేలమీఁదను గట్టిరి.

క. అంబరమున స్వాతీపథ,ముం బోలుచు వార్ధిమధ్య♦మున సేతువు గ్రా
లం బరికించుచు నభమున, నంబరచరతతులు నిలిచె ♦ నబ్బుర పడుచున్. ౪౭౧

అర్థములు. స్వాతీపథము = స్వాతీనక్షత్రి మార్గము. ఇది యాకాశంబున దెల్లగా నుత్తర దక్షిణముగా నక్షత్రకాంతి గానవచ్చును, స్వాతీపథము = ఛాయా మార్గము (౨) స్వాతీవీథి = ఆకాశమున సూర్యాదులచారమునకు మూఁడు మార్గ ములు గలవు. వానిలో రెండవదానికి మధ్యమార్గ మని పేరు. అందు మూఁడు మార్గములు కలవు. అందు స్వాతిమార్గము రెండవమార్గము. ఇది వాయుపురాణ మందుఁ జెప్పఁబడినది. సూర్యాదీనాం త్రయోమార్గా దక్షిణోత్తర మధ్యమాః తథా ద్వేచాపి ఫల్గునే న్యా మఘా చైవార్షభీ మతా, హస్తశ్చిత్రా స్తథా స్వాతీ మధ్య వీథ్యభివిశ్రుతా, జ్యేష్ఠా విశాఖానూరాధా వీధిరాజగవీమతా, ఏతా స్తువీథయ స్తిస్రో మధ్యమో మార్గ ఉచ్యతే॥ వాయు పురాణము.

తాత్పర్యము.

ఆకాశమున స్వాతిమార్గమువలె సముద్రమధ్యమున సేతు వుండఁగాఁజూచి యాకాశసంచారు లాకాశమునందుండి యాశ్చర్యపడుచుఁ జూచిరి.

సీ. పదియోజనంబుల ♦ పఱపును యోజన, శతకంబు నిడివియై ♦ జాను మీఱి
రాణించు కడు దుష్క♦రంబైన సేతువు, ముక్కున వ్రేలిడి ♦ యక్కజపడి
యద్భుతం బిది రోమ♦హర్షణ మిది యస,హ్యంబు నచింత్యం బ♦టంచు సకల
భూతముల్ వెఱఁగంద ♦ భూరుహచారులు, గంతులు వేయుచు ♦ గర్జ లిడిరి
ఆ. కోటివేలుకపులు ♦ సూటి సేతువుఁ దిద్చి, కొనుచు నవలితీర♦మునకుఁ జనిరి
గద ధరించి నిలిచెఁ ♦ గానివారి వధింపఁ, బ్రెగ్గడలును దా వి♦భీషణుండు. ౭౫ ౨

అర్థములు. పఱపు = వెడలుపు, అక్కజపడి = ఆశ్చర్యపడి, రోమహర్ష ణము = గగ్గురుపాటు గలిగించునది, అసహ్యంబు = సహింపరానిది, అనఁగా భగవం తుని తోడ్పాటు లేక యెవ్వఁడును చేయలేనిది, అచింత్యము = భగవత్సహాయము లేనివాఁ డిట్లు నేను జేయఁగల నని యాలోచించుటకును సాధ్యపడనిది, వెఱగు + అందఁ = ఆశ్చర్యము కలుగుచుండఁగా, కానివారిఁ = విరోధులను, ప్రెగ్గడలు = మంత్రులు.

తాత్పర్యము.

పదియామడ వెడలుపు నూఱామడ నిడివి గలిగి యందఱును చేయుటకుఁ గష్ట మైన సేతువును జూచి యాశ్చర్యపడి ముక్కుమీఁద వ్రేలుంచుకొని యిది యాశ్చర్యకరము, ఇది గగురుపొడువ చేయుచున్నది, ఇది భగవత్సహాయము లేనివారి కసాధ్యము, అట్టివారు మనస్సు నందైనఁ జేయఁ దలంపరానిది యని భూతము లాశ్చర్యపడుచుండఁ గోటివేల కోతులు ముందుగా సేతువు చక్కఁజేసికొనుచు నావలితీరమునకుఁ బోయిరి. శత్రువు లే పక్కనుండియైన మాఱువేషములతో వత్తురేమో యని వారిని దండించుటకై విభీషణుఁడు మంత్రులతో గద చేతియందు గలవాఁడై నిలచియుండెను. వచ్చిన శుకుఁ డిచ్చటనే బంధింపఁబడి యుండుటచే రావణున కీ వార్త తెలియదు.

ఫాల్గున బహుళము పాడ్యమినాఁడు సముద్రతీరముచేరుట. ఆ నాఁడే విభీషణున కభయప్రదానము, పాడ్యమి, విదియ, తదియ, దర్భశయనము. చవితి, పంచమి షష్ఠి, సప్తమి, అష్టమి, సేతుబంధనము. అష్టమినాఁడే సువేలారోహణము.

క. ఏపారి విశాలం బై, తోఁపుదు గొన్నట్టు నునుపు♦ దోఁపఁగ సమ మై
దీపించుచు సేతువు దగెఁ, బాపట దీర్చిన విధాన ♦ వారిధి నడుమన్. ౪౮౩

అర్థములు. ఏపారి = దృఢమై, తోఁపుదుగొన్నట్టు = నునుపు వచ్చుటకై తోఁపుదుపట్టినట్లు, నునుపై = గుంతలు మిట్టలులేనిదై, పాపటదీర్చినవిధానన్ = స్త్రీలు తలలందు పాపటదీర్చినట్లు చక్కఁగా, ఇది యీ కాలపు స్త్రీలు చెవులమీఁదికిఁ బోవు బత్తికొమ్ముల పాపటలు గావని యెఱుంగవలయును. పాపటలు చక్కఁగాఁ నుండిన మేలేమో, యీ జ్ఞానమే యిప్పటి స్త్రీలకుఁ బోయినది.

తా త్ప ర్య ము .

సముద్ర మధ్యమునందు దృఢమై వెడలుపై తోఁపుదుపెట్టినట్లు నునుపై మిట్ట పల్లములు లేనిదై చక్కఁగా పాపట దీర్చినట్లు సేతువు ప్రకాశించుచుండెను.

—♦ శ్రీరామ లక్ష్మణులు కపిసేనతోడ సేతువు దాఁటుట ♦—

సీ. అప్పుడు సుగ్రీవుఁ ♦ డా రామునితో నను, హనుమంతు మీఁదు తా♦ నాత్మజాతు
సౌమిత్రి యెక్కఁగఁ ♦ జయ్యన నీ యబ్ధి, వైహాయసాధ్వంబుఁ ♦ బట్టి వారు
దాఁటెదరంచు ♦ దశరథతనయుఁడు, సహలక్ష్మణుం డయి ♦ చాప మూని
తోయజాప్తభవుండు ♦ తోడరా సైన్యంబు, ముంగల గాఁగఁ జ♦నంగఁ గడఁగె

ఆ. నంతఁగపులు కొంద♦ఱతనిపార్శ్వంబుల, గొలిచి రాఁగఁ గొంద♦ఱలవు మెఱయ
నీఁదుకొనుచుఁ జనిరి ♦ యేగిరి కొందఱు, గరుడుభంగి వేగ ♦గగన మొరసి. ౪౮౪

అర్థములు. వైహాయసాధ్వంబునన్ = ఆకాశమార్గమున, తోయజాప్తభవుండు = సుగ్రీవుఁడు, ముంగల = ముందుభాగమున, అలవు = బలము-

తా త్ప ర్య ము.

అప్పుడు సుగ్రీవుఁడు రామచంద్రమూర్తితో నీవు హనుమంతుని లక్ష్మణు డంగదుని నెక్కితిరేని వా రాకాశమార్గమున నావలియొడ్డు చేరుదు రని చెప్పగా రామచంద్రమూర్తి వానరుల విడిచి సో నొల్లక సేనకు ముందుగా చాపముఁ గేలఁ బూని సుగ్రీవునితోడఁ బోవ నారంభించెను. అప్పుడు కొందఱు వానరులు ప్రక్కల నడచి వచ్చిరి. కొందరు బలవంతులు నీళ్ళలో నీఁదుచు వచ్చిరి. కొందఱ రాకాశమున గరుడుని వలె నెగిరిపోయిరి.

క. కొందఱకు లేదు మార్గము, యందఱు నిట్లరుగు చుండ ♦ నా సేనరవం
బెందును బర్వుచు జలనిధి, క్రిందెల్లను మ్రోగె నిమిష♦కాలములోనన్. ౪౮౫

తాత్పర్యము.

కొండ రెట్లుపోవుటకు నెడము దొరికినదికాదు. అందటే పరికారము పోవు నప్పుడు వారలు చేయు ధ్వని సముద్రధ్వనిని నిమిషములో మ్రింగివైచెను.

ఉ. సేతువు నిట్లు దాటి కపి♦సేన సమూలఫలోదకక్షితిన్
నేత్రుని దేశమార్గమున ♦ నెమ్మది డిగ్గెను, గోసలాత్మజా
జాతు సుముష్కరంపుఁ గృతి ♦ సంధ్రము తత్పర దృష్టిఁ జూచుచున్
జేతము పొంగ దేవఋషి ♦ సిద్ధులు చారణులున్ రఘూత్తమున్. ౮౫

అర్థములు. సమూలఫలోదకక్షితిన్ = గడ్డలు, వేళ్లు, పండ్లు, మంచినీరు గల భూమియందు, నేత్రుని దేశమార్గమున = సుగ్రీవుఁడు చూపించినట్లు.

తాత్పర్యము.

కపిసేన సేతువుదాటి పండ్లు నీళ్ళు మొదలయిన యాహార వస్తువులు దొరుకు చోట సుగ్రీవుని యాజ్ఞచొప్పున విడిసెను. అప్పుడు రామచంద్రమూర్తి చేసిన యసాధ్యకార్యమును దొలుత్రపాటులోఁ జూచుచు దేవఋషి సిద్ధచారణులు రావణు మరణ మింకఁ దప్పదని తమ మనస్సులో నుప్పొంగుచు.

వనమయూరము. చేరి యభిషేకమును ♦ జేసి శుభవారిన్
ధీరవర! శత్రుల ప♦రాభవము సపారా
వారమహి నేలుము య♦పారసమ లంచున్
నారదులు సముచ్చల నొ♦నర్చిరి సభక్తిన్. ౮౬

అర్థములు, స+పారావారమహి = సముద్రముతోఁ జేరనభూమి, అపార సమలు = అనేక సంవత్సరములు, సముచ్చలన్ = పూజలను.

తాత్పర్యము.

రామచంద్రమూర్తిని పవిత్రజలముచే నభిషేకించి శత్రువుల పరాభవము. అనేక సంవత్సరముల భూపాలించెల మంటయు నేలుము అనిభక్తితోఁ బూజించిరి. ఈ మాత్రమునఁ బరిత్యాము బయటపడెడ నని చెప్ప వలనుపడదు. అట్టి వాక్యము లందు లేవు.

వనమయూరము. భజనసగగలు గణములు. తొమ్మిదింట యతి.

—♦ { ౨౩-వ సర్గము. శ్రీరాముఁడు లక్ష్మణున కప్పుడు దోఁచు శకునంబుల తెఱం గెఱింగించుట. } ♦—

చ. సకల నిమిత్తవేది రఘు♦చంద్రముఁ డప్పుడు పర్తమానముల్
శకునము లోలిఁ జూచి యను♦జాతునిఁ గౌఁగిటఁ జేర్చి యిట్లనున్
బ్రకటజలాశయంబు ఫల♦భాసివనంబుల నాశ్రయించి సా
వికలతఁ గీశవాహినులఁ ♦ బెంపగు వ్యూహము దీర్పు లక్ష్మణా! ౮౭

అర్థములు. సకల నిమిత్తవేది=అన్ని శకునముల లక్షణములు దెలిసినవాఁడు, వర్తమానముల్ = జరగుచున్నట్టివి, ప్రకటజలాశయంబు = విస్తారముగ నీటిసౌకర్యము గల స్థలమును, ఫలభాసివనంబులన్ = ఫలములచేఁ బ్రకాశించు వనంబులను, స + అవికలత = వికలత్వము లేకుండునట్లు.

తా త్ప ర్య ము.

సమస్త శుభాశుభ శకునముల లక్షణ మెఱింగిన రామచంద్రమూర్తి యిప్పుడు శుభశకునంబు లగుట చూచి సంతోషించి మనకు భయము లేదని సంతోషించి లక్ష్మణుఁ గౌఁగిలించి, మంచినీళ్ళు విస్తారముగఁ గల ప్రదేశమందును, ఫలముల దండిగ దొరకు వనము లుండు చోటను వానరసేన చెదరకుండ వ్యూహముగాఁ దీర్చుట తగునని చెప్పెను.

రాజు లీ ప్రకారము శకునములఁ జూచియే కార్యములు చేయవలయు నని నీతిశాస్త్రము చెప్పుచుండుటచే రామచంద్రమూర్తి వానిని గమనించె నని తెలియు నది.

నిమిత్తాన్యేవ శంసంతి శుభాశుభ ఫలోదయం। తస్మాదేతాని శాస్త్రజ్ఞో రాజా సముపలక్షయేత్॥ కామందకము.

చ. బలిముఖ ఋక్షరాక్షస ని♦బర్హణముల్ భృశభీషణంబు నై
ప్రళయము లోకనాశన క♦రంబుగఁ దాఁగసిలెం, బరాగముల్
బలియఁగ వాయువుల్ విసరెఁ ♦ బర్వతశృంగములుల్ వణంకె, నీ
యిల చలియించె, నేలఁబడు ♦ వృక్షచయంబులు వ్రాలెఁ గంటివే. ౪౫౯

అర్థములు. అప్పుడు కానవచ్చిన శకునములను లక్ష్మణునకుఁ జెప్పుచున్నాఁడు. బలిముఖ = వానరులయు, ఋక్ష = ఎలుఁగులయు, రాక్షస = రాక్షసులయు, నిబర్హణముల్ = మరణములగలది-ఇట్లు చెప్పుటచే మనుష్యుల మైన మనకు భయము లేదని భావము, భృశభీషణంబు = మిగుల భయంకర మైనది, ప్రళయము = ప్రలయ కారణ మైన యుద్ధము, తారసిలెన్ = తటస్థించెను, పరాగముల్ = దుమ్ములు, బలియఁగన్ = అతిశయింపఁగా, ఇల చలియించెన్ = భూకంపము కలిగెను.

అత్యంతానిష్ట భూకంపము సంధ్యాకాలమందుఁ గలుగును కావున నిట సంధ్యాకాల భూకంపమే గ్రాహ్యము. ఇట్లు చెప్పుటచే నిది సముద్రము దాఁటిన నాఁటి సాయంకాల మని గ్రహింపనగు. "యామతో యాచ్చ భూకంపో ద్విజాతీనా మరిష్టదః। అనిష్టదః క్షితీశానాం సంధ్యయో రుభయో రపి" అని వసిష్ఠ వాక్యము ప్రమాణము.

తా త్ప ర్య ము.

వానరులకు భల్లూకములకు రాక్షసులకు వినాశకర మైనదియు మిగుల భయంకర మైనదియు నగు యుద్ధము లోకనాశనము కొఱకు తటస్థించెను. దుమ్ములు రేఁపుచు

గాలి విసరెను. కొండల శిఖరములు వణంకెను. భూకంపము కలిగెను. ఆ కారణమునఁ జెట్లు నేలఁ బడెను.

తే. భయదమాంసాదనిభములుఁ ♦ బరుషములును
బరుషరవములుఁ గ్రూరముల్ ♦ వారివాహ
నిచయములు ఘోరభంగిని ♦ నెత్తురితోడి
వృష్టిఁ గురియించె నుత్పాత♦ హేతుకముగ. ౪౯౦

అర్థములు. భయద = భయంకర మగు, మాంసాద = మాంసమును దిను పక్షిమృగములవంటి యాకారములు గలవి, పరుషములు = మనస్సునకు వెగటు గలిగించునవి, పరుషరవములు = కఠోరధ్వనులు గలవి, క్రూరములు=భయంకరములు వారివాహనిచయములు = మేఘముల సమూహములు, వృష్టి = వాన, ఉత్పాత హేతుకముగ = ఉత్పాతమునకుఁ గారణమై.

తాత్పర్యము.

భయంకరములైన మాంసములు దిను డేగలు మొదలగు పక్షుల మృగములు యాకారములు గలవియు, చూడ నింపుగానివియు, కర్ణకఠోర ధ్వనులు గలవియు, భయంకరములునగు మేఘసమూహములు భయంకరముగ నెత్తురు వర్షముకురియించు చున్నవి. ఇవి యుత్పాత సూచకములు.

'దివ్యుల్కాపతనం చైవ దివానక్షత్రదర్శనం దివాశని స్తదా కాష్ఠతృణరక్త ప్రవర్షణ' మ్మని వరాహమిహిరుఁడు.

సీ. కుంకుముడాలున ♦ ఘోర మయ్యెను సంధ్య, సూర్యునం దొక నల్ల♦చుక్క దోఁచె
మార్తాండునం దుండి ♦ మండుచు నొకయగ్ని, మండలం బిల వ్రాలె ♦ దండితారి
మృగములుఁ బక్షులు ♦ నెల్లెడ దీనస్వరముల ఘోషించెను ♦ రవిని జూచి
నిజతేజ మెడయంగ ♦ నిశలందుఁ జంద్రుండు, నలుపును నెఱుపు♦గలయఁ గొనల

తే. విలయకాలంబునను బోలె ♦ వికటముగను,
దాపమును గూర్చుచున్నాఁడు ♦ ధరణికెల్ల
గుడును హ్రస్వంబు రూక్షంబు ♦ ఘోర మగుచు
వెలయు చున్నది యుద్ధాని ♦ విధముఁ గంటె. ౪౯౧

అర్థములు. కుంకుముడాలున = కుంకుమము వన్నెచేత నెఱ్ఱగా, సంధ్య — ఇట్లు చెప్పుటచేతను నిది సంధ్యాకాల మనియే యేర్పడుచున్నది. ఎడయంగన్ = తొలఁగిపోఁగా, నిశలందున్ = అనుటచే ప్రతిదినము రాత్రులందు అనిభావము. ఇది వర్తమానవిషయము కాదు. గుడుసు = పరివేషము, హ్రస్వంబు = కుఱుచ యైనది, రూక్షము = క్రూరము.

తాత్పర్యము.

లక్ష్మణా! సంధ్యాకాల మేఘములు కుంకుమవర్ణము కలవై యున్నవి.

సూర్యునం దొక నల్లని చుక్క గానవచ్చుచున్నది. సూర్యునుండి యొక నిప్పు సమూహము మండుచు నేలఁబడెను. సూర్యుని జూచి యన్ని ప్రదేశము లందును మృగములు, పక్షులు దుఃఖస్వరముల ధ్వనించుచున్నవి. రాత్రులందు చంద్రుఁడు తనకాంతి క్షయింపఁగా కొనలందు నలుపు, ఎఱుపు కలసిన కాంతి గలవాఁడై ప్రలయ కాలమందువలె వేఁడిమి కలిగించుచున్నాఁడు. పరివేషము పొట్టిదై, పరుషమై, ఘోరముగ నున్నది, చూచితివా ? "అపర్వణి తథా రాహుగ్రహణం చంద్రసూర్యయోః । చంద్రార్కమండలచ్ఛిద్రం దృష్ట్వా జనపదక్షయః" వరాహమిహిరుఁడు. ఇది యష్టమినాఁటి సాయంకాలవార్త.

చ. మలినము లౌచుఁ దారకలు ♦ మానని లోక వినాశ మియ్యెడఁ
దెలిపెడిఁ, గాకగృధ్రములు ♦ దేకువ గల్గిన డేగ లెంతయే
నలుపఁపుఁ బక్షులుం దఱుమ ♦ నారట మండెడి, నక్క లెయ్యెడఁ
గలయఁగఁ బర్వి భీకరము♦గా రొద సేసెడిఁ గీడు దెల్పుచున్. ౪౯-౨

అర్థములు. తేఁకువ = ధైర్యము, అలుపఁపుఁ బక్షులు = చిన్నపిట్టలు.

తాత్పర్యము.

నక్షత్రములు మలినములై లోకము నాశమగుట తెలుపుచున్నవి. మిక్కిలి చిన్న పిట్టలు తఱుముకొని రాఁగా కాకులు, గ్రద్దలు, ధైర్యముగల డేగలు సంకటపడుచున్నవి. ఎక్కడఁ జూచినను నక్కలు వ్యాపించి భయంకరముగాఁ గూయుచుఁ గీడు గలుగుట దెలుపుచున్నవి. లంకయం దీ యుత్పాతములు కానవచ్చుటచే లంకకే కీడు గలుగు నని భావము.

ఉ. వీనిఫలంబుఁ జూడఁ బృథ♦వీస్థలి శోణిత మాంసకర్దమం
బౌ నిజ, మట్లు గాన విబు♦ధాహిత పాలితపట్టనంబు ని
స్సై నిఖిలాటవీచరస♦మేతముగాఁ జని ముట్టడింత మం
చా నెఱబంటు లంక కెదు♦రై చనె సంభృతచాపహస్తుఁడై. ౪౯-౩

అర్థములు. శోణితమాంసకర్దమంబౌ = నెత్తుటితోను, మాంసముతోను బురద యగును. విబుధాహిత = దేవవిరోధి యగు రావణునిచే, పాలిత = పాలింపఁబడు, నెఱబంటు = శూరుఁడు; సంభృతచాతహస్తుఁడై = ధరింపఁబడిన విల్లుగల చేయిగలవాఁడై.

తాత్పర్యము.

ఈ శకునములఫల మేమింటిరా? యీ నేల నెత్తుటితోను, మాంసముతోను బురద గానగును. కావున రావణపాలిత లంకానగరమును నిస్సై సేనతోడఁ బోయి ముట్టడింతము అని యామహాశూరుఁడు చేత విల్లుధరించి లంక కెదురుముఖమై పోయెను.

తే. సంప్రహారరసావేశ ♦ సంప్రహృష్టు, రాము వెనొకని సుగ్రీవ ♦ రాక్షసాధి
పతులు లోనగు కపులెల్ల ♦ వగుసఁ జనిరి, శత్రుమర్దన నిశ్చిత♦స్వాంతు లగుచు.

అర్థములు. సంప్రహారరసావేశ = యుద్ధాభిలాషావేశముచే, సంప్రహృష్టాన్ మిగుల సంతోషించినవారిని, సుగ్రీవరాక్షసాధిపతులు = సుగ్రీవవిభీషణులు, శత్రుమర్దన = పగవారిని జంపుటయందు; నిశ్చిత = నిశ్చయింపఁబడిన, స్వాంతులు = మనస్సుగలవారు.

తా త్ప ర్య ము.

యుద్ధాభిలాష యావేశించుటచే మిగుల సంతోషించి పోవుచున్న రామచంద్రమూర్తి వెంట సుగ్రీవ విభీషణులు, తక్కిన వానరులు రాక్షసులఁ జంపవలెనని నిశ్చయించుకొనినవారై పోయిరి.

క. వారలభక్తియు శక్తియు, వారల యాలాపములును ♦ వారల చేష్టల్
వారల ధైర్యము గని సీ,తారమణుఁడు సంతసించెఁ ♦ దన హృదయమునన్. ౨౯-౫

అర్థములు. ఆలాపములు = మాటలు.

తా త్ప ర్య ము.

ఆ వానరుల భక్తి, శక్తి,వీరాలాపములు, వీరులు చేయఁదగు చేష్టలు, ధైర్యము చూచి వీరుత్సాహపూరితులై యున్నారు గావున మనకు జయము తప్పదని తన మనస్సునందు సంతోషించెను.

ఇప్పుడు వానరులు సంతోషించి రనుటచే నింతకుఁ బూర్వము వారు మన మీఁదుర్గములు దాఁటఁగలమా యని నిరుత్సాహులై యుండి రని సూచన. సేనాభటులుత్సాహవంతులై యుండుట జయచిహ్నము.

—♦ ౨౪-వ సర్గము. శ్రీరాముఁడు లంకలోని ధ్వని విని సీతను దలఁచి దుఃఖించుట ♦—

క. పారావారముఁ బోలు న, పారవనేచరబలౌఘు ♦ వర్గము ధాటిఁ
భూరిజవంబును సైఁపక, ధారిణి వడఁకాడె భీతిఁ ♦ దతపీడితయై. ౨౯-౬

అర్థములు. పారావారము = సముద్రము, అపార=అంతములేని, వనేచరబల = వానరసేనల, ఓఘు = సమూహముయొక్క, ధాటి = దండయాత్రను, భూరిజవంబును = మిగులవేగమును, తతపీడితయై = మిగులఁ, బీడింపఁబడినదై.

తా త్ప ర్య ము.

సముద్రమువంటి పారములేని వానరసేనయొక్క దాడిని, మిగుల వేగమును సహింపలేక మిగుల బాధింపఁబడినదై భూమి భయముచే గడగడ వడఁకెను.

ఉ. భ్రాజితతారకానికర ♦ రాజితశారద పౌర్ణమాసి నీ
రేజవిపక్షుచే వలె హ ♦ రిప్రవరౌఘము సంవ్యవస్థితం
బై జిగి మీఱె భూమితన ♦ యాధవుచే, విన వచ్చె లంకఁ బే
రోజ మృదంగ కాహళర ♦ వోల్బణముల్ ప్లవగేంద్రపాళికిన్. ౨౯-౭

అర్థములు. భ్రాజిత = ప్రకాశించు, తారకానికర = నక్షత్ర సమూహముచే, రాజిత = ఒప్పుచున్న, శారద = శరత్కాలమందలి, పౌర్ణమాసి=పున్నమ,

నీరేజవిపక్షుచేవలెన్ = చంద్రునిచేతవలె, హరిప్రవరౌఘము = వానర ముఖ్యుల సమూహము, సంవ్యవస్థితంబై = విడిదిపట్టులం జక్కఁగా నిలుపఁ బడినదై, మృదంగ = మద్దెలలయొక్కయు, కాహళ = తుత్తూరాల యొక్కయు, రవోల్బణముల్ = ధ్వని విశేషములు, ప్లవగేంద్రపాళికిన్ = వానరశ్రేష్ఠుల గుంపునకు.

తా త్ప ర్య ము.

చంద్రునిచే, నక్షత్ర సమూహములచేఁ బ్రకాశించు శరత్కాలము నాఁటి పున్నమవలె (కార్తికపూర్ణిమ) వారి వారి విడిదిపట్టుల నిలుపఁబడి సద్దులేని వానర సమూహములు రామచంద్రమూర్తిచేఁ బ్రకాశించెను. (ఎన్ని నక్షత్రముల కాంతి యైనను నొక చంద్రకాంతికి సరి గానట్లు వానరు లందఱ తేజస్సు కంటె రామచంద్ర మూర్తి తేజస్సే యతిశయించి యుండె నని భావము) ఇట్లు వానరులు వారి వారి తావుల వారు వారు నిశ్శబ్దముగాఁ గుమురుకొనుటచే లంకలోని మద్దెలలయు,తుత్తూరాలయు ధ్వనులు విశేషముగ వానరులకు వినవచ్చెను.

ఉ. ఆ మహితారవంబులు వ♦నాటుల వీనులఁ బడ్డ వారు ను
ద్దామముదంబునం గెరలి ♦ తద్దయు రోసున వాని మించఁగా
భీమరవంబు నింపఁగ గ♦భీరఘనాఘన గర్జలట్టు లం
కామనుజాశనావళికిఁ ♦ గర్ణసుగోచర మయ్యె భీమమై. ౪౯౮

అర్థములు. మహిత+ఆ రవము = గొప్పధ్వని, ఉద్దామముదంబునన్ = అధిక సంతోషముతో, కెరలి = విజృంభించి, రోసున = రోషముచే. గభీర = దీర్ఘమైన, ఘనాఘన = వర్షాకాల మేఘములయొక్క, గర్జలు = ఉఱుములవలె, కర్ణసుగోచర మయ్యెన్ = చక్కఁగా వినవచ్చెను, భీమమై = భయంకరమై.

చ. తతబహుచిత్రకేతన ప♦తాకిని లంకను జూచి జానకీ
పతి తరుణీమణిం దలఁచి ♦ పాపి దశాస్యునిచే నిరుద్ధయై
సతి మృగశాబలోచన కు♦జగ్రహబాధిత రోహిణీగతిన్
వితతమనోవ్యథం దవిలి ♦ విన్నఁబడెంగద యీ పురంబునన్. ౪౯౯

అర్థములు. తత = విస్తారమైన, బహు = అనేకములై, చిత్ర=చిత్రములైన, కేతనపతాకిని = కేతనములు, పతాకములు గలది, చిహ్నములు గల టెక్కెములు కేతనములు - చిహ్నములు లేని ధ్వజములు పతాకములు; నిరుద్ధయై = నిర్బంధమున నుంపఁబడినదై, మృగశాబలోచన = జింకపిల్ల కన్నులవంటి కన్నులు గల సీత, సీతాదేవి రామచంద్రమూర్తితో వనవిహారము చేయునపు డామె యొక జింకపిల్లను పట్టుకొనఁ బోవ నపు డది బెదరి చూచెను. అప్పు డా జింకపిల్ల కన్నులు సీతాదేవి కన్నుల వలె నుండెను. రామచంద్రమూర్తి కిపు డది స్మరణమునకు వచ్చెను. లేదా యిక్కడ సీత నిరుద్ధయై యుండుటకు మృగము (జింక) కదా కారణమని జింక జ్ఞప్తికి రాఁగా నప్పుడు భయముతో జింకను జూచిన చూపులు జ్ఞప్తికి వచ్చె

నని యైనఁ జెప్పనగును. వాల్మీకి వ్యర్థవిశేషణము వేయఁడు. కుజగ్రహబాధిత = అంగారకునిచే బాధింపఁ బడిన, రోహిణీగతిᳯ = రోహిణివలె, వితత = విస్తార మైన, మనోవ్యథᳯ = మానసిక బాధచే, విన్నఁబడᳯ = దీనురా లయ్యెను.

ముందు ధ్వనులు వినఁబడె ననియు, నిపు డెత్తిన ధ్వజములు గానవచ్చె ననియుఁ జెప్పుటచే నూరు, వీథులు, నిండ్లు గాన రాలే దని భావము.

తా త్ప ర్య ము .

మిగుల విచిత్రములైన చిన్న,పెద్ద ధ్వజములుగల లంకను జూచి రామచంద్ర మూర్తి సీతాదేవిని దలంచి పాపాత్ముఁ డగు రావణుచే చెఱయం దుంచఁబడి యంగారకగ్రహముచేఁ బీడింపఁబడిన రోహిణివలె సీత మిగుల మనోవేదనచే నీ పురంబున దీనురాలై దుఃఖించుచున్నదిగదా.

తే. అనుచుఁ దా వేఁడి నిట్టూర్పు ♦ నినిచి యనుజుఁ
గాంచి యిట్లనుఁ దనకుఁ ద ♦ త్కాలమునకు
హితముఁ గూర్చెడి వాక్యముల్ ♦ నుత బలాఢ్య
లంకఁ గనుఁగొంటె యీ పురి ♦ పొంక మౌర ! ౫౦౦

తా త్ప ర్య ము.

అని తనలో ననుకొనుచు వేఁడి నిశ్వాసము విడిచి తమ్మునిఁజూచి యీ కాల మునఁ దనకుఁ మేలు గలిగించు యుద్ధవిషయము, సేనావిభాగ విషయము,లంకావిష యము లోనగు వాక్యముల నిట్లనియె. పొగడ్తగన్న బలవంతుఁడా! యీ లంకానగ రము పొంకము చూచితివా !

వేఁడి నిట్టూర్పు నినిచి- యిప్పుడు భార్యఁ దలఁచి విచారపడవలసిన కాలము గా దనుకొని,ముందు కలిగిన వ్యసనము నిలుపుకొనుటకై నిట్టూర్పు విడిచె నని భావము.

ఉ. భానుపథంబుఁ బైకొనఁగఁ ♦ బాఱెడినో యన విశ్వకర్మచే
మానసకల్పితంబు గతి ♦ క్ష్మాధరశృంగతలంబునందుఁ దా
మానిత మయ్యెఁ గంటివె వి♦మానకదంబముతో ధరాస్థలిᳯ
మా నగు పాండురాంబుదస♦మంచిత విష్ణుపదంబు చాడ్పునన్. ౫౦౧

అర్థములు. భానుపథంబు = సూర్యుఁడు పోవుమార్గము, పైకొనఁగᳯ = మించిపోవునట్లు, మానసకల్పితంబు = మనస్సుచే నిర్మింపఁబడినది, విమాన కదంబ ముతో = (౧) ఏడంతస్థుల మేడలతో (౨) ఆకాశయానముల సమూహముతో - పాండురాంబుద=తెల్లని మేఘములచే,సమంచిత=ఒప్పుచున్న,విష్ణుపదంబుచాడ్పునᳯ= ఆకాశము వలె (౧) సూర్యస్థానము, (౨) విష్ణుమూర్తికిఁ బాదమైనది (3) సర్వలోక వ్యాపకుఁడైన వాయువునకు స్థానమైనది. ఆకాశమున విమానమువలె లంకయందు విమానములు గలవని భావము.

తాత్పర్యము.

సూర్యుఁడు పోవుమార్గమున కంటె నింకను బైకిఁ బోవలయు నని పరుగెత్తు చున్నదో యన్నట్లు విశ్వకర్మచే మనస్సుచేత నిర్మింపఁబడినదానివలె పర్వతశిఖరము నందు నొప్పుచున్న లంకను జూడుము. విమాన సమూహములతో భూమియందుఁ దెల్లని మేఘములతో నొప్పు నాకాశమువలె నున్నది.

ఉ. మంజుల సూనకుంజచయ♦మండిత చైత్రరథోపమాన మై
కుంజదళిద్విజ ప్రకర♦ఘుష్టవనంబులచే మనోజ్ఞ మై
రంజిలెఁ బుష్పలీన భ్ర♦మరంబును మత్తశకుంతముం బికీ
శింజితమా వనావళిని ♦ శీతసమీరణుఁ డోలి నూఁచెడిన్. ౫౦ ౨

అర్థములు. మంజుల = మనోహరమైన, సూన = పుష్పముల యొక్క - కుంజ = పొదలయొక్క - చయ = సమూహములచే - మండిత = అలంకరింపఁ బడిన-చైత్రరథోప మానమై=కుబేరు నుద్యానవనమైన చైత్ర రథముతో సమానమై- కుంజత్ = ధ్వనించుచున్న - "రణతి క్వణతి కుంజ త్యపి స్తనతి గర్జతి" అని క్రియా నిఘంటువు - అళి = తుమ్మెదలయొక్కయు - ద్విజ = పక్షులయొక్కయు, ప్రకర= సమూహములచే - ఘుష్ట = ధ్వనించుచున్న - వనంబులచే = తోఁటలచే - పుష్ప లీనభ్రమరంబును = పూలయందలి తేనెఁ ద్రావి మత్తెక్కి కదలక, మెదలక వాని యందే యణఁగియుండు తుమ్మెదలు గలది. మత్తశకుంతమున్ = మదించిన పక్షులు గలది, పికీ = ఆఁడుతుమ్మెదలచే - శింజితము=ధ్వనింపఁ బడినది, శీతసమీరణుఁడు = చల్లనిగాలి - శింజితశబ్ద మాభరణముల ధ్వని యను నర్థము గలదైనను పెద్దధ్వని యనియు దాని కర్థము గలదు. లేదా యిచ్చట సామాన్య వాచకముగ పూలహారా దులవలె గ్రహింప నగు. తాత్పర్యము.

మనోహరము లయిన పూఁ బొదలచే నలంకరింపఁబడిన చైత్రరథముతో సమానమై, ఝంకారము జేయు తుమ్మెదలయు, పక్షులయు ధ్వనులచే నిండిన తోఁటలచే నందమై, పూలయందు దాఁగిన తుమ్మెదలు గలదై, మదించిన పక్షులు గలదై, యాఁడుకోవెలల ధ్వనులు గలదైన వనముల సమూహమును చల్లనిగాలి యూచు చున్నది.

—♦ శ్రీరాముఁడు సేనల వ్యూహంబు దీర్చుట ♦—

సీ. అని యిట్లు వచియించి ♦ యవనిజాపతి సేన, శాస్త్రపద్ధతి విభ♦జనము సల్పి
నీలునితోఁ దడ♦నీకినితో నంగ, దుం డురోదేశస్థి♦తుండు గాఁగ
ఋషభుండు చకస♦మేతుఁడై దక్షిణ, పార్శ్వంబునం దోలిఁ ♦ బ్రబలి నిలువ
గంధహస్తినిబోలు ♦ గంధమాదనుఁడు దా, డాపట వెలయఁగ ♦ నేపు మెఱసి
తే. వేగదర్శి సుషేణులు ♦ విధిసుతుఁడు, జాంబవంతుండు మువ్వురు ♦ సైన్యయుక్తి
గుక్షిఁగాపంగ ముదలిడి♦కువలయాక్షుఁ, డనుజుఁడును దాను శిరమున♦యందు నిలిచి

అర్థములు. శాస్త్రపద్ధతి = నీతి శాస్త్రమునఁ జెప్పిన ప్రకారము, తద నీకినితో = అతని (నీలుని) సేనతో, ఉరోదేశస్థితుండు = ఱొమ్ము ప్రదేశమం దుండు వాఁడు, చక్రినమేతుఁడై = అతని సేనతోఁ గూడినవాఁడై, గంధహస్తిని= మదించిన యేనుఁగును, దాపటన్ = ఎడమవైపు, కుక్షి = కడుపు, నడిమిభాగము, ముదల+ఇడి = ఆజ్ఞ చేసి.

తా త్ప ర్య ము.

ఈ ప్రకారము చెప్పి రామచంద్రమూర్తి రాజనీతిశాస్త్రప్రకారము సేనల విభజించి, నీలుఁ డతని సేనతోడను, నంగదుఁడును హృదయస్థానమం దుండునట్లును, ఋషభుఁడు తన సేనతో కుడిప్రక్క నిలుచునట్లును, మదపుటేనుఁగువంటి గంధమాద నుఁడు ఎడమవైపు నిలుచునట్లును, వేగదర్శి, సుషేణుఁడు, జాంబవంతుఁడు ఈ మువ్వురు వారివారి సేనలతో గర్భము గాచునట్లును ఆజ్ఞ చేసి తాను లక్ష్మణుతో శిరోదేశంబున నిలిచి,

క. లోకము వెనుకటి యర్థము, జోకన్ వరుణుండు గాచు♦చొప్పునఁ గీశా
నీకిని జఘనముఁ గావఁగఁ, జాకిటబలు సూర్యపుత్త్రు ♦ బనిచెన్ నరగన్. ౧౦౪

తా త్ప ర్య ము.

లోకము పడమటిభాగము వరుణుఁడు కాచునట్లు సేనయొక్క పుచ్ఛ భాగ మును రక్షించునట్లు సుగ్రీవుని పంపెను-

ఈ పద్యమందు ముఖ మని, ప్రక్కలని యీ ప్రకారము చెప్పుటచే శార్దూ లుఁడు చెప్పునట్లు సేన గరుడవ్యూహముగాఁ దీర్చఁబడె నని తెలియనగు.

ఉ. అంబుదసంప్లవం బయిన ♦ యభ్రముఁ బోలెడి కీశసేన ప్ర
కుంబులు శైలశృంగములు ♦ గైకొని రేఁగి దశాస్యుపట్టనం
బుం బొరి నుగ్గునూచముగ ♦ భూధరకూటవితానముష్టులన్
డంబుచెడంగ దంపఁగ నె♦డందఁ దలంచె సరోషచిత్తమై. ౧౦౫

అర్థములు. అంబుద సంప్లవము = మేఘములచే నిండినది, అభ్రము = ఆకాశము, కీశసేన=వానరసేన, భూధర కూటవితాన ముష్టులన్ =కొండల శిఖరముల సమూహములతోను, పిడికిళ్ళతోను, డంబు = కాంతి, ఎడందన్ = హృదయమందు.

తా త్ప ర్య ము.

మేఘములచే నిండిన యాకాశమువలె నున్న వానరసేన చెట్లు, శిఖరములు తీసికొని విజృంభించి లంకను కొండలచేతను, శిఖరములచేతను, పిడికిళ్ళచేతను పొడి పొడిగా దంచి రూపుమాపుటకు రోషముతో హృదయమునఁ దలఁచియుండెను.

—♦ శుకుఁడు రావణుతోఁ దాను బోయివచ్చిన వృత్తాంతముఁ జెప్పుట ♦—

సీ. అయ్యెడ శ్రీరాముఁ ♦ డర్కజుతో శుకు, విడిచి పుచ్చు మటన్న♦వెడల నడిచె
నతఁడును భయకంపి♦తాంగుఁడై రావణు, డాసిన నగుచు రా♦కాసిఱేఁడు

ఏ మిది శుక! తెక్క ♦ లేమాయెఁ గత్తిరించిన జాడ దోఁచెడిఁ ♦ జెనఁటులైన
చలచిత్తులైన కీ♦శులచేతఁ జిక్కితా? యే మన నతఁడు లో♦నెనఁగు భీతి
తే. రాక్షసోత్తముతో నను ♦ రాక్షసేంద్ర!, నీదుపనుపునఁ జని నేను ♦ నీరనిధికి
నుత్తరపుఁ దీరముం జేరి♦ మెత్తఁదనముఁ దోఁప మధురోక్తి సుగ్రీవు♦తోడ నేర్మి.

అర్థములు. వెడలనడిచెన్=వెళ్ళఁగొట్టెను- దీనివలన శుకుఁడిన్ని దినములు వానరసేన యందే చెఱలో నుండెను. విడిచిన యెడల వాఁడు రావణునితో వానరసేన సేయు ప్రయత్నము దెలిపి సేతువునకు విఘ్నము గావించు నని తలఁచి విడువఁబడిన వాఁడు కాఁడు. ఇపుడు వానివలన భయము లేదు గావున వదలి పెట్టఁబడెను. భయకంపితాంగుఁడై = భయముచే వణకుచున్న దేహము గలవాఁడై - డాసినన్ = సమీపింపఁగా - నగుచున్ = వానిస్థితిని జూచి నవ్వుచు - చెనఁటులు - దుష్టులు - చిక్కితా = చిక్కితివా? పనుపునన్ = ఆజ్ఞచేత - నేర్మిన్ = నేర్పుతో - చలచిత్తులు, కీశులనుటచే - స్థిరబుద్ధిలేనివారు కావున పొమ్మని కానేపు,వలదని కానేపు ఇట్లు పలుమాఱు విడిచి కట్టిరా యేమి యని భావము.

తాత్పర్యము.

శత్రువుల వలన విఘ్నభయము లేక సేతునిర్మాణసేనాస్థాపనాది కార్యములు దీరుటవలన నిఁక శుకుని వదలిపెట్టుఁడని రామచంద్రమూర్తి సుగ్రీవునితోఁ జెప్పఁగా నతఁడు వానిని నిఁక బొమ్మని వెడలఁ గొట్టెను. వాఁడును మరల వానరులు వచ్చి యెక్కడ పట్టుకొందురో యని భయముచే వడఁకుచు రావణుని సమీపింపఁగా వాఁడున్న దీనస్థితికి నవ్వుచు రావణుఁడు యేమిరా శుకా! యిట్లున్నావు? చపలచిత్తులు, దుష్టులగు వానరులచేతిలోఁ జిక్కితివా యేమి? నీ తెక్కలను గత్తిరించి నట్లున్నదే యని యడుగఁగా నతఁడోరి నిప్రయోజకుఁడా! శత్రువుల చేతిలోఁ, జిక్కితివా యింత జాగేల చేసితివి? అని తన్నునేమో యని భయపడుచు రావణునితో నిట్లనియె. రాక్షసరాజా! నీయాజ్ఞ చొప్పున నేను సముద్రపుటుత్తర తీరమునకుఁ బోయి మంచి తియ్యని మాటలతో నేర్పుగా సుగ్రీవునితో, (నన్ను వారిట్లు చేయుటకు నేను జేసిన యకార్యము లేదు. నేను దురుసుగా మాటలాడ లేదని తెలుపుటకై యిట్లు చెప్పెను.)

క. నీచెప్పినట్ల పలికిన, నేచిన కినుకను గపీంద్రు♦లెల్లరు నన్నున్
దోఁచిరి తాఁచిరి కూలన్, నైచిరి పీచి రిల నేను ♦ వాచారంగన్. ౫౦౮

అర్థములు. నీచెప్పినట్ల = నీవు చెప్పిన ప్రకారమే,ఎక్కువ తక్కువలులేక, ఏచిన = అతిశయించిన, తాఁచిరి = కొట్టిరి, పీచిరి=గిరగిరఁ దిప్పిరి, వాచారంగన్= ఏడువఁగ.

తాత్పర్యము.

నీవు చెప్పినట్లులే తూచాతప్పక, యెక్కువతక్కువలు చెప్పక చెప్పితిని. ఆ మాటలు విని వానరులు కోపాతిశయముచే నన్ను నాకాశము నుండి నేలఁబడఁద్రోచిరి.

గొట్టిరి. తోఁకపట్టుకొని గిరగిర త్రిప్పి నేలఁ బడవైచిరి. నే నేడ్చుచున్నను విడిచిన వారు గారు.

క. గ్రద్దన పై కెగిరి నను, గ్రుద్దిరి పిడికిళ్ళ గోడు ♦ గుడిపిరి కాలన్
మర్దించిరి బిద్దింపఁగ, గద్దఱి తనమునను గపులు ♦ కడఁగిరి తేఁడా! ౨౯

అర్థములు. గద్దఱితనమునన్ = దిట్టతనమున - గోడుగుడిపిరి = దుఃఖమనుభవింపఁ జేసిరి, మర్దించిరి = త్రొక్కిరి - తన్నిరి - బిద్దింపఁగన్ = చంఁపగా - కడఁగిరి = యత్నించిరి - తేఁడా = ప్రభువా - రాజార్థక పదములు పలుమాఱు చెప్పుట రావణునికిఁ దనపై కోపము రాకుండును గాక యని కాని, నీ వేమి రాజవయ్యా, నీ పనిన వానరులకు (రామునిమాట యటుండనీ) లక్ష్యమే లేదు. వారితో యుద్ధముచేసి నీవు మానము దక్కించుకొనగలవా - నా గతియే నీకుఁ బట్టు నని సూచించుటకుఁ గాని చెప్పె నని యెఱుఁగనగు.

తాత్పర్యము.

నేను నీవు చెప్పినమాట చెప్పితినో లేదో, తటాలున పై కెగిరి దిట్టతనమున వానరులు నన్నుఁ బట్టుకొని పిడికిళ్ల గ్రుద్దిరి - దుఃఖపెట్టిరి - నేలవైచి కాళ్లతో నలియ దంచిరి. నన్నుఁ జంపుటకు యత్నించిరి.

ఆ. ముక్కుమీఁద నుండు ♦ మున్గోప మెప్పుడు, సహజముగను గ్రక్క ♦ సకపులకును
నన్నుఁబల్క నీవు ♦ నామాటకును బదు, లిడరు మీఁద మీఁద ♦ నడచువారు.

తాత్పర్యము.

కఠినచిత్తులైన వానరులకు స్వభావమున మున్గోపము ముక్కుమీఁదనే యుండును. నన్నేదియుఁ జెప్పనీయరు - నామాట వినరు - ఇఁక బదులు చెప్పుట యెక్కడిది? అయిన నేమిచేసి రనెదవా, మీఁదమీఁద, దెబ్బ మీద దెబ్బ విరామము లేక యొకనివెంట నొకఁడుగఁ గొట్టిరి.

క. ఖరవైరి విరాధాంతకుఁ, డరిభయదకబంధకాలుఁ ♦ డదె రాముఁడు భా
స్కరసుతసహితుం డగుచును, ధరణీసుతకై సేనతోడ ♦ దాయఁగవచ్చెన్. ౩౦

అర్థములు. ఖరవైరి = ఖరుని జంపినవాఁడు, విరాధాంతకుఁడు = విరాధునికి మృత్యువైనవాఁడు, అరిభయద= శత్రువులకు భయము కలిగించు, కబంధ= కబంధునకు, కాలుఁడు = యముఁ డగువాఁడు, అదె = అదిగో నీ పిక్కడనుండియే చూడవచ్చును. సమీపమందే యున్నాఁడు - మీఁద యుద్ధము సేయుటో, సీత నిచ్చుటో రెంట నొకటి చేయు మని చెప్పఁబోవును. ఆ రెంటిలో యుద్ధమున మేలు లేదని తెలుపుటకై రాముని బలమును వర్ణించుచున్నాఁడు.

తాత్పర్యము.

ఖరుని, విరాధుని, కబంధునిఁ, జంపిన రామచంద్రమూర్తి సుగ్రీవునితో సీతాదేవి సమీపమునకు రానే వచ్చెను - అదిగో నున్నాఁడు - నీవే చూడుము.